ఆధునిక సాహిత్యంలో
అనర్ఘరత్నం-12

# ప్రమదావనము

"ఇది ప్రేమము కాదు. నీచ మోహ వికారము, కేవల రూపతృష్ణ."

"ఎట్లయిన నేమి? నావంటివాని కానందముఁ గూర్చుట నీకు శ్రేయము కాదా?"

"నీ యానందముతో నాకుఁ బని యేమున్నది? పాము పడగ విప్పునని వీణ తానముఁ బాడునా?"

"నేను నీ సౌందర్యమునకే వలచితిని. నన్ను గ్రహింపుము."

"శలభము తన్ను ఫలముగా భావించుచున్నదని తలచి దీపము చల్లఁబడునా?"

* * *

ఆంధ్ర మహానాయకమణి శ్రీకృష్ణదేవరాయలు కళింగ మర్దనం చేసి, కాలయవన నడంచి శ్రీకృష్ణనామమును అన్వర్థం చేసికొన్న అద్భుత చారిత్రక గాథను వీరశృంగార రస మంజులంగా కూర్చి, 'ఆంధ్రవాఙ్మయ చరిత్ర' ప్రస్తుతిగన్న ప్రశస్త గద్యకావ్యము. "ఇందలి కథావిధానములో కవుల శక్తి యంతయు బ్రదర్శితమైనది ముఖ్య మగు గుణము శైలి....వీరి శైలి మాధుర్య మపరిమితము."



# ప్రేమపావనము

వేంకట పార్వతీశ్వర కవులు




యం. శేషాచలం అండ్ కో
మచిలీపట్నం
మద్రాసు సికింద్రాబాదు

Modern Classics-12

PRAMADAA VANAMU

*By*

VENKATA PARVATHEESWARA KAVULU

Publishers :
**M. SESHACHALAM & CO.**

First Published:
(by Andhra Pracharini Grandha Nilayam) 1913

Emesco Pocket Books
First Edition:
January 1971

With the kind permission of Andhra Pracharini Grandha Nilayam, Ramachandrapuram, East Godavari

Printers :
**Sri Kala Printers**
Madras-33.

Cover Design :
**Bapu**

Distributors
ANDHRA PRADESH BOOK DISTRIBUTORS
Rashtrapathi Road, Secunderabad

Rs. 2/-




150

# ప్రమదావనామోదము

శ్రీ వేంకట పార్వతీశ్వర కవులు అర్ధ శతాబ్ది కి పూర్వం ప్రచురించిన, నాటి పాఠకులను అమితంగా అలరించిన నవల ప్రమదావనం. నాటినించి ఈ నవల ఏడెనిమిది ముద్రణలు పొంది, తెలుగు నవలల్లో అసాధారణ ప్రతిష్ఠను ప్రోది చేసుకున్నది. అటువంటి ప్రశస్త రచనను ఎమెస్కోవారు తిరిగి ఆధునిక పాఠకులకు అందిస్తూండటం హర్షింపదగినది

ఇద్దరు కవులు కలిసి రచనలు చేసే పద్ధతి మన తెలుగు సాహిత్యంలో మాత్రమే కనిపించే విశిష్ట సంప్రదాయం ఇలాంటి మన జంట కవులలో రెండు రకాలవారు ఉన్నారు ముఖ్యంగా అవధానాలు చేస్తూ, ప్రాచీన సంప్రదాయ పద్ధతిలో కొంత కావ్య రచన కూడా చేసినవారు మొదటి రకం. ఆధునిక శైలిలో కవిత్వం, నవలలు వగైరా రచించేవారు రెండవ కోవకి చెందినవారు. ఈ రెండవ రకం జంట కవులకు వేంకట పార్వతీశ్వరులు ఆద్యులు.

"లేదురా నిదురలో లేదురా సుగతి!
చూడరా కనువిచ్చి చూడరా జగతి "

అంటూ నాటి యువతను స్వాతంత్ర్య భావ మంజులమైన నవయుగ విభాతంలోకి మేలుకొలిపిన వైతాళికులు వీరు. ఆపైన మధురభావ శబలత గల నవకవితా శైలిలో "ఏకాంతసేవ", "కావ్య కుసుమావళి", "బృందావనము", "భావ సంకీర్తనము" వంటి బహు భావగీతా సంకలనాలను ప్రచురించి నాటి నవకవితా భాండారాన్ని సమృద్ధం చేశారు

అటువంటి మధుర కావ్య రచనలతో ఆగక, సవ్యసాహిత్యంలో ప్రకృష్ట ప్రక్రియ అయిన నవలా రచనకు కూడా నడుము కట్టి అభిమానులైన శ్రీమంతుల అండతో 1911 లో ఆంధ్ర ప్రచారిణీ గ్రంథమాల స్థాపించి, బహు నవలలు రచించి, ఇతరులవి సంపాదించి మొత్తం 150 నవలల దాకా ప్రచురించి తెలుగు నవలకు ఆ ప్రాథమిక దశలో విస్తార ప్రచారం కూడా సాధించిన సవ్యసాచులు వీరు

ఇంచుమించు ఆదే సమయంలో ఉదయించిన విజ్ఞాన చంద్రిక, ఆంధ్ర భాషాభివర్ధని వంటి గ్రంథమాలలు తెలుగు సాహిత్యానికి గొప్ప సేవ చేసినప్పటికీ, సుదీర్ఘ కాలం (1911-1942) నిలబడి తెలుగు నవలకు విశేష పుష్టి, విస్తృత ప్రాచుర్యం కూర్చిన గౌరవం, అగ్రతాంబూలం ఆంధ్ర ప్రచారిణీ గ్రంథమాలది

వేంకట పార్వతీశ్వరులు ప్రధానంగా కవులు కాని, వీరి రచనలలో వచన రచనలే - ముఖ్యంగా నవలలే - ఎక్కువ. కవులు అవటంవల్ల నవలల్లో కూడా చదువరులను విశేషంగా ఆకర్షించేది వీరి కవితాశక్తే. కనుకనే, ఆంధ్ర వాఙ్మయ చరిత్రకారులు వీరి నవలలను గద్యకావ్యాలుగా ప్రస్తుతించారు. సరళ సమాసాలతో, మధుర శైలిలో సాగే వీరి వర్ణనలు నవలలో అంతట పరచుకొని ఉండి, రచనను పాఠక ప్రీతిపాత్రం, అవిస్మృతం చేస్తాయి. కథా కీలకాలను గోప్యంగా ఉంచి, పాఠకులలో ఉత్సుకతను రగుల్కొల్పుతూ, వారు ఎడతెగకుండా నవలను కడముట్ట చదివేట్టు చేయడం వీరి నవలల్లో కనిపించే మరొక గుణం. ఈ లక్షణం అపరాధ పరిశోధక నవలల్లో సర్వత్ర కనిపించేది. ఆ రకం నవలలు కూడా వీరు రచించి ఉండటం, మొత్తంమీద ఆనాటి నవలలకు ఇదొక సాధారణ లక్షణం కావటం ఇందుకు కారణాలు అయి ఉండాలి నాటి నవలల్లో పాత్ర చిత్రణకు పరిమిత ప్రాధాన్యమే కనిపిస్తుంది. సన్నివేశ ప్రస్తార చాతురి అంతకన్న విస్తారంగా పాఠకులను ఆకడుతూంది.

వీరి నవలల్లో చాలా భాగం వంగ, ఆంగ్ల, కన్నడ నవలల అనుకరణలు, అనుసరణలు. వీరి స్వతంత్ర రచనలలో ముఖ్యమైనవి

"వసుమతీ వసంతము", "మాతృ మందిరము" "ప్రమదావనము".
ఈ మూడూ వీరికి విశేషంగా కీర్తి పంచించినవి. ఈ మూడూ మూడు రకాల నవలలు. 'వసుమతీ వసంతము' శృంగార రస బంధురమైన నవల 'మాతృ మందిరము' సంఘసంస్కరణ ప్రబోధకమైనది. 'ప్రమదావనము' ఆంధ్రదేశ చరిత్రాత్మక గద్యకావ్య మని ప్రస్తుతు లందుకొన్నది

ప్రమదావన మన గా అంతఃపుర యువతులు క్రీడించే ఉద్యాన వనం. ఈ రచయితలకు స్త్రీల యెడ ఆదర మెక్కువలాగ కనిపిస్తుంది 'మాతృమందిరం'లో లాగే ప్రమదావనంలో కూడా స్త్రీ పాత్రలకు ప్రాముఖ్య మెక్కువ, ఇందులో కమల, శ్యామల, శిశిరమణి (వసంత వాడ దుర్గంలో అన్యోన్యానురాగంతో పెరిగిన అన్నదమ్ముల బిడ్డలు) ఆదర్శ వీర యువతులు. శృంగార నాయికలు. ఈ ముగ్గురు లావణ్యవతులతో ముగ్గురు వీరకుమారుల ప్రణయ గాథలతోపాటు. ఆనాడు ఉత్కళేశ్వరుని పాలనలో ఆంధ్రదేశ పరిస్థితులను. శ్రీకృష్ణదేవ రాయలు 'కళింగమర్దనం' చేసి ఆంధ్ర సీమలన్నింటినీ కైవసం చేసుకున్న తీరును అద్భుత, వీర, శృంగార రసమంజులంగా తీర్చిన నవల ప్రమదావనం

వసంతవాడ దుర్గస్థుడైన నీలాద్రిరాజు దురాశాప్రేరితుడై తన కుమార్తె శ్యామలను కొండవీటి దుర్గాధిపతియైన వీరభద్ర గజపతి (ఉత్కళ యువరాజు)కి బలవంతంగా కట్టబెట్టాలని చూస్తాడు. శ్యామల ఒడుపుగా తప్పించుకొని పోయి ఉన్మాదినిలాగ దేశాలు తిరుగుతూ, గూఢార్థాలు స్ఫురించే పిచ్చిపాటలతో భావుకుల్ని హెచ్చరిస్తూ, కృష్ణరాయల నగరికి పోయి ఆయనలో ఆంధ్ర విజయోత్సాహాన్ని పురికొల్పి, ఆయన విజయానికి అద్భుతంగా తోడ్పడుతుంది రాయలు కృష్ణాతీరంలో గజపతుల సేనలతో తలపడి ఘోర సంగ్రామంలో వారిని ఓడించి పారద్రోలి, ఆపైన కొండవీడు మొదలైన దుర్గాల్ని కూడా ముట్టడించి వశం చేసుకుంటాడు. రాయల విజయం శ్యామల విజయం అవుతుంది ఆమె రాయలకు ప్రియమైన రాణి అవుతుంది. ఆ విధంగా శ్యామల చిన్న

తనంలో దైవజ్ఞులు చెప్పిన జోస్యం సఫలం చేసుకుంటుంది. ఈ శ్యామలే రాయల రాణి అన్నపూర్ణ అయి ఉండవచ్చునంటారు రచయితలు. దీనికి చారిత్రకాధారం కనిపించకపోయినా. ఈ నవలలో శ్యామల పాత్ర అపూర్వ సృష్టి.

ఏభయ్యేళ్ళనాడు వెలువడిన ఈ నవలను నేటి నవలలతో పోల్చబోవటం, శ్రీనాథుని కవిత్వాన్ని శ్రీశ్రీ రచనలతో పోల్చటం లాంటిది.

వేంకట పార్వతీశ్వర కవులు ఆ ప్రాథమిక దశలో తెలుగు నవలకు రూపరేఖలు దిద్దటంలోను. మన సాహిత్యంలో నవలను ఒక నూతన ప్రక్రియగా సుప్రతిష్ఠితం చేయటంలోను అసదృశమైన దోహదం చేశారు. నాటి యువరచయిత లెందరికో వీరి నవలలు ఒజ్జబంతులు

హృద్యంగా, ఉద్యాన వనకుల్యలాగ సరళంగా సాగే వీరి సుగమ గ్రాంథిక శైలి, వీరి మనోహర వర్ణనలు ఆధునిక వ్యావహారిక భాషకు అలవాటు పడిన పాఠకులను కూడా అలరింప వలతులు

బి. వి. సింగరాచార్య

శ్రీరామచంద్ర

# ఉపోద్ఘాతము

"దేశభాష లందుఁ దెలుఁగు లెస్స."

ఈ పై వాక్యము నానతిచ్చిన వారెవ్వరు? ఆంధ్రకర్ణాటమండలాఖండలుఁడగు శ్రీకృష్ణదేవమహారాయని స్వప్నమునం దాంధ్రజలజాషుఁడిట్లు బోధించెను దీనింబట్టి చూడఁగా నాంధ్రభాష భావ ప్రకటనమునకు సర్వానుకూలమైనదనియు, రసవంతమైనదనియు, శ్రవణానందకరమైనదనియు, అమృతమధురంబైనదనియు, నవనీత మృదులంబైనదనియు, ఇంకను భాషకెన్ని సులక్షణములు కావల యునో యన్నిటిచేతను బరిపూర్ణమైనదనియుఁ బరమేశ్వరోద్దేశ మైనట్లు తోఁచుచున్నది ఈ యాంధ్రభాష చిరకాలమునుండి మహా కవుల యొక్కయు,మహారాజుల యొక్కయు.నవలంబనానుగ్రహముల వలన వర్ధిల్లుచుఁ గొలఁదికాలముననే సర్వోత్కృష్టదశకు వచ్చినది. కాని కొంతకాలమునుండి యీమనభాషామతల్లి యెట్టియవలంబన మును లేక యలసగమనయై, దేహమనోదార్ఢ్యము నశింపఁ జవలయై, పోషణములేక కృశించుచుండుటంగాంచి యనేకులు మహనీయులగు భాషాభిమానులు బయలుదేఱి యెల్లవిధంబులఁదోడుపడి మాతృ భాష నెట్లయిన నుద్ధరింపవలయునని పాటుపడుచున్నారు.

ఏతత్కార్యనిర్వహణార్థమై యితర భాషలనుండి కొన్ని నాట కములును, ప్రహసనములును, వచనకావ్యములును వెలువరింపఁ బడినవి క్రమక్రమముగా నవి స్వకపోలకల్పితములుగఁ గూడఁ

ప్రకటింపఁబడుచున్నవి మన భాషలో నెన్నఁడును లేనివియు; మన రాజభాషయగు నింగ్లీషునందు విశేషముగ నున్నట్టియు నొక మాదిరి చిత్రవచనకావ్యము లిట్టి కాలమున భాషాంతరీకృతంబులుగను స్వేచ్ఛాకల్పితంబులుగను, నవలలను పేరితో మన యాంధ్రభాషా యోషకు నూతనాలంకారములుగ వెలువడుచున్నవి. ఇవి చరిత్ర విషయకంబులును, సాంసారికవిషయకంబులు ననియిరుదెరంగులుగా నున్నవి. చాలవఱకిట్టి నవలలు మనభాషాసతి నలంకరించినవి, కాని యే భాషా ప్రచారమున నీదేశ మాంధ్రదేశముగాఁ బేర్కొనఁబడు చున్నదో, ఏసార్వభౌమునను గ్రహమున నీ మాతృభాష సర్వవిధముల నభ్యున్నతికి వచ్చి యున్నదో యట్టిదేశమును గూర్చిగాని, యట్టి సార్వభౌముని కాలమును గూర్చిగాని తెలియఁజేయునవల యొక్క టియు నింతకాలమువఱకును మనమాతృభాష కుపాయనముగ నొసంగఁబడి యుండలేదు. నవలలఁ బ్రకటించుచు నాంధ్రభాషా సేవ సేయుచున్న మా యాంధ్రప్రచారిణీ గ్రంథనిలయ మింతకాలమున కిట్టి నవలను బ్రచురింపఁగలిగినందుల కెంతయు నానందించుచు న్నారము.

ఈ "ప్రమదావనము" అను నవల యాంధ్రదేశ చరిత్రాత్మకమై యాంధ్రమహాజనుల యాదరమునకుఁ బాత్రభూతమై యున్నది. ఏ సార్వభౌముఁ డీయాంధ్ర రాజ్యమంతయు నేకచ్ఛత్రముగఁ బరిపాలించెనో, ఏ యుదారహృదయుఁ డాంధ్రమహా కవుల నాదరించి తన్మూలమున నాంధ్రభాషాయోషను సర్వోత్కృష్ట దశకుఁ గొనితెచ్చెనో, ఏ కవిరాజశేఖరుఁ డాంధ్రగీర్వాణభాషా విశారదుఁడై యాంధ్రమునం దద్వితీయ నైపుణీవిలసితంబగు విష్ణుచిత్తీయమహాకావ్యమును రచియించిమించెనో, ఏ సంకల్ప సిద్ధుఁడు తన పరిపాలనమున విద్యానగర రాజ్యమును నన్వర్థముగాఁ జేసెనో, ఏ దివ్యకీర్తి యమృతమూర్తియై సకలాంధ్రజనసముదాయమునకు జిరస్మరణీయుఁడై యుండెనో యట్టి శ్రీకృష్ణదేవమహారాయని పవిత్రచరిత్ర మిందు విశేషముగ సూచింపఁబడియున్నది.

ఇందుఁ బ్రథమభాగమునఁ దెలుగుదేశమును బరిపాలించిన యుత్కళేశ్వరుని చరిత్రము కొలఁదిగను, ద్వితీయభాగమున నాంధ్ర సార్వభౌముఁడగు శ్రీకృష్ణదేవరాయని చరిత్రము విశేషముగను సూచింపఁబడినది. తక్కిన కథాభాగ మంతయు గల్పితము.

ఆంధ్రదేశ పరిపాలకుని యొక్కయు ఆంధ్రభాషా పోషకుని యొక్కయు, ఆంధ్రదేశము యొక్కయు పవిత్రచరిత్రము నుద్ఘోషించుచున్న యీ నవల యాంధ్రమహాజనుల కెల్లరకు నాదరపాత్రం బగుఁగాక.

ఇట్లు,
వేంకటపార్వతీశ్వర కవులు.

శ్రీ రామచంద్ర

# అంకితము.

శ్రీ జానకీవర స్మేరాననముఁ గాంచుఁ
లీలాకటాక్ష మాలికలతోడ.
గాలకంఠశరాస ఖండనోత్సుకమైన,
యాజానుబాహుద్వయంబుతోడ
సాహసోత్సాహ ప్రశాంతమై యొప్పు ప్ర
శస్త్యలీఢపాదాబ్జ ఓలతోడ
హరినీలనీల మేఘశ్యామలంబైన
భువన మోహనకళా స్ఫూర్తితోడ
నిలిచి, ముక్కంటివిలు ద్రుంచి నేర్పుతోడఁ
త్రిజగములు మెచ్చఁ గల్యాణ విజయుఁడైన
జానకీరామమూర్తి మా చంద్రరెడ్డి
నాయురారోగ్య విభవాఢ్యుఁ జేయుఁగాత!

సీ. లలితసద్గుణగణాలంకృతుం డగువాఁడు,
కమనీయతరకీర్తిఁ గన్నవాఁడు
సంతతానంద ప్రశాంతచిత్తమువాఁడు,
ధర్మానురూపవర్తనమువాఁడు
నిత్యసత్యవ్రత నియతి గాంచినవాఁడు,
హితమితమధురభాషితమువాఁడు
ప్రవిమలోదార స్వభావంబు గలవాఁడు,
భవ్యసౌభాగ్యవైభవమువాఁడు

దీనజనముల మొఱ విన లేనివాఁడు
లేనివారలవెతఁ జూడ లేనివాఁడు
సర్వజనరంజనము సేయ జాలువాఁడు
చల్లనగువాఁడు కోవూరి చంద్రరెడ్డి

గీ. ప్రాంచదాంధ్రప్రచారిణీ గ్రంథనిలయ
సుస్థిరస్థాపకుండు భాసురయశుఁడు
మాతృభాషాభిమాని యస్మత్ప్రియుండు
సరసకృతిమణిమౌళి మా చంద్రరెడ్డి

సీ. ఫలపుష్పతరులతా లలితమై యతిలోక,
రమణీయమైన యారామమందు
నాలోకహృదయమోహనమై ప్రశాంతతే
జంబై నసాయంతనంబు నందు
సుఖసన్నివాసమై శోభాయమానమై,
వరలు నానందమందిరమునందు
నామోదపవనాభిరామమై సుస్నిగ్ధ
కమనీయమైన యంగణమునందు
నాప్తవర్గంబుతోడ నిష్టానురూప
సరసగోష్ఠి మెలంగు మా చంద్రరెడ్డి
యురుతరానందమూర్తియై యొక్కవాఁడు
సమ్మదాలోకనంబుల మమ్ముఁ గాంచి—

ఆ. వె. అమృతరసముకంటె నతిమధురంబులై
చంద్రకాంతికంటెఁ జల్లనగుచు
నలరుసోనకంటె నతిపరిమళములై
యెసఁగుభాషణముల నిట్టు లనియె

చ. చనవున, గారవంబునను, సంతత సమ్ముఖ వర్తనంబునన్
గొనబుగ మీకు మాకును నకుంఠితమైత్రి ఘటిల్లె, నంతకం
టెను భవదీయనిస్తుల పటిష్ఠ మనోజ్ఞ పదార్థభావగుం
ఫనకవితావిలాసములు మాకుఁ బ్రియంబొనఁగూర్చుచుండెడిన్.

చ. నవరసకల్పనావిలస నంబున, వర్ణనమందు, వస్తుగౌ
రవమున, నౌచితిన్ సురుచిరంబగు కావ్యము నాటకంబుగా
నవలలపేరఁ గొన్ని వచనంబున నిప్పుడు చిత్రకావ్యముల్
నవరసబంధురంబులయి నవ్యగతిం దలసూపుచుండెడిన్.

ఉ. హృద్యపదార్థసంకలిత, మిద్ధ కథామహితంబు, సాధుసం
పాద్య సుధామనోజ్ఞ రస భావసమన్వితమైన కావ్యమున్
జోద్యముగాఁ బఠించుటకె చూతురుగాని, తలంప రట్టిచోఁ
బద్యము గాదు గద్య మని భవ్యరసగ్రహణైక పారగుల్.

ఉ. వేంకట పార్వతీశ్వరకవి ప్రతిభానిధులార! శారదా
కంకణకింకిణీరవ వినిస్వర సుస్వరనవ్యమాధురీ
సంకలనానురూపమృదు చారువచోరచనల్ సెలంగ మా
కంకిత మీయఁగావలయు నట్టిమనోహరచిత్రకావ్యమున్,

క. అని సాదరమునఁ దెల్పుట
యును, బరమానంద మంది యుత్తముఁడగునీ
యనఘుండు మెచ్చుకృతిగా
నొనరించుట కేచరిత్ర మొప్పునో యనుచున్

చ మనమున నూహ చేసి జన మాన్యగుణోత్తరుఁడైన కృష్ణరా
యనిచరితంబుఁ గైకొని సమంచిత కల్పనలందుఁ జేర్చి నూ
తనవచనప్రబంధమొక దాని రచించి జనానుమోద వ
ర్తనుఁడగు నీయుదారగుణ ధాముని కంకిత మీయనెంచుచున్.

శ్రీ ఆంధ్రదేశ భువ్యాప్తి యశఃకీర్తు
లందినదేవ్వాని యన్వయంబు
బసివిరెడ్డి యనంగఁ బ్రథితాత్ముఁ డగుభూరి
విభవాఢ్యుఁ డెవ్వాని పెద్దతండ్రి
దైవశాలయపుర స్థాపకుండైనచి
న్నయరెడ్డి యెవ్వాని యనుఁగుదండ్రి
శ్రీసతీ ప్రతిభాఢ్య చినబుచ్చమాంబిక
కడుపుచల్లఁగ వేనిఁ గన్నతల్లి

యట్టికోపూరివంశ పయఃపయోధి
పూర్ణిమాచంద్రుండై పుట్టి ప్రోదిగన్న
చంద్రునకుఁ, జంద్రికాకీర్తి సాంద్రునకును
భువనతోషకునకుఁ గళాప్రపోషకునకు.

క. ఆగర్భశ్రీమంతున
కాగంతుకదీనమండలావనచణక
ల్పాగునకు విబుధసుకవి
ప్రాగల్భ్యవచోవిలాస పరితుష్టునకున్.

క. సదయునకు నరసమాంబా
హృదయాబ్జ మధువ్రతునకు హితపరితోష
ప్రదమందహాసవిలసిత
వదనునకు ననంతభాగ్య వర్ధిష్ణునకున్.

క అనురూపమైన ప్రమదా
వనమను నీనూతన ప్రబంధము కృతి గా
నొనరించితి మిది చంద్రున
కనవద్యాభ్యుదయసంశ్రయం బగుఁగాతన్

క. కృతిచేఁ గృతినాయకుఁడును
గృతినాయకుచేతఁ గృతియు నీప్సితరసము
న్నతగౌరవాతిలోకా
యతకీర్తిఁ జెలంగుగాక యాచంద్రముగన్.

సీ అమరేంద్ర వైభవం బనలుని చిత్వంబు
వైవస్వతుని ధర్మ వర్తనంబు
నైరృతి విక్రమ నైపుణీమహిమంబు
వరుణామృతత్వంబు వాయు జవము
నలకాపురీనాథు నధికధనాఢ్యత
శర్వుని శాశ్వతైశ్వర్యగరిమ

వమరుద్ర సర్వదైవతదివ్యతేజంబు
రవిచంద్రముఖనవగ్రహబలంబు

బ్రహ్మవిష్ణుమహేశ్వర ప్రాభవంబు
శారదాకమలాసతీ సహజశక్తి
పరసగుణనిధియైన మా చంద్రరెడ్డి
కళిమశార్థప్రదంబులై యమరుఁగాత!

శ్రీ శ్రీ శ్రీ

——

శ్రీరామచంద్ర

# ప్రేమ

ప్రేమమున లోక ముదయించె నేమొ? కాక
ప్రేమయే లోకముగఁ బుట్టె నేమొ? కాక
ప్రేమ లోకమయం బయ్యె నేమొ? కాక
లోకమే ప్రేమమయమై వెలుంగు నేమొ
ఏమయిననేమి, కొంచె మూహించి చూడఁ
ప్రేమమయుఁ డీశ్వరుఁడు, సృష్టి ప్రేమ మయము
ప్రేమమయులెల్ల జీవులు ప్రేమ యొకటె
పావనం బైనదని బోధ పడుచునుండె.
అంతరంగము నిండి తొల్కాడు నేది?
యితరభావంబులను జొర నీని దేది?
కష్టసుఖముల భేదంబుఁ గనని దేది?
ప్రతివిధానంబునకు నాస పడని దేది?
యవిరతానందదాయక మైన దేది?
యదిగదా యుత్తమోత్తమ మైన ప్రేమ
అట్టి ప్రేమంబునకు విష మమృత మగును,
కాలకాకోదరము పూల మాల యగును,
దారుణారణ్య మఖిలవోద్యానమగును,
జ్వలనకుండంబు చందన కలశ మగును,
బండఱానేల యరవిరి పానుపగును,
మండువేసవియెండ రేయెండ యగును,
మృత్యుదేవతవరమాప్త మిత్ర మగును,

అట్టి ప్రేమప్రకాశంబు వెట్టయెదుట
నట్టి ప్రేమసుధావృష్టి యెట్ట యెదుట
నట్టిప్రేమ ప్రతాపాగ్ని యెట్ట యెదుట
నట్టిప్రేమౌషధరసంబు నెట్ట యెదుట
నట్టిప్రేమమృగేంద్రంబు నెట్టయెదుటఁ
గలుషకామాంధకారంబు నిలువఁగలదె!
విర్గతక్రోధదావాగ్ని నిలువఁగలదెఁ?
ఖలవిలోభ పతంగంబు నిలువఁగలదె?
నీచమోహవికారంబు నిలువఁగలదె?
నిష్ఠురమదోన్మదేభంబు నిలువఁగలదె?
నిఁద్యమాత్సర్యవిషఫణి నిలువఁగలదె—
భవ్యమగు నట్టిప్రేమ ప్రపంచకమున
కమరపట్టణ మొకపల్లె యైనఁ గాదు.
హద్దు లేనట్టిప్రేమ రసాలయమున
కఁబునిధి యొకశీకర మైనఁ గాదు.
వేయిగన్నుల వెలయు నా ప్రేమగతులఁ
గన్నుగవతోడ నెవ్వాఁడు గాంచఁగలఁడు?
తూరుపున. బుట్టి మిన్నెక్కి తొంగి మూచి
యబ్ధి. బొంగించి కు.వలయ మలరఁజేసి
కమలజాండకటాహంబుఁ గలయఁ బ్రాఁకి
చలువలను గ్రుమ్మరించి ప్రశాంతి నెసఁగు
పావన ప్రేమచంద్రికా పటలమందు
వెంతయమృతంబు గలదొకో యెవరి కెఱుక?
యెంతమాధుర్య మున్నదో యెవరి కెఱుక?
యెంతలావణ్య మున్నదో యెవరి కెఱుక?
యెంతయానంద మున్నదో యెవరి కెఱుక

———

శ్రీరామచంద్ర

# అనుక్రమణిక

## దాఁగిలిమూఁతలు

కృష్ణానదీతీరమున నున్న ప్రమదావనముం దొకనాఁటిసాయంకాలమునఁ బ్రశాంతారుణకిరణజాలము తెల్లెడ నర్తనము చేయుచుండెను లేఁజిగురుగొమ్మలమాటునఁ గూరుచుండియో, పరిపక్వఫలగుళుచ్ఛంబుల కెగయుచుండియో, కుసుమితలతాందోళికల నూఁగుచుండియో కలవిహంగములు మనోహరముగ గానము సేయుచుండెను. నదీతరంగ నిస్వనము లాయవ్యక్త మధుర గీతములకు లయ నెఱపుచుండెను. ప్రకృతి విలసితంబగు నీతౌర్యశ్రీ కనమ్మోళన మెంతమనోహరమైనది! క్రొంజిగురు గొమ్మల పసిఁడిచిగ్గులును, ముదురుటాకుల మర్మరధ్వనులును, నరవిరిగుత్తుల నెఱదేనెసోనలును నా మనోజ్ఞభావముతో నైక్యమంగుచుండెను, ఆసాత్వికారుణ సువర్ణకిరణము లాకృష్ణవేణీ జలతరంగ మాలికలపైఁ బ్రతిఫలించుచున్నప్పుడు—ఆ మనోహర విహంగ కలకలాలాపము లా జలతరంగ మాలికలఁ బ్రతిధ్వనించుచున్నప్పుడు — ఆవనతరులతాదులుగూడ మైమఱచి తల యూఁచుచుఁ బ్రతీక్షించుచున్నప్పుడు — ఆప్రకృతి రామణీయకముంగూర్చి యెంతని వ్రాసి తనివి నొందఁగలము? సమీరకుమారసంచాలనంబునను, శ్యామల తరులతా విలసనంబునను, సరస పరిణత ఫలమాధుర్యంబునను, సలలితలతాంత మంజరీసౌరభంబునను బరిపూర్ణానందముం గూర్చు నా ప్రమదావన సాయంతన రామణీయక మతిమనోజ్ఞమై యలరారుచుండెను.

సాయంసమయ రామణీయక విలసనంబునకును, సకలజీవ

హృదయ భావోదయంబునకును నేదియో సంబంధ మున్నదియనియే తోఁచుచున్నది. కానిచో నందలివిలాసవిహారములకు నిదియే సమయ మేలకావలయును? అవ్యక్తప్రకృతు లగుబాలకులకును, పశులకును గూడ నాటపాటల కదియే సమయ మేల కావలయును.

అట్టి సాయంసమయంబున, నాప్రమదావన ప్రమోదభవన ప్రాంగణమున నిరువురుబాలకులును, మువ్వురు బాలికలును గలసి యాటలాడుకొనుచుండిరి. చిన్నపిల్లలయాటలు ముద్దుల మూటఁ గట్టుచుండు ననుట వింతమాట గాదు. వారిమాటలుగూడ నవ్యక్త మాధుర్యపూర్ణములై విలసిల్లుచుండును ఆడినది యాటయుఁ బాడి నది పాటయు ననుమాట వారియెడల నన్వర్థ మగుచుండును, బిడ్డల పల్లావవిలాసవిహారము లెవ్వరిహృదయముల నాకర్షింపకుండును? వారలహృదయములు నిత్యనిర్మలంబులై యెసంగుచుండును వికార విరహితంబులును, నానందదాయకంబులు నగుమనోహరప్రకృతి భావంబులుమాత్రమే యందుఁబిహ్నితము లగుచుండును ద్వంద్వ భావసమ్మిశ్రితంబు లగుప్రాపంచికానుభవంబులు వారిక్రీడావిలా సంబులతోడనే జరగిపోవుచుండును కావుననే వారి యానంద ప్రవాహ మతిప్రశాంతరసనమంచితమై విస్తరంగకల్లోలితమై, నిష్క లంకమై విరాజిల్లుచుండును మనము వారిచెంత కరిగి వారియాటలం దిలకించి యానందింతముగాక !

వారు దాఁగిలిమూఁత లాడనారంభించిరి. ఒక బాలుఁడు ప్ర మోదభవనాంగణనికుంజము చెంతనున్న యొక వేదికపైఁగూరుచుండి యుత్తరీయాంచలాంతరమున కిరుచేతులం దార్చి నెటికవిరిచి యాచేతి వ్రేళుల నందఱను బట్టుకొమ్మనియెను. అందఱు నట్లు కావించిరి అప్పుడాబాలుఁ డొక్కనింజూచి "మాధవా! నీవు పండి తివి శ్యామలా! నీవు పండితివి, శిశిరా! నీవును బండితివి" అని చెప్పి నెటిక విరిచిన వ్రేలును బట్టుకొనియున్న కమలం జూచుచు నూర కుండెను.

మాధవుఁడు చప్పటలు చఱచుచు "గోపాలా! నీ చెల్లెలినే దొంగను జేసితివేమి?" అని పకపకనవ్వసాగెను

గోపాలు: దూరకుండెను

శ్యామల-(చిఱునవ్వుతో) బావా! ఇంకొక నిమిషములో నీవు గూడ దొంగవు కాకుందువా!

మాధ-నేను దొరికినప్పుడుగద?

కమల-దొరకకెక్కడ దాగికొందువు బావా!

మాధ-నన్నుఁ బట్టుకొనుటకు నీవును నీచెల్లెలును గూడ దొంగలు కావలయును.

శ్యామ-అక్కవంతు నేదొంగనై నిన్నుఁ బట్టుకొందును.

మాధ-నీకొక్కదానికి దొరకను.

శిరమణి-శ్యామలా! నీవెందులకు! నే దొంగనయ్యెదను

శ్యామల-వలదు. ఇట్లే యాడుకొందము,

కమల యన్న యొద్దఁ గూరుచుండెను. గోపాలుఁడు చెల్లెలి కన్నులను మూసెను. తక్కినముువ్వురును దాఁగికొనుటకై తలయొక దిక్కునకుఁ బోయిరి సంకేతధ్వన్యనంతరమున గోపాలుఁడు కమల కన్నులపై నున్న చేతులను దీసివైచెను కమల వారిని వెదకి పట్టు కొనుటకై పరుగెత్తుకొని పోయెను తల్లిగానున్న గోపాలుఁ డచ్చ టనే కూరుచుండెను

కమల, కురంగశాబకమువలె నొక్క పరుగునఁ బోయి యొక మల్లెపందిరికడ నిలిచి చూచెను మాధవుఁ డాతీవగుబురుమాటున దాఁగియుండునేమో యని యామెయాశ. కాని యాతఁ డక్కడ నగపడలేదు అటనుండి మాధవీలతాగృహంబున కరిగెను. అచ్చటఁ గూడ నెవ్వరును లేరు. కమల నలుదెసలఁ జూచి కులుకుచుఁ బసిఁ డిచిఱుగజ్జియలు గలగల రొదసేయ నదేపరుగున జలయంత్రముల చాఁటునకును, వేలమావిమోకలమాటునకును, గున్నపొన్నలచెంత కును, పొగడ గున్నలపొంతకును బోయి వెదకివెదకి చూడసాగెను. ఆమె తరళనయనప్రసారమున నావన మంతయుఁ గువలయవన మయ్యెను. కాని వారాశావుల నగపడలేదు ఆమె యాచెంతనున్న

ద్రాక్షానికుంజమున నేదియో చప్పు డగుచుండుటం గాంచి చటా లున నచ్చటికిఁ బోయి తొంగి చూచెను. ఆయదటున కందున్న లేఁడి పిల్ల బెదరి చెంగున నావలకుఁ దాఁటిపోయెను. కమల తెల్ల వోయెను మాధవుఁ డెందున్నాఁడు? శ్యామల యెక్కడ నున్నది? శిశిరమణి యేమూల ద్రాఁగియున్నదో?

కమల చిన్నిబాలిక సాత్వికస్వభావ ఎట్లయినను మాధవునిఁ బట్టుకొనవలయు నని యాశపడుచుండెను. కాని యిప్పుడామె యలసిపోయినది- ఆమె తన లేఁజెక్కులం గ్రమ్మిన చిఱుచెమ్మటలు నీరెండనిగ్గులు మిలమిల మెఱయుచుండ, నలపునం బొడమినవిడు దయూరువుల చేఁ జిఱుపెడవు లల్లన నదరుచుండ, నలిపెంపుజిలుగు పావడ పదంబుల కడ్డుపడుచుండ, నింకను వెదకవలయు నను నుత్సా హముతో నందందుఁబోయి చూచుచుఁ గ్రమముగా సరోవరతీర మున నున్న పొదరిండ్లకడకుఁ బోవుచుండెను. ఇంతలో నెక్కడ నుండియో కోకిలయూరక "కో" యని కూసెను బాల్యచాపలమున శ్యామలయు "కో" యసియెను సమీపమున నున్న శిశిరమణియు నామెనే యనుకరించెను.

అర్థ్వనుల నానవాలుపట్టి కమల యొక పొదమాటున కరి గెను. అటనున్న శ్యామల మాటాడకుండ వ్రేలితో మాధవుఁడున్న మాధవీనికుంజమును కమలకుఁ జూపెను కమలయాపొదమాటున నెమ్మదిగఁ గాచికొని యుండెను. శ్యామల పరుగుపరుగున నింకొక వైపునుండి మాధవుని యొద్దకుఁ బోవుచుండెను మాధవుఁ డాయడు గుల చప్పుడు నాలకించి కమల వచ్చుచుండెనని భ్రమించి యొక్క పరుగునఁ గమల యున్నచోటికే వచ్చెను. అట వేచియున్న కమల "దొంగ దొరకెను" అని కేకవైచి యాతని హస్తమును బట్టుకొని యెను శ్యామలా శిశిరమణులు కిలకిల నవ్వుచుఁ జప్పటలు చఱచిరి. గోపాలుఁ డచ్చటికివచ్చి, "బావా! ఏమైనదొ?" అనియెను

మాధవుఁడు నవ్వుచు. "కమల యలసిపోయిన దని దొరకిపో యితిని." అనియెను.

గోపా—ఎట్లయిన నేమి? నీవు దొరికి దొంగవై పోయితివి. సా యంతన మైపోయినది ఇఁకబూవులు గోసికొని యింటికిఁ బోవుదము.

సరియేయని యందఱను బుష్పాపచయంబునకు బయలు దేఱిరి. మాధవుఁ డొకకఱ్ఱతోఁ బొగడపూవులను రాల్చుచుండెను. కమల వాని నేరుచుండెను. శ్యామలాశిశిరమణు లాసమీపమున నున్న చంపక నికుంజముకడ కేఁగి పూవులను వెదకుచుండిరి. గోపాలుఁ డించుకదూరముగ బోయి మల్లెమొగ్గలను గోయుచుండెను.

క్రమముగా నందఱును జంపకనికుంజముకడకే వచ్చిరి. సకల కుసుమ సౌరభసంవాసితంబగు చంపకప్రసూన మెవ్వరికిఁ బ్రియకర ముగాకుండును? ఆసంపంగిపొద ననలెత్తి కొలఁదిదినములే యైనది. ఇంకను విశేషించి పూవులు విడుచుటలేదు. కాని యాపొదనుండి పరిమళము వచ్చుచుండెను. అందుచే నొకరికి దొరకకుండ నొక రాపూవును గోసికొనవలయునని తలయొకదిక్కునకుఁ బోయి వెదకుచుండిరి.

శ్యామల యొకననగొమ్మ నెత్తి పరిశీలించుచుండెను. అంత లోఁ బరిమళవాయుసేవనఁబున కందుం బ్రవేశించియున్న యొక సర్పము బుసకొట్టుచు నామెపైఁ బడఁబోయెను. శ్యామల తత్తర ముతో నాలుగడుగులు వెనుకకుఁ బరుగెత్తెను. సమీపముననేయున్న శిశిరమణి "పాము! పాము!" అని కేకవైచుచు శ్యామలను వెను కకుఁ ద్రోసివైచెను. కాని యా తొందరలో నామె క్రిందఁ బడి పోయెను. విషసర్పము బుస్సుమని యామెపైఁ బడి కఱచుటకుఁ దమకించుచుండెను. ఇంతలో మాధవుఁడు పరుగెత్తుకొని వచ్చి తన చేతనున్నకఱ్ఱతో నాసర్పమును జంపివైచెను

అప్పుడు శ్యామల శిశిరను లేవఁదీసెను. అందఱును దలయొక మాటగా నా యపాయమునుగూర్చి ప్రశంసించుచు నాసర్పమును, సర్పమర్దనుఁడగు మాధవుని వింతగాఁ జూచుచుండిరి. ఆకల్లోలమున నాపంపెఁగపొద చెదరి యొకకొమ్మ మాధవునితలపైఁ బడియెను. అందొకకుసుమము వికసించి యుండెను. శ్యామల దానిం గాంచి

యెవ్వరు నెఱుఁగకుండ నొక్కపరుగునం బోయి యాపుష్పమును గోసికొని పోయెను.

ఏలతాంతము తనదివ్యసౌరభముచేఁ బ్రమదావనము నంతను బరిమళింపఁ జేయుచుండెనో, ఏపుష్పరాజము తనకొఱ కాసించి వెదకుచున్న యక్కడివారందఱకును దుర్లభమై యుండెనో యట్టి సకలఫల చంపకప్రసూనము శ్యామలకు లభియించెను కాని యది తనకమ్మతావులచే నందఱకును నానందమును గూర్చుచునేయుండెను. అది మనకును బరమానందదాయకమే గదా!

---

శ్రీరామచంద్ర

# ప్రమదావనము

## ప్రథమ భాగము

### సింహాచలము

సర్వాత్మకుండును, సర్వస్రష్టయు నగుసర్వేశ్వరుఁడు సర్వారాధ్యుండును, సచ్చిదానందస్వరూపుఁడును సవాఙ్మానసగోచరుండును నై వెలుంగుచున్న వాఁడని సామాన్యముగ సర్వమతముల వారు నేకగ్రీవముగ నంగీకరించిన విషయమే. విశ్వారాధనమే ఈశ్వరారాధన మనియు, విశ్వమయత్వమే తన్మయత్వమనియు విజ్ఞానధనులమహాదాశయమై యున్నది. అట్టి విశాలహృదయయు లీ విశాల ప్రపంచమునం దంతటను బరమేశ్వరాకారమునే కాంచుచుఁ బ్రేమించుచు, నానందించుచుందురు. అంతటి మహామహు లీలోకమునఁ గొలఁదిగా నుందురని చెప్పుట సాహసోక్తి కానేరదు పరస్పర ప్రేమభావనమిశ్రితంబును, నన్యోన్య వైరభావ సంకలితంబును నగు నీ ప్రపంచమునందు మానవసామాన్యమున కంతకు నేకభావము కలుగుట యసంగతము. అందఱును బ్రకృతిని బరమేశ్వరాకృతిగాఁ జూఁడజాలరు. కాని, యెల్లరును భయముననో, భక్తినో సర్వేశ్వరునిఁ దలంచుకొనుచుందురు. అట్టితలంపు నిశ్చలముగా నుండుటకై తమతమ యుద్దేశముల ననుసరించి కొందఱొక పవిత్రక్షేత్రమున

నీశ్వరసాన్నిధ్యముం గల్పించుకొని ధ్యానించుచుందురు. కొందఱొక దివ్యస్థలంబున నీశ్వరు నర్చారూపునిగాఁ జేసికొని పూజించుచుందురు. కొందఱు చెట్లను, గుట్టలను బరమేశ్వరభావముతో నారాధించు చుందురు. ఈయభ్యాసము లన్నియును క్రమముగాఁ జిత్తము జగదీశ్వరాయత్తమగుటకే మతిమంతులగుమహాచార్యులచే నియమింపఁబడినవి. చిత్తము పరమేశ్వరాయత్తమైనవానికి విశ్వమంతయుఁ దన్మయముగనే తోఁచుచుండును అట్టివాఁడెన్నఁటికిని బరమేశ్వరునకు నామరూపగుణంబులఁ గల్పింపఁబోఁడు. అవాఙ్మానసగోచరంబగు నా దివ్యతేజమునఁ దానొకకళామాత్రుఁడై యభేదముగ నున్న సంగతి నాతఁడు గ్రహింపఁగలుగును అభ్యాసవశంబున నట్టి దివ్యజ్ఞానముదయించుటకే—అట్టిపవిత్రభావోదయమగుటకే— దివ్యక్షేత్రములనియు, దివ్యస్థలము లనియు, దివ్యనదీనదంబులనియు, దివ్యమంగళవిగ్రహము లనియుఁ బుణ్యపురుషులచేఁ గల్పింపఁబడినవి

అట్టి పవిత్రస్థలములలో భారతీయులకు సింహాచల మొక దివ్యస్థలము. అది వైశాఖ మాసము. శుక్లపక్షము నాఁడు తదియ ఆదినము సింహాద్రి వరాహలక్ష్మీ నృసింహుని కొక మహోత్సవదినము. నాఁడు చందన మొలుచు పుణ్య దినమగుటచే లక్ష్మీ నృసింహుని దివ్యమంగళవిగ్రహమును గనులపండువుగఁ గాంచి తరింపవలయు ననువేడుకతో ననేకు లాదివ్యక్షేత్రమునకు వత్తురు. భక్తి భావహృదయులగు భారతీయులకుఁ బుణ్యక్షేత్ర సందర్శన మనిన నెంతయో యానందము.

అరుణోదయమునకుఁ బూర్వమే కొండపై నాలయపురోభాగమున మంగళ వాద్యములు మొరయింప నారంభించిరి. ఆలయ ముఖద్వారములు తెఱవఁబడియెను. ఆ ద్వారఘంటికా నినాదము లా మంగళ ధ్వనులతో నైక్యములై పోయెను. సాక్షాన్నారాయణమూర్తి వలె నున్న శ్రీ వైష్ణవశిరోమణి యొకఁడు దివ్యకలశముతో దివ్య జలములం గొని తెచ్చి సూక్తవిధానంబున స్వామి కభిషేచన మాచరించుచుండెను. జయఘంటారావములును, దిరునామముల యోంకార స్వరంబులును, శ్రీ వైష్ణవుల వేదఘోషంబులు నేకీభవించి యాకాశ

ప్రపంచమున సమ్మిశ్రితము లగుచుండెను. ఉత్సవ సందర్శనార్థు లగు జను లందఱు నచలాంతర్వాహిను లగు జలధారలం దోఁగి యార్ద్ర వసనంబులతో, భక్తి రసార్ద్రంబులగు హృదయములతో నత్యుత్సాహమునఁ బర్వతారోహణము సేయుచుండిరి. మెట్టుమెట్టునకును "గోవిందా—గో—వింద" అనునుచ్చైస్స్వనంబులు మిన్నులు ముట్టుచుండెను. ఆ దివ్యనామోచ్చారణంబున నెల్లరి హృదయములును భక్త్యుత్సాహసంభరితము లగుచుండుటచే నాయాస మగపడకుండఁ బోవుచుండెను. అప్పుడు వారి కాపాషాణ సోపానములు పట్టు దిండ్ల కంటెను మృదులములుగాఁ దోఁచుచుండెను. పరమేశ్వర సందర్శన కుతూహలంబున నొకరి నొకరు త్రోసికొని ముందఱికిఁ బోవుచుండిరి. బిడ్డల నెత్తికొని తల్లులును బిడ్డల చేయూతగొని వృద్ధమాతలను గూడ నత్యుత్కంఠతో నాయాసమును బరిగణింపక కొండ నెక్కుచుండిరి భక్తి భావోన్మత్తులగు కొందఱు పరమేశ్వర తాదాత్మ్యముం గాంచి శివమాడుచుండిరి. అట్టివారి చుట్టునుం జేరి చాలమంది తమ తమ ప్రపత్తిభావముం జూపుచు వారి నతిగౌరవముగఁ గొండపైకిఁ దీసికొనిపోవుచుండిరి సూర్యోదయమగునరి కాకొండపల్లెయును, పర్వతసోపానములును గూడ జనాకీర్ణములై పోయెను. కొండపై నుండి చూచువారి కా పర్వత సోపానములపైనున్న యాత్రికుల యార్ద్రోత్తమాంగ సోపానపరంపర నీలజల ప్రవాహిని యగుపర్వత వేణికంబోలెఁ గన్పట్టుచుండెను ఆ ప్రజాఘోషము సాగరఘోషముకంటెను విశేషించి యుండెను

శ్రీస్వామిని దిరువీథుల వేంచేయింపఁజేయుట కొక వెండిపల్లకి యలంకరింపఁబడి యాలయము నెదుటికిఁ గొనిరాఁబడియెను భజనపరులు మేళతాళములతోఁ బరమేశ్వర సంకీర్తనములు సేయుచుండిరి. చిఱుగంటలచే నలంకరింపబడిన యాఁబోతుల వెంటఁగొని కొందఱు కంచుగంటల మొరయించుచు నెమిలికుంచెల విసరుకొనుచు నవతారములఁ బాడుచుండిరి. కొందఱు "గోవిందా" యని కేకలు వైచుచు ముకుళితకరులై స్వామియాలయమునకుఁ బ్రదక్షిణ మాచరించుచుండిరి. అక్కడి వారందఱకును శ్రీహరినామ సంకీర్తనము

కంటె వేఱొక మాటలేదు. శ్రీమన్నారాయణ సందర్శనాభిలాషము కంటె వేఱొక కోరిక లేదు. ఆ సమయమున నందటి హృదయము లొక్క-సారిగ భక్తి రసార్ద్రము అగుటకుఁ గారణ మా దివ్యక్షేత్రము పవిత్రమైనదనియు, నాదివ్య మంగళవిగ్రహమునఁ బరమేశ్వరుఁడు మూర్తీభవించి యుండెననియుఁ గలదృఢ విశ్వాసముకంటె వేఱేమున్నది?

పీతాంబరములతోడను, నమూల్యాభరణములతోడను, బుష్పహారములతోడను, నలంకరింపఁబడిన లక్ష్మీనృసింహుల యర్చావిగ్రహము లిరువురు వైష్ణవోత్తములచే నాలయమునుండి వెలుపలికిఁ గొనిరాఁబడియెను. ఆ దివ్యమూర్తులను బల్లకిలో నుంచుసమయమున జయఘంటా నినాదములును, దిరునామోచ్చారణములును, గరతాళములతోడి భగవన్నామ సంకీర్తనములును, వేదఘోషంబులును, మంగళ వాద్యములును, నొక్క-పెట్టున ద్విగుణీకృతములై భూనభోంతరాళమును శబ్దబ్రహ్మమయంబుగఁ జేసివైచెను. ఆ పవిత్ర ఘోషముల నడుమనుండి బోయలు స్వామిపల్లకిని బైకెత్తిరి పల్లకి కిరువంకల నిరువురు దేవ సేవకులు కప్పురపుఁగాగడలఁ జేతబట్టుకొని నిలువఁబడియుండిరి దేవార్చకుఁడు సాక్షాద్దేవతామూర్తివలెఁ బీతాంబర ధారియై ద్వాదశోర్ధ్వ పుండ్రములను యథాస్థానముల మెలచిన రీతిని శ్వేతరక్త కాంతులతో నలరారుచుండ వెండి పళ్ళెరమున విష్ణుపాదుకలును, దులసీ దళములు నుంచి పట్టుకొని స్వామిపార్శ్వమున నిలిచియుండెను అప్పుడ క్రమముగా సముద్రమునుండి కదలు చిఱుదోనె విధంబున నా మహాజన సముద్రమునుండి యాస్వామి పల్లకీ మెల్లఁగాఁ గదలనారంభించెను జనతరంగములు పాయలై యాపల్లకికిఁ ద్రోవ యొసగుచుండెను స్వామి యంతటి మహావైభవముతోఁ దిరువీథులు వేంచేయుచుండెను.

దేవార్చకుఁడు స్వామిపల్లకి నా కొండపల్లెయం దింటింటను నిలిపి యాయింటివా రొసంగిన మంగళపుటారతులును, సదక్షిణంబులగు ఫల తండులంబులును శ్రీహరి కర్పణము గావించి, వారి శిరములపై స్వామి పాదుకల నుంచి, యొకటి రెండు తులసి దళంబు

లను స్వామి ప్రసాదముగా నొసంగి ముందటికిఁ దరలించు చుండెను.

ఈ రీతిగా స్వామివాహనము పురమేగింపఁబడుచు నొకపటకుటీరము నొద్దకు వచ్చెను. అది యమూల్యదుకూల పరిచ్ఛదంబుతోడను, ముక్తాఫలజాలంబులతోడను, రజత కాంచన స్తంభంబులతోడను విలసిల్లుచు నధీశ్వరుని యధికైశ్వర్యమును సూచించు చుండెను. ఆ కుటీరముఖ ద్వారమున నొక్కచేమూఁడరిగల యుదుపులం దాల్చి యిరువురు సేవకులు కత్తులతోఁ గావలికాచుచుండిరి స్వామి యచ్చటికి వేంచేసినతోడనే లోపలినుండి నలువదివత్సరముల వయసు గల పురుషుఁడొకడు సముచిత పరివారముతో నంజలిబద్ధుఁడై యివ్వలకు వచ్చెను. ఆ ద్వారమున కేడెనిమిది గజంబుల దూరమున నున్న రాణివాసగృహంబునుండి ముప్పది యేఁడ్లయీడుగల యువతీమణి యొక్కతెయును, నించుమించు పదునాలుగేఁడ్ల వయిస్సుగల కన్యకామణులు ముగ్గురు నివ్వలకు వచ్చి స్వామిని సందర్శించుచుండిరి అందొక కన్యక బంగరుపళ్లెరమునఁ గప్పురపుటారతియును, మౌక్తిక హారములును, జూతఫలంబులును, బసిండి రూకలు నుంచుకొని నిలువఁబడి యుండెను. దేవార్చకుఁడు ముందుగ నా పురుషునకు స్వామి పాదుకలను. దులసిదళంబులను నొసఁగి ముందటికిబోయి యాకన్యక చేతనున్న పళ్ళెరము నందికొని యాఫలంబులను స్వామికి నివేదించి ముక్తాహారముల లక్ష్మీనృసింహుల కలంకరించి పసిండినాణెముల భగవదర్పితములుగాఁ జేసి స్వామిభుక్తశేషం బగు ప్రసాదంబుగా నొకఫలమును, దులసిదళంబులను నా పళ్లెరమునందుంచి యాకన్యకకు మరల నిచ్చి వారందఱకును విష్ణుపాదుకల నొసంగుచుండెను.

ఆ సమయమున నెదుట జనుల కోలాహలము తలచయ్యెను. వేత్రధారు లగు నిరువురు పురుషులా జనసముద్రము నిరుపాయలుగఁ జేసి మార్గముఁ గల్పించుచుండిరి ఆ త్రోవ నిరువదియెనిమిదేండ్ల వయసుగల సుందరపురుషుఁ డొకఁడు మహారాజోచితాలంకారములతో నొయ్యారముగ నేగుదెంచుచుండెను. ప్రజల కన్నులన్నియు నప్పు డాతనివంకకే తిరిగెను. అతఁడు సుందరుఁడై యుండెను. నేత్రములు విశాలములై, రక్తరేఖాసమన్వితములై

యుండెను. విశాల వక్షస్థ్సలంబును, మాంసలంబు లగు వాహాను బాహుదండములును, నాతని సమున్నతాకారమున కందమును గల్పించుచుండెను. అతఁడు క్రమముగా నా పటకుటీరము వంకకు వచ్చుచుండెను. ఆతనితోఁగూడ నొక పురుషుఁడు వచ్చుచుండెను. అతఁడు "యువరాజా! ఇదియే నీలాద్రిరాజు పటకుటీరము" అని చూపెను. కుటీరద్వారముకడ నుచితపరివారముతో నిలిచియున్న నీలాద్రిరాజాతనియాగమనముం గాంచి సవినయముగ, సగౌరవముగ నెదురుకొని దక్షిణహస్తముఁబట్టుకొని "సార్వభౌమకుమారా! దయచేయుము" అని పలుకుచు నా మందిరము కడకుఁ దోడితెచ్చెను. అతని రాకం గాంచి కొలఁదిదూరముననే యున్న రాణివాస జనమంతయు లోనికిఁ బోయెను. మంగళపుహారతిం బూని నిలిచియున్న కన్యక మాత్రము స్వామిసందర్శనమున దనివి తీరక యావంకకే చూచుచు నిలువఁబడి యుండెను. ఆమె యీ వంకఁ జూచుటయే లేదు. పురుషునిదృష్టులా వంకకుఁ బోయెను. అటనుండి కొంతసేపటివఱకుఁ దిరుగనేలేదు.

దేవార్చకుఁడు స్వామిపాదుకలు పురుషుని శిరమునందుంచి కొన్ని తులసిదళంబులును, సుగంధకుసుమంబులును, ఫలంబులును నాతని చేతులయందుంచెను అప్పుడు గూడ నాతని చూపు లోరగ నా కన్యవైపునకుఁ బోవుచుండుటచే మనసుకూడ నా వంకకే మరలుట వలన నాతఁడు పరాకుగ నా ఫలపుష్పములను గ్రిందికి జాఱవిడిచెను. అర్చకుఁడా పరమేశ్వరప్రసాదము క్రిందఁ బడకుండఁ బళ్లెరమున సేకరించెను. ఆ సమయమున మంగళవాద్యములు మొరసెను. దేవుని దివ్య విమానమటనుండి కదలెను ఆ కన్యక తిరిగి తిరిగి చూచుచు నంతఃపురమునకుఁ బోయెను ఆ పురుషుఁడప్పుడు తన హృదయము నామె చూపుల కొకయంతరర్థమును గల్పించుకొనియెను. దేవవిమానము కదలినతోడనే మొదటి పురుషుఁడా కుమారుని లోనికిఁ దీసికొనిపోయెను. ఆతని చూపు లాతని కన్నులతోడనే పోలునవి కాని మనసు మాత్రము తన మనసువచ్చిన చోటికిఁబోయి యుండెను.

# 2. అదృష్టము

నీలాద్రిరాజు యువరాజును లోనికిం గొనిపోయి యుచిత పీఠమునఁ గూరుచుండఁజేసి యతివినయకలితంబు లగు నుపలాలాపములచే వాతని యనుగ్రహమును సంపాదించుకొనియెను. యువరాజు వ్యస్తహృదయమున నాతనితో నించుకసేపు సంభాషించి వెడలిపోయెను. ఆనాఁటి సాయంకాలమున నీలాద్రిరాజొక్కఁడును పటకుటీరమును వదలి యుత్తరాభిముఖుఁడై కొంతదూరము పోయెను అటననేకులు జనులు గుంపుగూడియుండిరి. కొందఱట నుండి వెడలిపోవుచుండిరి. మఱికొందరు వచ్చి యా గుంపులోఁగలసి కొనుచుండిరి ఒకరినొకరు త్రోసికొని గుంపులోనికిఁ బోవుచుండిరి. ఆ గుంపు నడుమ నొక యోగీంద్రుఁడు సాక్షాత్సాంబశివమూర్తివలె వ్యాఘ్రచర్మముపైఁ బద్మాసనస్థుఁడై కూరుచుండియుండెను. తేజోమూర్తియగు నాతని శరీరమంతయును భస్మముచే నలంకరింపఁబడి యుండెను. అతని శిరోజములు తెల్లనై జడలుగట్టి వెన్నున వ్రేలాడుచుండెను ఆ మునిసింహుని విశాలవదనము దీర్ఘశ్మశ్రుసమన్వితమై సింహవదనమువలె భయంకరమయ్యు, శాంతతేజోనిధానమై యుండెను. జటాకౌపీనధారి యగు నాతనికి రుద్రాక్షమాలికల కంటె నితరాలంకారము లేవియును లేవు. ఆ మహామహుఁడు తనయెదుట నిలిచియున్నవారిలో నొక్కొక్కరిం బిలిచి హస్తముల బరికించి వారి భూతవర్తమానభావిస్థితులయందలి ముఖ్యభావములం దెలిపి పంపివైచుచుండెను పిలువకుండ నాతనియొద్దకుం బోవుట కెవ్వరును సాహసించుటలేదు

పలుకులంబట్టి పరుషసరళస్వరంబుల నెఱుంగవచ్చును. చూపులం బట్టి క్రూరశాంతస్వభావములను దెలిసికొనవచ్చును. ముఖలక్షణములంబట్టికోపప్రసన్నభావములం గనిపెట్టవచ్చును. అవయవస్థితులంబట్టి కర్కశతామార్దవములఁ బరిశీలింపవచ్చు ను. నిట్టూర్పులంబట్టి పరితాపమును, గన్నీళ్ళఁబట్టి దుఃఖమును, కంపమునుబట్టి భయమును గ్రహింపవచ్చును, అంతియకాక సామాన్యముగఁ బోలికనుబట్టి

యాభిజాత్యము నూహింపవచ్చును ఇట్లే వివేకనిధులును లోకాను భవజ్ఞానసంపన్నులు నగు దైవజ్ఞులు హస్తగతంబులగు రేఖలను బట్టియు, నవయవలక్షణంబులఁబట్టియు, మనుజుల యదృష్టమును నిర్ణయించుటకు మార్గములను గనిపెట్టియుండిరి. అట్టి మహామహుల దివ్యజ్ఞానానుభవంబువలననే జ్యోతిస్సాముద్రికాదిశాస్త్రము లుత్ప న్నంబు లయ్యెను. అట్టి శాస్త్రజ్ఞానమును సంపాదించి లోకానుభవ మును గన్న దైవజ్ఞులు కొందఱిప్పటికిని లోకోపకారార్థముగ జనుల భూతభావిస్థితుల ననువదించుచుందురు. ఈ యోగిశేఖరుఁ డట్టి దైవజ్ఞశిఖామణియే. ఈతఁడు శ్రీశైలమునుండి యాత్రార్థియై యిచ్చటికి విచ్చేసెనని జనులు చెప్పుకొనుచుండిరి ఆతఁడు చెప్పిన ఫలములనుబట్టి యా యోగీంద్రుని దివ్యజ్ఞానమున కెల్లరు నాశ్చర్య పడుచుండిరి ఆ సంఘములో నాతనికి నమస్కరింపనివారును, ఆతని యద్భుతశక్తింగూర్చి పొగడనివారును, ఆతనిఁ బరమేశ్వ రునిగ భావింపనివారును మందునకైన లేరు.

మననీలాద్రిరాజు జనసంఘముకడకుఁ బోయెను. అతని యాకారముంబట్టియు, రాజచిహ్నములఁబట్టియు, నాతనింగాంచి యెల్లరును సగౌరవంబుగ నాతని కించుక చోటొసంగిరి. నీలాద్రి రాజాశ్రమంబున లోపలఁ బ్రవేశించి యోగీంద్రునియెదుట వినయ వినమితుడై నిలువఁబడియెను. అప్పుడా యతిచంద్రుఁ డొకని హస్తముం బరికించి ఫలనిర్ణయము చేయుచుండెను. నీలాద్రిరాజు తదేక దృష్టితో నా వంకకే చూచుచు నిలిచియుండెను. కొంతసేపటి కా మునిశేఖరుఁ డాతనివంకఁ జూచెను అప్పుడు నీలాద్రిరాజు సాష్టాంగనమస్కారము లాచరించెను. యోగి యాతనిఁ గూర్చుండ నాజ్ఞ యొసంగి హస్తముం జూపుమని సౌంజ్ఞ చేసెను. నీలాద్రిరాజు తన దక్షిణహస్తము నాతనికిం జూపెను.

యోగి యాతని కరమునందలి రేఖలను దిలకించి బొమలు ముడివైచి యొక్క నిట్టూర్పు విడిచెను. తరువాత నించుక జాలిని సూచించు చూపులతో నాతని మొగమువంకఁ జూచెను తుద కిట్లని చెప్పనారంభించెను. "నీ విప్పుడు నీ సోదరుని రాజ్యమునకుఁ

ప్రతినిధివై యుంటివి నీకొక కుమారుఁడును, గొమరితయుఁ గలరు. నీ తనయ యొక చక్రవర్తి కిల్లాలు కాఁగలదు—" అని చెప్పుచుండ గనే నీలాద్రిరాజు "మహాత్మా! నాకుఁ జక్రవర్తి యల్లుఁడగునంతటి యదృష్టము పట్టునా?" అని యడిగెను.

యోగి మఱి మాటాడక తల యూఁచెను.

నీలాద్రిరాజు తత్తరముతో "మహానుభావా! ఇంకను నా యదృష్ట మెట్లుండునో దయయుంచి తెలుపవలయును," అని వేడు కొనియెను.

యోగి "నీ యూహలకుఁ దగినట్లే—" అని పలుకుచు మొగము త్రిప్పుకొనియెను.

మహాత్ములగు దైవజ్ఞు లకారణముగ నవ్యాజముగ నొక్కొ క్కప్పు డడుగకుండ నగపడనవారి యదృష్టముం గూర్చి చెప్పి పోవుచుందురు. అట్టి మహాత్ములు తమ్మెంత ప్రార్థించినను నొక్క పలుకైనఁ బలుకరు. అట్టివా రొకరి యనుగ్రహమున కానించువారు కారు ఒకరి యాగ్రహమునకు బెదరువారు కారు. ఒకరి యభినంద నమును మెచ్చువారు కారు,ఒకరి నిందనమును లెక్కించువారు కారు. ఈ యోగీంద్రుఁడు కూడ నట్టివాడే ఈతఁడు తన కుచితముగఁ దోఁచినంత చెప్పువాఁడే కాని యడిగిన ప్రశ్నముల కుత్తర మిచ్చు వాఁడు కాఁడు. అప్పుడా మునిచంద్రుఁడు నీలాద్రిరాజు హస్తమును వదలి మఱి యొకని హస్తమును బరీక్షింప నారంభించెను.

నీలాద్రిరాజు హతాశుఁడై యటనుండి లేచి యతివరుని గూర్చి సెలవు వేఁడికొనియెను. యోగి మఱి యాతనివంకఁ జూడనే లేదు. ఆతఁడట్లే కొంతసేపు నిలువఁబడియుండి మునిచంద్రుని యాభిముఖ్య ముం బడయఁజాలక యటనుండి కదలెను ఆతని హృదయమప్పుడు చేవెట్టి కలఁచినట్లుండెను యోగీంద్రుని తుదిమాట లాతని హృదయ మునఁ బిడుగులవలెఁ బ్రతిధ్వనించుచుండెను.ఆ దారుణాహతులచే నాతని గుండె గుభిల్లుమనుచుండెను. ఆతఁడట్లే మెల్ల మెల్లగ నడచుచుఁ దన మనంబున నిట్లాలోచించుకొనియెను.

"ఈ యోగీంద్రుని కడపటివాక్యమసంపూర్తిగ నున్నది.

దాని భావమేమియు నిశ్చయముగఁ దెలియకుండుటచే నింత తత్తర పడుచుంటిని తరువాత నే నెంత యడిగినను నాతఁడు మాఱుమాట తెలుపలేదు ఆ వాక్యమున కర్థ మేమై యుండును? ఏమగుటకై యున్నది? ఆతఁడు సర్వజ్ఞుఁడనుటకు సందేహము లేదు కానిచో నా సంగతి యంతయుఁ బూసగుచ్చినట్లెట్లు చెప్పఁగలుగును? ఆతఁడు చెప్పినఁ బతయు శుభస్థితియే యైయున్నది. నా తనయ సార్వభౌమున కిల్లాలగుట శుభస్థితి కాదా? ఆతని తుదివాక్యము కూడ శుభసూచకమే కావలయును. "నీ యూహలకుఁ దగినట్లే ఫలము లభియింపఁగలదు" అనునదియే యాతని సమస్యకుఁ బూర్తి కావలయును. మొదట "నీ విప్పుడు నీ సోదరుని రాజ్యమునకుఁ బ్రతినిధివై యున్నాఁడవు" అని చెప్పిన వాక్యమునకు "నీ యూహలకుఁ దగినట్లే—" అను కడపటి యసంపూర్తి వాక్యము సమన్వయించుటలేదా శుభసంపాదకుఁ డగు నాతని కడపటివాక్యము నకు 'ఫలము లభియింపఁగలదు." అను నుద్దేశమే యంతర్లాపియై యుండనోపును కాదే నా వాక్యమునకు మఱియొక యుద్దేశ మేముండును? సరియేకాని నా తనయ సార్వభౌమున కిల్లాలగుట యెట్లు సంభవించును. అది చాల వింతగా నున్నది. ఏమో! అదృష్ట మెప్పు డెట్లుగా మాఱునో యెవ్వరు చెప్పఁగలరు?" అని యీ విధ ముగా నాలోచించుకొనియెను

క్రమక్రమముగా నాతని హృదయసంభ్రమము శాంతించెను. అస్తంగతసూర్యునితోఁ గూడ నాతని సందేహము అస్తమించెను. సాంధ్యరాగముతోఁగూడ నాతని హృదయాకాశమున శుభోదయ రాగ మలముకొనియెను

## 3. వేఁట

వేఁటవలన లక్ష్యనిపాతన సామర్థ్యము, జంతుస్వభావవిజ్ఞానము దేహపరిశ్రమము మొదలగు సుగుణములు కలుగునని కొందఱు చెప్పుచుందురు దుష్టమృగసంహారమునఁ బ్రజలకును, సస్యములకును సంరక్షణము కలుగునుగావున వేఁట రాజుల కవశ్యకర్తవ్యమని కొం

దయు చెప్పుదురు కాని యెవరెట్లు చెప్పినను వేఁట సప్తవ్యసనము
లలో నొకటియనియు, సర్వవిధములఁ బరిత్యాజనీయంబనియు మేము
ఘంటాపథముగా జెప్ప గలము. గర్భవతి యగుటచే నలసగమన యగు
నొకయాఁడు లేడి, మృగయుని క్రూర వీక్షణంబులకంటె నతిక్రూరం
బును, నతినిశితంబును నగు కత్తి వాతియమ్మునకు బొట్ట చీల్పఁబడి
క్రిందఁ బడిపోయినప్పుడు, పొంగి పొరలి వచ్చుచున్న వెచ్చని నెత్తురు
మడుగునంబడి నెలలు నిండని నెత్తురు కండు పరిపూర్తి నందని యవ
యవములతోఁ గొట్టుకొనుచుండ, మూఁతలు వడియుఁ బడని కన్నుల
నుండి వేఁడికన్నీరు మున్నీరుగాఁ జేయుచుఁ దల్లి లేడి వెడలియు వెడ
లని ప్రాణములతోఁ దల్లడిల్లుచున్నప్పుడు కన్నారఁగాంచిన యే కఠిన
హృదయుఁడు వేఁట వినోద క్రీడయని చెప్పుటకు సాహసింపఁగలఁడు?
గూటిలోని గ్రుడ్లను వదలి యివ్వలకు వచ్చి మేఁతకై పోయిన కపో
తము రాకకొఱకుఁ గనిపెట్టుకొని చూచుచున్న గువ్వపెంటి వాఁడి
యలుగున కెరయై పడిపోయినప్పుడు, కపోతము వచ్చి ప్రియంగానక
పరితపించుచుఁ బిల్లలకు మేఁత నిడుటకై నఁదోఁచక యొంటి కాలున
నిలిచి పొట్టలోఁ దల గ్రుచ్చుకొని పనవి పనవి దుఃఖించు చుండఁగా
దానిని గూడ నదయుఁడగు మృగయుఁడు తనయలుఁగునకు బలిసేయు
నప్పుడు దిక్కుమాలిన యాకపోత శాబకము లాఁకట మలమల
మాడుచుఁ గీచుకీచుమని వాపోవుచుండఁ జెవులార వినిన యేనిర్దయుడు
వేఁట విలాస విహారమని నుడువఁ దమకింపఁగలఁడు?

కాని యౌవనమదోన్మత్తులగు రాజకుమారుల కిది వినోద
మాత్రముగనే యుండును, విలాసవిహారముగనే యుండును. సాధు
మృగంబులఁ జిత్రవధము కావించుట వినోదమని యెవ్వరు చెప్పఁ
గలరు? దుష్టమృగ సంహారనార్థమే రాజులకు వేఁట విధియింపఁబడి
నది. కాని సాధు మృగమారణంబునకుఁగాదు. వేఁటాడినకొలఁది
దమక మతిశయించు చుండుటచేఁ బెద్దలీ మృగయా విహారమును
దుర్వ్యసనముగాఁ బరిగణించి యుండిరి ఇట్టి వేఁటతమకంబున నే
యర్జుననంతటివాఁ డేకలవ్యుని యెడల నసూయాపరవశుఁ డయ్యెను.
ఇట్టి వేఁటతమకంబున నే పరమేశ్వరునంతటివాఁ డర్జునితోఁ బోరాడి

పరిభవపరిహాస పాత్రుఁడయ్యెను: కేవలవినోద మాత్రమే కాక యుచితకారణ సంకలిత మైనను మృగయాశక్తి ప్రమాదకరమే యగును దశరథుండును, పాండునృపాలుఁడును మునిశాపోపహతు లగుట వేఁటమూలముననే గదా! సత్యకీర్తి యగు హరిశ్చంద్రసార్వభౌముఁడు పదచ్యుతుఁడగుటకుఁ గారణము వేఁటకంటె వేఱొండే మున్నది? సమయ సందర్భములంబట్టి యకారణ వైరములను, వాకస్మికాపాయములను గల్పించుటయందు మృగయాసక్తియే సర్వసమర్థమైనది.

సింహాచలమునకుఁ బశ్చిమమున నున్న సాంద్రారణ్యమున వన్యమృగంబులకల్లోల మతిశయంబుగా నుండెను. కొందఱు వేఁటకాండ్రు డప్పులు మొదలగు వాద్యములతోఁ గొండపైనుండి మృగంబులఁ దెరలించుచుండిరి. భయంకరంబు లగునాశబ్దముల నాలకించి పులులు పందులు మొదలగు క్రూరమృగంబులును లేళ్ళు, దుప్పులు మొదలగు సాధుమృగంబులును గూడఁ దల్లడిల్లుచు నిలిచినచోట నిలువక పరుగులెత్తుచుండెను. ఆ సంఘోపద్రవసమయంబున జాతివైరములను గూడఁ బాటించుట లేదు. ఎదురెండ తాఁకున గన్నులు మిఱుమిట్లు గొనుటచేఁ గాళ్ళుజాఱి కొన్నిజంతువులు క్రిందఁ బడిపోవుచుండెను. కొన్ని కొండలోయలలోనికిఁ బోయి మాయ మగుచుండెను. కొన్ని భయావేశముచే నొడలెఱుఁగక ముందునకుఁ ద్రోసికొనివచ్చుచుండెను. వేయుచున్న మేఁతలను గణించుట లేదు. పాలుద్రాగుచున్న బిడ్డలను జూచుకొనుటలేదు వన మంతయు భీతమృగంబులచే కల్లోలముగా నుండెను.

కళింగరాజకుమారుండగు వీరభద్రగజపతి యుచితపరివారముతో మృగయావిహారము సేయుచుండెను. అతఁడు పరమానందముతో నగపడిన జంతువుల నెల్ల నమ్ములపాలు సేయుచుండెను. పడిన కొలఁది సేయుటకే యాతని కుత్సాహ మతిశయించుచుండెను. ఒక వంక వేఁట కుక్కలును, మఱియొక వంక భయంకరధ్వనులును వన్యమృగసంతతి నతలకుతలముగఁ జేసివైచుచుండెను.

రాజకుమారుఁడును బరివారజనంబుఁగూడఁ దమతమ కర

లాఘవ శరలాఘవంబులు మెఱయ సత్యుల్లాసముతో వేఁట లాడు చుండిరి ఆ భయంకర సంరంభమున నెన్నిపులులతలలు వ్రయ్య లయ్యెనో, యెన్ని కారెనుఁబోతులకంఠములు కరవాలముల కెర యయ్యెనో, యెన్నివరాహముల క్రొన్నెత్తుట నిశాతలము పంకిల మయ్యెనో, యెన్నికన్నె లేడుల నిండుప్రాణములు శరానలంబున కాహుతియై పోయెనో, యెన్నెన్ని యితరసాధు మృగంబుల కోమలాంగములు నిశితాయుధాఘాతములచేఁ జిందఱవందఱయై పోయెనో లెక్కించుటకు సాధ్యాతీతమై యుండెను క్రమముగా మృగ సంఖ్య మందగించుచుండెను. మృగయులయుత్సాహ మతిశయించు చుండెను. ప్రొద్దుపోవు చుండెను. వేఁటపై కింకను మనసు పోవు చుండెను. మృగములు పలుచఁబడుటచే మృగయులు పలుదెసలకుఁ జెదరి వేఁటాడ నారంభించిరి. ప్రొద్దుగ్రుంకుసమయ మయ్యెను, ఆకస మున నెఱసంజ యాక్రమించుకొనియెను. వనమంతయును రక్త కాంతి సముజ్జ్వలం బయ్యెను. ప్రకృతి సహజంబులగు నుపహారము లచేఁ దనిసి మత్తెక్కియున్న బలవన్మృగంబుల క్రొన్నెత్తుటిచే సిలా తలమంతయు రక్తమయం బయ్యెను. మృగయుల కరలాఘవంబున మృగగర్భములం జీల్చుకొనిపోయిన వాఁడి నారసములుగూడ రక్త ముఖంబులై యందందుఁ బడియుండెను. కోదమజాగిలముల కోన గోఱలనుండియు, యోధహస్తములందలి భల్లముఖంబులనుండియు రక్తము స్రవించుచుండెను. అప్పుడావన మంతయు, రక్తముఖియు రక్తాక్షియు, రక్తప్లావిత విగ్రహయునగు చండికా మూర్తిం దాల్చి యుండెను.

రాజకుమారున కింకను వేఁటయం దభిరుచి తగ్గలేదు. అతఁ డింకను వేఁటాడఁ దమకించుచునే యుండెను. అప్పుడా సంజమసఁ గున నాతని యెట్ట యెదుట నున్నయొక పొదమాటునుండి గజకల భంబువలెనున్న యొకకొమ్ముపంది తప్పించుకొని పాఱిపోవు చుండెను. రాజకుమారుఁడు దననిశిత భల్లముతోఁ గ్రుమ్మవలయు నను నుత్కంఠముతో నావరాహమును వెంబడించి పరువెత్తెను. ప్రాణభయంబున నది యతివేగమున నా కొండలోయకుఁ బరుగు

వాలెను. అతఁడును బట్టువిడువక దానిని వెం బండించి వేగముగ-
బోవుచుండెను.

ఆపత్సమయమున భయమే క్రోధముగాఁ బరిణమించు
చుండును. ప్రాణములపై నాశయున్నంతవఱకు భయముండును.
ఆయాశ వదులుకొన్నతోడనే యాభయము దూరమైపోవును
క్రోధసాహసము లాస్థానము నాక్రమించుకొనును ప్రాణములకుఁ
దెగించి పైబడుచున్న యల్పులనుగూడ నరికట్టుట యసాధ్యము.
మనుజుఁడనిన ప్రతిజంతువునకును భయమే. ఆతనిం గాంచి యన్ని
యును బాఱిపోవుచుండును. భయపడియో, యాసపడియో వశీ
కృతము లగుచుండుటయును గలదు కాని ప్రాణాపాయస్థితికిం
దెచ్చినపుడు మాత్రమాతనిఁ బిల్లికూడ నెదిరించి చంపుటకుఁ బ్రయ
త్నించుచుండును.

ఆవరాహమునకు భయ మధికమయ్యెను. భయపడి పరువెత్తు
టచే నాయాస మధికమయ్యెను రాజకుమారుఁడింకను తఱుముకొని
వెన్నంటి వచ్చుచునే యుండెను. తప్పించుకొనిపోయి బ్రదుకుట దుర్ల
భముగాఁ దోఁచెను. ఇంక నది తనప్రాణములపై నాశ వదులు
కొనియెను తోడనే దాని యొకలంతయును క్రోధావేగమున నుప్పొం
గెను. నిడుదయూరుపులచే ముకుపుటములనుండి క్రోధాగ్నిధూమశక
లంబులవలె గ్రొవ్వేఁడి నురుఁగులు వెలువడుచుండ నతిదారుణముగ
ఘుర్ఘురించుచు గిరుక్కునఁ దిరిగి వింటినుండి విడివడిన యమ్మువలె
నతివేగముగ రాజకుమారునిఁ గొమ్ములతోఁ జిమ్మివేయవలయునని
వచ్చుచుండెను. రాజకుమారుఁడు తన వాఁడి బల్లెమును దక్షిణ
కరంబునం బూని జాగరూకతతో వరాహసంహారణోత్సుకుఁడై
నిలిచియుండెను.

"రాజకుమారా! సాహసము వలదు, వలదు!" అని పలుకుచుఁ
బరిజను లాతనికడకుఁ బరువెత్తుకొని వచ్చుచుండిరి కనుమూసి
తెఱచునంతలో నా వరాహ మొక్క పరుగున వచ్చి రాజకుమారుని
పైఁబడఁ దమకించెను రాజకుమారుఁ డతిలాఘవముతో భుజబలము
మెఱయఁదన బల్లెము నా వరాహముపై బ్రయోగించెను. అది యా

పంది వలపలిముంగాలి క్రిందనుండి గర్భమునం జొచ్చి దాపలిచట్టి నుండి దూసికొనిపోయెను తోడనే యా పంది ఘుర్ఘురించుచుఁ దన క్రోధానలంబునకుఁ బ్రాణముల నాహుతిచేసి క్రిందఁ బడిపోయెను

రాజకుమారుఁడు వరాహశరీరమున నాటుకొనియున్న బల్లెము నూడఁబెఱుకుచుండ నింతలో నొక వంక వ్రేటునుండి తప్పించుకొనిన యొక భయంకర వ్యాఘ్రము క్రోధభీషణాకారముతో రాజకుమారునిపై నువ్వెత్తుగఁ బడి కబళించిపోవలయునని యతివేగముగఁ లంఘించి వచ్చుచుండెను ఆ దారుణ సంరంభముం గాంచి పరిజనులందఱును గొల్లునఁ గేకలు వైచుచు రాజకుమారునిఁ గాపాడవలయునని యతివేగముగ వచ్చుచుండిరి ఆ పులియును మృత్యుదేవతవలెఁ దనకరాళవదనముం దెఱచుకొని యా కలకలము లెక్కసేయక యతిత్వరితముగ నాతనిపైఁ బడుటకు దాఁటుకొని వచ్చుచుండెను ఆ కేకలను విని రాజకుమారుఁడు వెనుదిరిగి చూచెను ఆ పుండరీకము భయంకర రాక్షసునిబోలి తనపైఁబడవచ్చుచుండెను. బలముగ గ్రుచ్చుకొనిన బల్లెమెంత పెఱికినను వచ్చుటలేదు. అపమృత్యుదేవతవలె నెట్టయెదుటఁ బెద్దపులి పైఁబడనుంకించుచుండెను పరిజనులు దూరమునం దుండిరి. వారతివేగమునఁ వచ్చి కలిసికొనుట యసంభవము. ఆతని మనసు చెదరిపోయెను మృత్యుచ్ఛాయ తన్నావరించుకొనియున్నట్లు భావించుకొని నిశ్చేష్టుఁడైపోయెను. ఆ సమయమున నాతఁడు తన యొరయందలి కరవాలము మాటయే మఱచిపోయెను.

ఇంక నొక దాఁటునకుఁ బులి యాతనిపైఁ బడిపోవును వజ్రకర్కశంబులు, నతినిశితంబులు నగు నఖంబులతో ముంగాళ్ళను పైకెత్తి యా పుండరీక మాతనిపై నుఱుకుటకు సిద్ధముగా నుండెను. ఇంతలో నిరువు రాయుధపాణులగు నాశ్వికులు తమ గుఱ్ఱముల నడాయించుకొనుచు సాక్షాత్కరించిన నరనారాయణులవలె వచ్చుటఁ బ్రవేశించిరి అందొక పురుషుఁడు గుఱ్ఱమునుండి గుభాలునఁ గ్రిందికుఱికి రాజకుమారున కడ్డముగ నిలిచి తననిశితకరవాలముతో నతిలాఘవముగ నా వ్యాఘ్రశిరంబును ఖండించివైచెను.

పరిజనులు సాధువాదములతో నా మహాపురుషునిఁ గీర్తించుచు

వచ్చిఁ బ్రవేశించిరి. కొందఱు నేఁడు సుదినమనిరి కొందఱు రాకుమారుఁడీ దినమున మృత్యుముఖమునుండి విడివడియెననిరి కొందఱీ మహాపురుషునిఁ బరమేశ్వరుఁ డిచ్చటి కాకస్మికముగఁ బంపి మా రాజకుమారుని జిరంజీవిగాఁ జేసెనని సంతోషించిరి కొందఱు సర్వరక్షకుఁడగు రాకుమారుని బ్రాణములనే యొసంగిన యీతనికిఁ బ్రత్యుపకార మేమి సేయఁగలమనిరి ఇట్లనేకు లనేక విధములఁ దమ సంతోషమును వెల్లడించుచుండిరి బహుళరోదనధ్వనులతోఁ బ్రతిధ్వనింపవలసినయాసాయంతన మప్పుడు పరమానందసంగీత నిస్వనములతో మెఱసిపోవుచుండెను

జనులందఱు నా పురుషుని మహోపకారముం గూర్చి కీర్తింప నారంభించిరి రాజకుమారుఁడు ఖిన్నవదనుఁడై పోయెను. దురభి మానులు పరగుణకీర్తనమును సహింపఁజాలరు రాజసము కన్నులఁ గప్పినప్పుడు గుణపరిశీలనాశక్తి యంతర్హితమై పోవును. రాజ కుమారుఁడు పురుషుని గుణకీర్తనము వినుటకంటెఁ జచ్చుటయే మేలని భావించుకొనియెను అతని గుణోత్కర్ష తన కపకర్షను గల్పించు చున్నదని యనుకొనియెను. సామాన్యముగ లోకము గుణమును గ్రహించు స్వభావముగలది. తనకు మహోపకార మొనరించిన వానినిఁ దనకృత్యలోకము కొనియాడుచుండ నాతఁడేమి చేయఁ గలఁడు? తాను లోలోపల నెంతగాఁ గుందుచున్నను వలదని వారిం చుట కాతనికి నోరెట్లు వచ్చును? అయినను దురభిమాన మాతని హృదయము నుడికించుచునే యుండెను అప్పుడాతఁడు తన పరి జనులం గాంచి "ఈతఁడును మన పరిజనులలోనివాఁడే స్వామిసేవయే భృత్యునకుఁ బరమధర్మము ఈతఁడు తన విధాయక కృత్యమును నిర్వహించుకొని ప్రభుభక్తిని బ్రదర్శించుకొనియెను." అనియెను."

ఆతని యీవాక్యములందలి ప్రత్యక్షరమందును రాజసము మూర్తీభవించి యుండెను, దుఃభిమానము పూఁత పూయఁబడి యుండెను. అసూయ గర్భీకృతమై యుండెను.

అప్పుడా పురుషుఁడు చిఱునగవుతో "సార్వభౌమకుమారా! ఓపినకొలఁది నాపన్నుల నుద్ధరించుట జ్ఞానలేశముగల ప్రతిమానవున

కును విధాయక కృత్యమే యగును దేశ క్షేమమును గోరియున్న వాకు రాజకుమారులగు మీ ప్రాణములను గాపాడుట స్వధర్మము కాకుండునా?" అనియెను

రాజకుమారుఁడు విస్మయకరమగు నవ్వుచు, విస్మయమును వర్షించు చూపుల నధోమార్గమునకు మరలించెను

"రాకుమారా! పునర్దర్శనమగుఁగాక" అని పలికి వీడ్కొని యాయాశ్వికవీరు లిరువురును గుఱ్ఱములను దాఁటించుచు నొకనిమిష ములో నదృశ్యులై పోయిరి

# 4. రసాలవనము

"అక్కా! సార్వభౌమునివలన బావ కేదియో విశేషబహు మానము రాఁగలదని తోఁచుచున్నది" అని శ్యామల తనయక్క యగు కమలతో ననియెను.

కమ—అది యెట్లు?

శ్యామ—బావ యొక క్రూర వ్యాఘ్రమును సంహరించి రాజ కుమారుని ప్రాణరక్షణము చేసెనని రాత్రి మనయన్న చెప్పెను గదా?

కమ—"ఇది యాతనికి విధాయక కృత్యమే" అని రాజ కుమారుఁ డప్పుడే చెప్పిన సంగతి కూడ నాతఁడు చెప్పలేదా?

శ్యామ--ఔను రాజ్యమదంబునను, యౌవన మదంబునను దురభిమాని యగునాతనికి గుణ గ్రహణశక్తి లేకపోయెను గాని, లోకానుభవము గల వృద్ధుండగు సార్వభౌముఁడీ వార్త నాలకించి యూరకుండునా!

కమ— సోదరి! సార్వభౌముఁడు మొదలు సకలజీవులకును బరి పాలకుఁ డెవ్వఁడోయట్టిపరమేశ్వరుఁడను గ్రహించి యొసంగిన బహు మానమే బహుమానముగాని, తక్కినవి యస్థిరంబులును, చంచలంబు లును గావా!

శ్యామ—అక్కా! ఔనౌను.

ఇట్లు సంభాషించుకొనుచు వారిరువురును బటకుటీరమునకు

వెనుకనున్న రసాలవనంబున నొకతియ మావిగున్నక్రిందఁ గూరుచుండి మల్లెపూలదండలను గ్రుచ్చుకొనుచుండిరి వారి చెలిమికత్తెయగు శశిరమణి యక్కడకుఁ గొంచెదూరమున నున్న గులాబి పొదలకడ కరిగి పూవులను గోయుచుండెను.

సాయంసమయము అమృతగర్భ మగునా సింహాచలమున, నా రసాలవనమున, నా వసంతసాయంతన మెంతయో రమణీయముగ నుండెను. కళింగ రాజకుమారుఁడగు వీరభద్ర గజపతి తన మిత్రులతోఁ గలసి యారసాలవనమార్గమున వాయుసేవనమున కరుదెంచుచుండెను. ఇట్లు వచ్చుచు నాతఁడు పుష్పాపచయము సేయుచున్న యాశశిరమణింగాంచెను తోడనే యాతని యొడలంతయును పులకించెను మొన్నటి యుదయమున స్వామికి మంగళపుహారతిం బట్టి నిలుఁవబడియుండఁగాఁ జూచిన కన్యకారత్నము మరల నిప్పు డాతని కన్నులఁబడియెను అడుగు ముందునకు వైచిన నా కాంతామణి యటనుండి వెడలిపోవునేమో యను సంశయమున నాతఁడా పొద చాటుననే నిలువఁబడి యనిమిషనయనుఁడై యావంకనే చూచుచుండెను అతని మనసు చెదరిపోవుచుండెనే కాని, చూపులు సిశ్చలములుగనే యుండెను కొంతసేపట్లు చూచి చూచి గుట్టు నిలుపుకొనజాలక మిత్రునివంకఁ జూచి ' దమనికా! ఆ కన్యకా శిరోమణి ఎవ్వరో నీ వెఱుంగుదువా?" అని ప్రశ్నించెను

దమ—రాకుమారా! ఆమె మన నీలాద్రి రాజు తనయయే. సార్వభౌమతనయ లగుటామిట్లనుటచే నామె కన్యకాశిరోమణియే యగును

వీర—నీలాద్రి రాజున కింతవయసుగల పుత్రికారత్న మున్నదియా?

దమ—ఉన్నది

వీర—ఆమె పేరేమి?

దమ—శ్యామల

దమనకుఁడు చెప్పినదానిలోఁ జాలవఱకు సత్యమున్నది.

నీలాద్రి రాజునకు శ్యామల యనుతనయ యున్నది. కాని యామె మాత్రమే మె కాదు.

శిశిరమణి యల్లే పూవులఁ గోసికొనుచుండెను సవిలాసముగ నడుమునడుమ నేమేమియో యస్పష్టముగఁ బాటలు పాడుకొను చుండెను. కాని యీవంకఁ జూచుటలేదు రాజకుమారుఁడు మాత్రము నిశ్చలనయనములతో నావంకఁ జూచుచుండెను, అతని హృదయాంత రాళమున క్షణక్షణమునకును వివిధ భావము లుత్పన్నము లగు చుండెను.

శీతలమలయానిల ప్రచారమునఁ గుసుమలత సవిలాసముగ సంచలించుచుండెను. నవపల్లవాంతరాళములనుండి స్ఫుటకోరకము లరవిచ్చుచుండెను. కమ్మతావులు నలుగడల నలముకొనుచుండెను. ఇది యంతయుంగాంచి సమద చంచరీకము పరిభ్రమించుటెందులకు? చిగు రాకు మేసి కోకిల కలకంఠమెత్తి జిలుగుపాటలఁ బాడుకొనుచుండెను ఆస్వరలహరిలో నమృతము వర్షించుచుండెను. ఆ యమృతరస మెంత యోమధురముగ నుండెను. క్రీడోన్మత్తుఁ డగు బాలకుఁ డాస్వరము ననువదించు టెందులకు? విచ్చుమొగ్గకుఁ బరిమళించుట స్వభావము. వసంతకోకిలకు గానము సేయుట స్వభావము రమణీమణికి విలాస చేష్టాచరణము స్వభావము ఇవియన్నియు నితరుల హృదయముల యందు వివిధ భావముల నుద్రేకింపఁజేయుటయు స్వభావమే.

రాజకుమారుఁ డున్మత్తునివలె నా వంకనే చూచుచుండెను. ఇంతలో నిరువురు యౌవనపురుషు లాపటకుటీరమునకుఁ బశ్చాద్భా గము నుండి యారసాలవనంబునఁ బ్రవేశించుచుండిరి. క్రమముగా వారిరువురు నా గులాబిపొద యొద్దకు వచ్చిరి పువ్వులఁ గోయుచున్న శిశిర వారింగాంచి పరమానందముతో "బావా! ఇవె గులాబికుసుమ ములు" అని చెప్పి తాను గోసిన పూవులలోఁ గొన్నిటిని మాధవున కొసంగెను. మాధవుఁడు వాని నత్యుత్సాహముతో నందుకొని కొన్ని టిని గోపాలున కొసంగెను. ఆసమయమునముఁనఁ జాఁటుననుండి తన్నుఁ గాంచుచున్న రాజకుమారునిం గాంచి శిశిర గిరుక్కున మరలి కమలా శ్యామల లున్న చోటికిఁ బోయెను

మాధవగోపాలురు యువరాజుం గాంచి పలుకరింపవలయు నని పసివించుచుండిరి యువకురాజు సాసూయముగ వారివంక నోరగఁ జూచుచు నటనుండి వెడలిపోయెను

మాధ—గోపాలా! చూడుము! ఈ యువరాజు మనకు దర్శన మైన నొసంగకుండ బోవుచున్నాఁడు?

గోపా—ఈతఁడు దురభిమాని. దురభిమానులు గుణమునే దోష ముగ గ్రహించుచుందురు. ఈతఁడు తనకుఁ బ్రాణదానము చేయుట యవమానించుటగా భావించుకొని యుండెను.

మాధ—ఏమయిన నేమి? మనవిధాయక కృత్యమును నెఱ వేర్చితిమి

గోపా—ఆతఁడు మాత్రము తన విధాయక కృత్యమును నెఱ వేర్చుకొనవలదా?

మాధ—మన మట్టికోరికతోఁ బని చేసితిమా?

గోపా—లేకున్నను విశ్వాసము చూపవలదా? కృతజ్ఞత యుంతవలదా? ప్రాణములకైన నాశింపక దుర్గమారణ్యమునఁ బరిమిత సైన్యముతోఁ బ్రవేశించి కొండకోయల దుర్నయము నడంచి వచ్చినందులకు మనల నీతనిజనకునంతటివాఁడు సార్వభౌముఁ డయ్యును సబహుమానముగ నాదరించి సాదరవచనములతో నభినందింపలేదా?

మాధ—అది మాత్రము సార్వభౌముని మెప్పునకై చేసితిమా? దేశక్షేమమునకై మన శక్తి కొలఁదిఁ బ్రయత్నించితిమి. పరమేశ్వర సాహాయ్యమున నా ప్రయత్నము ఫలించినది.

గోపా—ఎట్లయిననేమి? మనమీమార్గముగ రాకయుండిన బాగుగ నుండును.

మాధ—వచ్చిన నేమి? దేవతాదర్శన మైనది బంధుదర్శన మైనది. ప్రభుకుమారుని ప్రాణసంరక్షణ మైనది—

గోపా—అదియే యిట్టి వైమనస్యమును గల్పించినది.

మాధ—వైమనస్యమున కేమున్నది?

గోపా—అట్లనరాదు. ఈతఁడు నీచహృదయుఁడు. ప్రాణాధి

కులుగాఁ జూచుకొనవలసిన మనల నిప్పుడు పరమశత్రువులకంటె నధికులుగాఁ జూచుచున్నాఁడు.

మాధ — పోనిమ్ము! ఉత్సాహమయమున నా గొడవ యెందులకు? రేపెగదా మన ప్రయాణము! కనుకవండువగ సీరసాల వన మంతయు నొకసారి దర్శించి వత్తము రమ్ము.

ఇట్లు మాటలాడుకొని వారిరువురును వనాభిముఖులై పోవుచుండిరి. అంతలో నమృత మధురంబును, నతిమనోహరంబును, నానందమయంబును నగు కంఠస్వరంబుతో నీక్రిందిగీతము వారిశ్రవణపుటంబుల నమృతాభిషేచన మాచరించెను.

'చెట్టునకు మొగ్గఁ దొడిగెడు - చేష్ట గలదు,
కోరకమునకు వికసించు - గుణము గలదు,
విరికి వలపుల వెదచల్లు - విద్య గలదు,
వలపునకు గుబులొల్కునుల - వాటుగలదు,
ఇట్టిసౌభాగ్య మంతయు - నెదుకొరకు?—''

ఆ మధుర గీతాకర్ణనమున మాధవుని హృదయ మవ్యక్తానంద రసనిమగ్న మయ్యెను. ఆ మనోహర స్వరామృతరస ప్రవాహామునం దొక దివ్యమూర్తి వికిచియు విడువని తామరపూవువలె నృత్యము చేయుచున్నట్లాతని మనోనయనములకు గోచరించెను.

అప్పుడు గోపాలుఁ డానంద వికసితవదనుఁడై, "బావా! ఇది పోదరియగు కమలకంఠస్వరమువలె నున్నది," అనియెను.

మాధవుని సకలాంగకములును బులకించెను. అంతలో మరి యొకగీతము వినఁబడియెను

"లలితపరిమళతతి వాయు-వులు హరించు
మధుర మకరందరసము బం-భరము గ్రోలుఁ
దళఫలోదయమునకె జీ-వితము గడచుఁ
బుట్టుటయెగాని పూవేమి — పొందఁగలిగె?—''

మాధవుఁ డాలకించి శ్రుతిసుఖము నభినయించుచు "గోపాలా! ఆపాడుచున్నది శ్యామల కాదా?" అని యడిగెను.

గోపాలుఁడు "ఔనౌను," అనియెను

ఇంతలో మఱియొకగీత మిట్లు వినఁబడెను

"వినమిత లతాంతమంజరీ - విలసనమున

సముదపట్పద స గీత - సంశ్రవమున

లలితకోమల మాధవీ — లత సెలంగఁ

గాంచికొని గ్రీష్మ మిటు లొంగి - చూచు టేల?—"

మాధ—ఓహో! శిశిర కూడ వారి యొద్దకే పోయినది మనము కూడ వా వంకకే పోవుదము రమ్ము

అని చెప్పి యిరువురును సంతోషముతో సంగీతము వినవచ్చిన దిక్కుగాఁ బోయిరి

కమలా శ్యామలా శిశిరమణులు ముగ్వురును పూలదండలను గ్రుచ్చుకొనుచుఁ బైవిధముగాఁ బాడుకొనుచుండిరి. ఆ గీతములు మాధవుఁడు రచియించినవే. ఆగానరస మాధుర్యమున నారసాలో ద్యాన మంతయు మధురిమామయ మయ్యెను. అప్పుడా సాయంతన రామణీయకము కూడ మనోజ్ఞ మాధురీరస స్ఫూర్జిత మయ్యెను

మాధవగోపాలు రా ప్రదేశమునకుఁ బోయిరి. వారిని జూచిన తోడనే యారణీమణులు ముప్వురును సంగీతము నాఁపివైచి వారల వెదుకుకొనిరి. అప్పటివారి పరస్పర వీక్షణములు పరమానందసంకలితములై యుండెను.

మాధ— శ్యామలా! రసాలోద్యానమున సాయంతన కీర్తనములు వినవచ్చిన వెచ్చట?

శ్యామ—రసాలోద్యానమున నని నీవే చెప్పితివిగదా?

మాధ—ఔను· ఆపాడిన వారెవ్వరు?

శ్యామ—కలకంఠులు.

మాధ—కలకంఠములకు మనుష్యస్వర మెక్కడిది?

శ్యామ—మనుష్య కంఠములకుఁ గలస్వన మబ్బుట లేదా?

మాధ—ఆగీతత్రయముమూర్తిత్రయ ముందాల్చి యిప్పటికిని సాక్షాత్కరించు చున్నట్టు లున్నది

శిశి—బావా! ఆగీతత్రయము నందేది బాగుగ—

మాట ముగియకుండఁగనే శ్యామల "శిశిరా! మూఁడవ

గీతమే బాగుగ నున్న దగిన శాకకు ఏవేమి యిచ్చెదవు ' అని యెను.

శిశిర—దానికేమి' అని చెప్పుచు ' బావా ప్రథమగీత మప్రతిమానముగ లేదా?'' అనియెను.

కమల యదరిపడి శ్యామల వెనుక కరిగెను.

మాధ—నాకది యస్పష్టముగ వినవచ్చినది

ఆ మాట విననప్పటికిఁ గమలహృదయమున నేదియో యవ్యక్తభావోదయ మయ్యెను. ఆ వెనుక నొకదాని వెనుక నొకటిగ ననేక భావములుదయించుచుండెను!

శిశి—బావా! అంతటి స్పష్ట స్వరంబున వెలువడిన ప్రథమ గీతము నీక స్పష్టముగ వినఁబడుటేమి?

ఇట్లు సంభాషించుచుండఁగా శ్యామల తనయన్న యగు గోపాలునకురహస్యముగఁ జిమ్మనగ్రోవి నొసంగెను దానినిండ వసంతము నింపఁబడియుండెను. గోపాలుఁడు, మాధవుఁడు పరాకుగ నున్నప్పుడు దానితో మాధవునిపై వసంతమును జిమ్మెను ఆ సమయమున శ్యామలా శిశిరమణులు చప్పట్లు చఱచుచుఁ గిల గిల నవ్విరి. "కమల చిఱునగవుతోఁ దలవంచుకొనియెను గోపాలుఁడు నవ్వుచు బావా! మాధవుఁడిప్పుడు వసంతమూర్తి యయ్యెనా?'' అనియెను.

మాధవుఁడు నవ్వుచు "గోపాలా! ఏల యీదిగ్భ్రాంతి? తత్తఱపడకుము,'' అని చెప్పి యాతనిఁ గౌగలించుకొనియెను అప్పుడు మాధవ గోపాలు రిరువురును వసంతమూర్తులై యైరి

శ్యామల "ఏమి యీగడుసుందనము!" అనియెను

వదలియు వదలని బాల్యమున, వచ్చియు రానిజవ్వనమును, గల యాతరుణీతరుణు లగపడియు నగపడని యంత వెన్నెలలో నిట్లు ముచ్చటించుకొనుచుండగా నా కొండ ప్రక్కనుండు బాలచంద్రుఁడు తొంగిచూచుచుండెను. అతని చూపులందును మందహాసము స్ఫురించుచుండెను. ఆ నెల బాలుఁడు తనివిదీరని చూపులతో వారింగాంచుచుఁ గ్రమముగా వెనుకకుఁ బ్రాఁకుచుండెను. హృదయోల్లాసకరం

బుగ సంభాషించుకొనుచు వారెవ్వరును బటకుటీ రాభిముఖులై పోవుచుండిరి

ప్రప్రథమమునఁ బ్రమదావనమున దాఁగిలిమూఁత లాడుచుండఁగా మనము చూచిన బాలికా బాలకులు వీరే. నిరవధిక సాన్నిధ్యమునను, నిత్యసంభాషణాదిక పరిచయంబునను, వారికిఁ బరస్పర ప్రేమము కలిగినది వివిధ గతుల నాప్రేమము దినదినాభివృద్ధి నందుచుండెను.

## 5. చరిత్రము

క్రీస్తుశకము పదునాలుగువందల యేఁబది నాలుగవ సంవత్సరము నుండియు కటకము మొదలు నెల్లూరుమండలము వరకును గల భూభాగ మంతయు నుత్కలదేశాధీశుని పరిపాలనమునకుఁ లోఁబడి యుండెను ఆకాలమునందా సార్వభౌముని క్రిందిసామంత రాజులు తమతమ రాజ్యములను స్వతంత్రముగఁ బరిపాలించుకొనుచు సార్వభౌముఁడు కోరినప్పుడు కొంత కొంత సైన్యమును బంపి సాహాయ్యము చేయుచుండుట వాడుకగా నుండెను. తమ రాజ్యములయం దెంత స్వతంత్రులైనను సామంతులందఱును సార్వభౌమునకు భృత్యులుగనే పరిగణింపఁబడుచుండిరి. సార్వభౌముఁడు సంవత్సరమున కేదియో యొక నియమిత దినమున సభ చేయుటయు, నా సభ కెల్ల సామంతులును గూడఁ జేరి తమ తమ ప్రభు భక్తిని బ్రకటించుచుండుటయుంగూడ నాచారమై యుండెను అప్పుడప్పు డట్టి సభలలోనే సార్వభౌముఁడు తన దండనాయకులలో నుత్తములైనవారల కనుగ్రహించి కొన్ని గ్రామములను బహుమానముగ నిచ్చి సామంత రాజకోటిలోఁ జేర్చుటయును గలదు

ఆ విధముగనే సార్వభౌముఁడు తన యొద్ద దండనాయకుఁడుగా నుండి యొక గొప్ప యుద్ధమునఁ దనకు విశేష సాహాయ్యముఁ జేసి ప్రభు భక్తి విశ్వాసములను జూపియున్న నారాయణ రాజను నాతనికిఁ గృష్ణా నదీతీరమునఁ గొన్నిగ్రామములను బహుమానముగ నొసంగెను. నారాయణరాజప్పుడు కృష్ణవేణీ తీరమున

నొకదుర్గమును నిర్మించి రాజశేఖరు డను వాతని మంత్రిగాఁ జేసి కొని యారాజ్యమును బరిపాలించుచుండెను. ఆ దుర్గము వసంతకాలమున నిర్మింపఁబడుటచే వసంతదుర్గ మని పిలువఁబడుచుండెను. క్రమముగా నా గ్రామమునకు వసంతవాడ యనుపేరు గలుగుటచే నా దుర్గమును గూడ వసంతవాడ దుర్గమని పిలుచుచుండిరి. మంత్రి బుద్ధిబలంబునను, తన భుజబలంబువలనను నారాయణరాజ నేక సమయములందు సార్వభౌమునకుఁ దోడుపడుచు సామంత రాజులలో నెల్లఁ జక్రవర్తికిఁ బ్రియుండై యుండెను

అతని కొక కుమారుఁడు గలిగి యచిరకాలముననే మరణించెను. ఆతఁడు తలిదండ్రులు లేని మేనల్లునిఁ దన యొద్ద నుంచుకొని యాతనినే తనయునిగ భావించుకొనుచు రాజోచిత గౌరవములతోఁ బెంచుకొనుచుండెను. కొంత కాలమున కాతని దేవి యొకయాఁడు శిశువుం బ్రసవించి కొలఁది దినములలోనే లోకాంతరగతురాలయ్యెను. తరువాత నాతఁడు తన యేక పుత్రికనే సర్వస్వముగఁ జూచుకొనుచుఁ గాలక్షేపము చేసి కొనుచుండెను. లక్ష్మీ స్వరూపిణి యగునాబాలిక కాతఁడు కమలయని పేరిడియెను.

నారాయణరాజునకు నీలాద్రి రాజను సోదరు డొకఁడు గలఁడు అతఁడనిన నారాయణరాజున కెంతయో ప్రేమ అతనికిఁ దనవలెనే తన రాజ్యమునందు గౌరవమును గల్పించెను. నీలాద్రి రాజునకు గోపాలుఁడను నొక తనయుఁడును, శ్యామలయను నొక తనయయుం గలిగిరి. నారాయణరాజు సోదరుని బిడ్డలను తన బిడ్డల పోలికనే గారవించుచుండెను. గోపాలుఁడు తన మేనమఱఁదియగు మాధవునికంటె నొకయేఁడు చిన్నవాఁడు. కమల తన పినతండ్రి కూఁతురగు శ్యామలకంటె నొకయేఁడు పెద్దది. శ్యామల దాది కూఁతురగు శిశిరమణి యనునొక బాలిక కూడ వారితోఁ గలసి మెలసి యాడుకొనుచుండెడిది. ఆ బాలిక శ్యామలతోడి యీడు గలదై యుండెను. ఆయేవురు నొక్క తల్లి బిడ్డలవలె నన్యోన్య ప్రియ భావములతో నొక్కచోఁ బెరుఁగు చుండిరి. నారాయణరాజు తలి

చంద్రుడులేని తన మేనల్లుఁడగు మాధవు నతిప్రియముగఁ బోషిం చుచు రాజకుమార గౌరవముతోఁ బెంచుకొనుచుండెను

ఇట్లుఁడఁ గొంతకాలమునకు నారాయణరాజుస కవసాన కాలమా సన్నమయ్యెను. ఆ సమయము నందాతఁడు తన మంత్రితో నాలోచించి సోదరునిం బిలిచి తన స్థితిగతులం దెలిపి యనంత కర్తవ్యములను బోధించి కమలా మాధవులను రాజ్యముతోఁగూడ నాతని కొప్పగించి కార్య భారమంతయును మంత్రిపై నుంచి నిర్విచారముగ ప్రాణములను విడిచి స్వర్గ రాజ్యమునఁ బ్రవేశించెను ఆతఁడు మరణించు నప్పటికి గమల యైదేండ్ల యీడు గలదై యుండెను. మేనల్లుఁడగు మాధవుఁడు పదియేండ్లవాఁడై యించుకించుక చదువను వ్రాయను నేర్చియుండెను.

పిమ్మట నీలాద్రిరాజు సోదరుని రాజ్యమును మంత్రి బుద్ధి బలంబునఁ బరిపాలించుచుండెను. మాధవగోపాలురును, కమలా శ్యామలలును, వారితోఁ గూడ శశిరమణియు సమయోచితంబులగు విద్యల నభ్యసించుచుండిరి. ఆ కాలమున యువరాజగు వీరభద్ర గజపతి కొండ వీటి దుర్గమునకుఁ బరిపాలకుఁడుగా నియమింపఁబడియెను నీలాద్రి రాజాతని యనుగ్రహమును సంపాదించుకొనఁ బ్రయత్నించుచుండెను.

పేరునకు మాత్రమే నీలాద్రిరాజు రాజుగానుండెను, కాని కార్యక్రమ మంతయు మంత్రియగు రాజశేఖరుని బుద్ధిమాత్రమున నే నడపఁ బడుచుండెను ప్రప్రథమ మునందెట్లున్నను, కాలక్రమమున నీలాద్రి రాజు హృదయాకాశమున నీలమేఘమావరించు కొనుచుండెను.నలుగడలన్ధకారమలమికొనుచుండెను అతండు సకుటుంబముగ సింహాచలయాత్రకుంబోయి శ్రీశైల యోగిని సందర్శించివచ్చుచున్నప్పుడా త్రోవలో నాతని హృదయాంతరాళమున, నా సాంద్ర నీలమేఘమాలి కామధ్యమున—నా గాండాంధకారమునఁ దళుక్కున నొక మెఱవు మెఱసెను. ఆయకాల మేఘమువలన నెట్టియుఱుములు వెడలునో, యెన్ని పిడుగులు పడునో, యెంత వర్షము వర్షించునో, యెవ్వరు చెప్పఁగలరు?

# 6. ప్రేమ

కొందఱు రూపమును ప్రేమింతురు. కొందఱు గుణమును ప్రేమింతురు. మఱికొందఱు రూపగుణములను సమానముగఁ ప్రేమింతురు. రూపగుణసమ్మేళనమునఁగాని కొందఱికిఁ ప్రేమోదయమే కలుగదు. ఏ గుణరూపానుభవంబున హృదయనయనము లైక్యమై తన్మయత్వము నందుచుండునో యాగుణ రూపనిలయమునందుఁ ప్రేమోదయ మగుచుండును. రూపగుణంబులవలననే ప్రేమ యుదయించునని యూహింపవచ్చును గాని యొకరీతి రూపగుణంబులు గలవారి యెడలఁ ప్రేమ గలిగినప్పుడు వారితో సమాన రూపగుణులయెడ సమానముగను నంతకంటె నధికులయెడల నధికముగను ప్రేమ కలుగుచుండునని తలంపరాదు. ఒకరీతి రూపగుణంబులు గలవారి యెడలం గలిగిన ప్రేమము నంతకంటె నధికరూపగుణంబులు గలవారలు గూడ నాకర్షింపఁజాలరు. దీనినిబట్టి చూడఁగాఁ ప్రేమోదయమునకు రూపగుణంబులే కాక యనిర్వాచ్యంబగు వేఱొకకారణమేదియో యుండవలయునని తోఁచుచున్నది ప్రేమ తత్త్వముం గూర్చి విమర్శించినకొలఁది నగాధమై పోవుచుండును.

ఎంతటి జీవనదాయకమై యున్నను వర్షాగమమునకంటె వసంతాగమముననే సహకారము పుష్ప ఫలవిలసిత మగుచున్నది. ఎంత మధురములై యున్నను పరిపక్వ ఫలములకంటె నవపల్లవములనే కోకిల కోరుకొనుచున్నది. మాధవీ మల్లికలు రెండును వసంతకుసుమములే. అందు మాధవీ కుసుమమునందే మృదు సౌరభగము గలదని చెప్ప వచ్చును. అయినను కొందఱు మాధవీ కుసుమమునకంటె మల్లికా కుసుమ సౌరభమునే యభిలషించుచుందురు. శారికాకీరములు రెండును గలకంఠములే. స్ఫుటస్వరమున శారికయే పెద్దయని చెప్పవచ్చును అయినను గొందఱు చిలుకపలుకులకే ముచ్చట పడుచుందురు. ముక్తామణియు, వజ్రమణియుకూడ స్వచ్ఛతేజో విభాసితములే. తేజోమూల్యంబుల వజ్రమే యధికమైనదని చెప్పవచ్చును.

అయినను గొందఱు మౌక్తిక హారములను ధరించుకొనుటకే ప్రియ పడుచుందురు. దీనిఁబట్టి యాలోచింపఁగా ప్రేమయనునది వారివారి హృదయభావముల ననుసరించి యుండునని తోఁచుచున్నది.

కమలయును శ్యామలయు సమాన రూపవతులే, గుణవతులే. యౌవనవతులే. విలాసవతులే అనురాగవతులే. బంధుత్వ విషయం బునఁ గూడ మాధవున కిరువురును సమానలే, మాధవునకుఁ గమల యనిన నెంతయో ప్రేమ శ్యామల యనిన నెంతయో యానందము కాని, యీ యిరువురిలో నను మాధవుని యనురాగ మెచ్చట నెట్లు న్నదియో తెలిసికొనవలయును.

కేవల రూపగుణంబువలననే గాక యనిర్వాచ్యంబగు నొక సూక్ష్మ కారణముంబట్టి కూడఁ బ్రేమోదయ మగునని స్పష్టపడు చున్నదిగదా! కావుననే పరిణయాకాంక్షితులగు స్త్రీ పురుషుల యందే కాక తదితరులగు వారియందుఁగూడఁ బరస్పర ప్రేమభావ ములను గాంచగలుగుచున్నారము

ఏ కోరికయు లేకుండ నెట్టి కారణమును గ్రహింపకుండ నాక స్మికముగనో, సహజముగనో స్త్రీ పురుషులకు బరస్పరముగ బ్రేమో దయ మగుచుండును. ఆ ప్రేమమున కెట్టి ప్రతీకారాపేక్షయుఁగలు గక ఎట్టి ప్రతిబంధకమునకు లోఁబడక యది దినదినాభ్యుదయమందు చుండును అది యొండొరుల హృదయముల నజ్ఞానరీతి నాకర్షించి యనిర్వాచ్యానందముం గూర్చుండును. అది యెడఁబాటున కోపఁ జాలదు. నిరవధికసాన్నిధ్యమునే యభిలషించుచుండును. ఆ ప్రేమ మునకు బరిణామము లేదు. పరిమాణము లేదు అది యకారణ సంజనితమైనది! కమలా మాధవుల ప్రేమ మటువంటిది. అనంతప్రేమ సంబంధమగు నొక దివ్య తేజఃకణము సద్భావవిలసితంబులగు వారల హృదయముల నేకీభవింపఁజేసి యందనంత తేజోమూర్తియై ప్రకా శించుచుండెను. దాని ప్రభావమువలననే వారొండరుల, జూచుకొన్న ప్పుడును, దలంచుకొన్నప్పుడను వారి హృదయంబుల నవ్యక్తం బగుభావోదయం బగుచుండెను అట్టియెడ వారలహృదయంబుల

కెట్టి సుఖానందము కలుగుచుండెనో, యెందులకుఁ గలుగుచుండెనో వారెఱుంగరు

దర్శన స్పర్శన సంభాషణాకర్ణన పరిచయంబునను, గుణానుభవంబునను గూడ బ్రతిఫలాపేక్ష లేకుండఁగనే ప్రేమోదయ మగుచుండును అట్టి ప్రేమమునకుఁ బరిమిత పరిణామములున్నవి. న్యూనాధికభావములు కూడఁ గలవు ఆ ప్రేమయుఁ బవిత్రమైనదియే, పరమానందదాయకమైనదియే కాని కొండొక కారణంబున నుదయించుటచే నది దివ్యమైనదని మాత్రము చెప్పుటకు వలనుపడదు. శ్యామలా మాధవుల ప్రేమ మటువంటిది

ఇట్టి ప్రేమయే స్త్రీలలో స్త్రీలకును, బురుషులలోఁ బురుషులకును, ఒకరిపైఁ బలువురకును, బలువురిపై నొక్కరికిని గలుగుచుండుట కలదు. సమూహముమీఁద మాధవుఁడు, గోపాలుఁడుఁ కమల, శ్యామల, శశి మణి—ఈ యేవురకుంగల యన్యోన్య ప్రేమ మటువంటిది పాత్రభేదములంబట్టి, గుణవిశేషముల ననుసరించి యా ప్రేమ న్యూనాధిక పరిణామములతో వివిధాకృతుల నెసలారుచుండెను కాని ప్రత్యేకించి చూడఁగాఁ గమలామాధవుల ప్రేమయే ఉన్నతోన్నతమైనదని చెప్పవచ్చును అది యవ్యక్తమనోభావవిలసితమై, యనిర్వచనీయానంద సంధాయకమై విలసిల్లుచుండెను

చూచుట, వినుట మొదలగువానివలనఁ గూడ నాకస్మికముగఁ బ్రేమ యుదయించుచుండును. అట్టి ప్రేమ మాశావిశిష్టమైనదిగా నుండును. దానికి వాంఛాచపలతాది గుణంబులు గలవు అది ప్రేమ భూమికయే గాని నిజముగాఁ బ్రేమగాదు కేవల మనోదౌర్బల్యము వలనం గలుగునది యగుటచే దానిని మోహమని చెప్పవచ్చును. హృదయభావముల నుద్రేకింపఁజేయు స్వభావముగల యా మోహమున కనేక వికారము లుండును. కాలకారణవశంబున నది క్రమముగా నశించినను నశింపవచ్చును. కాదేని విపరీతమైన వివిధ వికారములఁ గల్పించినను గల్పింపవచ్చును ఒక్కొక్కప్పుడది క్రమముగాఁ బ్రేమాకృతిని బరిణమించినను బరిణమించవచ్చును వీరభద్రగజపతి హృదయము నాకర్షించినది యట్టి భావమే.

ఓ ప్రేమమా! నీ వాక్కొకసారి చూచుటచే సాక్షాత్కరించు చున్నావు. వినినంతమాత్రమునఁ బ్రసన్నతఁ జూపుచున్నావు. కేవల పరిచయమునఁ బ్రత్యక్షమగుచున్నావు తరుణారుణోదయంబునఁ దామరమొగ్గవలె నీ యభ్యుదయమున హృదయకోరకము వికసించి రసమరందమాధురీవిలసితమై, భావపరిమళోద్భాసితమై యలరారు చున్నది. నీవొకప్పుడు కృత్రిమాకారములతో హృదయముల నాక ర్షించుచున్నావు ఒకప్పు డాకస్మికముగఁ బొడసూపి హృదయాంత రాళములఁ బ్రకాశించుచున్నావు. ఒక్కచో సహజముగనే యుద యించి మనఃకమలముల వికసింపఁజేసి పరమానందముం గూర్చు చున్నావు నీవేకాకృతివయ్యు,వివిధాకృతుల వివిధరీతుల నభినయించు చున్నావు అనంతమైన నీ శక్తికి న్యూనాధికపరిణామము లగపడు చున్నవేమి? అవ్యయమైన నీ తేజమునకు వృద్ధిక్షయములు చూపట్టు చున్నవేమి? నిర్వికారమైన నీ రూపమునకు వికారములు గలుగు చున్నవేమి? కాంక్షావిరహితమైన నీ స్వభావ మొకప్పు డాశాభిభూత మైనట్లు గూడఁ బొడకట్టుచుండు నేమి. ఈ పరిణామము లన్నియును నీకు లేనేలేవా యేమి? ఇవి యన్నియును నీ యవస్థలని యెంచి మేమే భ్రమపడుచుంటిమా! ఇన్ని రూపములతో విహరించుచు నిన్ని పోకలఁ బోవుచున్న నీ సత్యస్వరూపమును నిర్ణయించుటకు మార్గ మేమున్నది?

కాదుకాదు తెలిసినది. ఈ యాకృతులన్నియును నీ యథార్థ స్వరూపములు గావు. అవి నీ దివ్యతేజమునందలి కిరణలేశములు అవి పాత్రభేదంబులఁ బ్రతిఫలించి వివిధ రూపములతో, వివిధ గుణము లతో, వివిధావస్థలతో విరాజిల్లుచుండును. నీ కిన్ని యాకృతులు లేవు. ఇన్ని గుణములు లేవు ఇన్ని యవస్థలు లేవు. ఇన్ని భేదములు లేవు. నీవేకాకృతివి.

ఎవ్వని హృదయాంతరాళమున నీ దివ్యమూర్తి కోటి సూర్య ప్రభాభాసమానమై విరాజిల్లుచుండునో, యట్టివాని కహేతుకముగ, నవాంఛితముగ నీచరాచరప్రపంచమునందంతటను బ్రియభావ ముద యించును. ఆతని యభేదానంద రస ప్రవాహముచే నీ జగమంతయు నభిషేకింపఁబడును రూపగుణభేదంబుల నలరారు నెల్లవస్తువులు

నాతనికి మనోజ్ఞములై యుండును. సర్వాత్మకంబగు నీ దివ్యమూర్తి యాతని కెల్లయెడల దృగ్గోచరమగుచుండును సర్వమయంబగు నీ దివ్యశక్తి ప్రతిపదార్థము నందును నాతని హృదయము నాకర్షించు చుండును మిథ్యాకల్పితంబులగు కామాదివికారము లాతనికి దూర ములై యుండును. సుఖదుఃఖములు, రాగద్వేషములు మొదలగు ద్వంద్వభావము లాతనిఁ గన్నెత్తి చూడఁజాలవు. ఆతఁడు నిత్యా నందుఁడై యుండును. నిత్యసుఖియై యుండును! పవిత్రంబును, పరి శుద్ధంబును, ప్రగాఢంబును నగు నట్టి హృదయభావము నీ దివ్య సాక్షాత్కారముననేగాని యభ్యుదయము నందఁజాలదు అట్టి భావోన్మత్తుఁడేగాని దివ్యమగు నీ యనంతమూర్తిని సందర్శించి యానందింపఁజాలఁడు. విశుద్ధప్రేమ యనినను, భక్తి యనినను, దైవ తేజ మనినను నీనామాంతరములేకాని వేఱుగావు

# 7. ఆలోచన

జాము రాత్రి యైనది. రాజశేఖరుఁడు తన మందిరమునందలి దర్శనగృహంబున నొక పీఠముపైఁ గూరుచుండి యేమేమియో యోచించుకొనుచు మాధవుని రాకకు వేచియుండెను. అధికమనః పరిశ్రమచే నాతని వదనకమలము వాఁడియుండెను ఎడతెగని యోచనాపరంపరల నడుమఁబడి యాతని గంభీరహృదయము కొట్టుకొనుచుండెను. దూరాలోచనా పరిశ్రమంబున నాతని యూరుపు లించుక యుష్ణములును, దీర్ఘములు నగుచుండెను. దీపపు వెలుతురున నాతఁ డేదియో యొక కాగితమును దృఢమనస్కుఁడై చదువ నారంభించెను, ఆ కాగితమును జదువుట కిది పదియవసారియై యుండును. ఆతఁడు దానిని జదువుట ముగించి బల్లపై నుంచి యున్నతమస్తకుఁడై యాలోచించుచుండెను.

ఇంతలో మాధవుఁ డచ్చటికి వచ్చి యాతనికి నమస్కరించి నిలువఁబడియెను. మంత్రి యాతని నతిగౌరవమునఁ గౌఁగిలించుకొని యుచితాసనమునఁ గూర్చుండఁజేసెను ఇరువురును గొంతకాలమట్లే కూర్చుండిరి. పిమ్మట మాధవుఁడు "మామా! నన్నతి శీఘ్రముగ

నొంటిగా రమ్మని పిలువనంపుటకుఁ గారణ మేమి?'' అని యడిగెను

మాధవుఁడు రాజశేఖరుని మామ యనియే పిలుచుచుండె ను

రాజశేఖరుఁడు నిట్టూర్పు విడిచి, "కుమారా దుర్గేశ్వరుఁడగు మీ మామ యవసానకాలమున నాపైఁ బెట్టిన కార్యభారమును వహించుట వృద్ధుఁడనగు నా కెంతయుఁ గష్టముగా నున్నది. అందు కొంత భారము తరుణవయస్కుఁడవు, శూరశిఖామణివి, సుధీయుతుండవు, విజయుండవు నగు నీవు కూడ వహింపవలయును!" అనియెను.

మాధ—సర్వజ్ఞులగు మీ నోటినుండి యిట్టి సామాన్యవాక్యములు వినఁబడుచున్న వేమి?

రాజ—కుమారా! కాల మప్రసన్నముగా నున్నది కుతంత్రము బలవత్తమముగా నున్నది అదృష్టము దురూహముగా నున్నది ఆలోచనము తోఁచుట లేదు

మాధ—అది యేమి యట్లనుచున్నారు?

రాజ—మఱేమియు గాదు మీ మామకును యువరాజునకును వేగు నడచుచున్నది

మాధ—ఏ విషయమున?

రాజ—అదియే యింకను దెలియుట లేదు. అందులకే యింతగా దల్లడపడవలసివచ్చినది

మాధ—సకల తంత్రజ్ఞులగు మీకు దుర్విలంఘ్యమైనది యేముండును? ఆతని కొలకు మీరంతగా నాలోచింపఁబని లేదు.

రాజ—నాయనా! క్రమముగా మీ మామ మతను మాఱినది. సింహాచలయాత్రకుఁ బోయి వచ్చినది మొదలు మఱియు విపరీతముగా నున్నది.

మాధ—ఆతని యుద్దేశము మీ కెట్లు బోధయగుచున్నది?

రాజ—ఈ దుర్గ మాక్రమించుకొనవలయునని యాతని ముఖ్యోద్దేశము.

మాధ—(అదరిపడి) ఏమీ! ప్రాణపదముగఁ జూచుకొనిన యగ్రసోదరుని యెడల నాయనకుఁ గృతజ్ఞత లేదా? కన్నబిడ్డకంటె

నెక్కు డనురక్తయై భయభక్తి విశ్వాసములతో మెలఁగు కమలపై వాత్సల్యమును ద్రోసి వేయఁగలఁడా!

రాజ—మాయనా! పరిశుద్ధహృదయుఁడవును, బాలుఁడవునగు నీవట్లే యూహించు చుందువు. రాజ్యలోభంబున నాశావివశుఁ డగు నాతనికి సోదర విశ్వాసమును, బుత్రికావాత్సల్యముఁ గూడ నుండునా?

మాధ—ఆయనమత మంతవఱకు మాఱినట్లు మీరు గ్రహించి తిరా?

రాజ—నిశ్చయముగా గ్రహించితిని

మాధ—అయ్యో! ఇది యంతయు నెందులకు? గోపాలుని కొఱకుఁగదా! ఆతఁ డా దారుణ కృత్యమున కంగీకరించునా?

రాజ—ఎట్లయిన నేమి? ముందుగ సంక్షోభము పుట్టుట మానదు గదా!

మాధ—ఇప్పు డందులకు దగిన ప్రతీకార మేమి సేయవల యును.

రాజ—ఈ సంగతి యిట్లుండ నింకొకటి వచ్చినది. నిడుబ్రోలు దుర్గ నాయకుఁడు మన్నెరాజులతోఁ గలసి కుట్రలు సేయుచున్నాఁ డఁట! ఆసంక్షోభము నడగించుటకుఁ సర్వ సైన్యముతోడను మాధవునిం బంపవలయుననియు, నింకను సేన గావలసినచోఁ గొండ వీటినుండి రప్పించుకొనవలయు ననియు సార్వభౌముఁడు కమ్మ వ్రాసి యున్నాడు

మాధ—అందుల కింతయాలోచన మెందులకు? వేగముపోయి యాకార్యమును నిర్వహించుకొని వచ్చెదను. మన కిప్పట్టున సార్వ భౌమానుగ్రహము కూడఁ గావలయును గదా?

రాజ—బుద్ధిసూక్ష్మత యన నట్లుండవలయును. నేనూహించిన దానికి నీవు చెప్పినదానికిని సరిపోయినది. మనకు సార్వభౌమాను గ్రహమే కావలసినది. గోపాలుఁడును నీవును నరనారాయణులవలె సేనా సహితులై పోయినచో నా కార్యము నక్రమమున నిర్వహించు కొని రాఁగలరు. కాని యొక్క సందేహము మాత్ర మున్నది.

మాధ—ఏమది?

రాజ— మీరు కార్యవిజయులై వచ్చునప్పటికి. జాలకాలము పట్టును ఈలోపల నెట్టిసందర్భములు పుట్టునో యని సంశయించుచు న్నాను. నీవు వచ్చినతోడనే నేనొకసారి సార్వభౌముని సందర్శింపం బోవ దలంచితిని. అందుల కాలస్యమగునేమో యనియే సందేహము.

మాధ—మీరుగాని నేనుగాని గోపాలుండుగాని యిట నున్నంత వఱకెట్టి దుష్కృత్యము ను జరుగుటకు వలను లేదు. మేమును నతిత్వరితముగనే వచ్చెదము. తరువాత మీరు పోవచ్చును.

రాజ—అట్లయినచో మీరు రేపే ప్రయాణమునకు సంసిద్ధులు కావలయును.

మాధ-అట్లే చేసెదము.

ఇట్లు సంభాషించిన తరువాత మాధవుం డింటికిం బోయెను. ఆ రాత్రి యాతనికి నిద్దురపట్టలేదు ఆలోచనములతో గడియలు జరగి పోవుచుండెను తెల్లవారు జామునం గలిగిన కలతనిద్దురలో నా రాత్రి యాతడెన్నియో విశృంఖల స్వప్నములం గాంచెను.

# 8. మోహవికారము

శ్రీకృష్ణదేవ మహారాయలు దక్షిణదిగ్విజయమునకై బయలు దేఱుటకుం బూర్వమే రాజనీతి విశారదుం డగుకళింగ సార్వభౌముండు కొండపల్లి, కొండవీడు దుర్గములయందుం దనకుమారులనే దుర్గేశ్వరులుగాం జేసి యుంచెను అందం గొండవీటిదుర్గము దుర్విలంఘ్యమైనది. అట యువరాజగు వీరభద్రగజపతి ప్రబల సేనాసమూహముతో నివసించి యుండెను. శౌర్యసాహసములం దాతనితో సమానులగు కొందఱు పాత్రనాయకు లాతనికి సహాయులై యుండిరి భుజబలమున నేమి, శౌర్యమున నేమి, రణనైపుణ్యమున నేమి, యువరాజు సుప్రసిద్ధుండు.అందువలననే రాజ్యమున కాయుస్స్థానమగు కొండవీటి దుర్గమున నాతండుండవలసి వచ్చెను అతిరథశ్రేష్ఠుండగు నాతండు సహజముగ రాజకుమారుండై యుండినను రాజలక్షణము లాతని యెడలం బరిపూర్తి నందియుండలేదు. పట్టుదలగలవాండయ్యు నాతండు వెనుకముం దరయక మనసు వెంబడినే పోవుచుండు

స్వభావముగలవాఁడు ఆత్మగౌరవము గలవాఁడయ్యు సమయ భేద మెఱుఁగని వాఁడై తండ్రినైనను గణియింపనోపని దురభిమాని అసాధ్య కార్యకరణక్షముఁడయ్యు దూరాలోచనము లేని యవజ్ఞుఁడు అప్రతి హత పరాక్రముఁడయ్యుఁ గుతంత్రకుశలుఁడు. ఆభిజాత్యసంపన్నుఁ డయ్యు నల్పహృదయుఁడు అతఁడు తన నిర్భయత్వమును క్రోధ మునకుఁ బాలుపఱుచుచుండును. నిరంకుశత్వమును దుష్క్రియా కరణమునకై వినియోగించుచుండును పరాక్రమ సామర్థ్యమును సాధుశోషణమునకుపయోగించుచుండును, ఆభిజాత్యమును, ఐశ్వర్య మును, ప్రభుత్వమును గూడ నాతనికి గర్వకారణము లయ్యెను. పరాక్రమనిధియగు నాతనికి శత్రువులే కాక యొక్కొక్కప్పుడు సార్వభౌముఁడగు తండ్రికూడ భయపడుచుండును. క్షణకోపియగు నాతని మూలమున సేవకులే కాక సామంతులును దల్లడిల్లుచుందురు.

కొండవీటిదుర్గమునందలియుద్యానవనంబునఁబ్రమోదభవనాం గణముకడనున్న సమున్నతచంద్రశిలావేదికపై వీరభద్రగజపతి యొం టిగాఁ గూరుచుండియుండెను. అది శరత్కాలము నాఁడు కార్తిక శుద్ధపూర్ణిమ. అప్పుడే చంద్రోదయ మైనది. ఆ రాకా సుధాకరుఁడు తన యమృతకిరణములచే జగ మంతయు నమృత మయంబుగఁ జేయు చుండెను. ఎదుటనున్న ప్రమోదభవన మంతయు నా వెన్నెల కాంతులలో వింత మెఱుంగుల నలరారుచుండెను పార్శ్వమునఁ గొలఁది దూరమునఁ గూలంకషముగ నిండియున్న క్రీడాపుష్కరిణి యందలి కలఁక యెఱలిన నిర్మల జలంబులలో శీతల సమీర సంచాల నంబునం బొడమిన తరంగమాలి కాడోలికలఁ గమలినీ సంతతి కన్నులు మూసికొని నిదురించు చుండెను. ఆ నిర్మల చంద్రికా ప్రసా రమున నా తరంగాంచలములు వెండిపూఁత పూయఁబడిన రీతి మిల మిల మెఱయుచు డెను. సుధాధవళ చంద్రికాపటలంబున నీభిన వశ్యామల ప్రభావిలసితంబు లగు నిందీవర కుసుమంబులనుండి మనోజ్ఞ పరిమళము లెల్లెడల వెల్లివిరియుచుండెను. అప్పుడప్పుడు చలువ మడుఁగులంబోని శరన్మేఘ శకలములు బయలు వెడలుచు ఋతురాజు రేరాజు నడ గులకు మడుఁ గులొగ్గుచుండె యనువేమో నట్లుండెను. ప్రకృతియంతయు నాలోక రమణీయమై యుండెను.

ఆ కాంతిమయ ప్రపంచమున వీరభద్ర గజపతి కన్నులకు మనోజ్ఞ పదార్థ మొక్కటియు నగపడుటలేదు ఆతని హృదయా కాశమున మబ్బు గ్రమ్మియుండెను ఝంఝామారుత మతిదారుణ ముగ వీచుచుండెను గాంఢాంధకారము వ్యాపించి యుండెను అప్పు డప్పుడు తళుక్కున మెఱపులు మెఱయుచుండెను. పెళ పెళనుఱుము చుండెను పిడుగులు పడుచున్నట్లుండెను అశ్రువుల నెపంబున వర్షించుచుండెను భావకందళములు మొలక లెత్తుచుండెను రస వాహిని హృదయ కుహరమున దరితట్టి గభీర తరంగములతో గొట్టుకొనుచుండెను ఆ యదటున నాతని హృదయ మంతయు దడదడ లాడుచుండెను.

సింహాచలమునఁ గాంచినప్పటినుండియు నా రమణీమణి యాతని కహర్నిశము జాగ్రత్స్వప్నములయందును గన్నులఁ గట్టినట్లుండెను నిరంతర మామెను గూర్చియే యాతఁడు ధ్యానించుచుండును. అలీక సందర్శనము. గల్పించుకొని పలుకరించుచుండును. రిత్తకోరికలం గోరుకొని పొంగిపోవుచుండును. ఆత డెట్లో చొరవచేసి నైచ్యమని యోచింపక నీలాద్రి రాజునకుఁ దనహృదయ భావమును దెలియఁ జేసెను ఆతఁడందుపై నొక యుత్తరమును వ్రాసెను దానికిఁ బ్రత్యుత్తర మొసంగుట కాతని కేమియు దోఁచుటలేదు. అందుచే నొక్కఁడును గూరుచుండి యాలోచించు కొనుచుండెను

ప్రశ్నోత్తర రూపమున నాతని హృదయమునం దనేకాలోచన ములు తోఁచెను.

ప్రశ్న-నా తండ్రి యందుల కంగీకరించునా?

ఉత్తరము—అంగీకరింపఁ జేయకున్నచో నా గొప్ప యేమున్నది?

ప్రశ్న—నిరాఘాటముగ నంతటి కార్యమును జేయ వచ్చునా?

ఉత్తరము—కపట తంత్రమును గూఢముగఁ జేసినచో సర్వ శ్రేయము.

ప్రశ్న—ఇంతయుం జేసినచో నన్నాయువతీమణి యను గ్రహించునా?

ఉత్తరము— దుర్లభుఁడగు సార్వభౌముని కుమారుని వరించుట కంటె నామె కింకేమి కావలయును?

ఇట్లను కొనునప్పటి కాతని కేదియో సంశయము తోఁచెను. ప్రియవస్తువులయెడల సంశయములు పుట్టుచుండుట సహజము అంతలో నాతని హృదయ మంతయుఁ గలఁగిపోయెను. ఇఁక నాలో చనము తోఁచుటలేదు హృదయావేగమున నొడలు కంపింప నారంభించెను నిట్టూర్పులు దీర్ఘములై వెడల నారంభించెను. కాలి యను భవించుచున్న దేదియు నాతఁడెఱుంగఁ జాలకుండెను.

ఈ రీతిగా జాము రాత్రి గడచినది. అప్పుడు దమనకుఁ డచ్చటికి వచ్చి యెదుట నిలువఁబడియెను. కొంతసేపటి కాతఁడు దమనకుని వంకఁ జూచి "మిత్రమా. కూరుచుండుము" అనియెను.

దమ—ప్రభూ! ఇంత రాత్రి వఱకు భోజనమునకు దయచేయ లేదేమి?

వీర—ఎంత రాత్రి యైనది?

దమ—జాము రాత్రి యైనది

వీర—భోజనమున కేమి లెమ్ము!

దమ—మహా ప్రభూ! అట్లనియెద రేమి?

వీర—నా హృదయము కలఁగిపోవు చున్నది?

దమ—ఏమది?

వీర—నీలాద్రిరాజు వ్రాసినజాబు చూచితివి గదా!

దమ—చూచితిని. అంతయు మనకు శుభముగనే యున్నది కాని, తుదివాక్యములు మాత్రము చాల వ్యతిరేకముగా నున్నవని యనుకొంటిని.

వీర—దాని కేమి? ఆతని కోరిక యెట్లయినను దీర్పవచ్చును.

దమ—ఇఁక నేమి? అట్లయినచో మనకార్యము ఫలించినట్లే గదా!

వీర—అది కాదు. అంతయు నెట్లో నిర్వహింపవచ్చును పిమ్మట నా యువతి నన్నుఁ బరిగ్రహింప నంగీకరింపనిచో నేమి చేయవల యును?

దమ—ఎంత మాట! ఇది సార్వభౌమ కుమారుఁ డనుకోనవలసి నది కాదు. సామాన్యు లనుకొనవలసిన మాట.

వీర—ఒకవేళఁ జిన్నతనముచే మొదట నంగీకరింపక పోయి నను మన వైభవాధికములం జూచిన పిమ్మటనైన నొప్పుకొనవచ్చు ననుకొని యెదను. ఏమందువు?

దమ—అక్కఱలేదు. తరువాత నెట్లయినఁ జూచుకొన వచ్చును.

వీర—అట్లయినచో, "నీయభీష్టము నెఱవేర్తు" నని నీలాద్రి రాజునకు జాబు వ్రాయవచ్చునా'

దమ—దేవరచిత్తము

వీర—ఇది యంతయు రహస్యముగ జరుగవలయును. నీవే యాజాబు దీసికొని పోవలయును

దమ—చిత్తము

ఇట్లు సంభావించుకొని వారిరువురును నా యుపవనమునుండి మర్గాభిముఖులై బయలుదేఱిరి.

సంశయము తోఁచినప్పుడు నిర్విఘ్నముగఁ గార్యము సిద్ధించు వఱకు నదియట్లే యుండును, మోహాంధులకు దూరదృష్టి యించు కంతయు నుండదు. సమయోచితముగఁ బ్రవర్తించుటయే వారిపని అతనికిఁ దోఁచిన సంశయ మాతని హృదయమును గలఁగించుచునే యుండెను. అంతలో మనస్సమాధానము గలుచునే యుండెను కార్య భార మాతనిఁ గ్రుంగఁజేయుచునే యుండెను. సమయానుకూల మగు నుత్సాహ మాతనిఁ బ్రేరేపించుచునే యుండెను అతని యాలోచనముల కంతము లేదు సంశయములకు సంపూర్తి లేదు. ఈ రీతిగాఁ గొట్టుకొనుచుండెను. తుద కేమగునో చూచి కొనవల యును.

## 9. ఆశ

ఆశ యనునది కామరూపిణియగు నొకరక్కసియని చెప్ప వచ్చును. అది నిరంతరము వివిధ మోహాకృతులం దాల్చి జీవుల వశపఱచు కొనుచుండుటయే కాక, తన్ను వరించినవారల కిట్టె వశీ

కృతయై పోవుచుండును. కామ వికారోద్రిక్త స్వభావ యగుటచే నది యొకప్పుడు చండప్రభంజ నాకృతిం దాల్చి తన వలపు కాంద్ర హృదయకమలముల నామూలముగ నుఱిచివైచుచుండును. మఱి యొకప్పుడు దారుణ జ్వాలాకరాళమూర్తియై సర్వాంగములం బరితపింపం జేయుచుండును. ఒకప్పుడు రణదేవతా స్వరూపిణియై యిలా తలమున నెత్తురుటేరులఁ బ్రవహింపఁ జేయుచుండును. కులము, రూపము ధనము, రాజ్యము, వేయేల—లోక మునం గల సంతోషదాయకము లగువస్తువుల నన్నిటి నేర్చి యొక్కచోఁ గూర్చి యొసంగినను దానికి సంతుష్టియనుమాట యుండదు అది యొకప్పుడు విశ్వరూపముం దాల్చి బ్రహ్మాండ మంతయు బాలపండువలె నోట వేసికొనవలయు నని యాత్రపడుచుండును. ఆకలి తీరక యొకప్పుడది తన బిడ్డలగు కోరికలనే మ్రింగివైచుచుండును. దానికి లజ్జాభిమాన ములు లేవు, దయానురాగములు లేవు, ఆభూతము నడంచుటకుఁ దగిన మారణమంత్రములు మంత్ర శాస్త్రమునం దెచ్చటను లేవు.

సీతాద్రిరా జిప్పుడాశా భూతావేశవివశుండై పరితపించు చున్నాఁడు అతఁడు భుజబలమున దుర్గాధిపతియగునంతటి సమ ర్థుఁడు గాఁడు కాని దైవశంబున నాతనియన్న దుర్గము సోదర పుత్రికా ప్రతినిధియను నెపంబున నాతని చేతిలోఁ బడినది. అది మొదలుగ నాశాభూత మనేక మోహనాకృతులతో నాతని హృద యమును గలఁచివైచుచుండెను. అందువలనఁ దనయన్న తన్నెం తగాఁ బ్రేమించియుండెనో, యన్న బిడ్డయగు కమల తనయెడల నెంతటి భయభక్తి విశ్వాసానురాగములతోఁ బ్రవర్తించుచుండెనో యంతయును మఱచిపోవుచుండును. ఎటులైన నా దుర్గము తన యధీనము నుండి యెన్నటికిని దప్పిపోకుండఁ జేసికొనవలయునని యాతని యాశ — తన యన్నగారి మరణ సమయమున మంత్రియగు రాజశేఖరుఁడు మరణశాసనము వ్రాయించి వీరభద్రగజపతి యొద్దకుఁ గొండవీడు రహస్యముగఁ బంపినట్లు మొదటి నుండియు నాతని కనుమానము గలదు ఆ కారణమున నెప్పు డెట్టిమార్పు తటస్థించునో యని యాతఁ డెప్పటికప్పుడే తల్లడిల్లుచుండును

కమలకు బెడ్డిదైయైనట్లును, కమల మగనికిఁ గళింగేశ్వరుఁడు వసంత వాడదుర్గాధిపత్యము నిచ్చివేయవలయునని తనపేర నాజ్ఞాపత్రిక వ్రాసి పంపించినట్లును, కమల తనకు వర్ష వేతనముగ నొకటి రెండు గ్రామముల నిచ్చినట్లును జాగ్రదవస్థ యందే యాతఁడు స్వప్నములం గాంచి యులికిపడచుండును ఇంతకును మూలమైన కమల నెట్లు లైనఁ జంపివేయవలయు నని యాతఁ డొకప్పుడు తలంచుచుండును కాని మంత్రియనిన నాతని కెంతయో భయము! అట్లు చేయ సాహ సించినచో నాతఁడు తన ప్రాణము మీఁదికే తెచ్చునేమో యని సంశయించుచుండును ఆ విచారమువలన నాతనికి నిద్రాహారములు దూరములై పోయెను

ఆతఁ డిప్పుడు తన శయన మందిరమునఁ బర్యంకముపైఁ దలదిండు చేసుకొని యర్ధశాయియైయుండి మింటికిని మంటికిని సూత్రముఁ బన్నుకొనుచుండెను - "నా ప్రయత్నము ఫలోన్ముఖ మైనది ఉన్ముఖమననేల' ఫలించినదనియే చెప్పవచ్చును. సార్వభౌమ తనయుండగు వీరభద్రగజపతి స్వహస్తములతో వ్రాసి యంపిన లేఖయం దక్షరాకృతిం దాల్చి యదృష్ట దేవత నా యెదుట సాక్షా త్కరించినది చక్రవర్తి వెనుకఁ జక్రవర్తి యంతటివాఁడు, నాతనయ యగు శ్యామలను బ్రేమించితి నని వ్రాయుటకంటె నింకేమి కావలయును? సార్వభౌమ తనయుఁ డల్లుఁడగుటయు, వసంతవాడ దుర్గము నిరాబాధకముగ నాయిది యగుటయు నా కొక్కసారియే తటస్థము కానుండెను. అప్పుడు రాజశేఖరుని మంత్రి పదమునుండి తొలఁగించివై చెదను. ఎంతటి బుద్ధిశాలియైనను నిస్సహాయుఁ డగు నాతఁ డప్పుడేమి చేయఁగలఁడు? ఎంత ప్రయత్నించినను నా యన్న గారి యెడల విశ్వాసమును వదలఁజాలనియవివేకి యగు నాతని కప్పు డధఃపతనమే యగుఁగాక! - ఈ విషయమునఁ గుమారునకు వ్యతిరేకముగ సార్వభౌముఁడు మాత్రము సంబంధము గలుగఁజేసి కొనునా? అంతయు బాగుగనే యున్నది. సార్వభౌముని వియ్యముం గాంచి యెల్ల దుర్గేశ్వరులలో నేనే యగ్రగణ్యుఁడ నయ్యెదను." అని యింక నేమేమియో తన హృదయోల్లాసమునకుఁ దగినట్లు యోచించుకొనుచుండెను

ఎప్పటివలెనే యథా సమయమునకుఁ జారుమతి పసిఁడి పళ్ళెరముతో ఫలాదులను దీసికొని యాశయన మందిరముఁ బ్రవేశించెను. చారుమతి నీలాద్రిరాజు గృహిణి! ఆమె యాతని గృహిణి యని చెప్పుట కంటె శ్యామలజనని యని చెప్పుటయే బాగుగ నుండును ఆమె చారుమతి యగుటయేగాక, శీలవతియు, గుణవతియు, మానవతియునై యుండెను ఆమె తన నాథుని పర్యంకము కడ నున్న యొక పీఠముపై నా పళ్ళెరమునుంచి నిలువఁబడి సవిలాసముగ భర్తవంకఁ జిఱునవ్వు వెన్నెలలతోఁ గూడఁ కటాక్ష మాలికలను బరగించుచుఁ గేవలము మంద్రస్వరమును గేవల ముచ్చైశ్వర్యమును గాని స్ఫుటస్వరముతో "మీకీ దినమున నెండ మిక్కుటముగా నుండుటచే నిద్ర పట్టలేదు కాఁబోలును!" అనియెను.

నీలా—కేవల మెండమాత్రమే కాదు. మనసొకచో నుండి పనిచేయుచుండుటచే నిద్ర పట్టుట లేదు.

చారు - నాకు నట్లే యున్నది, మన మాధవుఁడును గోపాలుఁడును గూడ నూర లేకుండుట వలనను వారు వహించు భార మతితరమైనదగుటవలనను, నా దృష్టి యంతయు వారిమీఁదనే యున్నది. కాని మాధవుఁడు సమర్థుఁ డగుటచే వారిరువురును గలిసిపోవు పని నిర్విఘ్నముగఁ గొనసాగు ననియు, వారు పట్టిన దెల్ల బంగార మగు ననియుఁ దలచి ధైర్యము తెచ్చుకొనుచు నుందును.

నీలా—నీ వాఁడుదానవు, నీకు రాజకీయ వ్యవహారజ్ఞానము లేదు,

చారు—(నవ్వుచు) నా కంతటి జ్ఞానము లేకపోవచ్చును. అయిన నిప్పు డేమి వచ్చినది? రాజ్యతంత్ర మంతయు నా బుద్ధి మాత్రముననే నడవఁబడుట లేదుకదా!

నీలా—అందులకుఁగాదు - పూర్వము మా యన్నగారి జీవితకాలమునం దెప్పుడో మంత్రి రాజశేఖరుఁడు సార్వభౌముని కొక గొప్ప యుద్ధమునఁ దోడుపడుటవలనఁ జక్రవర్తి యింతవఱకు నాతని గౌరవించుచు నీ చుట్టుప్రక్కల నున్న యరణ్యములందలి మన్నె దొరలకల్లోలముల నడంచు విషయమున నేమేమియో యాతనికే వ్రాయుచుండును.

చారు—అది మనకును గౌరవమేకదా!

నీలా—మంత్రి యీ సంగతి యంతయు మాధవునకుం దెలిపి యాతనినే యీ కార్యనిర్వహణమునకుఁ బంపుచుండను!

చారు—మనకు సేనానాయకుఁడై యుండిన మాధవుఁడు గాక మఱియెవ్వ రాపని చేయఁగలరు?

నీలా—తోడిపెండ్లికొడుకువలె మాధవునితో మన వెట్టి గోపాలుఁడుకూడఁ బోవుట లేదా?

చారు—ఔను వారిరువురును బోయిన నేకార్యము విజయము నొందదు? ఇదివఱ కొకసారి వారిరువురునుఁబోయి మన్నీల దుండగముల నడంచి రాలేదా?

నీలా—ఏమి చేసిననేమి? విజయము మాధవునిదే కాని గోపాలున కేమున్నది?

చారు—ఎవ్వరిదైన నేమి? వారిరువుర కును భేద మేమున్నది? ఇరువురును మేనమఱఁదులే కదా? అన్నదమ్ముల బిడ్డలగు కమలా శ్యామల లెట్టివారో. మేనత్త మేనమామ బిడ్డలగు మాధవ గోపాలురు కూడ నట్టివారే కాదా? ఒక్కచోఁ బుట్టి పెరిఁగిన యీ నలుగురిలో నొండొరులకు భేదబుద్ధి యెట్లుండును?

నీలా—అది యెటు? మాధవుని విజయము గోపాలునకు వచ్చునా? కమల రాజ్యము శ్యామలకు వచ్చునా?

చారు—మీ రట్లు తలంపరాదు అంతరంగిక ప్రేమాను బంధములు బలపడియున్నవారికి బాహ్యాడంబరములగు రాజ్య విషయము లొక లెక్కలోనివి కావు, మాధవుఁడు విజయుఁడై యున్నను గోపాలుఁ డాతని మేనమఱఁదియె. కమల దుర్గేశ్వరి యైనను శ్యామల యామె చెల్లెలే,

నీలా—శ్యామల దుర్గేశ్వరి చెల్లెలగుటకే కాని మహారాజ్ఞి కావలయునని నీకుఁ గోరిక లేదా?

చారు—కోరికల కేమికొదవ? మాధవుఁడు సార్వభౌముఁడు గావలయునని గోపాలుఁడు సర్వసేనానాయకుఁడు గావలయు ననియుఁ, గమలాశ్యామలలు మహారాజ్ఞీమణులు గావలయు ననియు నా కెంతయో కోరిక యున్నది.

నీలా—(కొంచెం ఓర్గరగా) అప్పెన్నఁటికిని గాదు, శ్యామల మాత్రము మహారాజ్ఞీమణి యగుపు – అగుచున్నది - అయినది.

చారు—(నవ్వుచు) కలవరించుచున్నారా యేమి?

నీలా—ఇవి స్వప్నమునందలి కలవరములు గావు, ఆనందము నందలి యాశీర్వచనములు!

చారు—జాగ్రదవస్థయందుఁ గూడ స్వప్నము లుండు నని పెద్దలు చెప్పుచుందురు

నీలా—ఇది యెన్నటికిని స్వప్నము గాదు. సత్యము. ముమ్మాటికిని సత్యము.

చారు—అది యెట్లు తటస్థించును?

నీలా—మన యదృష్టము ఫలించుటవలన.

చారు—మీ మాటలు నాకు బోధపడుట లేదు

నీలా—అట్లయినఁ గన్నులారఁ గాంచి యనుభవమునకుఁ దెచ్చుకొనుము

అని చెప్పి తన తల దిండు క్రింద భద్రముగా నుంచిన యొక లేఖం దీసి యామె చేతి కిచ్చెను చారుమతి దాని నందుకొని యాత్రముతోఁ జదువ నారంభించెను. చదువుచున్న కొలఁది నామెరక పల్లములు కంపించిపోవుచుండెను. పడిగాలిచే మృదులశికంబోలి యామె సుకుమారతనులత చలించిపోవుచుండెను, అధరపల్లవ మదిరి పోవుచుండెను ఇందీవరంబులంబోని సోగకన్నులనుండి యుష్ణాశ్రు బిందువులు జాలువాఱుచుండెను, నిట్టూర్పుపొగ లెగయుచుండెను, క్రమముగాఁ గన్నీరు మున్నీరై పోయెను. తుద కా భయంకర లేఖ యామె కరకమలములనుండి జాఱి పడిపోయెను. తోడనే యామెయు నిలువున నీరై యిలాతలమునఁ బడిపోయెను.

నీలాద్రిరాజు నిశ్చల నయనములతో నామె వంకఁ జూచుచు నిర్విణ్ణుఁడై స్తంభితుఁడై పోయెను

ఆ సమయమున నవ్వల నెవ్వరో "అక్కా! దుర్గేశ్వరీ!" అని పిలిచిరి,

ఆ పిలిచినది శిశిరమణి. ఆమె యప్పుడప్పు డుత్సాహముతోఁ గమల నట్లే పిలుచుచుండును.

ఆ పలుకులు నీలాద్రిరాజు చెవులం బడుటచే నులికిపడి శయ్య నుండి క్రిందఁబడి భూతము పట్టిన క్రోఁతివలె. బిదులు ద్రొక్కుచు నేమి చేయుటకుం దోఁచక మది గలఁగిపోవుచుండ నంతఃపురము వదలి యావలకుఁ బోయెను.

# 10. బహిరంగ రహస్యము

లోవి మాయఁగలముగాని లోకము మాయఁజాలము. గోడలకుఁ జెవులున్నవి. మాటలు కోటలు దాఁటును. రహస్య మనఁగా గోప్యముగనే యుండఁదగినది. పెదవి దాఁటినఁ బృథివి దాఁటును, అందును నాఁడువారినోట నువుగింజ నానదు. శ్యామలా వివాహ విషయమున నంతఃపురమున భార్యాభర్త లిరువురకును జరగిన సంభాషణ మెట్లో యీవలఁ బడియెను. ఏ మూలఁ జూచిన నా విషయమును గూర్చిన గుసగుసలే వినవచ్చుచుండెను. శ్యామలా వివాహ విషయమున నింత రహస్య మెందులకో తెలిసినదిగాదు. శుభవార్త యందఱును వినవలసినదే. విని యానందింపవలసినదే. కాని దీని మార్గముఁ వేఱుగా నున్నది. నీలాద్రిరాజీ విషయమునఁ బట్టుదలతోఁ బనిచేయుచుండెను. చారుమతి యందుల కసమ్మతమునే సూచించుచున్నదని తోఁచుచున్నది. కానిచో, నాఁడు గజపతియుత్తరమును జూచి యామె కొయ్యవడిపోనేల? ఆమె మాత్రమంతకంటె గొప్ప సంబంధమును దీసికొని రాఁగలదా? ఆమె కెందుల కనిష్టముగ నుండెనో మనకుఁ దెలియదు. శ్యామలా వివాహ విషయమున యజమానుల హృదయము లిట్లన్యోన్యమును విపరీతభావము నొందుటచేతనే పరివారజనములో నిట్టి గుసగుసలు బయలుదేఱినవని తోఁచుచున్నది! ఈ విషయమున శ్యామల హృదయ మెట్లున్నదో మనము కనుఁగొనవలసియున్నది. ఈ విషయ మంతఃపుర సమీప సరోవరసోపానములపైఁ గూర్చుండి ముచ్చటించుచున్న విరజా సరమల సంభాషణమువలన మన కించుక తెలియఁగలదని తోఁచుచున్నది. కావున మనమా తావునకుఁ బోవుదము రండు!

సరమ—శ్యామల సార్వభౌముని కుమారునకుఁ బత్ని యగునఁట కాదా!

విరజ—దైవయత్న మెట్లున్నదో యెవ్వరు చెప్ప గలరు?

సర—అట్లనెదవేమి? రాజు తలంచిన దెబ్బల కేమి కొదవ! ప్రభువు వారిందుల|కా మోదించినా-రట గావా?

విర—ప్రభువుల హృదయము లతి గంభీరములు. మన కెట్లు తెలియును?

సర—నా యొద్ద దాఁచెదవేమి? నేను పరాయిదాననా? ఈ చెవిని బడిన రహస్య మా చెవికైన దెలియనీయనని నీకుఁ దెలియదా యేమి?

విర—మనమట్లే యనుకొందము ఒకరి హృదయభావ మింకొకరికిఁ దెలియుటయే రహస్యభంగమని నీ వెఱుంగవా?

సర—అట్లే. కాని నన్ను నీ వెఱుంగవు గనుకనా? నీ హృదయమే నా హృదయము. నీ ప్రాణమే నా ప్రాణము కావున నింతటి శుభవార్త నాకును దెలిపి నీకున్న యానందము నే నాకును గలిగించుట న్యాయము,

విర—నీ హృదయమే నా హృదయ మైనప్పుడు నాకుఁ దెలిసినది నీకుఁ దెలియకుండు టెట్లు?

సర—తెలియకుండరాదనియే తెలుపుమనుచుంటిని'

విర—ప్రభువులతోడి పని పాములతోఁ జెరలాటమువంటిది? మన కెందులకుఁ బోనిమ్ము.

సర—ఆ మాట నిజమే. కాని నాతోఁ జెప్పినందువలన నపాయమేమియును లేదు. అది నీ హృదయమునందున్నట్లే యుంచెదను.

విర—నీ వట్టిదానవే. ఇటునటు నెవ్వరును రాకుండఁజూడుము చెప్పెదను.

సరమ యటునిటు చూచి "ఎవ్వరును వచ్చుటలేదు." అనియెను!

విర—సార్వభౌమకుమారుఁడు శ్యామలను దన కిమ్మని మన ప్రభువున కుత్తరము వ్రాసినాఁడట!

సర—మన ప్రభు వందుల కొప్పుకొనియెనా?

విర—మొదటినుండియు నందుల కే ప్రయత్నించుచున్న ప్రభు వందుల కొప్పుకొన కేమి!

సర—ఏమి! ఈ ప్రయత్నమంతయు నీయన చేసినదే నా, సార్వభౌమునితో వియ్యమున కాతఁడు ప్రయత్నించుట తప్పుగాదు!

విర—నీ వింకను బెడత్రోవనే యున్నదానవు అతని యుద్దేశము వేఱు. ఆ ప్రయత్నము వియ్యంకుఁడగుటకే కాదు

సర—ఇంకెందులకు?

విర—దుర్గాధిపత్యము నొందుటకు.

సర—(యదరిపడి), దుర్గాధిపత్యమా?

విర—అన్న దుర్గ మున్నదిగదా!

సర—ఇఁతటి యన్యాయమున కొడిగట్టుటయే!

విర—కాకేమి?

సర—నోరెఱుఁగని పసిబిడ్డ యగు కమలగతి యేమి కావలసి వది?

విర—తనకు దుర్గాధిపత్యము వచ్చునుగదా! ఆమె యేమైన నేమి?

సర—గోపాలుఁడీ సంగతి నెఱుఁగునా?

విర—ఆతని కంత విస్పష్టముగాఁ దెలియదనుకొనియెదను కాని, శ్యామల వివాహమున కాతఁడంగీకరించినట్లు కనఁబడదు,

సర—శ్యామలయో?

విర—శ్యామల యదుల కంగీకరింపలేదు

సర—ఏమి? సార్వభౌమకుమారుఁడు తన్ను వరించుట కంటె భాగ్యమున్నదా?

విర—ఆమె గభీరహృదయము గలది ఆమె హృదయము నందేమున్నదో యెవ్వరికిఁ దెలియును? ఆమె యూహ లెప్పుడును సరియైన మార్గములందే నడచుచుండును.

సర—అవును. ఎవ్వరి హృదయాన్నత్యమెట్టిదో పర్యవసానమునఁగాని యెవ్వరికిని దెలియరాదు—కాని యీ ప్రయత్నము సర్వానర్థములకు మూలమని తోఁచుచున్నది,

విర—సర్వనాశనమగునని చెప్పుము.

సర—దీని మూలమునఁ గమలా మాధవుల వివాహమునకు నేదియో యనర్థము గలుగును,

విర—మొదటికే మోసము వచ్చుచున్నదిగదా

సర—దేవి చారుమతి యేమనుచున్నది?

విర—ఆమెకు మొదలే యా సంబంధ మిష్టము లేదు ఆమెకు మాధవ గోపాలు రిద్దఱును నెటియొక కన్నులు, కమలా శ్యామల లిద్దఱును గవలపిల్లలే,

సర—ఆమె మహాసాధ్వి—రాజశేఖరుడు డింమల కేమియును బ్రతిక్రియ చేయలేదా?

విర—అతఁ డట్టి ప్రయత్నములోనే యున్నాడు కాని రాజులతోఁ బని—ఏమి చేసిన నేమి వచ్చునో?

సర—సరేకాని శ్యామలకు మాధవునిఁ బెండ్లి యాడవలయు నని యుండెనా యేమి?

విర—సరిసరి; కమలా శ్యామలలకు శరీరములు వేఱైనను బ్రాణ మొక్కటియే యని యెఱుంగుదువా? అక్క యాతనిఁ బ్రేమించుటవలనను, అతఁడు తన మేనమఱఁది యగుటవలనను, చిన్న తనము నుండియుఁ దమతో బెరిఁగినవాఁ డగుటవలనను, మాధవుఁడు సరళ స్వభావుఁడగుటవలనను శ్యామల యాతనిఁ బ్రేమించి ప్రియము వెలుపుచుండెనేగాని పెండ్లియాడవలయునను నుద్దేశముతోఁగాదు. ఆమె యా ప్రేమమునకు బ్రతిఫలాపేక్ష యెంతమాత్రమును లేదని నా నిశ్చయోద్దేశము,

సర—అట్లయినచో నామెకు యువరాజు కంటెను దగిన వరుఁ డెక్కడ దొరకును?

విర—ఆమె యుదార హృదయ. ఆమె స్వభావము సమున్నత మైనదే ఆమె యుద్దేశ మెవ్వరికిని దెలియదు.

సర—ఆమె పెండ్లి చేసికొనునా'

విర—ఏమో ! ఆమె గంభీరహృదయమున నేమున్నదో యెట్లు తెలియును?

సర—ఇంత దురాగతము మూఁడియున్నప్పు డందఱును నిమ్మకు నీరు వోసినట్లు,చల్లగా నిట్లున్నారేమి?

విర—యువరాజు మన రాజునకుత్తరము వ్రాసిన తరువాత

నె దులకో తండ్రి యొద్దకుఁ బోయియున్నాఁడు అప్పుడే యైదాఱు నెలలైనది. అతఁడు వచ్చిన తరువాత కొక్కసారిగా లంకాపురి యంటుకొనకమానదు

సర—అయ్యో, దురాశ యెంత దారుణకృత్యముల఼ఁ జేయించుచున్నది? అయ్యో! పండువంటి కుటుంబము భగ్నమైపోవుచున్నది? అయ్యో! అయ్యో!

విర—పాపాత్మురాలా! నేఁ జెప్పలేదా? ఇదియేనా రహస్యగోపనము? అట్లు కేకలు వైచెదవేమి? ఎవ్వరైన వత్తురేమో, పోవుదము పద

విర—క్షమింపుము హృదయతాపమున నొడ లెఱుంగక యిట్లు యిటిని, పోవుదము రమ్ము

ఇట్లు సంభాషించుకుని యిరువురు నటనుండి చెటియొకత్రోవను బోయిరి.

# 11. కమల

కమల నవనీత మృదులహృదయ, సరళస్వభావ. మాయమర్మముల నెఱుంగని ముద్దరాలు పాప మామెకుఁ జిన్నతనముననే తల్లిదండ్రులు కలువైపోయిరి ఆమె నీలాద్రిరాజునే తండ్రిగను, చారుమతినే తల్లిగను భావించుకొనుచుండెను శ్యామలా శిశిరమణులామెకు బహిఃప్రాణములే. గోపాలుని యెడల నామెకుంగల సోదరస్నేహమునకుఁ బరిమితిలేదు పినతండ్రి తన విషయమై చేయుచున్న కుతంత్రముం గూర్చి యామెకు స్పష్టముగా దెలియవచ్చెనుఁ అందువలనఁ దనకుఁ గలుగఁబోవు నష్టముమాట యటుండఁ దన ప్రాణపదమగు సోదరి శ్యామలకుఁ బ్రాణసంకటము గలిగినందులకు విచారించుచుండెను. గ్రీష్మతప్తంబగుస్థలకమలమువలె వాఁడియున్న శ్యామల ముద్దుమొగ మామె చూడఁజాలకుండెను. ఇంకను నా తంత్రమువలనఁ దనకుఁ గూడ నెట్టి దురాగతము రానున్నదో యని భయపడుచుండెను. గోపాలుఁ డందులకు సమ్మతించుట లేదని యించుక ధైర్యముతో నుండెను సర్వవిధములఁ గంటికి ఱెప్పవోలెఁ బితృ

వాత్సల్యమును దక్కించుకొనుచున్న మంత్రి రాజశేఖరుడు సార్వభౌముని యొద్దకుఁ బోవుచునుమాట యామె హృదయమునకు శూలమువలెనుండెను ఆమెకు దుర్గము విషయమై విచారములేదు. అది యెట్లయినను సరియే

ఆమెకు మాధవునితోడిదే లోకమై యుండెను. మాధవుఁ డిప్పుడు సార్వభౌమానుగ్రహమున దుర్గేశ్వరుఁడై చాలాదినములనుండి యిచ్చటికి వచ్చుటలేదు. నిమిషమైన నెడబాయుటకు సహింపఁజాలని మాధవునిఁ జూడకుండ నిప్పుడు నెలలు గూడఁ గడపవలసివచ్చెను, ఆతని వియోగముచే నామె కా నెలలు మహాయుగములుగాఁ దోఁచుచుండెను. అందుపైఁ బినతండ్రి చేయుచున్న దుస్తంత్రమువలన ముందెట్టి కీడు మూఁడునో యని భయమగుచుండెను అందువలన నామె హృదయసంతాపము ద్విగుణీకృతమై పోయెను శ్యామలకుఁ గూడ నట్టి యపాయమే తటస్థించుటవలన నొకరి కొకరు చెప్పుకొని దుఃఖించుటయేకాని యూఱడిల్లియుండుట కుపాయమే యగపడుట లేదు. గోపాలుఁ డప్పుడప్పుడు వచ్చి ధైర్యము చెప్పుచునేయుండెను. కాని పినతండ్రి హృదయదార్ఢ్యమును బూర్ణముగా నెఱింగియున్న యామె కూఱట యెట్లుండును?

మాధవుఁడీ విషయమున నేమియును వ్రాయుటలేదు ఆతఁడు ప్రేమరసపూరితంబులగు సువర్ణములతో, హృదయానందదాయకంబులగు భావములతో జాబులను వ్రాయుచునే యుండెను. ఆ దుర్దినములలో మెఱుపులవలె నామె కవియే నయనానందకరములై యుండెను. దుఃఖమును సహింపఁజాలని సమయమున నామె యా ప్రియలేఖలను చదువుకొని కొంచెమూఱడిల్లుచుండెను దినదినము నామె దుస్స్వప్నములను సుఖస్వప్నములను గూడఁ గాంచుచుండెను స్వప్నములు హృదయభావముల ననుసరించియే యుండును ఆమె గాంచు దుస్స్వప్నములన్నియుఁ బినతండ్రి తనకును,సోదరికినిఁ జేయఁ బూనుకొనునని యనుమానించిన విషయములను గూర్చినవే. తన్ను దుర్గదేవతకు బలియిచ్చినట్లు, శ్యామలను దుష్టరాక్షస నిర్బంధమునకుఁ జాలువఱచినట్లు, శ్యామల యుత్తమాంగము ఖండింపఁబడినట్లు తా

నొక జీర్ణారణ్యమున దావానల మధ్యమునఁ దగులుకొనినట్లు- ఇట్టివే దుస్స్వప్నములు.

మాధవుఁడు తన కంఠమున బుష్పహారమును వేయుచుండఁగ శ్యామలాశిశిరమణులు చూచి కిలకిల నవ్వినట్లును, తనకును మాధవునకును బెండ్లియైనట్లును, పెండ్లికొడుకగు మాధవుని మెడలో శిశిరమణి మల్లెపూదండలను వైచి పరిహసించినట్లును, మాధవునితో మాట్లాడుటకు దాను సిగ్గుపడుచున్నట్లును, మాధవుఁ డేకాంతమునఁ దనతో నెన్నియో మాటలాడినట్లును, ఇంక నిట్టివే యెన్నెన్నియో సుఖస్వప్నములను గాంచుచుండెను

ఏమైన నామెకు నిద్రాహారములు దూరములై పోయెను. పినతండ్రి చేయు కుతంత్రములవలన హృదయోత్తాపము, ప్రియజన వియోగసంతాపము, గ్రీష్మగ్రీష్మ పరితాపము——ఈ ముచ్చిచ్చు నామె హృదయము నుడికించివైచుచుండెను ఆ జ్వాలలు శాంతించుటకుఁ దగిన యుపాయ మగపడుటలేదు ఒక్క మాధవ సందర్శనమున నా పరితాపమంతయు క్షణములోఁ జల్లాఱగలదు. అతని యమృతమధుర భాషణంబున హృదయకమలమానందవికసితము కాఁగలదు. కాని యామె కట్టి భాగ్యము లభించుటలేదు. ధైర్యము నిలుచుటలేదు. దిక్కు తోఁచుటలేదు.

పగలు మూఁడవజాము జరుగుచున్నది. గ్రీష్మతాపము ప్రచండమంతను బెలగింజవలె వేచుచుండెను భయంకరమగు వడగాలి నిప్పులఁ జెఱఁగుచుండెను. జగమంతయు నిప్పులగుండము వలె నుండెను: కమల తన శయనమందిరమునఁ బర్యంకముపైఁ బరుండియుండెను. పరిచారికలు గవాక్షద్వారము ఇకడనున్న వట్టివేళ్ళ తడకలపైఁ బన్నీరు చిలుకరించుచుండిరి కొందరు తామరపూవుల వీవనలతో నామెకు విసరుచుండిరి కొందఱు సుగంధమిశ్రితంబగు చందనమును నెమ్మేనవలందుచుండిరి. ఇంక నెన్నెన్నియో చలువ పనులు చేయుచుండిరి. ఏమిటను దాపమారుటలేదు నిట్టూర్పులు తగ్గుటలేదు. నిద్దరపట్టుటలేదు

ఆమె యొకొక్కప్పు డేమేమియో తలంచుకొని యులికిపడు

చుండెను సీత్కారములతో నూర్పులు విడుచుచుండెను. ఆ సంతాప ప్రతప్తం బగునామె హృదయమున నప్పుడుగూడ నన్నెన్నియో యుద్దేశములు పుట్టుచుండెను.

బావ నొకసారి చూడవలయునని బావపలుకుల వినవలయు నని, సిగ్గువిడిచి మనసుదీర బావతో మాటలాడవలయునని బావసర సను నిలువ వలయునని, బావచెంగటఁ గూరు చుండవలయునని, బావను బెండ్లియాడి సుఖింపవలయు నని- ఇట్టివే యుద్దేశములు.

ఇట్టి యుద్దేశములు కమలకుఁ బ్రథమమునుండియు నవ్యక్తము లై యున్నవి అవి యామె యనుభవమున కెన్నఁడును దోఁచి యుండలేదు. క్రమముగాఁ దారుణ్యము వర్ధిల్లుచున్నది. భావములు స్ఫుటపడుచున్నవి. అనుభవ మతిశయించుచున్నది వీనికిఁదోడిప్పుడు వియోగము కూడఁ దటస్థించినది. అందుచే మేఘవాయు సంఘర్షణ మున విద్యుల్లతలవలె లోహశిలా సంఘర్షణమున నగ్నిస్ఫులింగముల వలె నామె హృదయభావము లతిస్ఫుటముగ, నతితరగముగ నుద యించు చుండెను.

# 12. మాధవుడు

ఉత్కల దేశాధీశ్వరునియనుగ్రహమున మాధవునకునిడుబ్రోలు దుర్గాధిపత్యము గలిగెను ఉత్కలేశ్వరుని యుత్తరువులు చేరినతోడనే మాధవుఁడు, గోపాలుని వెంటఁబెట్టుకొని వచ్చి క్రమముగ దుర్గమును స్వాధీనము చేసికొనియెను. మాధవుఁడేమన్నె దొరల దుండగము లడంచి యేప్రాంతములకు శాంతి నెలకొల్పెనో, అట్టి మన్నెదొరల కందులకును, ఆ ప్రాంతమున కంతకును నాతఁడధీశ్వరుఁ డయ్యెను నిడుబ్రోలు దుర్గము గోదావరికి దక్షిణ భాగమునందుఁ గల మన్నె సీమ కంతకును ముఖద్వారముగాను డెను. మాధవుఁడా సీమకంతకు నేలికయై రాజ్యాంగ విషయములైన కట్టుదిట్టములను జేసి కొనుట కించుమించు పదిమాసముల కాలము పట్టెను. గోపాలుఁ డొక నెల మాత్ర ముచటనుండి తండ్రి యాజ్ఞానుసారముగా వసంత వాడ దుర్గమునకుఁ బోయెను. మరలఁగొలదిఁకాలములోనే యొకటి

రెండు పర్యాయములు వచ్చి మంచి త్రోవ్రటయే తటస్థించినది కాని సంతోషముగా నిరువురునుగలసి యానూతన దుర్గమునం గాల క్షేపము చేయుటకుం దగిన యవకాశము కలిగినది కాదు మూఁడవ సారి గోపాలుఁడు వచ్చి యొకటి రెండు దినములు మాత్రమే యుండి వెడలిపోయెను అని మొదలు వసంతవాడ దుర్గ సమాచారము లేమియును మాధవునకుఁ దెలియుట లేదు. నిత్యమును రాజకార్యా యత్తమై యుండియు నాతని చిత్త మవకాశ సమయములందు మాటిమాటికిని వసంతవాడ దుర్గమునకుఁ బరువెత్తుచుండెను ప్రాణ ప్రియుల సమాచార మాఱు మాసముల వఱకును దెలియకుండ నోర్చుకొని యుండుట మాటలా?

మాధవుఁడీ పదిమాసములలోను రాజ్యాంగ సంబంధమునం గట్టు దిట్టములను జేయుటయందును, దుర్గోద్యానమును మనోహార ముగ బాగుచేయించుటయందును, శత్రువుల కభేద్యంబుగ నుండునట్లు దుర్గమును బలపఱచుటయందును దనచిత్తమును బ్రవర్తింపఁ జేయు చుండెను

ఒకనాఁటి యుదయకాలమున నాతఁడుద్యానవన సరోవర తీరమున నిటునటుఁ దిరుగుచుండెను. బాలభాస్కరుని లేఁతకిరణములు వృక్షాగ్రములనుండి క్రిందికి దిగి పద్మవనమునఁ బ్రచారము సేయు చుండెను. ఆ కిరణ ప్రభావమున నా కమల వనమంతయు సువర్ణా కారముందాల్చి నూతన రాగమును వెలార్చుచుండెను ప్రభాతవాత పోతము లావన వీథిం దిరుగు చుండుటచే హాయిగఁ జిఱుకెరటంబులా సరోవరంబున నాటలాడుకొనుచుండెను. ఆ కెరటముల కదలికం గలఁగి తామరసంబులు తలలూపఁ జొచ్చెను అప్పుడే వికసించుచున్న యొక కమల ముంజేరి సమదచంచరీకము ఝుంకారము సేయుచుఁ జుట్టు చుట్టును దిరుగసాగెను. ఆ ప్రచారమున నాకమల మలరి మృదుహాసమును జేయుచుండెను ఆ మధుర మందహాసమున నిట్టట్ట వరానివలపుట్టిపడు చుండెను.

ఈ సమ్మేళన మంతయు మాధవుని కనులం బడియెను ఆతని హృదయమున నొక భావోదయ మయ్యెను కమల యాతని హృద

యమునఁ దెరఁ జిమ్ముకొని ప్రత్యక్ష మయ్యెను! కమలకు యౌవనోదయ మైనది మాధవుని హృదయ పద్మము వలపుచే నిండి పోయినది. కమల పరమానందముతో మందహాసమును జేయుచుండెను. మాధవుఁడత్యానందముతోఁ జాతుర్యముగ నూతన గీతమును బాడుచుండెను. కమల యా గీతమున కలరి మాధవునిఁ దన హృదయమునఁ జేర్చుకొనియెను భావాంకురములు బొందిన మాధవుని హృదయ మీ విధముగా సంకల్ప సోపానముల నెక్కి పోవుచుండెను, ఇంకెన్ని మెట్లెక్కిన సౌధారోహణ మగునో!

మాధవుఁ డిఁక నాసరోవరతీరమున నుండఁజాలక వెనుదిరిగి తన సౌధమునకు వచ్చి శయ్యపైఁ బరుండెను కాని, యాతని హృదయ మాకాశవీథిని బరువెత్తు చుండెను అతఁడు కన్నులు మూసికొని హృదయాగారమునఁ గమలామూర్తిఁ దిలకించుచు నానందించుచుండెను. ఆ యానంద సముద్రమున మునిఁగి తేలుచున్న సమయమున వెలుపల నెవ్వరో "కమల యేది? శ్యామల యేది?" అని పిలిచినట్లయ్యెను

అతఁడా పలుకులను విని యదరిపడి లేచి "కమల యేది? శ్యామల యేది? అని మరలఁ బ్రశ్నించెను ఆ ప్రశ్నమునకు మరల నావలనుండి "కమల యేది' శ్యామల యేది" అను ప్రశ్నము లే విన వచ్చెను. ఇది మాధవుని కంఠస్వరమునకుఁ బ్రతిధ్వని యా? కాక, యవ్వల నెవ్వరైన మరలఁ బ్రశ్నించుచున్నారా? మాధవుని కంఠస్వరమునకుఁ బ్రతిధ్వనియే యైనచో మొదటి ప్రశ్నస్వర మెవ్వారిదై యుండును? అదియును మాధవుని కంఠస్వరమును డి యవ్యక్తముగ వెలువడిన ధ్వనియేనా — అప్పుడు మాధవుఁ డేమియుం దోఁచక "ఎవరక్కడ?" అని చెప్పుచు రెండడుగులు ముందునకు వైచెను. గది యావలి నుండి మరల "ఎవరక్కడ?" అను శబ్దము విననయ్యెను ఆ మాట వినిన తోడనే కమలాశ్యామలలు వచ్చి చాటున దాఁగియుండి తన్ను హాస్యము చేయుచున్నారని యాతఁడు భావించుకొనియెను కాని, యీడు వచ్చిన రాచకన్నియ లాకస్మికముగ నిప్పు డిక్కడ కెందులకు వత్తురు? అను సందేహమాతనికిఁ గలుగ

లేదు. ఆత డు తమకముతో "కమలా! శ్యామలా!" యని పిలుచుచు గది దాఁటి ముందరి హాలులోనికి వచ్చెను ఆ హాలులోఁ గనక పంజరమునందలి చిలుక "కమలా! శ్యామలా!" అని యఱచుచు మాధవునిఁ జూచి యటు నిటు తిరుగఁనారంభించెను మాధవుఁ డా చిలుకం జూచి నివ్వెఱపాటున నట్టె నిలువ బడిపోయెను ఇంతవనుక "కమల యేది! శ్యామల యేది?"అని వలుకుచున్న దీ చిలుకయేనా? కమలా శ్యామల లిక్కడకు రానేలేదా? మాధవునితోఁబాటు చిలుక కును మతి పోయినదా? కమలా శ్యామలలు తన కేమైన మాటలు చెప్పిరా? తనతోఁ గలసి మెలసి యుఁడి మంచిఫలాహారముల నేమైనం బెట్టిరా? - లేదు - అట్లయిన వారి నెందులకు స్మరించుకొన వలయును? మాధవుఁ డీ రాచిలుక నెంతో గారాభముతో బెంచు కొనుచుండెను. ఉబుసు పోవని కాలమున నా చిలుక యొద్దకు వచ్చి "కమలా! శ్యామలా! కమల యేది? శ్యామల యేది?" అను నిట్టి ప్రియోక్తుల నె దానికి నేరుపు చుండెను తిర్యగ్జంతువు. దానికేమి తెలియును? చెప్పినది చెప్పుటయే దానికి స్వభావము మాధవుని యొద్దఁ గష్టపడి నేర్చికొనిన యాకపురంపుఁబలుకుల నుబుసుపోకకై యీ చిలుక వల్లించుచుండ నేఁడు ఆ మాట నాలకించి యన్యమన స్కుఁడై యున్న మాధవుఁడు దిగ్భ్రాంతి నొంది యీవలకుఁ బరు వెత్తుకొని వచ్చెను. ప్రేమోన్మత్తులకు సర్వమును దన్మయముగనే దోఁచుచుండును గదా!

మాధవుఁ డట్టె నిలువఁబడి తన యవ్యక్తకార్యక్రమమునకు లజ్జించి రెండడుగులు వెనుకకు వైచి, యక్కడ నెవ్వరును లేక పోవుటచే మరల ముందునకు వచ్చి పంజరకీరముతో "ఏమిపని చేసితివి" అనియెను, తడవికొనకుండ మరల నాకీరము "ఏమి పని చేసితివి?" అనియెను. చిలుక యుద్దేశ మెట్లున్నను, చిలుక చేసిన పని యెట్లున్నను, తన యుద్దేశము విభ్రాంతిమూలక మనియు, తన చెయిదము హాస్యాస్పద మనియు నాతఁడు గ్రహించెను. గ్రహించిన యాతఁడాకీరమున కెట్టి ఫలాహారమును బహుమానముగ నీయకుండ వెనుదిరిగిపోయెను. తిర్యగ్జంతువు మొగము జూచుట కంత సందేహ

మెందులకు? ఇప్పుడిచ్చుట మృదు లస్వభావయగు కమలయే యున్నచోఁ
రమునకు మంచి ఫలాహారమునే పెట్టియుండును - హాస్యమయి
యగు శ్యామలయే యుండుట తటస్థించినయెడల. గీరరాజమున
కెన్నియో ముద్దులు బహుమానముగ నొరికియుండునని మేము
ఘంటాపథముగఁ జెప్పఁగలము. కాని, కీరమున కాయదృష్టము
పట్టినది కాదు

మాధవుఁడు మరలఁ దన శయ్యాగృహంబునకుం బోయి యా
చెంత బల్లపై నున్న తాళపత్ర గ్రంథము నొకదానిని దీసికొనియెను.
అది తిక్కన సోమయాజి రచించిన యాంధ్రమహాభారతమునందలి
విరాటపర్వ సంపుటము. ఆ సంపుటమును విప్పి యాత డుత్తరా
వివాహ ఘట్టమును జదువఁ బ్రారంభించెను ఇంతలోఁ గ్రిందినుండి
యొక సేవకుఁడు వచ్చి "ప్రభూ! వన తవాడదుర్గమునుండి యొక
యుత్తరము వచ్చినది." అని చెప్పి యా యుత్తరము మాధవున
కిచ్చెను. మాధవుఁడు తత్తరముతో నా యుత్తరము నందుకొని
యిటునటు త్రిప్పి చూచెను అది తన మేనమామయగు నీలాద్రి
రాజు స్వహస్త లిఖితముగా నగపడియెను అతఁ డా యుత్తరమును
విప్పి యీవిధముగ జదువుకొనియెను.

కుమారా!

నీవు దుర్గేశ్వరుఁడవై నపిమ్మట నిక్కడకు వచ్చుటకే యవ
కాశము గలిగినది గాదు. చిన్నప్పటినుండియు నిన్ను మిగుల గారా
బముతోఁ బెంచుకొంటిమి ఇతకాల మెపుడును విడిచియుండలేదు
పెద్దవాఁడవైతివి అయినను నీవు మాకు గోపాలసదృశుఁడవే.
రేపటి శ్రావణపూర్ణిమ చి॥ సౌ॥ యగు శ్యామల పుట్టిన దినము,
ఆనాఁడు మహోత్సవములు జరుగును గావున నీ వీలోపలనె బయలు
దేఱి రావలయును. నీవు దుర్గేశ్వరుఁడవైతివి. మా కన్నుల కఱవు
దీర ముద్దుముచ్చటలతోఁ గానిపింతువుగాక!

గ్రహింపవలయును.

నీలాద్రిరాజు"

మాధవుఁ డా యుత్తరమును జదువుకొని యత్యానందభరితుఁ
డయ్యెను. పఁడాది క్రిందటఁ జూచిన ముఖచంద్రను శిశిరమణిని,

సమస్త బంధువులను సంపూర్ణానందముతోఁ జూడనగును గదా యని యాతఁడూహించుకొనియెను. కాని మేనమామ విషయమున వానిని హృదయమున శోకమావరిగా నుండెను. అతఁడీవిధముగ నాలోచించుకొనియెను,

"నాకు దుర్గము వచ్చినప్పు డుత్తరము వ్రాసితిని. అందులకుఁ బ్రత్యుత్తర మీయఁడయ్యెను, నేఁడీ యకారణవాత్సల్య మెందులకుఁ గలిగినదో—ఎందులకననేల? శ్యామల జన్మదినోత్సవము గదా! నేను వచ్చుట యామె కానందమే కదా? ఆమె యానందమే తనయానందము. కావున నీ శుభలేఖను వ్రాసియుండును—ఇతర కారణము లేవియును విస్పష్టముగఁ దోఁచుటలేదు - ఎట్లయిన నేమి? సమస్త బంధువులను గన్నారఁ జూచి మరల వచ్చెదఁగాక!"

అని యీ విధముగా నాలోచించుకొని వసంతవాడదుర్గమునకుఁ బరివారయుతుఁడై బయలుదేఱుటకుఁ దగిన సన్నాహములు చేయుచుండెను.

# 13. శ్యామల జన్మదినోత్సవము

నేఁడు శ్రావణ శుద్ధపూర్ణిమ ఈ సము శ్యామల పుట్టిన దినము. రాజమందిర మతిరమణీయముగ నలంకరింపఁబడియెను. మనోహరాలంకృతంబు లగు భద్రగజంబులు, నుత్తమాశ్వములును రాజమందిర ద్వారమున కిరువంకల నుచిత స్థలంబుల నిలువఁబడియుండెను సింహద్వారమునకిరువంకలను నడగొండలవలె నున్న రెండేనుఁగులపై భేరీ కాహళాదుల నుంచి సవ్వతాళంబుల వివిధ గతుల నతినిపుణముగ నతి మనోహరముగ ప్రయోగించుచుండిరి. ఆ వెనుక నున్న భద్రగజద్వయముపై వాశికులు గూరుచుండి సప్త స్వరముల నమృతరసము లొలుక వివిధ రాగోపరాగాలాపనముల వలన శ్రోతల హృదయములు గరఁగునట్లు మంగళగీతముల గానము చేయుచుండిరి. ఆ వెనుక నిరువంకల నుత్తమాశ్వములపైఁ బెద్ద చిన్నతరముల వరుసను గొందఱు సజ్జితశరశరాసనధారులై చిన యోధాశ్వాహములు మొగములఁ దాఁడవింప రాజద్వారాభిముఖులై

కూరుచుండి రాజసంపత్తిని వెల్లడించుచుండిరి. ఆ యిరువరుసపుల నడుమనుండియు వేలకొలఁది బ్రాహ్మణ పుంగవులు భూలోక దేవతలవలె నుచితవేషాలంకృతులై యా మంగళగీతములతో మేళవించునట్లుచైస్వనంబుల శ్రుతుల నుచ్చరించుచు రాజసందర్శనార్థమై పోవుచు వచ్చుచుండిరి, సింహద్వారము నొద్ద నిరువురు ద్వారపాలకులు కృపాణపాణులై సందడి గలుగకుండ వారల రాకపోకలకు సౌలభ్యముం గూర్చుచుండిరి.

సింహద్వారము గడచి, యుక్యోగిజనోపవిష్ట ప్రదేశమును దాఁటి కొలువుకూటము నవతరించి, నాలవద్వారము నధిగమించినచో నంతఃపురము చేరువఁ దూర్పువై పున నొక విశాలపూజామందిరము గలదు. అందు నీలాద్రిరాజు మడుఁగుదోవతులం దాల్చి యుచితాసనమునం గూరుచుండి తన తనయ యభ్యుదయమునకై బ్రాహ్మణాశీర్వాదములను, మంగళాక్షతలను, బరిగ్రహించుచు నా భూసురులకతితరంబుగఁ బారితోషికంబుల నొసంగి పంపివైచుచుండెను. అంతఃపురమునఁ బుణ్యసతీమతల్లులచే గానము చేయఁబడు శోభన గీతముల నానందముతో నాలకించి తన్మయత్వమునఁ దామును వాని ననువదించుచు విలాసవతులగు కొందఱు పరిచారిక లా పూజాభవనమునకు వచ్చి తమ ప్రభువునొద్ద నున్న మంగళాక్షతముల నెప్పటి కప్పుడు శ్యామల కొఱకుఁ బసిఁడి పళ్లెరములతోఁ గొనిపోవుచుండిరి, సింహద్వారముకడ భేరీమృదంగ తూర్యగంభీరధ్వనులును, పూజా గృహంబుననుదాత్తానుదాత్తస్వరితప్రచయస్వరంబుల నుద్దీపించు పవిత్ర వేదఘోషంబును, నంతఃపురంబునఁ బురంధ్రీమణుల శోభనగీత మనోజ్ఞనిస్వనంబులును, బరస్పర మేకీభవించుటచే నీశబ్దత్రయ సమ్మేళనము శ్రుతిమనోహరమై వర్ణత్రయ విశిష్టం బగునోంకారముఁ బోలి బ్రహ్మాండము నిండి జోరుకొలుపుచుండెను.

ఇఁక నంతఃపురము మనోహర పురంధ్రీమయమై యప్సరస్సంజనన సమయంబునందలి పాలసంద్రంబు వడువున విలసిల్లి కన్నులపండువై యుండెను. కొందరు ముత్తైదువ లావిశాల భవనమునఁ బఱుపఁబడియున్న మెత్తని రత్న కంబళముపై నాసీనలై తముల

ములను సేవించుచుండిరి. కొందఱు కలకంఠులు మృదుల స్వనంబులు సెలఁగ మంగళగీతములఁ బాడుచుండిరి కొందఱు పేరటాండ్రు చందనము పూయించుకొనుచుండిరి. కొందఱు ముద్దియలు పరిమళ ద్రవ్యములకుఁ బయ్యెద చెఱంగుల నొసంగుచుండిరి. కొందఱు బాలికలు పుక్కిట నున్న తమ్ములమున నించుక యెత్తయిన నునుఁ జెక్కులు తళతళ మెఱయుచుండ వెలిఁగించిన యగరువత్తుల గిర గిరం ద్రిప్పుచు విలాసముతో నడుమ నడుమఁ బాటల బాడుచుండిరి, వరుసలుగల తరుణీమణులు కొందఱొండొరులఁ బరిహసించికొనుచు సముత్సాహవివశలై చందనములఁ జిలుకరించుకొనుచుఁ గైసేత లెడల నొండొరులం బట్టికొని పన్నీరుచల్లుకొనుచు, సోగకంటి చూపులను, జిగురుమోవివిఱుపులను, దమతమ హృదయభావములు ప్రకటితములగుచుండ ముదురునవ్వు వెన్నెలలతో హాస్యరసమును గ్రుమ్మరించుచుండిరి. ఇందఱు సుందరీమణు లింతటి యుత్సాహమున నిట్లు విలసిల్లుచున్నప్పు డాప్రదేశము - ఆ సందర్శనము - ఇంత రమణీయముగా నుండు నని మితివెట్టి యెవ్వరు చెప్పఁగలరు? "సుందరీమణుల విలాసచేష్టితములం దెయ్యది మనోజ్ఞముగా నుండదు?" అని యూహించి వ్రాసిన కవిశేఖరుఁడు నిజముగాఁ జూచి గ్రహించి నిశ్చయించుకొనఁదగినసమయ మదియే.

పరిచారికలం దెవ్వరికి నూపిరి విడుచుటకైనఁ దెఱపి లేదు. కొందఱు పేరటాండ్రకుఁ జందనతాంబూలముల నొసంగుచుండిరి. కొందఱు ముత్తైదువల పాదములకుఁ బసుపును, బారాణియుఁ బూయుచుండిరి. కొందఱు పురంధ్రీమణుల కంఠంబులకుఁ గప్పురపుదండలను వైచుచుండిరి. కొందఱు పూలదండలను గ్రుచ్చుచుండిరి. కొందఱు పుష్పతైలములచేఁ బుణ్యసతులచేలాంచలములఁ బ్రవాసితములుగఁ జేయుచుండిరి. కొందఱు పాకశాలకు సామగ్రులఁ దీసికొనిపోవుచుండిరి. కొందఱు పాకక్రియల నిర్వర్తించుచుండిరి. కొంద ఱటునిటు తిరుగుచు, వినోదములం గాంచుచుఁ, బనిచేయువారలను హెచ్చరించుచుఁ, బెత్తనము చేయుచుండిరి. కొందఱు శ్యామల నలంకరించుచుండిరి. కొందఱు కమల నలంకరించుచుండిరి.

శ్యామల జన్మదినోత్సవసమయమునఁ గమలను గూడ నలంక రించుట యెందుల కని ప్రశ్నింతురా? కమల రాజపుత్రిక, దుర్గేశ్వరి. రాజ్ఞి యగునామెను దినదినమున కొకరీతి నలంకరించుట కెందఱో పరిచారిక లుందురు. అట్టిపరిచారికలచే నలంకరింపఁబడుట సంపత్సూచకమగు చిహ్నము. ఇంతియకాక శ్యామల జన్మదినోత్సవమునందలి యానంద మంతయుఁ గమలదియే కమల యానందమే శ్యామల యానందము. వారిరువురకును శరీరములు వేఱైనను హృదయ మొక్కటియే. వారిరువురు నన్నదమ్ముల బిడ్డలైనను గవల బిడ్డల కంటె నెక్కుడు సౌదర్యమున నలరారుచుందురు. వారొక తల్లి బిడ్డలవలె ననురాగవతులై, యొక గుత్తియందలి మొగ్గలవలె, నొక మొగమునందలి కన్నులవలె నెప్పుడు నెడఁబాయక కలసి యుందురు వారి హృదయభావములుకూడ నొక నదియందలి తరంగములవలె వత్యస్తములయ్యు నేకవస్తుజన్యములైనట్లు సామాన్యము లగుచుండును. వారి పరస్పరప్రేమాము ప్రకృతి దుర్లభమైనది. అంతటి విశుద్ధప్రేమామృత తరంగితంబులగు హృదయముల యేకీభావము పురాతనసుకృత పరిపాకమునం గాని లభియింపదు.

చతురమతు లగు పరిచారిక లతినిపుణముగ వివిధవస్త్ర భూషణానులేపనముల మార్చి మార్చి వారల నలంకరించిరి. ఆ యలంకార విరచనము నందుఁ బరిచారికలకు శ్యామలజనని యగు చారుమతి తోడుపడి యుండెను, కైసేత లైనవెనుక, శ్యామల ముందుగాఁ దల్లికి నమస్కరించెను. ఆమె పరమానందముతోఁ దనయ నెత్తి కౌఁగిలించుకొని "అమ్మా! నీవు ప్రేమమునకుఁ బ్రేమమై, యానంద మున కానందమై, సుఖమునకు సుఖమై, వర్ధిల్లెదవుగాక!" యని దీవించెను. పిమ్మటఁ ముసలి ముత్తైదువలు శోభనగీతములఁ బాడుచు శ్యామల చేయినిబట్టికొని కమలతోఁ గూడఁ బుణ్యావతీకలితంబగు నా విశాలాంతః పురమందిరమునకుఁ దోడితెచ్చుచుండిరి. శిశిరమణి వసిఁడి పసుపుఁ బళ్ళెరమును జేతఁ బట్టుకొని వారి వెనుకనే వచ్చుచుండెను. ఆ వెనుకఁ బరిచారికా పరివృతయై పుత్రికా జన్మదినోత్సవ సమయానందము కనుఁగొనలను, నునుఁజెక్కులను, జిగివాతెరను

దొలకరించుచుండఁ జారుమతి యత్యుత్సాహముతో బయలుదేఱెను. అంతఃపురమున నున్న పుణ్యసతులు వారల నెదురుకొని లోనికిఁ దోడ తెచ్చిరి.

శ్యామల కమలాద్వితీయయైవచ్చి వినయ విశ్వాసములతో నా పుణ్యాంగనల పాదములకు శిరమణి కొనితెచ్చిన పసిఁడి పళ్లెరము నందలి పసుపును దీసి యించించుక రాచి యొక్కొక్కరికి నమస్కరించు చుండెను. కమల పరిచారికానీతంబు లగుపుష్ప ఫలంబులను గాంచన నిష్కసంకలితంబులగు తాంబూలములతోఁ గూడ వారలకొసంగు చుండెను పుణ్యాంగనలు వాని నందుకొని శ్యామల యుత్తమాంగమున మంగళాక్షతములు వైచుచు దీవించుచుండిరి, ఎవ్వరి యావ వయోవిలాస భావములకుఁ దగినట్లు వారు శీఘ్రముగఁ బెండ్లి కొమరితవు కమ్మని కొందఱును, చెలువునిఁ జెంగున ముడివైచికొమ్మని కొందఱును, కాంతునిఁ గటాక్షగింకరునిగాఁ జేసికొను మని కొంద ఱును, చందమామ తోడి వెన్నెలవలె నెప్పుడును పతితోడి నీడవై మెలంగుమని కొందరును. గమల పాణియగు నిందిరాదేవి వలెఁ బురుషోత్తమునింబతిగాఁ బడసి యాతని హృదయమున నెప్పుడు నెడఁబాయకుండు మని కొందఱును, గౌరీదేవివలె మగనియర్ధాంగ లక్ష్మివై యుండుమని కొందఱును, వేయేల-ఎవ్వరికిఁ దోఁచిన రీతిని వారు దీవించుచుండిరి. ఆ మహోత్సవ సమయమునం దాసం దడిలో నా విలాసవతులం దెవ్వరెవ్వ రెట్లెట్లు వర్తించిరో ప్రత్యేక ముగఁ జూచి గ్రహించుటయే కష్టముగా నున్నప్పుడింకను వ్రాసి తెలుపవలయునని పాఠకులు మమ్ము నిర్బంధింపకుండెదరుగాక!

ఆ సమయమునఁ బుణ్యాంగనాజన బహూకరణంబును, తదాశీ ర్వాద పరిగ్రహణంబును, నీ రీతిగాఁ గొంతసేపు జరగెను. పిమ్మట శ్యామల కమలతోఁ గూడ నటనుండి కదలి పూజాగృహమునకుం బోయి జనకునకు నమస్కరించెను. కమలయు నమస్కరించెను. అప్పుడు నీలాద్రి రాజిరుపురు కొమరితల నిరుచేతుల నెత్తి దీవించెను కాని యవి యస్పష్టముగ నుండుటచే నా యాశీర్వచనములను యథారీతిగ వ్రాయలేకపోయితిమి. అతఁడు తనయల యెడలం గల

ప్రేమమునకుఁ దగినట్లు, తన యుత్సాహమునకు నపేక్షమునకుఁ దగినట్లుగనే వారల దీవించి యుండును. ఆ సంగతి తెలియక పోయినంత మాత్రమున మన కథా సందర్భమునకు లోపము గలుగదు. ఇంతియ కాక యాశీర్వచనము లానంద దాయకములే కాని యపేక్షిత ఫల దాయకములు కావుగదా!

అనంతరము తండ్రితోఁ గూడ నాయక్క చెల్లెం డ్రిరువురును నంతఃపురమునకుఁ బోయిరి. గోపాలుఁడీ యుత్సవ సందర్భమున బ్రాహ్మణ సమారాధనము మొదలగు నావశ్యక కార్యములయందు నియుక్తుఁడై యుండుటవలన నా సందడిలో వాతనికిఁ దెలుపియే లేక యుండెను.

# 14. శిశిరమణి

అంతర్భవనమునకుఁ బశ్చిమమున వాలోక రమణీయంబగు ప్రత్యేక మందిర మొకటి కలదు. అది రెండంతస్తుల సౌధము. అంతఃపుర దక్షిణ ద్వారమునుండి యుద్యానవన మార్గమున నా భవనమునఁ బ్రవేశించుట కొకత్రోవ యున్నది రాజాస్థానమునకుం బోలె దానికిని నుత్తరమున సింహద్వారము కూడ నున్నది. పూర్వము కమల తండ్రి రాజుగానున్నప్పుడా సౌధము నాతఁడు తన తమ్ముఁడగు నీలాద్రిరాజునకుఁ గట్టించి యొసంగెను. పిమ్మట నీలాద్రి రాజు రాజ ప్రతినిధియై రాజ భవనముననే నివసించి యుండుటవలన నిప్పుడది రాజునకు సమీప బంధువు లగువారికి విడిదిగా నొసంగుటకు మాత్రమే వినియోగింపఁ బడుచుండెను శ్యామలా జన్మదినోత్సవమునకు విచ్చేసిన మాధవునకది యిప్పుడు విడిదిగా నీయఁబడియెను. మాధవుఁడందుఁ దనపరివారముతోఁగూడ విడిసి యుండెను. అతఁడు చిన్నతనమునుండి యిచ్చటనే పెరిఁగి పెద్దవాఁడై యున్నను దుర్గేశ్వరుఁడైన తరువాత మరల నిచ్చటికి వచ్చుట కిదియే ప్రథమము.

మాధవుఁ డిప్పుడా భవనదక్షిణద్వారముకడ నుచిత పీఠమునం దొంటిగాఁ గూరుచుండి యుపవనమువంక నాలోకించుచు, నాలోచించు కొనుచుండెను నిదానముగ నప్పుడుత్తరపుగాలి వీసరుచుండు

టచేఁ బ్రగాఢంబగు నా మేఘమాలిక యించుక చెదరియుం జెదరక విలువంపుగ నెగసి పూర్వ పశ్చిమ దిక్తటంబుల నలముకొనుండెను. ఆ సుస్నిగ్ధపయోదమాలిక శ్యామల ప్రభావిరాజితమై యుండెను ఆ యుప వనతరులతాదులును, మనోజ్ఞశ్యామల పత్రి సంతతులచే నలరారు చుండెను. ఉపవన ధరణీతలము గూడ నవదూర్వాంకుర సమాచ్ఛా దితమై,శ్యామలచ్ఛాయామయమై యుండెను ఆ శ్యామలజలదమాలికం గాంచి యానందముతోఁ గ్రీడామయూరము పురివిప్పి శ్యామ మందరంబగు తన కంఠము నెత్తి కేకారవచ్ఛలంబున శ్యామల తేజ మును గీర్తించు చుండెను. ఆహా. శ్యామల తేజస్సందర్శన మెంత యానందమయమైనది! ఎంత ప్రేమ మయమైనది! ఇందీవరదళ శ్యామలంబగు శ్రీరామచంద్రుని దివ్య మంగళ విగ్రహముంగాంచి దివ్యమూర్తులగు దేవత లెల్లరును ప్రేమరస నిమగ్న హృదయులై మోహపరవశులై పోయిరి. నందగోపాలుని నవజలధర శ్యామల కోమలాకారముం గాంచి తన్మయత్వమున రాధాదేవి, జగమంతయు నా మోహన రూపమయంబగనే భావించినది గోపసుందరు లెల్ల రును దమమేనులతో సర్వమును మరచి యామోహనమూర్తినే యాశ్రయించిరి. గోవత్సములు కూడ నా మోహనాకారమునకు వశీకృతములై పోయినవి సర్వశక్తి స్వరూపిణియు, సర్వారాధ్యయు నగు జగన్మాత సుస్నిగ్ధ శ్యామల ప్రభామూర్తియే సర్వజగంబులును దేనియం దిమిడి యున్నవో తేజోమూర్తు లన్నియు నెందుఁ బ్రకా శించుచున్నవో, యాయంత రాళముగూడ శ్యామల తేజోవిరాజితమే మనోమోహనకరంబును, ప్రేమరసపరిప్లుతంబును నగు నా శ్యామల తేజమునం దెంతశక్తి యున్నదో కదా? ఏ దివ్యభావము అనురా గము, ప్రేమ, భక్తి యనునామములచే రూపభేదములంగాంచి విల సిల్లు చుండునో యాదివ్యభావము గూడ మనోహర శ్యామల ప్రభా విరాజితమే యైయుండునా?

మాధవుఁడా శ్యామలతేజముం గాంచఁగలుగుచున్నాఁడా! అతఁడు తన దృష్టులను హృదయములోనికి మరల్చి చూడఁగలిగిన యెడల నప్పుడుతనహృదయముగూడ శ్యామలతేజోమయమై యుండె

ననియు, నందుఁ గమలకేళీమూర్తి దివ్యప్రభలచే ప్రకాశించు చుండెననియు, ఆ ప్రభలలోఁగూడ శ్యామల కిరణములు మెఱయు చుండెననియు, ఆ శ్యామలతేజము నుజ్జీవింపఁ జేయుట కాజ్యోతి ర్మూర్తియే యాధారమై యుండెననియు, అజ్యోతిర్మూర్తి యటనుండియంతర్హితయైనచో నా హృదయాంతరాళము నిస్తేజమై, యంధకార బంధురమై పోవుననియు నాతఁడు గ్రహింపగలిగి యుండును.

కమలా శ్యామలల నెట్లైన నన్యాపదేశముగఁ బరిహసింప వలయునని మాధవుని యుద్దేశము. అందులకే యాతఁ డొకపద్య మును రచియింప నాలోచించుచుండెను మాధవుఁడు శూరశిఖామణి యనియు, సరసకవి శేఖరుఁడనియుఁ గూడఁ బేరు మోచియుండెను. ఆతనితోఁ జూడఁ జదువుకొనుటవలన, నాతని యుపదేశమువలనఁ గమలయు, శ్యామలయుఁగూడఁ గవితా సరస్వతులైరి. ఇత రెందు లకు?వారల సాహచర్యమున శశిరమణి కూడఁ గవయిత్రి యయ్యెను. మాధవుని పై వారలకును, వారలపై మాధవునకును గల ప్రేమ మింతయని చెప్పఁజాలము.

మాధవుఁ డప్పుడొక కేతకీదళంబున నొకపద్యమును వ్రాసెను. తనలోఁ దానే నాలుగైదుసారులు, పదిసారులు, లెక్కలేనన్ని సారులు చదువుకొనియెను.ఆపద్యమునందు మాటిమాటికి ననేకభావ ములు పొడకట్టుచుండెను. అది వారలయొద్దఁ జదివినచోఁ గమల చిన్నపుచ్చుకొనునేమో యని యాతనికి సంశయము తోఁచెను. చిన్న వోయిన కమల మొగము నాతఁడు తన కన్నులతోఁ జూడఁజాలఁడు. ఆతఁడెప్పుడును శ్యామలను బరిహసింప వలయుననియే యభిలాష పడుచుండును. ఎప్పుడును శ్యామలయే యాతనిఁ బరిహసించుచుం డెను కాని కమల యాతనితో విశేషించి మాటాడుటకే సిగ్గుపడుచుం డును. శ్యామల మాధవు నెంతగాఁ బ్రేమించుచుండెనో కమల నం తగాఁ బ్రేమించుచుండెను కమల మాధవు నెంతగాఁ బ్రేమించుచుం డెనో మాధవుఁడు కమల నంతగాఁ బ్రేమించుచుండెను. దీనినిబట్టి వారిప్రణయముల వేర్వేఱు నిర్ణయి చుటకు సూత్రములఁ గల్పింప వచ్చునా? మాధవుఁడేమేమియో యోచించు కొనుచుండెను.

ఆ సమయమున శిశిరమణి మంగళా క్షతములను బసిండిపళ్ళె రము నందుంచి పట్టుకొని వనదేవతవలె నా యుపవన మార్గమున వచ్చి మాధవు నెదుట నిలువంబడియెను. మాధవుండు పరధ్యానముచే నా మెరాక నెఱుంగక జాలకపోయెను.

అతనిం గాంచి శిశిరమణి నవ్వుచు "బావా! పరాకుగ నుంటి వేమి?" అనియెను

మాధవుం డులికిపడి శిశిరం గాంచి 'శిశిరా! నీ విప్పుడెందులకు వచ్చుచుంటివని యాలోచించు చుంటిని,' అనియెను.

శిశి—నీదర్శనమున కే

మాధ—పని యేమి?

శిశి—నీ చిన్ని మఱందలు నీ యాశీర్వాదమును బడయ వచ్చుచున్న దని నీతోం దెలుపవలయు నని నన్నుం బంపినది.

మాధ—నీ వాక్యమునకుం గర్త లేదు, నిన్నుం బంపిన వారె వ్వరైన నున్నారా? నీవే వచ్చితివా?

శిశి—ఉన్నారు.

మాధ—వా రెవ్వరు?

శిశి—మా యక్కలు.

మాధ—ఆశీర్వాదమును బడయువా రెవ్వరు?

శిశి—నీ చిన్నమఱంద లగు శ్యామల.

మాధ—నిన్నుం బంపినవా రెవ్వరు?

శిశి—నీ పెద్ద మఱందలు - దుర్గేశ్వరి!

మాధ—అలాగా? ఈ మాట మొదటనే చెప్పంగూడదా? సరే కాని యాశీర్వాదముం బడయం గోరిన శ్యామల యూరకుండంగాం గమల కెందుల కీమనవి?

శిశి—శ్యామల యూరకున్నదని నీ కెట్లు తెలిసినది?

మాధ—శ్యామలకూడ నిన్నుం బంపినదా?

శిశి—లేదు ఆమె తన యక్కచేం జెప్పించినది.

మాధ—శిశిరా! ఇంత యెందులకు? నేను వారి నెఱుంగనా? వారు నన్నెఱుంగరా? నన్ను సందర్శింపం గోరువారలకు నడుమ నీ రాయబార మెందులకు?

శశి—నీ రాయబార మెందులకనియా? ఈ రాయబార మెందులకనియా? ఎట్లయిన నేమి? నీవిప్పుడు మునుపటి బావవు కావు గదా!

మాధ—మునుపటి బావనే కాని యిప్పటి మఱదండ్రు చూడఁ గూడదా?

శశి—నీతో నేను మాటలాడఁగలనా? వీవిప్పుడు దుర్గేశ్వరుఁడవుకూడనై యుంటివి. నీకు వారే సమాధానము చెప్పెదరు అడుగు కదలకుండ నిచ్చటనే యుండుము

అని చెప్పి శశిరమణి పరిశరము నట నుంచి వెడలిపోయెను.

# 15. సమావేశము

మాధవుఁడు ద్వారమునొద్ద నిలువఁబడి తన మఱఁదండ్ర రాకకై యాయుద్యానవన మార్గమువంకఁ బ్రతీక్షించుచుండెను. ఆతఁడు తన ప్రేమమునకుఁ బ్రేమములై, ప్రాణములకుఁ బ్రాణములై యున్న మఱఁదండ్రను జూచి చాలదినములైనది. ఱెప్పవాల్చినఁ గాలము జరగిపోవునేమో యని చాల వేడుకతో నిశ్చల నయనుఁడై యావంకనే చూచుచుండెను.

శశిరమణి వచ్చునప్పటికి శ్యామలయుఁ, గమలయు మరలఁ గ్రొత్తగ నలంకరించుకొని పరమానందముతో బావకు నమస్కరింప వలయునని యుత్కంఠపడుచుండిరి. శశిర వచ్చినతోడనే వారు ముప్వురును బయలుదేఱిరి. కమలయు, శ్యామలయు నొండొరుల భుజంబులపై బాహులతల నుంచుకొని మందమందగమనములతోఁ గదలి వచ్చుచుండిరి. ఆవెనుక శశిరమణియును వచ్చుచుండెను. కమలా శ్యామలల హృదయము లెంత త్వరపడుచున్నను చాల దినములై చూచిన బావను, దుర్గేశ్వరుఁడై వచ్చిన బావను దర్శించుటకు స్త్రీజనసామాన్యంబగు సిగ్గు దోఁచుటచే వారి గమనములు మాత్రము మందగించు చుండెను. ద్వారమునొద్ద నిలువబడియున్న మాధవుఁడు దూరమునుండి వచ్చుచున్న వారి నానందవికసిత నయనములతోఁ జూచుచుండెను.

కమలా శ్యామలలు గంగాయమునలవలె సౌందర్యరుల తనూలత లొరసికొనుచుండ, లావణ్యరసతరంగములు పొంగి పొరలుచుండ, మణిభూషణములు మెరయుచుండ నల్ల నల్లన నడతెంచుచుండిరి. వారి వెనుక నంతర్వాహిని యగు సరస్వతీ తరంగిణివలె నగవడియు నగపడకుండ శిశిరమణియును వచ్చుచుండెను. కమల శరచ్చంద్ర చంద్రికామనోహర గౌరాంగి, శ్యామల సుస్నిగ్ధకోమల శ్యామలాంగి. ఇరువురును జక్కనివారే.

వారిరువురును యౌవనవతులే కాని యాకారమున మాత్ర మిరువురును సమాన లని చెప్పుటకు మాత్రము వలనుపడదు. భాషా ప్రపంచమునం దిదివఱకు మహాకవులు వర్ణించిన రూపవర్ణనములం బట్టి పోయినచో నెంత వెదకినను వారి రూప భేదములం గూర్చి యథావిధిగ వ్రాసి తెలియఁజేయుటకుఁ దగినత్రోవ దొరకుట లేదు. మొగము చందమామవలె నున్న దనిన నది యిరువురకును సమానమే కన్నులు కలువరేకులవలె నున్న వనిన నవి యిరువురకును వర్తించును. నాసిక సంపెఁగవలె నున్న దనిన యిరువురకును నట్లే యున్నది. అధరము ప్రవాళమణివలె నున్న దనిన నది యిరువురకును జెల్లును. చెవులు శ్రీకారములవలె నున్న వనిన నవి యిరువురకును సరిపోవును భ్రూలతలు సింగిణులవలె నున్న వనిన నా వర్ణన మిరువురకును నొక్కటియే అలాట మర్ధచంద్రాకృతిగా నున్న దనినను, చెక్కు లద్దములవలె నున్న వనినను నిట్టి వర్ణనము లన్నియు నిరువురకును సామాన్యములే యగుచున్నవి. ఇఁకఁ బోలికను నిర్ణయించుటకుఁ దగిన మొగమును వర్ణించి చెప్పుట కనువైన మార్గ మేమున్నది?

కొందఱు ఉపమానములను వదలి మొగమునందలి నిమ్నోన్నత స్థలంబులం బట్టియు, సమవిశాల స్థితులం బట్టియు, వర్ణనములను బట్టియు, మచ్చలను బట్టియు, ముఖవిలాసభంగులం బట్టియు, రూపమును వర్ణించుచుందురు ఆ మార్గము కూడఁ బాఠకుల హృదయములందు యథారూపమును జిత్రించుటకు సమర్థమైనది కాలేదు. కేవల భావ సంసూచకంబులగు నిట్టి వర్ణనములతో యథారూపములను బ్రదర్శించుట యెట్లు?

ఇందేదియో యొక మార్గమునుబట్టి యెట్లో యొక విధముగ వర్ణించి మావిధాయకకృత్యమును నిర్వహించుకొంద మనినచో నా వర్ణనములవలన మా పారకులయం దెవ్వరి కెట్టిభావములు పుట్టునో యని సందేహము కలుగుచున్నది లోకమోహనరూపవతులును, సకల జననయనానందస్వరూపిణులు నగు మా కథానాయికల నొక రీతి వర్ణించి మాయప్పు తీర్చికొనినచో మామాటలనుబట్టి భిన్నరుచి గలలోకమునం దెవ్వ రెట్లు భావించుకొందురో యనియు. నందు వలన సర్వసమదర్శనీయ లగు మా కథానాయికలయెడల మే మెంతటి యపచారము చేసినవార మగుదుమో యనియుఁగూడ శంకించుచున్నారము ఎట్లు వర్ణించినను నెంతవ్రాసినను యథా రూపములు ప్రదర్శింపఁబడకయె పోవుచున్నప్పుడు – ఎట్లయిన నా రూపములు హృదయములచే భావింపఁబడవలసియే యున్నప్పుడు – మఱి యీ వర్ణనములతోఁ బని యే మున్నది? కావున లోక మోహనమూర్తు లగు కమలాశ్యామలల సౌందర్యమునకు లోపము గలుగకుండునట్లు — పారకులకు భేదభావములు పుట్టకుండునట్లు – మే మొక విన్నపము చేసికొనుచున్నారము – ఏమనిన – లోకమునం దెవ్వరు దేనిని సౌందర్యముగాఁ బరిగణించుచుందురో యట్టిసౌంద ర్యము గల యువతీమణుల నిరువురను తమతమ హృదయములందు భావించుకొని వారి యాకారములం దించుక భేదమును గల్పించుకొని వారే కమలాశ్యామలలనియు, ఇరువురును నవనవోన్మేష యౌవన విలాసవిభాసిత లనియు- ఇరువురి కోమలాంగములను నవలావణ్యరస ప్రవాహిని సహస్రముఖములఁ బ్రవహించుచు దివ్యతేజస్తరఁగమాలి కలతోఁ బొంగి పొరలుచుండెననియు, యిరువురి వదన మండల ములను మనోజ్ఞమందహాసచంద్రికావిలసితము లనియు, ఇరువురి కటాక్షావలోకనములను బవిత్రత్రమామృతరసము వర్షించుచుండునని యు గ్రహింపఁగలిగినచో మేమీ వర్ణనానంత సాగరమునుండి యతి సులభముగఁ దీరమునకుఁ జేరఁగలుగుదుము.

కమలా శ్యామల లంత చక్కనివారు! వయసునుఁబట్టి శ్యామల కంటెఁ గమల యొకయేఁడు పెద్ద, ఇరువురును వసంత కుసుమముల

వలె, శ్రావణ తరంగిణులవలె, శరత్కమలములవలె విలసిల్లుచుండెను ప్రమదావనమునందలి పన్నీటి కాలువపొంత నున్న సహకార తరుచ్ఛాయాతలంబునఁ బల్లవులోదెలోఁ బరిమళ సేచనమునఁ దనివొంది మృదుల గతుల నభినవముగఁ గొనలు సాగుచున్న మాధవీ మల్లికా లతలు రెండును మహానందాయకములే ఆ రెంటికిని వసంతోదయ మైనది. ఆ రెండును మనోజ్ఞ తనులతా విలసితములే. రెండును నభిన వారుణ పల్లవ మృదులములే రెండును దరవికసిత కుసుమ మంజరి సంవాసితములే, రెండును మధుర మకరంద రసనిష్యందములే. రెండును సహకార తరుశాఖావలంబన యోగ్యములే వానివలపులు వనమెల్ల గుబులు కొనుచున్నవి. మలయపవనాహతుల కవి రెండును జలించిపోవుచున్నవి - మన కమలా శ్యామలల నా మాధవీ మల్లికలతోఁ బోల్చి భావించుకొనియెదరా? అట్లయినచో నా భావము సరిపడియేయుండును. ఎట్లు భావించుకొనినను సరియే. వారు జగదేక సుందరీమణులని మాత్రము గ్రహియించిన జాలును. అదియే మాకుఁ బదివేలు.

మాధవుఁడు నిశ్చలనయనుఁడై వారివంకనే చూచుచుండెను మాధవునిసమీపించుకొలఁది వారిగమనములుమందములగు చుండెను మూర్తీభవించిన మోహన శృంగార దేవతలవలె నున్న కమలాశ్యామలలను మాధవుని స్థిరదృష్టు లెదురుకొని గమన మిషంబున వారలచేఁ ద్రోపుడుపడుచుండియు వెనుదిరుగక యభిముఖముగనే యుండి వారలఁదోడి తెచ్చుచున్నవో యన్నట్లుండెను యవనతవదనలై వచ్చుచున్న కమలా శ్యామలల క్రేగంటి చూపులును మాధవుని చూపులును గలిసికొనినప్పుడు నిశ్శబ్దంబగు వానియన్యోన్య సంఘర్షణంబున నయ్యంతరాళంబునం దదృష్ట తటిల్లతలు మెఱసి పోవుచుండెను. ఒకప్పుడు మాధవుని చూపులు కేవల మానందముతో నీలాలకవరి శోభితంబగు కమల రమణీయ ఫాలభాగమున విహరించుచుండెను. ఆ సమయమున శ్యామల కటాక్షములా మాధవుని మనోహరాంగకములఁ గలువపూదండలచేఁ గట్టి వేయుచుండెను. మాధవుఁడు చలించుట లేదు. నిలిచినవాఁడు నిలిచినట్లేయుండెను అతఁడొక కంటిని గమల

వైపునకు మరల్చెను రెండవ కంటి దృష్టి కూడ నా వంకకే మరలెను. ఇంక వాతం డేమి చేయంగలండు? ఆ చూపు అటనుండి మరలుట లేదు శ్యామల యా కన్నులలోం బ్రతిఫలించుచునే యున్నది. కాని యున్మత్తములైన యా చూపుల కితర గ్రహణశక్తి లేకుండం బోయినది. మాధవుం డిప్పు డుత్కంఠుండై యున్నాండు. ఆతని చూపులు గూడ నత్కంఠితములై యీ ప్రపంచమునే మఱచి పోయెను. ఆ చూపులతో నాతని మనసును బోయినదికాంబోలును! మాధవుండు కూడ నేమియు నెఱుంగకుండంబోయెను

అప్పుడు శిశిరమణి ముందునకు వచ్చి కమలా శ్యామలలను మాధవునొద్దకుం దీసికొనివచ్చుచుండెను. ఆసమయమునకు సరిగందళుక్కునవొక మెఱపు మెఱసెను అందరికన్నులునుమిఱుమిట్లుగొనియెను పిమ్మటం బెళపెళ నుఱిమెను మాధవుని తన్మయత్వమునకు భంగమయ్యెను. తోడనే రివ్వు రివ్వు మనుగాలితోం గూడ వర్షసమాగమమును సూచించుచుం బెద్ద పెద్ద చినుకులు వడసాగెను. అప్పుడా నారీరత్నముల గమనములకు వేగము గలిగెను మాధవుండు కూడం ద్వరిత గమనముతో వారల నెదుర్కొని మందిరమునకుం దోడి తెచ్చెను. చాల దినములకు మరలం గలియుటచే వారందఱు నించుకసేపానందవిస్మృతింగాంచి యుండిరి. ఈ విధముగా రెండుమూడు నిమిషములు వారెఱుంగకుండ జరగిపోయినవి

అప్పటి కమలా మాధవుల హృదయభావము లిట్టివని వ్రాయంజాలము. మాధవుం డెవ్వరిని బలుకరించి, యేమి చేయవలయునో యెఱుంగజాలకుండెను. కమల హృదయ మెట్లయిన మాధవునితో మాటలాడవలయునని యుత్కంఠపడుచుండెను ఆమె మృదుహృదయమున నెన్నియో యుద్దేశములు క్షణక్షణము నుదయించుచుండెను. లజ్జాసఖి యామెను గాఢాలింగనము చేసికొని తనతో నైక్యము చేసికొనుటచేం గమల యేమియుం జేయంజాలక క్రేగంటిచూపులతో మాధవునివంకం జూచుచు నిలువంబడియెను.

ఆ సమయమున శ్యామల మాధవుని సమీపించి కుసుమమంజరీభరంబున వినమితంబగు మృదువల్లరివోలె నించుక వంగి మాధవునకు

నమస్కరించెను. మాధవుడు శశిరమణి తెచ్చిన పళ్ళెరమునందలి మంగళాక్షతలను శ్యామల యుత్తమాంగమున వైచి ప్రియపూర్వకముగఁ బెక్కు విధముల దీవించెను. ఆ సమయమున మాధవుఁడు వారలఁ బరిహాసింపవలయునని వ్రాసియున్న పద్యముగల కేతకీదళము శ్యామల పాదములపైఁ బడియెను. శ్యామల చూచి దానిందీసి యందక్షరము లుండుటచేఁ గన్నుల కద్దుకొనియెను. మాధవుఁడు తన కడకంటి చూపు త్రోవంబట్టి హృదయము కూడఁ గమలవంకకుఁ బోయి యుండుటచే నితరమును బరిగణింపఁజాలక పరాకుగ నుండెను.

అంతయుంజూచుచున్న శశిరమణి నవ్వుచుఁ దనయాశురచనా సామర్థ్యమును వెల్లడించుచు నీ క్రింది గీతమును జదివెను.

"కలువయును దామరయుఁగూడ గలసి మెలసి
విమలకమలాకరంబున వెలయుచుండె,
గలువపూవన్న నిష్టంబె కలదుగాని,
తమ్మి పూఁదేనెయే తుమ్మెదకుం బ్రియంబు"

ముగ్గురు వాలకించిరి ముగ్గురును దెల్లపోయిరని మేము చెప్పజాలముగాని మాధవుఁడు మాత్రము నిజముగాఁ దెల్లపోయెను.

# 16. మనవి

ప్రభుభక్తిపరాయణుండగు రాజశేఖరుం డెడతెగని ప్రయాణములం జేయుచు సుఖముగఁ గటకపురంముం జేరుకొనియెను. ఉత్కలేశ్వరునకు రాజశేఖరునియందెంతయో యాదరభావముగలదు. రాజశేఖరుఁడు తన రాక సుత్కలేశ్వరునకుఁ దెలిపించి యాతని యనుజ్ఞ యగువఱకును సుఖముగ నా పట్టణమున విశ్రాంతిని దీసికొనవలసి వచ్చెను. కాని యాతనికి సుఖ మెక్కడిది? కొండవంటి కార్యభారము తలపైనుండ నాతనికి విశ్రాంతియుండుట యెట్లు? తానూరలేని సమయమున నీలాద్రిరాజెట్టి తంత్రములఁ బన్నుచుండునో గదా యను సంశయమున నాతని చిత్త మాందోళనాయత్తమగుచుండెను. కమల యెట్లున్నదో? మాధవుఁ డేమి సేయుచున్నవాఁడో? గోపాలుఁ డెట్టి యిక్కట్టులను రానీయఁడను ధైర్య

మాతనికిఁ గలదు. కాని, యువరాజు కుతంత్రముల కాతఁడేమి ప్రతిక్రియ చేయఁగలఁడు? ఈ విధమగు నాలోచనములతో నాతనికి రేయుంబవలు జరగిపోవుచుండెను. ఎప్పుడు సార్వభౌముని దర్శన మగునో, ఎప్పు డాతనికి సమస్తమును నివేదింతునో, ఎప్పుడు తనకుఁ గార్యసిద్ధి యగునో, యను నాందోళనముతో నాతఁడు సమయము నకై తొందరపడుచుండెను. కాని, మహారాజులతోడి కార్యములంత సులభముగఁ దేలవనియు నాతఁడెఱుంగును. అవలి కుతంత్రములు జ్ఞప్తికి వచ్చినప్పుడెల్ల నాతని కోరిమి లేకుండఁ బోవుచుండెను.

ఇట్లుండఁగా నొకనాఁ డుత్కలేశ్వరుని యాజ్ఞ యయ్యెను. ప్రభువుల నే విధముగ దర్శింపవలయునో, వారితో నెట్లు సంభా షింప వలయునో మన రాజశేఖరునకు బాగుగఁ దెలియును. ఆ విద్య వలననే యాతఁడు చిరకాలము నుండి మహారాజాధిరాజుల కాదర పాత్రుఁడై యుండెను ఆతఁడు సమయోచితముగఁ బ్రభువును సంద ర్శించెను. ఉత్కలేశ్వరుఁ డాతని కత్యాదరభావముతో దర్శనమిచ్చి యాతనితో నేకాంతముగఁ బ్రియసంభాషణములఁ బ్రొద్దుపుచ్చు చుండెను రాజశేఖరుఁడు ప్రభువున కుల్లాసముగ సంభాషించుచుఁ దన వచ్చిన కార్యమును నివేదించుటకై యవకాశమును జూచుకొను చుండెను,

ప్రసంగవశమున నుత్కలేశ్వరుఁడు, "మన్నెదొరల దుండగము లడంచి దుర్గేశ్వరుఁడైన మాధవరాయ లిప్పుడు స్వతంత్రుఁడయ్యెనఁట గాదా!" యనియెను. ఆ మాటలను విని రాజశేఖరుఁ డదరిపడి యించుక యోచించి నెమ్మదిగా, "ఆతఁడు ప్రభుభక్తిపరాయణు లలో మొదటివాఁడు. సార్వభౌముని యాజ్ఞయైనచోఁ బ్రాణముల నైన నర్పించుటకు వెనుదీయని రాజసేవకుఁడు. ఏలినవారే యాదర భావముతో నాతని దుర్గాధ్యక్షునిఁ జేసితిరి! అంతకంటె స్వాతంత్ర్య మేమున్నది?

ఉత్క—వసంతవాడ దుర్గమున నున్నప్పుడు—

రాజ—సేనానిగా నుండి ప్రభువువారి యాజ్ఞను బాలించుచు మన్నెదొర దుండగము లనేక పర్యాయము లడంచి తన స్వామి భక్తిని వెల్లడించుకొనియున్నాఁడు.

ఉత్క—కాలము జరిగినకొలఁది, వయసు వచ్చినకొలఁది, బలము చేరినకొలఁది, మనుష్యుల మనసులు మాఱుచుండుననుకొని యెదను.

రాజ—ప్రభూ! మాధవుని విషయమున నట్లెన్నఁటికినిగాదని నేను ప్రమాణము చేసి మనవి చేయఁగలను. ఏలినవారు మఱియొక లాగున భావింపరాదు.

ఉత్క—మేము భావించుటలేదు.

రాజ—ప్రభువువారి న్యాయపీఠము నాశ్రయించుకొని చాల యేండ్లు గడిపితిని. ఏలినవారివలన నిట్టి మాట యెప్పుడును విని యుండలేదు.

ఉత్క—రాజశేఖరా! నీ పట్టి వాడవే—నీలాద్రిరాజు సేమముగ నున్నాఁడా?

రాజ—సేమముగనే యున్నవాఁడు. నేనీ సమయమున నొక మనవి చేయవలసియున్నది. క్షమియించినచో మనవి చేసికొనుచున్నాఁడను

ఉత్క—దానికేమి? మనవి చేసుకొనవచ్చును,

రాజ—మా ప్రభువు చనిపోవునప్పు డేలినవారి కొక మనవి వ్రాసికొనుచు దానితో నొక మరణశాసనమును ప్రభువువారి యొద్దకుఁ బంపియున్నాఁడు

ఉత్క—అవును. ఆ విషయము తెలుఁగుదుము

రాజ—ఇప్పుడు రాజకుమారుని యొద్ద కాశాసనము వచ్చి నట్టును, అది నీలాద్రిరాజున కిచ్చివేయునట్లును వినియున్నాను. అట్లు జరగినచో రాజ్యకల్లోలములు జరుగునేమో యని భయమగు చున్నది ఇది తలంచుకొనియే ప్రభువువారితో మనవి చేసికొనుటకై యిచ్చటికి వచ్చితిని.

ఉత్క—కల్లోలముల కేమున్నది?

రాజ—ప్రభుకుమారికయగు కమల దుర్గేశ్వరి కావలసియుండగా నందులకు వ్యతిరేకముగ జరగినచోఁ గలహము లేలరాకుండును? ఇవి లోలోపల జరుగుచున్న సమాచారములు.

ఉత్క—కమలామాధవుల వివాహ మైనవిమ్మటఁగదా దుర్గ మును గూర్చి యాలోచించుట!

రాజ—ఈలోపుగ నే నీలాద్రిరాజున కాదుర్గాధిపత్యము నిచ్చెద రనువదంతి కలిగినది ఇది కల్లోలమునకుఁ గారణము కాదా?

ఉత్క—కుమారుఁ డట్లెన్నటికినిఁ జేయఁడు,

రాజ—నీలాద్రిరాజతనయ శ్యామల నాతఁడు పెండ్లియాడు టకును, దుర్గము నీలాద్రిరాజు స్వాధీనము చేయుటకును, మాటలు జరగినవి,

ఉత్క—అది యసంభవము.

రాజ—అట్లు జరగినచోఁ బ్రమాదము వచ్చునని మనవిచేయు చున్నాను ఒకమూల శ్రీకృష్ణదేవరాయలు తూర్పుదేశ దండ యాత్రకు బయలువెడలనున్నాఁడని తెలియుచున్నది ఈ సమయ మున సామంతరాజులలో నంతఃకలహములు పుట్టినచో రాజ్యమునకు క్షేమ ముండుట యెట్లు?

ఉత్క—అందులకుఁ దగిన సన్నాహముతో నుండవచ్చును.

రాజ—ఈ సమయమునఁ గుమారుని వివాహప్రయత్నములు పూనుకున్నచో ననర్థము వాటిల్లునని భయ మగుచున్నది

ఉత్క లేశ్వరుఁ డందుల కేమియును బ్రత్యుత్తరము నీయ లేదు రాజశేఖరుఁ డాత్రముతో "ప్రభూ, నన్ను మన్నింపుము. నేను రాజనీతి నెఱిఁగి భావి నాలోచించి మనవి చేసుకొనుచున్నాఁ డను, మా ప్రభువరుని మరణ శాసనమునకు వ్యతిరేకముగ నక్కడి కార్యములను జరుపరాదు. అట్లు చేయరాదని కుమారున కొక యాజ్ఞపత్రమును వ్రాయుటకుఁ బ్రార్థించుచున్నాఁడను అట్లు చేయ నిచో ననర్థములు చాల సంభవిల్లును." అనియెను, ప్రతాపరుద్ర గజపతి యేమియో యాలోచించుచు నందుల కేమియును బ్రత్యుత్త రము నీయలేదు. రాజశేఖరుఁడనేకవిధముల నాతనికి బోధించెను, కాని కార్యము లేకపోయెను. ఉత్కలేశ్వరుఁ డేమిచేయుటకును దోఁచక నాఁటి కాతనికి సెలవొసంగెను.

# 17. ఆ భవనము మన మాధవుఁ డుండునదియే

ఒకదెస నరుణకిరణుం డపరాంబుధిలోఁ బడిపోవుచుండెను. మఱియొక దెస సుధాంశుఁ డుదయాచలంబునుండి తొంగి తొంగి చూచుచుండెను,

ఒకటి దుఃఖమయము వేఱొకటి సుఖమయము ఈ దుఃఖమునకును, సుఖమునకును నడుమనున్న యనిర్వచనీయాంతరాళమునఁ జుక్కలుమినుకుమినుకుమనుచుండెను ఇట్లేనవీనాచారానుసారంబుగఁ గథాసందర్భమునకు నడుమనున్న యనిర్వచనీయంబగు నంతరాళంబుఁగూడఁ జుక్కలు పొడసూపుచుండును పొడగానరాని హృదయములకును, వాక్యములకును నడుమనున్న రహస్య భాగములందు గూడ నిట్లే చుక్కలు పొడవఁబడి యుండుననియే తోఁచుచున్నది. నీలాద్రిరాజు తన యేకాంత మందిరమునఁ గూరుచుండి యాలోచించు కొనుచుండెను, ఆతఁడాయాలోచనా భాగమున నట్లే చుక్కలు పొడిచియున్నాఁడు. అది మనకుఁ దెలియదు. ఆతఁడేదియో యాలోచించు కొనుచుండఁగాఁ గోఁడెమీసములును, మిడిగ్రుడ్లును, నల్లని శరీరమునుగల యొకపురుషుఁడు వచ్చి, "ప్రభూ! వందనముః" అని యాతని యోచన కంతరాయమును గలిగించెను,

నీలాద్రి రాజు వచ్చిన పురుషునిం జూచి, "దమనకా! నీవు కొండవీటినుండి యెప్పుడు వచ్చితివి? కుమారభద్రుఁడు సేమముగా నున్నాఁడా?" అనియెను

దమ—నేనొక గడియ క్రిందటనే వచ్చితిని. కాని ప్రభువారి సమయమును నిరీక్షించుచుంటిని. రాజకుమారునకు సేమమే

నీలా—ప్రయత్నము లన్నియు నేమైనవి?

దమ—పెకినవారు వ్రాసినచొప్పునఁ బ్రయత్నము లన్నియును జేయఁబడినవి నిన్నటిదినముననే రాచిరాజవరుఁడు తన సేనతో నక్కడకుఁ జేరియుండును.

నీలాద్రిరాజు సంతోషముతో "ఏమీ! అంత శీఘ్రముగనే పని జరుగుచున్నదా? ఈపాటికి దుర్గము వారిచేతిలోఁ బడియే యుండును." అనియెను.

దమ—చిత్రము, రాజేంద్రకుమారులు కొలఁది దినములలోనే యిక్కడకుఁ బరివారమును బంపెదమని సెలవిచ్చియున్నారు ఈలోపుగనే యిక్కడి కొదవపనికూడఁ బూర్తి కావలయునని వారి యభిమతము

నీలా—సరియే. అట్లు కానిచో ముందు కార్యమునకు భంగము వచ్చును,

దమ—ఆ ప్రయత్నములను జేయించితిరా?

నీలా—ఆఁ, అది యభిముఖమై యున్నది. కాని—

దమ—ఇఁకఁ జేయవలసిన దేమున్నది?

నీలా—పర్యవసానమును దేల్చవలసి యున్నది దానిని గూర్చియే యాలోచించుచుంటిని.

దమ—అందులకుఁ దగినవారిని నియమించియున్నారని తలంచెదను.

నీలా—లేదు, అందుకొఱకే యాలోచించుచుంటిని. అతి నిగూఢముగఁ గార్యమును జరుపఁగల సమర్థులు కావలయును

దమ—దేవర తలంచినచో నట్టివారి కేమికొదవ? ఆయన వచ్చియే యున్నాఁడని వింటిని

నీలా—అవును,

దమ—వంటయింటికుందేటిని బట్టుటెంతపని?

నీలా—అవి సామాన్యమైనవి గాదు.

దమ—అందులకుఁ దగిన విశ్వాసనేవకు లుండకపోరు. దేవర సెలవైనచో నాపని విషయములో నీనేవకుఁడే నెఱవేర్పఁగలఁడు.

ఆ మాటలు విని నీలాద్రిరాజానందముతో, "నీవట్టి ప్రభుభక్తిపరాయణుఁడవే. నీవే యీ కార్యమును దుద ముట్టింపవలయును నీకుఁ పారితోషికము బొసంగుటకు సిద్ధముగా నుంటిని నేఁటియర్ధరాత్రముననే యీపని పూర్తి చేసినచో నొరులెవ్వరును దీనిజాడనైనఁ దెలిసికోఁజాలరు." అనియెను.

దమ—ఆయానుపాను లన్నియు నాకుఁ దెలిపినచో నట్లే సిద్ధముగా నుండెదను.

అప్పుడు సీలాద్రిరా జాత్రముతో నమూల్యమణిఖచిత మగు తనవ్రేలి సువర్ణముద్రికను దీసి ' దమనకా! దీనిని ఁ చ్చుకొనుము. పిమ్మట నీకుఁ దగినబహుమానమును గావించెదనులే'' అని యొసంగఁబోయెను. కాని యాభృత్యుఁ డాముద్రికను దీసికొనక యే "స్వామీ! మీదయయే నాకఁ బదివేలు. అది చక్రవర్తికుమారునకును ప్రియదాయకమైన కార్యమేగదా! కార్యము ముగించినపిమ్మట నన్నే తీసికొందును" అనియెను

అప్పుడు సీలాద్రిరాజు గుమ్మమునొద్దకు వచ్చి, యొరు లెవ్వరు నా చుట్టుపట్ల లేకుండుటను జూచి మరల లోపలకుఁ బోయి, దమనకునితోఁ జాలసేపు కర్తవ్యమునుగూర్చి యోచింపసాగెను తరువాత నేకాంతముగా మాటాడుకొనుటచే నా మాటలేవియు మనకు వినఁబడలేదు. కాని యొకసారిమాత్రము దమనకుఁడు, "దక్షిణపువైపు భవనమునందా?'' అని గట్టిగఁ బ్రశ్నించెను ఆ మాటకు సీలాద్రిరాజు, "గట్టిగ నడువకుము ఆ భవనము మన మాధవుఁ డుండునదియే" యని మెల్లఁగ జెప్పెను ఈ సమయము నకు సరిగా శ్యామల యాప్రక్కనుండ పోవుట తటస్థించెను అమె కామాట లస్పష్టముగ వినఁబడియెను ఆమె యా గృహమునఁ దండ్రి యెవ్వరితోడనో మంతనము చేయుచున్నాఁడని గ్రహించి తనయడుగులచప్పుడైన వినఁబడకుండ నక్కడనుండి వెడలిపోయెను కాని, 'దక్షిణపువైపు భవవము-మాధవుఁడు" అని వారేకాంత, ముగా ముచ్చటించుకొనవలసిన యావశ్యక మేమియున్నది?'' యని యామె యనేకపర్యాయము లందునుగూర్చి యోచించుకొనియెను. ఆమె కేమిబోధపడినదో మనకుఁ దెలియదు. కాని మన కేమియు దానిప్రయోజనము దెలియలేదు.

ఆయిరువురును గొంఁదిసే పచ్చట గుసగుసలాడి యాతావును విడిచిపోయిరి. ఏ హృదయములో నేమున్నదో యెవ్వరికిఁ దెలియును?

# 18. అగ్నిపర్వతము పగిలి పడునేమో!

జన్మదినోత్సవము నాఁటి రాత్రి మాధవుఁడు తనవిడిదియింట మృదులశయనముపై మేనువాల్చి నిట్టూర్పులు విడుచుచుండెను. రాత్రి పదిగడియ లైనవి పరిచారకు లందఱును నిదురించుచుండిరి నాఁడు పున్నమ యైనను నాకసమున నల్లమబ్బులు వ్యాపించి యుండుటచే వెన్నెలకాంతి మందమై యుండెను. అప్పుడప్పుడు రేరాజు మబ్బుచాటునకుఁ బోవుటం జూచి తమస్సముదాయము రాజద్రోహ సంఘమువలె జగమంతయు నాక్రమించుకొనుచుండెను. కేవలము చలియును, జలువయును గాని, యెుండొకగుణభేదముం గాంచి జనులకు సుఖమును గష్టమును గాని యొకానొకయవస్థం గూర్చుచు వర్షావసనము రివ్వున వీతెంచుచుండెను ఎట్లున్నను మాధవున కారాత్రి కాళరాత్రివలె నుండెను ప్రియజన సందర్శనా నందమును, శ్యామలా జన్మదినోత్సవ కుతూహలమును గూడ నాతని హృదయోత్తాపమున నంతరించిపోయెను సాయంతనము తానును గోపాలుఁడును గలిసికొన్నప్పుడు జరిగిన సంభాషణ మాకస్మికముగ నాతని హృదయమును గలఁచివైచినది ఆ విషయముం గూర్చియే యాతని మనసు పరితపించుచుండెను. ఆ పరితాపము వలననే యాతని యాలోచనలు పరువులెత్తుచుండెను ఆ యాలోచనములవలననే యాతనికి నిదుర పట్టుటలేదు అంతటి దారుణ కరంబగు నా వార్త యంత విస్పష్టముగ నాతని కప్పటివఱకును దెలియనేలేదు. కావుననే యాతఁడాకస్మికముగ విభ్రాంతుఁడై పోయెను సమయమున మంత్రి రాజశేఖరుఁ డూరలేకుండుట కూడ నాతనికి హృదయ సంకటముగా నుండెను ఇట నొక నిమిషమైన నిలువక నిడుద్రోలు దుర్గమునకుఁ బోయి యేదేని ప్రతీకారము సేయ వలయునని యూహించెను, తానటనుండి కదలిన నే నిమిషమున కేమి పుట్టునో యని వెంటనే సందేహము తోఁచెను. ఆతని కట్టి యాలోచనమును స్థిరపడుట లేదు ఎదుట నుద్యానవన మార్గమున నెవ్వరో యీ వంకకు వచ్చుచున్నట్లాతనికిఁ బొడకట్టెను. గోపాలుఁడై యుండునని యాతఁడా వంకనే చూచుచుండెను.

అంతలో నిలువున ముసుఁగు పైఁ జికొనియున్న యొక వ్యక్తి క్రమముగా మాధవు నొద్దకు వచ్చి నిలువఁబడియెను. మాధవుఁడు చూచి "గోపాలా! ఈ యవరోధ మెందులకు? ' అనియెను,

వ్యక్తి—ఇది నేఁటినుండియే కలిగినది.

మాధవుఁడా స్వరము నానవాలుపట్టి యులికిపడి "శ్యామలా! ఇప్పు డిచ్చటి కేల వచ్చితివి?" యని యడిగెను.

శ్యామల తన యవకుంఠనమును దీసివైచి తలవంచుకొని నిలువఁబడి యొక్క నిట్టూర్పు విడిచెను.

మాధ—శ్యామలా ఇప్పు డిచ్చటి కేల వచ్చితివి?"

శ్యామ— వచ్చుట తప్పే. అందు నిట్టి సమయమున వచ్చుట లోకవిరుద్ధమే

మాధ—అదియేమి యట్లనుచుంటివి?"

శ్యామల నయనేందీవరము లశ్రుజలపూరితము లయ్యెను ఆ యశ్రుబిందువులలో దీపప్రభలు ప్రతిఫలించుచుండెను ఆమె గద్గద స్వరముతో "బావా! నేటినుండి మన కింకఁ జూపులు లేవు," అనియెను

మాధ—ఏమది?"

శ్యామ—నేడు నీకు నమస్కరింపవలసివచ్చినందులకుఁ గోపించి మా తండ్రి యక్కకును నాకును నవరోధముం గల్పించియున్నాఁడు.

అని పలుకునప్పుడు శ్యామల యిరుగన్నుల నుండియు రెండు వేఁడి కన్నీటిబిందువులు జాఱిపడియెను

మాధవుని హృదయము జల్లుమనియెను అప్పు డాతఁడు, "శ్యామలా! రాజ కన్యలకు రాణివాస మాచారమేకదా! ఇంత మాత్రమున కీ విచార మెందులకు?" అనియెను

శ్యామ—ఇంతమాత్రమే కాదు వెనుక మా తండ్రికి యువ రాజు వ్రాసిన యుత్తరము సంగతి వింటివికదా!

మాధ—తెలిసినది,

శ్యామ—ఆ విషయమై నా యంగీకారమును స్పష్టముగఁ దెలిపివైచితిని. ఇంతవఱకును మఱి యా ప్రశంసయే లేకుండుటచే జాల సంతోషముగా నుండెను.

మాధ—నేఁడేమో కొండపీఁటినుండి సమాచారము వచ్చినదఁట గాదా!

శ్యామ—ఔను. అప్పుడప్పుడు కంపించుచు నింతవఱకు సంతప్తమగుచున్న యనలపర్వత మిఁక నొక్కసారిగా బగిలిపడునేమో యని భయమగుచున్నది

మాధ—పగిలి భస్మీపటలము కానిమ్ము భయమేమి?

శ్యామ—అక్క రాజ్య మన్యాయముగ నపహరింపఁ బడుటయు, నన్ను బలవంతముగ యువరాజునకు బలిసేయుటయుఁ గూడ భయంకర కృత్యములు కావా?

మాధ—మీ యక్క రాజ్య మపహరింబడుచున్నదను మాటయే గాని యది మిమ్ము విడిచి యెక్కడకును బోదు దుర్గము కమలదైన నేమి, గోపాలునదైననేమి? ఇఁక రెండవ సంగతిని గూర్చియే యాలోచింపవలసియున్నది.

శ్యామ—రెండవది తప్పిపోయినచో మొదటిదానికిని భంగము లేదు. అది తప్పుట యెట్లు?

మాధ—ఇప్పుడేమి వచ్చినది?

శ్యామ—అయ్యో! అట్లందువేమి? నీచమోహావికారమునకుం జిక్కి మూర్ఖుఁడగు యువరాజు యుక్తాయుక్తజ్ఞానము లేక సంచరించుచున్నాఁడు ఆశాపిశాచావేశవివశుఁడై తండ్రి దయావాత్సల్యములను విడిచి బలవంతపఱుచుచున్నాఁడు. అబలనగు నా గతి యింకేమి కావలయును? అగతిక వలెనున్న యక్క గతి యేమి కావలయును?

మాధ—శ్యామలా! నీ ధైర్యమంతయు నెక్కడకుఁబోయినది? నీ చురుకుదనమంతయు నెట కేగినది? బేలవై యిట్లు చెప్పెద వేల? నా ముక్కున నూపిరియున్నంతవఱకు, రాజశేఖరుఁడు జీవించియున్నంతవఱకు మీ కెట్టి యాపదయును రానేరదని నమ్ముము!

శ్యామ—నిరంకుశుఁ డగు యువరాజు నెవ్వరడ్డుకొనఁగలరు?

మాధ—ఇంతటి దుష్కృత్యమున కాతని తండ్రి యంగీకరింపవలదా?

శ్యామ—సర్వ స్వతంత్రుఁడగు నాతనితోఁ దండ్రి యూరక వైరము కల్పించుకొనఁజూచునా? అదియుఁగాక యిదివఱకే యాతఁ డెల్ల సంగతులను దండ్రికిఁ దెలిపి యొప్పించియే యుండును. ఆతఁ డచ్చటికిఁ బోవుట యిందుకొఱకే యనుకొందును

మాధ—ఆతని దురుద్దేశమునకుఁ దండ్రి గూడఁ దోడుపడినంత మాత్రమున భగవదుద్దేశము కూడ నట్లే యుండునా?

శ్యామ—ఏమైన నేమి చేయఁగలము?

మాధ—శ్యామలా! ఎంతమాట యంటివి? అంతటి దురాగతమే సంభవించుట తటస్థించెనేని కొండవీటిదుర్గమున రక్తనదులు ప్రవహింపవా? అట్టి దారుణ సమయమున వీరభద్రగజపతి మాధవ గోపాలుర క్రోధానలంబునకు శలభమైపోవునని నమ్ముము

శ్యామ—సార్వభౌమునితోఁ గత్తి కట్టుట సాహసము కాదా? ఆతఁడు గూడ సేనలతో నెత్తివచ్చినచోఁ జేయున దేమున్నది?

మాధ—ఎంత వెఱ్ఱి? సార్వభౌముని గోదావరినది దాఁటి యివ్వలకు రానిచ్చినప్పుడుకదా?

శ్యామ—మన యుద్దేశము లిట్లున్నవి కుతంత్రకుశలురగు ప్రతిపక్షుల యాలోచనము లెట్లున్నవో! ధర్మమున దైవమే యున్న యెడల మన యభీష్టము సఫలము కాఁగలదు అట్లుగాక నా తండ్రి బలవంతముగఁ బంపివేయునేని, వీరభద్రగజపతి నా యెడల నక్రమముగఁ బ్రవర్తించునేని నీ యొద్ద నభ్యసించిన యాయుధపరిశ్రమ మంతయు సార్థకమగునట్లు నా నిశిత కరవాలమున కా యువరాజును బలిచేసి సాహసిక సతీశిరోమణులు పోయిన మార్గమునఁ బోయెదఁగాక' నా కొఱకు మీరీ దారుణ విపత్సముద్రమున మునుఁగవలదు.

మాధ—అంతవఱకు రాదు. ధైర్యము వహించి యుండుము,

శ్యామ—రాదని యెద వేల? పాపాత్ములకుఁ జేయరాని కృత్యము లుండునా? నీవు మాత్ర మీ రాత్రి జాగరూకుఁడవై యుండుము.

మాధ— అది యేమి?

శ్యామ—కొండ పీటి నుండి వచ్చిన వార్తాహరునితో మా తండ్రి రహస్యముగ సంభాషించు చుండఁగా నొకటి రెండు మాటలు నా చెవులఁ బడినవి. ఆ సంగతి నీతోఁ దెలుపుటకే యిట్లు వచ్చితిని.

మాధ—నీ వేమి వింటివి?

శ్యామల తాను విన్న మాటలం దెలిపి భద్రమని చెప్పి వెడలి పోయెను మాధవుఁ డావిషయముం గూర్చి యాలోచింపఁ దొడఁగెను.

పూర్ణ చంద్రుని పై నీల మేఘ మావరించు కొనియెను జగమంతయు నంధకార మయ మయ్యెను. దీపము వెలుఁగుచునే యుండెను. అవల నే మున్నదో యగపడుట లేదు అనంతర కర్తవ్యమేమో తోఁచుటలేదు మాధవుని హృదయమున నాలోచనా పరంపరలు సముద్ర తరంగముల వలె నొక దాని వెనుక నొకటిగ నెగసి విరిగి పోవు చుండెను

# 19. మృతకళేబరము

కాల ప్రవాహ మతి వేగముగఁ బరువెత్తుకొని పోవు చుండును. వెనుక నేమున్నదో యది చూచుకొనదు దానికి సింహావ లోకనము లేదు. ఆ ప్రవాహమునఁ బడియెనేని బెద్ద పెద్ద దామువులు గూడఁ దృణములుగాఁ గొట్టుకొని పోవును ఇఁకఁ దృణముల మాట చెప్ప వలసిన దేమున్నది? ప్రతి మనుజుఁడును నిప్పుడో, యొకప్పుడో, యెప్పుడో కాల వేగమునఁ బడిపోవుచునే యున్నాఁడు కాని కాల తత్త్వము నొక్కఁడును గ్రహించుట లేదు దానిని గూర్చి యాలోచించుటయును లేదు కాల మెవ్వరికిని దెలియకుండ నంతర్వాహినియై చల్లఁగ నిశ్శబ్దముగ, సమధిక వేగమున జరిగి పోవుచున్నది ఇఁక దాని నెవ్వఁడు తెలిసి కొనును? సముద్ర ముప్పొంగి మీఁద బడనున్నప్పుడు ప్రళయాంతక గర్జనములతో బయలుదేరు చున్నది. ఆగర్భనిర్భేద శబ్దములను విని దాని గర్భమునఁ గలసి పోకుండఁ దప్పించు కొనుటకై యెల్లరును బ్రయత్నింతురు కాని, కాల మంతటి వేగముతోఁ బొంగి పోవుచున్నను దాని గర్జనములు మన చెవులఁ బడుట

లేదు దాని పొంగుఁ పాటు మన కనుల కగపడుట లేదు. అది యెప్పుడును పొంగియె ప్రవహించుచున్నది. సమాన వేగముతోడనే పోవుచున్నది తన చిహ్నము లేవియును మన కగబడుట లేదు ఇఁక మన మెట్లు తప్పించు కొనఁ గలుగుదుము. కాని, యొక యప్పుడు కాల వేగమునఁ బడి రాకుండఁ బోయినప్పుడాకస్మికముగ నది మన హృదయ నయనములకు గోచరించు చున్నది మనుజుఁ డప్పుడా కాలమునఁబడి పోయిన వానికై శోకించు చుండును ఆ శోకాంధకార మునఁ బడ పోయిన వానికి, గాలమును గూర్చి యాలోచించుట కవ కాశ మెక్కడ నున్నది? అప్పుడు గూడ నాతఁడు కేవలమును గ్రుడ్డి వాఁడే యగు చున్నాఁడు. ఇఁకఁ గాలము నెవ్వఁడు తెలిసి కొనఁగలఁడు? తెలిసి కొనుట కవకాశ మేమి యున్నది! అది యెవ్వరికిని గోచరించుటలేదు అది యెవ్వరి నెప్పుడు తన పొట్టఁ బెట్టుకొనునో మన మెరుంగఁ జాలము.

మాధవుని మందిరమున నేఁటి యుదయమునఁ గోలాహల ముగా నుండెను ఆ మందిరమునఁ దల నరుకఁ బడిన యొక మనుజుని కళేబరము పడి యుండెను. ఆ మొండెమును, దలయును రక్త సిక్త ములై పోవుటచే నెవ్వరైనదియు నానవాలు పట్టుటకు వలను గాకుండెను. ఉదయమున దాసీ జను లలవాటు చొప్పున గది నూడ్చుట మొదలగు పనులను జేయఁ బోవునప్పటికీ ఘోర కృత్య మగపడియెను. అప్పుడు వారు కళవళము నొందుచు శరీరములు వడఁకు చుండఁ దడఁ బడుచున్న పాదములతోఁ బరువెత్తుకొని పోయి యంతఃపురమునఁ దెలియఁ జేసిరి ఒక పరిచారకుఁడు పోయి నీలాద్రి రాజునకును, గోపాలునకును దెలియఁ జేసెను. దుర్గమంత టను మాధవు నెవ్వరో చంపి వైచిరని గుప్పునఁ జెప్పుకొన సాగిరి. అంతఃపురమున గందర గోళము బయలు వెడలెను. గోపాలుఁ డొక్క పరువున నా మందిరమునకు వచ్చెను. అతని కాళ్లును జేతు లును గడ గడ వడఁకి పోవుచుండెను గుండెలు దడ దడఁ గొట్టు కొను చుండెను. గుమ్మము నొద్దనుండి లోపలికిఁ బోవుట కాతని పాదము లాడినవి కావు. ప్రాణ బంధుఁడగు మాధవుఁడు చచ్చి

పోయినచో నాతఁడు బ్రదుకఁ గలఁడా? దుర్గ మంతయు నరణ్యమై పోవలసినదేనా? ఈ మొదలగు భయంకరాలోచన లాతని హృదయమునఁ బుట్టి పోవు చుండెను.

అప్పు డాతఁ డధైర్య వివశుఁడై యొక యడుగైన ముందునకు వేయలేక పోయెను ఇంతలో శశిరమణియుఁ గూడ గుండెలు బాదుకొనుచు రోఁజుచు నక్కడకుఁ బరు వెత్తుకొని వచ్చెను. కమలా శ్యామల లెట్లున్నారో ఎవ్వరు చెప్పఁ గలరు? శశిరమణి గోపాలుని గలసికొని 'అన్నా' ఇంక మన గతి యేమున్నది! ఈ ఘోర కృత్యమును జూచుట యెట్లు?" అని యేడువ సాగెను గోపాలునకును దుఃఖము వచ్చెను సహజముగ నాతఁడు పురుషుఁడు గావున నించుక ధైర్యము వహించి శశిరమణితో నా శవమున్న గదిలోనికిఁ బోయెను. అది శయ్యా పార్శ్వమునఁ బడి యుండెను. శయ్యయును, బ్రక్క గోడయును, శవ శరీరమును, శిరమును, రక్త సిక్తములై యుండెను. వారలా శవమును జూచుటకుఁ గన్నులు చెదరి పోవుటచే సరిగ దృష్టింప లేక పోయిరి "రాత్రి పరుండి యున్న మాధవుఁ డిట్లగునని యెవ్వ రను కొనిరి?" అని గోపాలుఁడు గద్గద స్వరముతో శోకింప సాగెను. శశిరమణి యావైపునకుఁ జూడఁజాలక "బావా! బావా!" యని వాపోవుచుఁ బెద్ద పెట్టున రోదనము చేయఁ దొడఁగెను. ఇంతలో నలు దిక్కుల నుండియును సేవకులును, ఉద్యోగులును, రాజ బంధువులును, మిత్రులును నక్కడకుఁ బరువెత్తుకొని వచ్చిరి అందఱు నెవ్వరికిఁ దోఁచిన గతి వారు మాటాడు చుండుటచే నా భవన మంతయు గోలాహలముతో నిండి పోయెను. ఒకరి మాట యొకరికి నచ్చుట లేదు. ఒకరి నొకరు త్రోసి కొని, ఒకరి కంటె నొకరు ముందుగాఁ బోయి యాఘోర కృత్యమును జూచుటకై ప్రయత్నించు చుండిరి

ఈ సమయమున నీలాద్రి రాజు తన మేడ క్రింది వసారాలో వెఱ్ఱి వాని వలె నటు నిటు తిరుగుచు మాధవుఁడే—చనిపోవుటయే— ఎంత ఘోరకృత్యము? — ఈ దుర్మార్గము ఎవ్వరు చేసిరి?— చూడుఁడు — పరుగెత్తుఁడు. ఇంకేమే మున్నది! రాజ మందిరమున

యింతటి ఘోరకృత్యము జరిగించిన రాజద్రోహు లెవ్వరో పట్టుకొని రాను కట్టి బంధింపుఁడు మా మాధవుఁడు — మాధవుఁడు — చచ్చి పోయెనా? ఎంత రాజద్రోహము జరిగి పోయినది? రండు — పరు వెత్తుఁడు — ఆ మందిరమును బరిశోధింపుఁడు," అని పిచ్చి పిచ్చి కేకలు వేయుచుండెను

అంతఃపురమునఁ గమల యీ మాట విన్నతోడనే నఖముకఁబడిన యరటి పలె నొక్క పెట్టున మూర్ఛఁ బడి పోయెను శ్యామల యామెను దగ్గఱకుఁ దీసికొని "యింతటి విపరీతమా? ఇట్లగునా?— నావా? నా మాటల నాలకింపవా?" అని వెక్కి వెక్కి యేడ్చు చుండెను. చారుమతి దుఃఖించుచుఁ దన తనయకు ధైర్యముఁ జెప్పుచుఁ గమలకు శీతలోపచారములు సేయుచుండెను.

అందఱును దుఃఖ సముద్రమున మునిఁగి పోయిరి ఏ మూలఁ జూచినను మాధవుని గుణకీర్తనము సేయుచు దుఃఖించువారే, ఏ వంక వీక్షించినను మాధవుని రూపశౌర్యములను వర్ణించుచు వాపోవువారే. ఏ దెస నాలోకించినను మాధవునికై శోకించువారే కనబడుచుండిరి శోకజలధరము ముంచుకొనివచ్చుటచే నందఱి కన్నులనుండియు సంతాపాశ్రుధారలు వర్షించుచుండెను. అప్పుడా యుదయ మంద లకును దుర్దినమైపోయెను

గోపాలుఁడును, శిశిరమణియు నిలుచుండి దుఃఖించుచున్న చోటికి గోపాలుని మిత్రుఁ డొకఁడు వచ్చి యా శవము నొద్దకుఁ బోయి చూచెను. ఆతఁ డటునిటు పరికించి చూచి, పిమ్మటఁ గెవ్వున కేకవైచి, 'ఇది మాధవుని శవము కాదు,'' అని చెప్పి గోపాలు నక్కడకుఁ దీసికొనిపోయి చూపెను గోపాలుఁడా శవమును బరీ క్షించి చూచెను. అప్పుడే సూర్యోదయ మగుటచే నా మందిరమున నింకను బాగుగ వెలుతురు అగపడుటలేదు. ఆ కారణమున నా శవము నెవ్వరును దూరమునుండి యానవాలు పట్టలేకపోయిరి గోపాలుఁడా శవమును బరీక్షించి చూచి సంతోషముతో నొక కేక వైచి 'శిశిరా! మన మాధవుఁడు గాఁడు బ్రదికిపోయితిమి. పరు వెత్తుకొనిపోయి యీ శుభవార్తను జెల్లెంద్ర కెఱిగింపుము.

అమ్మతోఁ జెప్పుము," అనియెను. శోకాంధకారములో మునిఁగి యున్న శిశిర మొగమున దటాలున నానందప్రభ లుదయించెను అప్పుడామె, 'పరమేశ్వరుని లీల లనంతములైనవి, ఒక నిమిషము క్రిందట నంధకారమునఁ బడిపోయిన మా యందఱకును మరల సూర్యోదయమైనది. యనంతవిలాసా! మా మాధవుని క్షేమ మును గాచ్చి నీకు నమస్కారము జేయుచున్నదానను," అని తనలో ననుకొనుచు నా శుభవార్త కమలా శ్యామలలకును, దక్కినవారందఱి కిని దెలియ జేయుటకై యా జనమును దప్పించుకొని వెనుక మార్గ మునుండి యంతఃపురమునకుఁ బరువెత్తుకొనిపోయెను.

శిశిర పరువెత్తుకొని వచ్చుచుండుటఁ జూచి శ్యామల యాత్రు ముతో నామె మొగమును దిలకించుచుండెను శిశిర దూరమునందుం డియే "బ్రదికియే యున్నాఁడు బావ! ఆ శవము బావది కాదు," అని కేక వైచి చెప్పెను. అప్పుడు శ్యామల పంచప్రాణములు మరలఁ గూటఁ బడియెను ఆమె కమల చెవిలో "అక్కా! బావ బ్రదికియేయున్నాఁడు" అని గట్టిగా నాలుగైదుసారు లుత్సాహముతోఁ గేకవైచి చెప్పెను. కమలకుఁ గ్రమముగాఁ గొంతసేపటికిఁ జైతన్యము కలిగెను. ఆమె యా వెంటనే కన్నులు విప్పి చూచి శ్యామలను గౌఁగిలించుకొనియెను. శ్యామల యానందముతో "అక్కా! బావ బ్రదికియే యున్నాఁడు. ఆ చచ్చిపోయిన దొక సేవకుఁడట" అని చెప్పెను.

కమల యానందముతో "సోదరీ! ఈ ఘోరకృత్య మాకస్మిక ముగ జరుగుట కేమి కారణమో? బావ యెక్కడ నున్నాఁడు?" అని యడిగెను.

శిశిర—అక్కా! అది యేమియును దెలియదు. ఒక పురుషుని శవము మాత్ర మక్కడ నున్నది. బావ యెక్కడకుఁ బోయెనో యెవ్వరికిని దెలియదు.

శ్యామ—బావకే యీ యపాయము జరగవలసినది. కాని యాతఁడు తన నేర్పునఁ దప్పించుకొనియెనని తోఁచుచున్నది.

అని చెప్పి రాత్రి బావకును దనకును జరిగిన సంభాషణమును నేకాంతమందిరమునఁ దాను విన్న యనుమానాస్పదవాక్యములను

వారి కెఱింగించెను వారా మాటలను విని నిర్భ్రాంతులై పోయిరి,

ఇంతలో లోనికిఁబోయిన చారుమతి సంతోషముతో నక్కడకు వచ్చెను. ఆ కారణమున వారి సంభాషణ ముందా భాగ మా - పోయెను. అందఱును మాధవుఁడు బ్రదికియున్నాఁడని యానంద మున ముచ్చటించుకొనసాగిరి.

గోపాలుఁడు సంతోషముతో దండ్రియొద్దకు బరువెత్తుకొని వచ్చి, "బావకాదు ఆ చనిపోయినది దమనకుఁడు అతఁ డక్కడఁ జచ్చిపోవుట కేమి కారణమో!" యని యడిగెను.

నీలాద్రిరాజు తెల్లపోయి, "ఈ ఘోరకృత్య మెట్లు జరిగినదో? మాధవుఁ డేమైపోయినాఁడో తెలిసికొనవలయును," అని యాత్ర ముతోఁ బ్రత్యుత్తర మిచ్చెను. గోపాలుఁడు తండ్రియొద్ద నుండి తన చెల్లెండ్రఁ జూచుటకై లోనికిఁ బరువెత్తుకొనిపోయెను.

నీలాద్రిరాజు వానతి నా దమనకుని శవమున కుచితసంస్కా రము గావింపఁబడియెను. దమనకుఁడు నీలాద్రిరాజునకు నచ్చిన బంటు. అదిగాక యువరాజు ప్రాణమిత్రుఁడు అట్టివాఁడు పోవుటచె నీలాద్రిరాజునకు మతిపోయినట్లుండెను.

# 20. అనుమానము

రాత్రి యాకస్మికముగ దమనకుని సంహరించి మాధవుఁడెక్క డకో వెడలిపోయెనను నొక ప్రవాదము గలిగెను కాని, దానికి సరి యైన కారణ మెవ్వరును జెప్పఁజాలకుండిరి. ఒక్క సేవకుని నిష్కా రణముగ మాధవునివంటి వీరాగ్రేసరుఁ డెందులకుఁ జంపును?చంపినఁ జంపునుగాక! అతఁ డగపడకుండఁ బోవుట యేమి? ఇది యంతయును మాయగా నున్నదని యందఱు ననుకొనిరి. నీలాద్రిరాజు మాత్రము నేఁ డస్తిమిత భావముతోఁ తన యేకాంత గృహమున నెవ్వరితోడను మాటాడకుండ నటు నిటుఁ దిరుగాడుచుండెను, అతఁడు మాధవుని వెదకించుటకై నలుగెలంకులకు మనుష్యులను బంపించెను మాధ వుని పరివారజన మక్కడనే యుండెను. వారికి సైతము నాతని పోకడ దెలియలేదు. ఆ కారణమున వారిలోఁ గొందఱుగూడ

వాతని వెదకుటకై బయలుదేఱిపోయిరి గోపాలుడు చెల్లెండ్ర సనునయించి వారికి ధైర్యోక్తులం జెప్పి "బావ యెక్కడ నున్న దియుఁ దెలిసికొని నిమిషములో నాతని దీసికొనివచ్చెదను." అని చెప్పి గుఱ్ఱము నెక్కి వెడలిపోయెను. బావ యగపడకుండిన గోపా లుఁడు బ్రదుకఁగలఁడా?

ఆనాఁడు కమల యన్నమును ముట్టలేదు. శ్యామల గూడ నట్లేయుండెను. వారికి మిన్ను విఱిగి మీఁదఁబడినట్లయ్యెను చారుమతి వారలకెంతయో బోధించి, "బావ సాయంతనమునకు వచ్చును. ఊరక విచారించుచుండుట కూడదు" అని యనునయోక్తులం జెప్పు చుండెను. కాని యామె హృదయము గూడ నాందోళనమే పొందు చుండెను. శిశిరమణి వెఱ్ఱిదానివలెఁ గమలా శ్యామలల చుట్టు చుట్టును దిరుగుచు, వారికి ధైర్యోక్తులను జెప్పుచుండెను. కాని యామె హృదయము గూడ పరితపించుచునే యుండెను.

శిశిరమణి కమలం జూచి, "అక్కా! విచారించుట యెందులకు? బావ యీ యపాయము నుండి తప్పించుకొనిపోయెనని సంత సింపుము," అనియెను

కమ—అట్లని యెట్లూరకుండఁగలము? ఈ విపరీత కార్యము జరుగుట కేమి వచ్చినదో తెలియక నా హృదయము తల్లడిల్లు చున్నది.

శ్యామ—అక్కా! ఇది యంతయును రాజ్యాంగవిషయమైన కల్లోలముగాఁ దోఁచుచున్నది.

కమ—అది యెట్లు?

శ్యామ—అది నిన్నటి సాయంకాలమున నాకుఁ దెలియవచ్చి నది. నేనొకమాటపై ననుమానించి బావతో రాత్రి యాసంగతి చెప్పి తిని అందువలన నాతఁడు తప్పించుకొని పోయెననియే తోఁచుచు న్నది

అని చెప్పి తండ్రికిని దమనకునకును నిన్నటి సాయంకాలమున జరగిన సంభాషణలలోఁ దన చెవులఁ బడిన వాక్యముల నెఱింగించి, "ఇంతకన్న నేమిచెప్పుదును?" అని యూరకుండెను.

అప్పుడు కమల భయభ్రాంతయై, "సోదరి! ఇంక నేమున్నది?" అని యెను ఆమె కంఠము గాద్గద్యమును వహించుటచే నింక ముందు మాట చెప్పలేకపోయెను కొంత యించుక యోచించి, "కంచెయే చేనును మేసివేయునా? అది యట్లయియుండదు దీనికి మఱియొక కారణముండి యుండును," అనియెను

శ్యామ—అప్పుడు వారిరువురకును భావప్రసక్తి యెందులకు రావలయును? తెల్లవారుసరికి దమనకుఁడు చచ్చియుండుట యేమి? ఇవి యంతయును నాయన చేయుచున్నకుట్రయని తెల్లమగుట లేదా?

కమ—తన కడుపునఁ బుట్టిన బిడ్డలకంటె నెక్కుడు ప్రేమముతోఁ బెంచి పెద్దవానింజేసిన మేనల్లుని యెడల నాయన యన్యథా ప్రవర్తించునా?

శ్యామ—నా యిష్టమునకు వ్యతిరేకముగఁ గన్నబిడ్డ నగు నన్నే యింతలు సేయుచున్నప్పుడు బావ యాతని కొకలెక్కయా? అట్లనఁ బోకము నాయన యీవిషయమున నేమి నేయుచున్నాఁడో యెఱుంగవా? నన్నా చక్రవర్తి తనయునకుఁ గట్టిపెట్టవలయునని కదా యాతని ప్రయత్నము.

శశి—దానికిని దీనికిని సామ్య మెక్కడ? నాయన నీ యభివృద్ధికి మంచిదని భావించి యిట్లు చేయుచుండవచ్చును, కాని—

శ్యామ—కాని యేమి? యాతనితలం పెట్లున్నను పర్యవసానమున నిర్వురను ధ్వంసము చేయుటకేకదా యీ ప్రయత్నములు!

అప్పుడు కమల "సోదరి! అమంగళములను బలుకఁబోకుము. దుఃఖింపకుము నీకనుఁదమ్ములనుండి వేఁడికన్నీటి బిందువు లురులు చుండుట నేను చూడఁజాలను," అని చెప్పుచుఁ దనపైఁట చెఱంగున శ్యామల కన్నీటి బిందువుల నల్లనఁ దుడువసాగెను. కాని యబలయగు కమల నేత్రకమలములనుండియు నప్రయత్నముగ నశ్రుబిందువు లురుల సాగెను.

అప్పుడు శ్యామల దీనభావముతో "అక్కా! ముందేమిజరుగ నున్నదో నాకుఁ దెలియకున్నది అన్నింటికిని మనకు బావయేకదా

శరణ్యము. అతఁడుగూడ నీకపటతంత్రమునఁ బడిపోయినచో మన గతి యేమికావలసి యుండును?" అనియెను.

శశిర గద్గద స్వరముతో. "బావ సుఖముగనే యున్నాఁడు మీ రధైర్యమును బొందవలదు. అశుభమును బలుకవలదు.' అని యెను.

శ్యామల కన్నీటిని దుడుచుకొనుచు,"బావ పదివేలకు దీర్ఘాయుష్మంతుఁడై యుండుఁగాక! ప్రేమ మయుఁడగు పరమేశ్వరుఁడాతని సర్వవిధముల రక్షించుఁగాక " అనియెను.

కమల సంభ్రమముతో "నా ప్రార్థనముగూడ నదియే!'' యనియెను.

శశి—దైవనియుక్తి యెవ్వరికిని దెలియదు దైవ మెప్పుడును సజ్జనులకు సహకారి యగుచుండును. దురాత్ములు తాము త్రవ్వుకొనిన గోతులలోఁ దామే పడిపోవుచుందురు. ఇది నిశ్చయము. వమియు నెఱుఁగని బావ కపకారము చేయఁబోయిన దమనకుఁ దేమి యయ్యెనో చూడుఁడు!

కమ—నిద్రావస్థలో బావ యెట్టిగందరగోళమును బొందెనో కదా యని నా యుల్లము తల్లడిల్లు చున్నది.

శ్యామ—రాత్రి బావ నిద్రించి యుండఁడు. నేను పోయి జాగ్రతగా నుండుమని తెలిపివచ్చితిని గదా!

శశి—అందువలననే యాతఁడు క్షేమమార్గమున నుండఁగలి గెను.

కమ—నిద్రలోఁ దడఁబాటున లేచి సంసిద్ధుఁడైయున్న యొక క్రూరుని జంపుట సామాన్యమా?

శ్యామ—అతఁడు జాగరూకుఁడై యుండక పోయినచో నష్టే.

శశి—బావ కేమియు నపాయము రాలేదు. నే నిందాఁక మరలఁబోయి యాతని శయ్యాతలమును జూచి వచ్చితిని. దమనకుని శిరసు తెగినపుడు పడినరక్తబిందువులుతప్ప నందేమియు నగపడలేదు. అతఁడు నిద్రించుచునే యున్న యెడల నట్లుండియుండదు కావున

బావ సేమముగనే యిక్కడనుండి వెడలిపోయె నని తలంచెను. అత నికి మఱియొక యుపాయమేమియును వచ్చి యుండదు.

అపాయ మనినతోడనే కమల శరీరము ఝల్లుమనియెను. ఆమె గుండెలు దడదడ కొట్టుకొనసాగెను. అప్పుడు శ్యామల ముందు గావలించుకొని "అక్కా! భయపడకుము," అనియెను.

కమల శ్యామల మొగము జూచుచు, "పోపకి! నా హృదయము మవశ మగుచున్నది. బావ యిక్కడనుండి తప్పించుకొని పోయె నని చెప్పుట కేమియాధారమున్నది? ధైర్యము వహించి యుండ జాలకున్న దానను," అనియెను.

శశి—అట్లనంపోకుము నేనశ్వశాలకు బోయి చూచి వచ్చి తిని. ఆతని యశ్వ మందగపడలేదు. ఆతడా యశ్వము నెక్కి యెక్కడకో పోయియుండును.

ఆ మాట వినుటతోడనే కమలా శ్యామలల హృదయము లించుక తేలుకొనియెను. వారిముఖకమలములు మరల నించుక వికా సముతో గన్పట్టసాగెను

ఇది వర్షాగమము. కమలము లిప్పుడు దుర్దినముల నెట్లో గడవుచున్నవి ఇంక నీ దుర్దినము లంతరింపవా? శరదాగమము రాదా?

## 21· ఇరువురు

ఒకనాంటి సాయంస మయమున నేలూరున కుత్తరముననున్న యొక వటవృక్షము క్రింద నిరువురు పురుషులు రహస్యముగ నేమియో సంభాషించుకొనుచుండిరి. ఇప్పటి యేలూరు పట్టణము పూర్వకాలమున సా రసపుర మని పిలువంబడు చుండెడిది. అది యుత్కలేశ్వరుని సామంత రాజులలో నొకని యధీన మునందుండెను కొల్లేరను సరస్సునకు సమీపమున నుండుటచే దానికి సారసపుర మని పేరు వచ్చినట్లు తోంచుచున్నది. వట వృక్షము క్రిందనున్న యిరువురు పురుషులలో నొకండు "కుమారా! దుర్గము లక్ష్మీపతిరాజు స్వాధీ

నము చేసికొనినాఁడు. నీవక్కడకు పోయినచో నపాయము రాఁగలదు,'' అనియెను.

రెండ—వేఁకటి వృత్తాంతమును వింటిరిగావా!

మొద—వింటిని నేను పోయినచో నిక్కమైనది. ఇప్పట్టున దైవ మనుకూలముగా నున్నట్లగపడదు. ముందేమి చేయవలయునో తోఁచకున్నది.

రెండ—ఏమిచేయుట కేమున్నది? మీరు త్వరితముగఁ బోయి మొదటికి మోసము రాకుండఁ జూచికొనవలయును. నే నింకనక్కడకు రాఁగూడదు. ఆ భారమంతయు మీరే వహింపవలయును.

మొద—నాప్రాణములనైన నర్పించి యపాయము రాకుండఁ గాపాడెదను. కాని ముందుగతి తోఁచుట లేదు.

రెండ—దైవముపై భారమువైచి సముద్రమున కడ్డుపడుచుంటిమి. ఈఁదుకొని రాఁగలితిమేని క్షేమముగ నందఱము మరలఁ గలిసికొనగలము.

మొద—కుమారా! నీవు ధైర్యవంతుఁడవు. భగవంతుఁడు నీపక్షమునం దుండును. ధైర్యవంతులఁ దప్పక లక్ష్మి వరించును. ఎల్లకాలమును దుర్దినములే యుండఁబోవు

రెండ—మీరు పురమునఁ బ్రవేశించి జాగరూకతతోఁ గార్యమును జక్కఁబెట్టుకొనవలయును.

మొద—అట్లే—చేసెదను కాని నీవెక్కడ నేరీతి నుందువో కదా యని విచారము కలుగుచున్నది.

రెండ—నాకై విచారింపవలదు.

మొద—కుమారునిపైఁ గలమమతచే నాతఁడు నామాటలు నిరాకరించినాఁడు. నాకేమియుఁ దగినప్రత్యుత్తరము నీయలేదు. ఈ యవకాశమును జూచుకొనియే యాదురాత్ముఁ డిట్టికల్లోలములఁ దెచ్చి పెట్టినాఁడు. కానిమ్ము. కొలఁదిదినములలోనే యిందులకుఁ దగిన ఫలమును వారనుభవింపకపోరు

రెండ—మీ రెచ్చటఁ దలఁదాఁచుకొందురో యని యాందో

శనముగా నున్నది ఆయబలలతో నొకవివిక్తప్రదేశమునఁ గాలక్షేపము చేయుఁడు నే నచిరకాలములోనే మిమ్ములను గలిసికొందును.

మొద—అన్నిటికిని భగవంతుఁడే యున్నాఁడు. పురుషకారముచేత నెట్టిలోపమును రాకుండ జాగరూకతతో నుండఁ బ్రయత్నింతును. కాని, నీ వెక్కడకుఁ బోయెదవు ?

రెండ—నేను మరల వెనుకకే వచ్చెదను. రహస్యముగ దుంగభద్రాతీరమునకుఁ బోయెదను

ఈవిధముగ వారిరువును జాలసేపు ముచ్చటించుకొనిరి చాల రాత్రి యయ్యెను. ఒకవైపున జీనుతోనున్న గుఱ్ఱము దూరముగ మేయుచుండెను. రెండవయాతఁడాగుఱ్ఱమును దీసికొని వచ్చి యొక మఱ్ఱియూడకుఁ గట్టివైచెను. వారిరువురు నారాత్రి యాచెట్టు క్రిందనే పరుండి తెల్లవాఱుజాముననే లేచి తమ్మొరులు చూడకుండ నెక్కడకో వెడలిపోయిరి.

## 22 ప్రతికూల పవనము

“నీ యుద్దేశ మేమి” అని కోపతీవ్రసూచకస్వరముతో నీలాద్రిరాజు శ్యామలంగూర్చి ప్రశ్నించెను ఆ యంతఃపురమున నితరులెవ్వరును రాఁగూడ దని యాజ్ఞచేసి యుండుటచే నొరు లెవ్వరు నచ్చటికి కేతెంచుట లేదు.

శ్యామల దీనవదనయై యస్పష్టస్వరముతో “ఎన్నిసారులు చెప్పుమనియెదరు?” అనియెను.

నీలా—నయమున నెంతచెప్పినను నీబుద్ధి మార్చుకొనునట్లు తోఁచుటలేదు.

శ్యామ—ఆత్మబుద్ధియే సుఖకరమైనదని నమ్మియున్నదానను.

నీలా—నీ హితముఁ గోరి యుపదేశించు గురుబుద్ధి యంతకంటె విశేషముకాదా ?

శ్యామ—మీ గురుత్వ మాశాపాశసమన్వితమై యున్నది.

నీలా—ఏమీ నన్నుఁ జండాలునిగఁ బరిగణించుచుంటివా?

శ్యామ—చండాలుఁడు నరమాంసమును విక్రయింపఁడు! ఆత్మజాత నాశాదేవతకు బలిచేయఁడు.

నీలా—నిన్నుఁ జక్రవర్తినిఁగాఁ జేయఁజూచుట బరిసేయుటగాఁ దలంచుచుంటివా?

శ్యామ—వర్షాభ్యుదయమున కనియే గ్రీష్మము విశ్రమించుచున్నది కాని నవమాలతీలత వసివాఁడిపోవునని దానికిఁ దోఁచుట లేదు.

నీలా—ఈవిషయమున నీ కంతకష్ట మెట్లు కలుగును?

శ్యామ—నా యిష్టమునకు వ్యతిరేక మగుటయే కష్టము.

నీలా—వయోరూపగుణంబుల నిన్ను మించిన యెందఱో సుందరీమణులు పాదములపైఁ బడి వేఁడికొనినను బరిగ్రహింపఁ గోరని యువరాజు స్వయముగా నిన్నుఁ బ్రేమించి పెండ్లియాడఁ గోరుచుండఁగా నిరాకరించుట సిరి రా మోకా లొడ్డుటవంటిది కాదా?

శ్యామ—అశనిపాతభీషణంబగు వర్షామేఘము మయూరసంతతులకు నయనానందకరమే యగుఁగాక! రాయంచకు మాత్రము కాలకాకోలసదృశమే యగుచున్నది.

నీలా—ఛీ! బుద్ధిహీనురాలా! యువరాజునకు రూపము లేదా! వైభవము లేదా! కులము లేదా?

శ్యామ—తండ్రీ! ఎందులకీగొడవ! ఫలరససంజనిత మైనను మద్యము వికారసంకలితమే కదా!

నీలా—పోనిమ్ము సర్వోత్కృష్టవైభవముం గూర్చు చక్రవర్తి నీ పదమున కైనను నీ వాసింపవలదా?

శ్యామ—తండ్రీ! విషబిందుసమన్వితమై పోయినప్పు డాజ్యము నమృతమని యెవ్వఁడు పానము సేయ నంగీకరింపఁగలఁడు?

నీలా—మూర్ఖురాలా! నీకు మతిపోయినది. మూర్ఖుఁ డగు గోపాలుఁడు కూడ నిన్ను మించిపోయినాఁడు. వానికి మాధవుఁడే వైకుంఠము నీకుఁ గమలతోడిదే లోకము. మీరిరువురునుగూడ నా కడుపునఁ బుట్టవలసినవారు కారు.

శ్యామ—తండ్రీ! కోపగింపకుఁడు. మీ రాజాపాశమునకుం జిక్కి యపత్యస్నేహముంగూడఁ బాటించుటలేదు. ప్రాణప్రియుం

డను వే[illegible]మ[illegible]ది యపాయ మునం[illegible] యు[illegible] [illegible]న్నప్పు
డాతనిని వెదక [illegible]వుట మా యున్నతవా[illegible] [illegible] [illegible] యగు
నా సోదరి రాజ్యము [illegible] [illegible]పహరింప వలయునియు, దూ[illegible]
తృష్ణాపరవశు[illegible]డై [illegible] [illegible]కుళత్వమున [illegible] [illegible] [illegible] [illegible]
జేయ[illegible]వాల్పడు [illegible] స్వభావముగల [illegible]కూరరాజున[illegible] డగు యువ
రాజునకు [illegible] [illegible]గవలదనియు, [illegible] [illegible] జూచి
యనుగ్రహింప వలయునని యు జనకు అగుమిమ్ము[illegible] ప్రార్థించుట
నా యపరాధమా? అయ్యో! తండ్రీ! ఏ పాపము నెఱుంగని యన్న
బిడ్డపై ననుకంపవలదా? కన్నబిడ్డను జూచి యైన గరుణింపవలదా?
ఇంతటి దారుణకృత్యము [illegible] నరింప సాహసించినచో లోకులు
నిందింపరా?

నీలా—ఏమి యీ [illegible]! ఘనకార్యములు నిర్వర్తించునప్పుడు
మొదట నిశ్చేయుండను ఇప్పుడు లోకు లెంత నిందించిన నేమి?
కార్యసిద్ధి యైనచో గావలసినంత జనామోదము.

శ్యామ—తండ్రీ! అట్లని యెద రేల? అధర్మ మెప్పటికైన
జనామోదము నందఁజాలునా? పాప మెప్పుడైనఁ [illegible]ఫలము
నీయఁజాలునా?

నీలా—నా తల్లీ! ఏందుల కీవాదము? తండ్రియెడ గౌరవ
ముంచి నా మాట చెల్లింపుము

శ్యామ—తండ్రీ! నీయందు నా కెంతయో గౌరవ మున్నది.
ప్రేమ యున్నది కాని మీ కార్యములు మాత్రము ప్రాణసంకట
ములుగా నున్నవి.

నీలా—పాపాత్మురాలా! ఏమి నీ పొగరు? నీ వెంత చెప్పినను
నీ కెట్లున్నను, లోక మెట్లు నిందించినను నా కార్యములు మాత్రము
నిరాఘాటముగ జరిగి తీరవలసినవే వసంతవాడదుర్గము నా కవ
శ్యముగ వచ్చితీరును యువరాజు తప్పక నిన్నుఁ బెండ్లియాడి
తీరును.

శ్యామ—తండ్రీ! అనురాగవతి కాని వనితం బరిగ్రహించుట

నీలా—దురాత్మురాలా! ఎందుల కీకుతర్కములు? నే జెప్పి నట్లు చేసెదవా లేదా?

శ్యామ—తండ్రీ! నే నెల్ల విధముల మీకు విధేయురాల నే యగు దును. ధర్మవిరుద్ధంబును, లోకశాహ్యాంబును నగు నీ విషయమున మాత్రము మీరు లేని యధికారమును గల్పించుకొనవలదు. తండ్రీ! ఊరక కోపించెద రేల? క్రోధము దూరదృష్టి నెఱుంగనీయదు. క్రోధాంధుఁడై యకార్యప్రవృత్తుఁ డగువాఁడు తప్పక పశ్చాత్త ప్తుడు కాకమానఁడు. చేతులు కాలిన వెనుక నాకులు పట్టుకొనిన లాభము లేదు. మున్మున్న లాభాలాభముల నెఱింగి కార్యము నాచరించుట సర్వశ్రేయము మీరు—

నీలా—(కోపముతో) చాలుఁజాలు నిఁక నీ యుపన్యాసమును గట్టిపెట్టుము నే నికార్యమునం దిదివఱకే కృతనిశ్చయుఁడనై యుంటిని. నీ బుద్ధి యెట్లయిన మాఱునేమో యని యింతవఱకును బోధించితిని. నీ వంగీకరించినను, అంగీకరించక పోయినను దప్పకుండ నీ రాత్రి బలవంతముగ నిన్ను యువరాజు నొద్దకుఁ గొంపవీఁడు పంపివైచెదను. తరువాత నీవు సార్వభౌముని సతివే యగుదువు

శ్యామ—తండ్రీ! ఇదియేనా కన్నకడుపునకుఁగల యపత్య వాత్సల్యము? తండ్రి యాశాపరవశుఁడై ధనాఢ్యున కమ్ముఁజూపు నప్పు డబల యగు తనయ యేమి చేయఁగలదు? అయ్యో! ఆశా! నీ వెంతదారుణమైనదానవు! ఇంతవఱకు నే తనయ ప్రమదావనము నుండి వచ్చుట యించు కాలస్య మైనచో నే తండ్రి తల్లడిల్లుచుండెడి వాఁడో, ఏ తనయ సమీపమునఁ గూరుచుండి మాటాడుచుండిననఁగాని యేతండ్రి భుజియింపనైన భుజియింప కుండెడివాఁడో, ఏ తనయ పలుకుపలుకునను నమృతరసము వర్షించుచున్న నాతండ్రి యానంద రసనిమగ్నుఁ డగుచుండెడివాఁడో, ఆప్రియజనకుఁడేనా యితఁడు? అయ్యో! దైవమా!—

నీలా—ఈ బుడిబుడికన్నీళ్లు, కార్యసాధకములు గావు. ఎట్లును - ప్రయాణము తప్పదు. సంసిద్ధురాలవై యుండుము

శ్యామ—(గద్గద కంఠముతో) తండ్రీ! నాయొక్క మనవి నాలకింపుఁడు. ఇది మీ కంఠకష్టము గాదు

నీలా—చెప్పుము. వినుట కభ్యంతర మేమున్నది?

శ్యామ—నా యందు ప్రీతి కావాత్సల్య ముంచి, మీప్రియ తనయ నగు నా విన్నపమును గరుణతో నాలకించి యొక్కించుక క్రోధమును మరలించుకొని నా యుద్దేశమును యువరాజునకుఁ దెలియఁజేయుఁడు. మనుష్య స్వభావము గలవాఁడైనచో నాతఁడే నా యుద్దేశమును మన్నింపఁగలఁడు

నీలా—ఇఁక నట్టి వేవియును సాగవు. నా మాట దాఁటిపోయినది. పని జరిగితీరవలసినదే ఇట్టి కుట్టుమాటలతో నాప్రయత్నమంతయును మూలచ్ఛేదము చేయఁజూతు ననుకొంటివా? ఎట్లయిన నీకిది తప్పనది గాదు నీ వీరాత్రి పోయితీరవలసినదే

శ్యామల నిరుత్తరయై తల వంచికొనియెను. ఆమె కన్నుల నుండి యుష్ణాశ్రుబిందువులు కంటికి మంటికి నేకధారగా జాలువాఱు చుండెను. లావణ్యరసమును గ్రుమ్మరించుచుండు నామె మనోజ్ఞ వదనమండలము వసివాఁడిపోయెను. కలఁగిపోయిన యామె హృదయమున నెట్టి యాలోచనములు వెడలుచుండెనో కాని యామె మృదులాధరపల్లవము చలించిపోవుచుండెను తనులత వడఁకిపోవు చుండెను పాప మామెకు గత్యంతరమే మున్నది? ఈ మహావిపత్సముద్రమునుండి దరిఁజేరుట కిఁక నాధారమేమున్నది? ఆమె యట్టే యధోవదనయై నిలువఁబడియుండెను

అప్పుడు నీలాద్రిరాజు బిగ్గఱగ, "తెల్లవాఱుజామునఁ బ్రయాణము వినుచున్నావా?" అనియెను.

శ్యామల కొంచెమునే పాలోచించి, "వినుచున్నాను. కానిందు దైవ మేమి చేయఁదలఁచి యుండెనో యట్లే యగును," అనియెను.

నీలా—సరియే.

ఓ హాలికుఁడా! కారుక్రమ్ముకొని వచ్చుచున్న యాఘనాఘనమువంక నత్తెత్తి యేల చూచెదవు? వర్షజలంబులచే నీసస్యసముదాయములు దడిపి పండించుకొని యైశ్వర్యవంతుఁడవు కావలయు

వనియా? పరదేశీ! నీ యాశకుఁ దగినట్లు నీవు కోరుకొనుచున్నావు. కాని యా మూలనుండి ఝంఝామారుతము విసరుచున్నది చూచితివా? వర్షము మాట యటుండ నా ప్రతికూల మహావాయువు నీ హర్షణమున వజ్రనిపాత మగునేమో యని భయ మగుచున్నది. భవిష్యమను తెరమఱుఁగున నేమున్నదో యెవ్వరు నిర్ణయింపఁ గలరు?

# 23. కాళరాత్రి

రాత్రి రెండు యామము లయ్యెను. అంధకారము లెల్లెడల నలముకొని యుండెను. వసంతవాడ దుర్గమునం దందఱును నిద్రాలోలురై యుండిరి. అప్పుడప్పుడు కీచురాలనిస్వనంబులును, ఉన్నత వృక్షాగ్రములనుండి గాలిపాటున రాలిపడుచున్న యెండుటాకుల మర్మరధ్వనులును, చెట్లపై నున్న పక్షులసమ్మర్దరవంబులును, నిశ్శబ్దముగనున్న ప్రకృతిసాగరమున కొంకించుక భంగపాటును గలిగించుచుండెను. నిశాలలన కృష్ణవసనాచ్ఛాదితయై తారకామాలికలచే నలంకృతయై భయంకరముగ మందహాసమును జేయుచుండెను. అంధకారపూరిత మగు నా ప్రకృతి నా మందహాసము మఱింత గాఢాంధకారముగఁ జేసివైచుచుండెను. ఆ యర్ధరాత్రి సమయమున నా ప్రకృతిరంగమున నా నిశాలలన గాక మఱెవ్వరు నాట్యము సేయఁగలరు? ఓ కాళమూర్తీ! నీ వెవ్వరికొఱకు పదవిక్షేపము సేయుచున్నావు? ఎవ్వరికొఱకు హాసించుచున్నావు? నీకుఁ బ్రియులెవ్వరు? నీ రాక కానందించువారెవ్వరు? నీ చీకటి మత్తుమందుచే సమస్తజీవసంతానమును వివశముగఁ జేసివైచి నీవొక్కతె వెక్కడకు బయలుదేఱితివి? నీ భయంకరరూపమును జూడఁజాలక దిక్కులంధీభూతములై పోయినవి. నీ నీలమస్తకము నెత్తి, యీ యాకాశమున నెవ్వరికై వెదకికొనుచుంటివి? కృష్ణతారకా ప్రశోభితము లగు నీ చూపుల నెక్కడకుఁ బరువెత్తించుచుంటివి? నిన్ను మే మెఱుఁగుదుము. నీవాదిశక్తివి. నిన్ను నీవే చూచుకొనుచుంటివి. నీకొఱకే నీవు నృత్యము సేయుచుంటివి. రంగస్థలమును నీవే. నృత్యము సేయుచున్నదానవును నీవే. నృత్యమును నీవే నీవు

జగన్మాతవి. నీకొక నమస్కారము సేయుచున్నారము మమ్మా ప్రకృతిరంగమునందు-నీయందుఁ బర్యటనముఁ జేయనిమ్ము. వసంత వాడ దుర్గాంతఃపురద్వారమును తెఱచుకొని మెల్ల మెల్లగ నీవలికి వచ్చుచున్నది నీవా? నీ ప్రతిబింబమా? మాకు నిజము చెప్పుము!

ఆ దుర్గాంత పురభవనద్వారములు తెఱచుకొని కృష్ణవసనా చ్ఛాదిత యగు నొకమూర్తి మెల్ల మెల్లగ నీవలకు వచ్చుచుండెను. ఆ విగ్రహమిటునటు జూచుచుఁ బ్రాకార ద్వారముచెంతకుఁబోవుచుండెను పోవుచుఁ దనమనమున "కృష్ణవేణీతటమునకు-ఏవైపునకు? దుర్గప్రా గ్భాగమునకా? పశ్చిమభాగమునకా? అయ్యో! ఇది విస్పష్టముగ నడచుట మఱచితినే. నాకప్పుడీ యనుమానమే తోఁపలేదు. వారు తూర్పువైపు కొండలకుఁ బోవుదురు? కానిమ్ము," అని వితర్కించు కొనుచుండెను. ఇంతలో నా తలవాకిలి యెదుటనున్న భవనద్వార మునఁ జప్పుడయ్యెను. చప్పుడు విని యా వ్యక్తి తటాలున నక్కడ నాగిపోయెను. ఆ ద్వారమునుండి మరియొక వ్యక్తి తన దెసకే వచ్చుచున్నట్లగపడియెను. అప్పుడు మొదటివ్యక్తి "ఆ వచ్చుచున్న వారెవ్వరు? నా నీడయా? అంధకారమునందు నీడకూడ నగ పడునా? అది నీడకాదు. ఆ మూర్తి యెవ్వరు? ముందునకుఁబోయి నచోఁ బ్రమాదము వచ్చును," అని యనుకొనుచు గిర్రున వెనుకకు మరలి తన భవనములోనికిఁ బోయెను. రెండవవ్యక్తి యా మొదటి వ్యక్తిం జేర, వానినే వెన్నంటి యా మందిరమునఁ బ్రవేశించెను. ఇరువురు నందుఁ బ్రవేశించిన పిమ్మట వారేమేమియో ముచ్చటించు కొనుచున్న శబ్దము విననయ్యెను. ఇంతలో నాకస్మికముగ నా భవన ద్వారములు మూయఁబడుటచే మనకు వారి మాట లేవియు విస్పష్ట ముగ వినఁబడలేదు మనకిఁక వారగపడరు. మనము కృష్ణాతీరము నందున్న మఱి రెండు మూర్తుల యొద్దకుఁ బోవుదము రండు.

వసంతవాడ దుర్గమునకుఁ దూరుపువైపు నదిగట్టున నొక మఱ్ఱి చెట్టుక్రింద నిరువురీ విధముగా మాటాడుకొనుచుండిరి

"అప్పా! ఇంకను రాలేదేమి"

"నేను నడయే యోచించుచున్నాను."

"ఏదియో యుపాయమే వచ్చియుండును లేనిచో నింత యాలస్య మెందులకు? మనము రెండు జాములకు సరిగ రమ్మని చెప్పితిమిగదా! అట్లు జరుగలేదు. నాతోడనే తీసికొనిరావలసింది."

"బిడ్డా! నీ తోడనే తీసికొనివచ్చుట యెట్లు? తల్లిదండ్రుల కన్ను లామె మీఁదనే యున్నవి, ప్రయాణసన్నాహము నేయుచుండఁగా నామె యగపడకుండఁబోయినచో గందరగోళము పుట్టదా?"

"అప్పా! ఇప్పుడు చేయవలసినదేమి?"

'బిడ్డా? ఇంకను గొంతసేపు నిరీక్షింతము. ఇప్పుడు మూడు జాములు కావచ్చుచున్నది."

"సోదరి రాకుండ మనము పోవలసినదేనా?"

'ఇక నేమి చేయవలసియుండును? తెల్లవారినచోఁ బ్రమాదము వచ్చును మన మొరుల కగపడ రాదు.''

"మనము మూఁడు గుఱ్ఱములను దెప్పించితిమే. ఆ మూఁడవ గుఱ్ఱము నేమి చేయవలసియుండును?

"ఇక్కడ విడిచిపోరాదు."

"మఱి ఏమి చేయవలయును?"

"రేవు దాఁటికదా మనము గుఱ్ఱములను గలసికొనుటయు నేవకున కా యశ్వము నిచ్చి మఱియొకచోటికి బొమ్మని చెప్పుదము"

"ఆ వైపుగ దూరమున సవారీబోయల మూల్గులు వినవచ్చుచున్నట్లున్న దేమి?"

"బిడ్డా! అట్లే వినవచ్చుచున్నవి"

'ఇఁక నేమున్నది? సోదరి యనలజ్వాలలోఁ బడిపోవుచున్నది ఆమెను రక్షించువారెవ్వరు? ఇఁక రక్షణము లేదా?"

"బిడ్డా! విచారింపకుము అన్నిటికిని సర్వరక్షకుఁడగు భగవంతుఁడే యున్నాఁడు. మన మిఁక నిక్కడనుండరాదు. వారు పడమర వైపుననున్న రేవు దాఁటుదురు. మనమీ తూరుపుదిక్కునుండి పోవుదము."

అని ముచ్చటించుకొనుచు వారు నదియొడ్డు దిగి తూరుపుగా నిసుకతిన్నెలోఁ గొంతదూరము నడచిపోయి నావను జేరుకొనిరి

నావవాఁడు వారిరాకకై యీవలనే కనిపెట్టుకొని యుండెను. వారా నావనెక్కి పావుగంటలో నదియవ్వలికి దాటిపోయిరి.

## 24 ఎక్కడకుఁ బోవుదును ?

"అక్కడకుఁ బోవుదునా? ఇక్కడకుఁ బోవుదునా? ఎక్కడకుఁ బోవుదును?" అని యోజించుచు వెంకటగిరి దుర్గప్రాంతమున నున్న తూర్పుకనుమలలో నొకయామ్లతరుచ్ఛాయం గూరుచుండి యొకవిగ్రహము వితర్కించుకొనుచుండెను. ఆమెశరీరము జీడిపూఁత పూసినంత నల్లనై, మలినవసనాచ్ఛాదితమై యుండెను. తరళనయనంబులును తళుకుఁ జెక్కులును, తొగరు మోవియుఁ గల యామె చక్కని మొగము విశీర్ణాలకవిన్యస్తమై, యవ్యక్తభావసమావృతమై వికారముగ నగపడుచుండెను. ఆమె కోమలాంగికవిన్యాసముకూడ వికారముగనే యుండెను. చూపుకూడ నట్లేయుండెను. ఆమెవితర్కముకూడ దానితో నేకీభవించుచున్నట్లే యగపడుచున్నది.

అక్కడకుఁ బోవుదునా? ఇక్కడకుఁ బోవుదునా? ఎక్కడకుఁ బోవుదును?—ఈవంక దినమణి యగాధసముద్రమునఁ బడిపోవుచున్నది! ఆవంక నంధకారచ్ఛాయ లలమికొనుచున్నవి; ఈవంక మహానలజ్వాలలు ప్రజ్వరిల్లుచున్నవి, ఆవంక హాలాహలకీలలు మిన్నుముట్టుచున్నవి. ఈవంక నూయి! ఆవంక గోయి; ఇదియగాధము, అది యసహ్యము ఇది దారుణము, అది భయానకము. అక్కడకుఁ బోవుదునా? ఇక్కడకుఁ బోవుదునా?

ఈ సముద్రములోనికి నావను దీసికొనిపోవుదునా? ఆ చీఁకటిలోనికి జ్యోతిని వెలిఁగించుకొని పోవుదునా! కాదేని దీని నీఁదికొని పోవుదునా? దానిని భేదించుకొనిపోవుదునా? కాక యీ సముద్రమును ద్రాగివైతునా? ఆయంధకారమును మ్రింగివేయుదునా? దీనికిఁ దీవ్రబడబానలమును గావలయును; దానికి దివ్యజ్యోతిని గావలయును. అక్కడకుఁ బోవుదునా? ఇక్కడకుఁ బోవుదునా?

దినము గ్రుంగిపోవుచున్నది. కాళరాత్రి పైకొనుచున్నది. జ్ఞానము నశించిపోవుచున్నది. అజ్ఞాన మాక్రమించుకొనుచున్నది. ఈ

వంక మార్గ మగమ్యా మగుచున్నది, ఆవంక దిక్కు తెలియకుండఁ బోవుచున్నది. దేవుఁ డెక్కడ నున్నాఁడు? అక్కడకుఁ బోవుదునా? ఇక్కడకుఁ బోవుదునా? ఎక్కడకుఁ బోవుదును?

గోవత్సములఁ దోలుకొని గోపకులిండ్లకుఁ బోవుచున్నారు. గిరిదుర్గమున భేరీ ధ్వనులు వినవచ్చుచున్నవి ఆధ్వనులతోఁగూడఁ బాటలు పాడుచున్నట్లున్నది. పాటలు పాడి కోటలు పట్టవచ్చునా? కన్నులన్నియును చూచుచున్నవి హృదయమా! నీవు కన్నులతో నీయిచ్చ వచ్చినచోటికిఁ బోవుచున్నావు. కన్నులు చీకటులు క్రమ్ముచున్నవి నీవును చీఁటిలోఁ బడిపోకుము! ని న్నొకమాట యడిగెదను. చెప్పెదవా?—అక్కడకుఁ బోవుదునా? ఇక్కడకుఁ బోవుదునా? ఎక్కడకుఁ బోవుదును?

తెలిసియుం దెలియని కలఁతనిద్రలో నా యొడలిసొమ్ములన్నియు నెవ్వరో దోచుకొని పోయినారు. కలలోనినగలు మేలఁకువలోనే పోయినవో, మెలఁకువలోనినగలుక లలోనే పోయినవో యెవ్వరైనను జెప్పగలరా? పాఱవైచుకొన్నవి ప్రాణము మీఁదికి వచ్చినవి. పట్టుకొనిపోయిన వేమగునో? కృష్ణవేణిలోని గుసగుసలు నా చెవులలో సూదులఁ గ్రుచ్చినవి ఆ ధచే నేను బడిపోయితిని. నేను బడినచోట నానీడ కూడఁ బడుట యెందులకు? దానిపాప మేమి పండినది? నీడ నాతో రాఁగలిగినప్పుడు నేను నీడతో నెందులకుఁ బోఁగూడదు? కాని నాకును నీడకును జీఁకటి యడ్డము వచ్చినది చిక్కు వచ్చినది. అక్కడకుఁ బోవుదునా? ఇక్కడకుఁ బోవుదునా?

కంటిలోనిపాప కాశికిఁ బోయినది ఇంటిలోని దీప మేమి కావలసినది? పువ్వులు నెత్తిపైఁ బడినఁ బోటెక్కునని యనుకొంటినా? చెట్టునే యూఁచివైచినగాలి చిగురు నేమీ చేయలేదు? నీడకొఱకు చెట్టు క్రిందకుఁ జేరఁగాఁ గొమ్మ విఱిగి మీఁదఁబడినది. తగులవలసిన దెబ్బ తప్పినను దప్పునేమో కాని విఱిగిపడినకొమ్మ మరల నతుకుకొనునా? కాలము కర్మము నేకమైనప్పుడు కలువపూపే కాలకూటమై పోవును. కంచెయే చేను మేయుచున్నప్పుడు కాపువాఁడేమి చేయఁగలఁడు? మెలకువలోనే కల గనుచున్న నేను నిద్రపోవుచుంటి

నసుకొనుచున్నాను ఒకచోట జాగరము, ఒక చోట దుస్స్వప్నము. అక్కడకుఁ బోవుదునా ఇక్కడకుఁ బోవుదునా? ఎక్కడకుఁ బోవుదును?"

అని యీ విధముగా నామె తనలో నేమేమియో గొణఁగుకొనుచుండెను. ఆ దారినే పల్లెలకుఁ బోవుచున్న కృషికులు కొందఱామెం జూచి నవ్వుకొనుచుఁ బోవుచుండిరి. మఱికొందరు కొంచెము సేపాగి యామెయాకార వికారాలాపములం గాంచి యించుక వినోదించి మఱిపోవుచుండిరి. గోపబాలకులు కొందఱు దారిని బోవుచున్న తమ పశువులనట్లే విడిచి యామెకుఁ గొంచెము దూరమున నిలువఁబడి బాల్య చేష్టలతోఁ బరిహాసించుచు నామె మాటలనే యనువదించి గంతులు వైచుచుండిరి. ఆమె వారి నెవ్వరిని లక్ష్యము సేయుటలేదు. క్రమముగాఁ జీకటిపడ నారంభించెను. బాలకు లెవ్వరి యిండ్లకు వారుపోయిరి. మఱికొంతసేపటి కామెయు నా యంధకారములోఁ గలసిపోయెను.

ఆమె మాయమైపోయినది గాని యాపర్వతమును, ఆ చెట్టునటఁ గూరుచున్న యావిగ్రహమును, ఆమె వికార చేష్టలను, మనకుఁ గనున్నలఁ గట్టినట్లే యగపడుచుండెను. ఆ వికృతాలాపములు మన చెవులఁ బడుచున్నట్లేయుండెను. ఆమె యాడిన మాటలకేమైన సంబంధమున్నదా? సందర్భమున్నదా? అర్థమున్నదా?

ఏమో! ఏమియును బోధపడుటలేదు ఆమె పిచ్చిది కాఁబోలును!

# 25. దారుణ్యా కృత్యము

"నెల దినములు గడచిపోయినవి. ఇఁక దైవమేమి చేయనున్నదో? నేఁడె కదా కడపటి దినము! ఆ దోషాకరుని గుణకీర్తనములతో నా చెవులు చిల్లులు పడి పోయినవి ఆ దురాత్ముని నే నీ కన్నులతో నెట్లు చూడఁ గలుగుదును? అయ్యో! చూడఁజాలననిన నన్నిచ్చట దయఁ జూచు వారెవ్వరు? నాకుఁ దోడు పడు వారెవ్వరు? నా శీలమును గాపాడు వారెవ్వరు?— ఏమి! — అధర్మము

బలవత్తరమై ధర్మము నడఁగఁ ద్రొక్కు చున్నప్పుడు— పాపము ప్రబలమై పుణ్యమును ద్రోసివేయుచున్నప్పుడు— ధర్మమూర్తియుఁ బుణ్య పురుషుండును నగు పరమేశ్వరుఁడు చూచుచు నూరకుండునా? నే నాతని బిడ్డను ఆతనిచేఁ బ్రేరేపింపఁబడి స్వధర్మ నిర్వహణార్థమై యిట్లవత రించితిని. సౌ శీల్య సంరక్షణోపాయము నాతఁడు దయతో నాకుఁ బ్రసాదించి యున్నాఁడు. అట్టి ధైర్య సాహసములఁ గూడ నను గ్రహించి యున్నాఁడు. మృత్యు దేవతను నా చెలి కత్తెనుగాఁ జేసి కొంటిని స్వధర్మ నిర్వహణ విషయంబున నేను విజయముం గాంచినను, విజితనై పోయినను యుక్త సమయమునకు వచ్చి యామె నన్నాదరింపఁ గలదు నా యను బంధము లన్నియు వదలి పోయినవి అబలాత్వమును నిరసించ వైచితిని ఇఁక నీ పురుషాధ ముఁడు నన్నేమి చేయఁ గలఁడు? పవిత్ర ప్రేమ కొరకు నేనన్నిట కిని తెగించి వైచితిని ఎంత కైనను సంసిద్ధురాలనై యుంటిని. నే నిఁక దుష్టశిక్షణంబులఁ గరాళ కాళికా మూర్తి నయ్యెదను. శీల సంరక్షణంబున నుత్తమ క్షత్రియ సాహసిక సతీ శిరోమణి నయ్యెదను. మాన సంరక్షణ సమయంబునఁ బ్రాణములు తృణప్రాయములుగదా. ఇన్ని దినముల వరకు నే నెందులకు జీవించి యుంటినో, యింత కష్ట మును సుఖముగా భావించి నే నెందులకు సహించి యుంటినో, యట్టి నా యుద్దేశ్యమును సంపూర్ణముగ నెఱవేర్చుకొని కృతకృత్యనయ్యె దను."

అని యీ విధముగా నింక నేమేమియో యోచించు కొనుచుఁ గొండ వీటి దుర్గమున రాజాంతఃపుర పార్శ్వము నందున్న యొక ప్రత్యేక భవనము నందొక యువతీ మణి కూరుచుండి యుండెను. ఆమె సుందర వదనము క్రోధ పరితాప వికార చిహ్నితమై యుండెను. తీవ్ర కటాక్షము లగ్ని జ్వాలలఁ గురి యించు చుండెను. మృదు లాధర పల్లవము ప్రకంపిత మగు చుండెను, హృదయా వేగ మునం బొడమిన నిడు దయూరుపులచే నామె సమున్నత వక్షో భాగము సంకోచ వ్యాకోచ భావములఁ గాంచు చుండెను, ఆమె యొకసారి తర్జన్యగ్రమును మనోజ్ఞ చుబుక మధ్య ప్రదేశమునం

దార్చి రదన కోరకముల నధర పల్లవముం దాటించుచు విస్ఫారి తన యనాలోకనము లూర్ధ్వ తల విన్యస్తము లగుచుండ శిరఃకంపము సేయు చుండెను ఒకసారి యధో వదనయై, నిడుదయూరువుల పందడిచే నాసాపుటంబులు వికశితంబులగు చుండఁ గుటిల భ్రుకు టియై, లాలాతలంబు వ్రక్కలగు నట్లు క్రొవ్వాఁడి వేఁడి చూపులఁ గురియించు చుండెను, ఒకసారి యెర కెదురు చూచు చున్న యాఁడు సింగమువలె నెదుటనున్న ద్వారము వంక నిశ్చల నయనములతోఁ జూపులు నిగుడించు చుండెను, ఒకసారి సకలాంగకములను గంపింపఁ దటాలున నులికి పడు చుండెను. ఒకసారి యువ్వెత్తుగ లేచి మొల నూలు సవరించుకొనుచుండెను, ఒకసారి ద్వారముకడ కేఁగి యటు నిటుం జూచి మరల యథా స్థానమున నాసీన యగు చుండెను. అప్పటి యామె హృదయ భావములను. భావానుగుణంబు లగు చేష్ట లను, చేష్టాను రూపంబులగు నాకృతులను చూచి గ్రహియింప వల సినదే కాని యథా విధముగ నెన్ని యని వ్రాసి చూపఁగలము?

అభిమానవతు లగు రమణీ మణులు తమ శీలమును గాపాడు కొను సమయమునఁ బ్రాణములనైనఁ దృణప్రాయముగఁ దలం తురు వారలకు శీలము కంటె రక్షణీయంబగునది వేఱొండు లేదు. వారలు ప్రేమించినచో నమృతలతలే కాని కోపించినచో హాలా హాల జ్వాలల వలె మాఱు చుందురు కాంతయుఁ గవితయు నను వస్తువులు స్వయంవర లబ్ధములే కావలయును. గాని నిర్బంధము వలన లభియించునవి కావు ఒక వేళఁగవిత యెట్లో విశ్వ ప్రయ త్నము చేసినచో వికారాకారము తోడనో, విముఖభావము తోడనో దొరికియుండొరకని యట్టుఁబొరకినను దొరక వచ్చును గాని శీలవతులగు కాంతలు మాత్ర మట్లు లభియించు వారు గారు,

వారు సువర్ణము కంటె నధికముగ నాశలను బుట్టింతురు. గరళము కంటె నధికముగ మరణములను గల్పింతురు చంద్రిక కంటె నధికముగ నానందముఁ గూర్తురు. దావానలము కంటె నధికముగఁ దాపముఁ గల్గింతురు, మాతృ దేవత కంటె నధికముగఁ బ్రేమమును జూపుదురు. మృత్యు దేవత కంటె నధికముగ భయమును గలిగింతురు.

వారబల లయ్యు నతి సాహసికలై యుందురు. వారి సుకుమారతను లత లతి మృదులము లయ్యును కుజనులను బంధించుటకు సమర్థత గలిగి యుండును, వారొకచో సతీమణు లయ్యును. మఱియొకచోఁ గాళికా మూర్తులై యుందురు. వారి హృదయము లొకచో శిరీష కుసుమ పేశలములై యుండినను మఱియొకచో నస్త్రాస వజ్రకర్క శములై యుండును. వారు పూపులతో నాడు కొనుచున్నను గత్తులతో నాటకము సేయఁగలరు, సంపదలు నాపదలును వారి యధీన మునందుండును వారికి మానమే ప్రాణము. ప్రేమమే సర్వస్వము. వారి ప్రేమ మనంతమైనది. అవ్యయ మైనది అమృతమయ మైనది, వారి క్రోధము దురంత మైనది. దుస్సహమైనది.

పురుషాధములు మోహావేశ వివశులై మరియాద లెడలి కన్ను గానక చరియించుచు సతీ మణుల క్రోధానలజ్వాలలకు శలభములై పోవుచుందురు, సర్వ శక్తి స్వరూపిణులగు సతీ మణుల కకారణ మున నన్యాయముగ నపకారముం జేయు దురాత్ములకు, నీచహృద యులకుఁ గేవల మధోగతియే కాక వేఱొండు గతి లేదు. దుర్మ దాంధులై నీచాతినీచముగఁ బ్రవర్తించు పురుషాధములవలన సతీ మణులకు భయము గలుగనున్నప్పుడు జగద్రక్షకుఁడగు పరమేశ్వరుఁ డే వారికి సాయపడుచుండును, కాని యట్టి విపత్సమయములందు సతీమణులకుఁ బరమేశ్వరసాహాయ్యముకంటె మృత్యుదేవతాసాక్షా త్కారమే వరణీయమైనదిగాఁ దోఁచుచుండెను సతీమణులు తమ యభిమానమునకు భంగము గలుగునంతటి విపత్తునకు లోనై యున్న ప్పుడు చచ్చుటకైనను, జంపుటకైనను సంసిద్ధలై యుందురు తొల్లి వేదవతియను సతీమతల్లి లోకవిద్రావణుండగు రావణుని కరస్పర్శ మున కులికి వైశ్వానరజ్వాలలకుఁ బూర్ణాహుతియై పోయినది, మోహోన్మాదగ్రస్తుఁడగు భిల్లనాయకుని యున్మత్త ప్రలాపము లకు సహియింపక దమయంతి యాతనిం దన తీవ్రశాపానలంబునకు శలభముగాఁ జేసివైచినది. ఇట్టి యాపత్కల్లోలములంబడిన సతీ మణుల మూలమున నెన్ని జ్వలనకుండములు క్రీడాసరోవరములై పోలేదు? ఎన్ని విషకరండము లమృత కలశములై పోలేదు?

ఎందఱు సార్వభౌములు మృత్యుదేవతా కరాళవదనగహ్వ రమున మాయమైపోలేదు? ఎన్ని రాజ్యములు విపరీత పరిణామావర్తములఁ బరిభ్రమించి యధఃపతితములై పోలేదు? ఎన్ని దేశము లెందఱి జీవుల కవోష్ణరక్తపాతములచేఁ బంకిలములై పోలేదు? ఆ కాలము తిరిగిపోవుచుండునుగాని. వారి పవిత్ర చరిత్రములు దశదిశల నిరంతరముఁ బ్రతిధ్వనించుచునే యుండును.

పాపచిత్తులకు—పంచేంద్రియోన్మత్తులకు—పరమ మూర్ఖులకు - ఆ పవిత్ర శబ్దములు వినఁబడవు.

జామురాత్రి యైనది. మందిరమంతయు దీపకాంతులచే విరాజిల్లుచుండెను. వెలుపల నంతరాళమునఁ గృష్ణాష్టమీచంద్రుని నీల మేఘములు ముంచుకొని వచ్చుచుండెను. శ్యామల మేఘపటాంచలమున వెలుంగుచున్న నిశాకరుని విశాలచంద్రికలు వింత కాంతులఁ బ్రసరించుచు నంతరింపనై యున్న తేజము యొక్క పరిణామములను జూపించుచుండెను ఎచ్చటనో వర్షించియుండుటచే నీటిమీఁది గాలి రివ్వురివ్వున వీచుచు నించుక చలి గొలుపుచుండెను ఆ రమణీమణి కాయవస్థలేవియును నగపడుటలేదు. అమృతమయంబగు నామె హృదయసముద్రమున నిప్పుడు హాలహాల ముదయించి ప్రజ్వలించుచున్నది. దాని వేగమునకుఁ దరంగములు పొంగిపొరలిపోవుచుండెను. జగద్భయంకరమగు హాలాహాలమును పూర్వము పరమేశ్వరుఁడు కబళించి, కంఠమున నిలికించుకొని లోకముల నుద్ధరించియుండెను. ఈ హాలాహాలము మాత్ర మట్టిదిగాదు దీనిని పరమేశ్వరుఁడు కూడ భరింపఁజాలఁడు. ఇది క్రమముగాఁ బొంగిపొరలి యసురవినాశముఁ జేసియైన శాంతింపవలయును. తరంగభంగములంబడి క్రిందుమీఁదగుచు గ్రమముగా నా సముద్రము నింకించియైనఁ జల్లారవలయును. ఎట్లయిన నది తనకుఁ దానే శాంతింపవలయును ఎట్లయిన నది యంతరించియే తీరవలయును.

వీరభద్రగజపతి వివిధాలంకారభూషితుఁడై తన ప్రాభవమును సూచించు బిరుదుపట్టములు మెఱయుచుండ రాజసము మూర్తీభవించిన వడువున, మద మవతరించిన పోలిక, గామము రూపొందిన

రీతిని, సాభిమానముగ, సగర్వముగ, సవిలాసముగ నా మందిరమునఁ బ్రవేశించెను. అప్పుడా కాంతామణి తటాలున లేచి, కొంచె మవ్వ లకు జరగి, యవనతవదనయై నిలువఁబడియెను. ఆమెం గాంచిన తోడనే గజపతి హృదయాకాశమునఁ దళుక్కున నొక మెఱపు మెఱసెను. తోడనే మోహాంధకారము ద్విగుణీకృతమయ్యెను. మొదటఁ దాను చూచినప్పటికంటెఁ బదిరెట్లు—నూఱురెట్లు—వేయిరెట్లు ఆమె సౌందర్య మతిశయించియుండి నట్లాతని కగపడి యెను అది యాతని మనోవికారమో, యదార్థమో మేము చెప్పఁ జాలము.

అప్పుడు గజపతి చిఱునవ్వు నవ్వుచు, ''శ్యామలా! నా యప రాధమును క్షమియింపుము. నేను నీవు వచ్చిన దినముననే రాజ కార్యార్థినై కొండపల్లిదుర్గమునకుఁ బోయితిని. నేటివఱకును వచ్చు టకుఁ దీఱిక గలిగినది కాదు అందువలననే నీ దివ్యసుందరవదనము సందర్శించు భాగ్యము నాకు లభియించినదిగాదు,' అనియెను,

ఆ రమణీమణి యందుల కేమియును బ్రత్యుత్తరము చెప్పలేక, అట్లే తల వంచుకొని నిలువఁబడియుండెను. ఆమె సుకుమార శరీరము ప్రకంపితమైపోవుచుండెను. వేఁడి నిట్టూర్పులచే సుకుమారపల్లవా ధరము చలించిపోవుచుండెను. హృదయావేగముచే సుకుమారవదన మండలము శ్రమజల పరిపూరితమైపోవుచుండెను ఆమె తన దక్షిణ హస్తమును కోణాకృతిగ వంచి కటితలంబునఁ గరకమలము నుంచు కొని వామకరపల్లవము దక్షిణమణిబంధమున నిలుచునట్లు సమం బుగ మలచియుంచి ధాత్రీదేవివంకఁ జూపులు నిగుడించుచుఁ జిత్రిం చిన మోహనవిగ్రహమువలె నిలచియుండెను.

గజపతి యామె మోహనాకారముం గాంచి యొడలెఱుంగని యానందముతోఁ బొంగుచు ''శ్యామలా! నీ కటాక్షకింకరుండనగు నాపై నీ తరళనయనములనుండి విలాసతరంగితంబులును మనో మోహనకరంబులునగు సుకుమార వీక్షణములను కొల్లకొల్లలుగఁ బ్రసరింపఁజేయుట కేల సిగ్గుపడియెదవు? భావిసార్వభౌముఁడగు నీతఁడు నీ పాదదాసుఁడై వచ్చి యెదుట నిలువఁబడి యమృతమధు

రంబులగు నీ చిలుకపలుకుల నాలకింప నువ్విళ్ళూరుచున్నప్పుడు నీ మృదుపల్లవాధరము నించుక విచ్చి చిఱునవ్వు లొలుక నొక ముద్దు పలుకు పలుకఁ ట్టకై యుల్లేల సంశయించెదవు?" అనియెను.

ఆ రమణీమణి ప్రత్యుత్తరము చెప్పలేదు.

గజపతి యించుక ముందునకు జరగి, "ప్రియా! మనోహారిణీ! పార్శ్వభాగము నొక్కచో నుంచి యువరాజునయ్యు రాజ్యమంతయుఁ గరగతముగాఁ జేసికొని యఖిలమును మాటమాత్రమునఁ బరిపాలించుచు నెల్లయెడలఁ గృతార్థుఁడనై యున్న నాకిఁకఁ గోరఁదగినది వేఱొండేదియును లేదు. దయాశీతలమగు నీ కటాక్షలేశము మాత్రమున్న జాలును శ్యామలా! నీకు మాత్ర మింకేమి కావలయును? కళింగరాజ్యలక్ష్మి నీ కనుసన్నల మెలంగఁజూచు చున్నది. ఇది నీ భాగ్యముగాదా?" అని పలుకుచు నామెను సమీపించుచుండెను.

ఆమె తత్తరముతో వెనుకకు జరిగి నిలిచి, "అయ్యా! నీవు సర్వ స్వతంత్రుఁడ వగు భూపాలుఁడవు. ధర్మసంరక్షణమే నీ కవశ్య కర్తవ్యమై యున్నది. హృదయ దుర్బలత్వముచేఁ దోచిన రీతిని మెలంగుట నరపాలునకు ధర్మముగాదు. అధర్మమునఁ దేజోహానియు వన్మూలమున నధఃపతనమును గలుగును. కావున శ్రేయోభిలాషి యగు నీయట్టి వాఁడిట్టి దుష్కృత్యమునకు లోఁబడఁగూడదు. దూర మాలోచించుకొనుము" అనియెను.

"ఇందు నా యపరాధ మేమున్నది?"

"ఇంతకంటె నేమి కావలయును? బలవంతముగ నన్నిచ్చటికిఁ గొనితెచ్చుట పాపము కాదా?"

"నిన్ను నేను సంపూర్ణముగఁ బ్రేమించితిని. నీ తండ్రి మనః పూర్వకముగా నాకు నిన్నొసంగుటచేఁ దీసికొనివచ్చితిని. ఇందు నా దోషమేమున్నది?"

"నీవు రూపముగ్ధుఁడవై మోహోన్మాదమునఁ బ్రభుధర్మ మును ద్యజించివైచితివి. తండ్రి యాశాభిహతుఁడై రాజ్యలోభమునఁ బితృధర్మమును నిర్మూలముఁ జేసివైచెను. ఇట్టి మీ యిరువురి మూల

మునను నబలనగు నా కెట్టి గతి గలిగినదో కొంచె మాలోచించి చూడుము?"

"అదియేమి? భావి కళింగ సార్వభౌముఁడనగు నా కంటె నీ కనుకూల వరుఁ డెందు లభించును? జనకునికంటెను నీ క్షేమమును గోరువారింకెవ్వ రున్నారు?"

"నేను రాజ్యమును బ్రేమించుటలేదు. అట్టిచో నీవు నా కనుకూలుఁడ వెట్లగుదువు? నా యిష్టమునకు వ్యతిరేకముగ—ఆత్మలాభమున కనుకూలముగఁ బ్రవర్తించియున్న జనకుఁడు నా క్షేమదాయకుఁ డెట్లగును?"

"ఏమి యీ యవివేకము! దేశమునందలి రాజకన్యకాజన మెవ్వని దుర్లభునిగాఁ బరిగణించుచుండునో, యట్టివాఁడు స్వయముగ నీకు వశుఁడై పోవుచున్నప్పుడు నీ కనుకూలముగఁ దోఁచుటలేదా? ఎంత వెఱ్ఱిదానవు!"

"దోషాకరుని కరంబు లెంతటి యమృతమయంబులైనను పద్మిని తత్కరస్పర్శమును సహింపఁజాలదుగదా!"

"ఎంత యవివేకము! ఎఱుంగక పలుకుచున్నావు నీవెంత పరితపించినను లభింపని నేను స్వయముగ నిన్నే ప్రేమించుచున్నప్పుడు నీవు నీ యదృష్టమును బ్రస్తుతించుకొనవలదా? అందులకు బ్రతీకారముగ నీ యంగీకారమునైనఁ దెలుపవలదా?"

"నీవు మోహోన్మత్తుఁడవై యుంటివి. ఆ యున్మాద మెన్నటికిని బ్రేమము గానేరదు. ప్రేమ ప్రతీకారము నభిలషించునది గాదు. నీకు నిజముగ నాపైఁ బ్రేమ కలదేని నాకుఁ గష్టము గలిగింపవలదు"

"ఏమిచేయుమని యెదవు?"

"ఈ నిర్బంధమునుండి నన్ను వదలింపుము"

"ఇది నిర్బంధమా? నీపయిఁగల సంపూర్ణ ప్రేమమునకు గుఱుతు గాదా?"

"ఇది ప్రేమము కాదు నీచమోహావికారము, కేవల రూపతృష్ణ"

"ఎట్లయిననేమి? నావంటివాని కానందముం గూర్చుట నీకు శ్రేయము గాదా?"

"నీ యానందముతో నాకుఁ బనియేమున్నది? పాముఁ పడగ విప్పుకొని వీణ తానములఁ బాడునా?"

"నేను నీ సౌందర్యమున కేవలచికితిని. నన్ననుగ్రహింపుము."

"శలభము తన్ను ఫలముగా భావించుచున్నదని తలఁచి దీపము చల్లఁబడునా?"

"నా యధికారమును జూచియైన నీవు నా యాజ్ఞను పాలింప వలదా?"

"నీ యధికారము మానవునిపై నున్నది గాని మానసముపై నెక్కడిది? కష్టసుఖ పరంపర పంచేంద్రియ సంకలితం బగు శరీర మునకుఁగాని పరమాత్మ కెక్కడిది?"

"ఎల్లవిధముల నిన్నే ప్రాణముగ భావించి ప్రేమించియున్న నాయెడల నించుకైన దయచూపకుండుట నీకు ధర్మమా?"

"చపలచిత్తుఁడవై, మోహవికారమున యుక్తాయుక్త జ్ఞానము నశింప, రాజ్యమదంబునఁ గన్నుఁ గానక, పాపభీతిలేక, రూపతృష్ణం బడి, సుశీల యగు నొక యబలను గపట తంత్రమున బలవంతముగఁ గొని తెచ్చి పరిభవింపఁ జూచుచున్న పాప హృదయుఁడ వగు నీకు ధర్మాధర్మ వివేచనముగూడ నున్నదా?"

"శ్యామలా! ఈ గొడవ యంతయు నెందులకుఁ ఇది ధర్మమైనను, అధర్మమైనను. ప్రజలు నన్నభినందించినను, నిందించినను నిన్ను విడువఁజాలను"

"ఎంత బుద్ధిహీనుఁడవు? కరాళకాళమృత్యువును కౌఁగిలింపఁ దలచెదవా? భయంకరానలకణంబును బటాంచలమున ముడువ నెంచె దవా?"

"శ్యామలా! వేయిమాటలేలఁ నీకొఱకేమైనఁ జేసెదను"

దురాత్మా! అధమమానవునికంటె నధముఁడవై, పశుతుల్యుఁ డవగు నిన్నుఁ బరమేశ్వరుఁడు పరిపాలకునిగా నెట్లుచేసెనోకదా! నీ దుష్పరిపాలనమున జగమెంతగాఁ దల్లడిల్లునో, నీ దురహంకార

మున సుజన సంతానమెట్లుఁ డగఁడ్ల పాలవునో, నీ దుష్టమోహావికారమున నబలాజన మేరీతి నతలకుతమై పోవునో, సర్వభూతదయాపరుఁడగు నాతఁడించు కంతయైన నూహింపలేదు కాఁబోలును! అవ్యాజమున లభియించిన యీయున్నత పదమును నిలుపుకొనటకుఁ బ్రయత్నిఁపవలదా? బుద్ధి హీనుఁడవై దుష్క్రియా పరత్వమున నధోగతి పాలుగాఁగోరెదవేల?''

''రమణీమణీ! నాకును నా రాజ్యమునకును నమున్నతిం గూర్చు నదృష్టము నీ కటాక్షలేశముపై నాధారపడియున్నది. ఊరక నన్నేల నిందించెదవు? నీకు లోకోపకారబుద్ధి గలదేని నా యెడల ననుగ్రహముం జూపుము''

ఇట్లు పలుకుచు విలాస సహితంబులగు వినయ గౌరవ భావములు మొగంబునఁ దాండవింప గజపతి యాసతీమణి కరగ్రహణ మాచరించు తమకంబునఁ బ్రకంపితంబగు తన దక్షిణ హస్తము నామె వంకకుఁ జాచెను.

పాప మింక నాయబల యేమిచేయఁగలదు? తన పవిత్ర శీలమును గాపాడుకొనుట కామెకు వేఱుగతి యేమున్నది? దుశ్శాసన పరిభూతయై దిక్కుగానక పరితపించుచున్న యాపాంచాలి మానమును గాపాడుటకు సోదరుఁడగు శ్రీకృష్ణుఁ డెచ్చట నున్నాఁడు? దుష్టదానవ నిర్బంధమునంబడి తల్లడిల్లుచున్న యా సీతామహాదేవికిఁ బ్రాణమానరక్షణ మాచరించుటకుఁ బ్రాణనాయకుండగు శ్రీరామచంద్రుఁ డెచ్చట నున్నాఁడు?—కాని యీమె పాంచాలికాదు, సీతామహాదేవియునుగాదు—దుష్టదానవ భయంకరాకారిణి యగు కాళికామూర్తి!

అప్పుడామె ధైర్యముతో నించుక యోసరిల్లి "దురాత్మా, దూరముగ నుండుము. దారుణాశనిపాతంబునకుఁ దల యొగ్గ సాహసించెదవా!'' అని పలుకుచుఁ దన మొలనూలుగ ధరియించిన కరవాలము నతిలాఘవమునఁ దీసి యాదురాత్మునిపై నొకవిసరు విసరెను. ఆ వ్రేటున కానీచుని పాపపుఁదల తెగిపడవలసినదేకాని

యాతc డించుక తప్పించుకొనుటచే నా దారుణ కృపాణ మాతని వక్షఃస్థాంస భాగము నుండి మూసికొని పోయెను.

తోడనే యాసాహసిక సతీశిరోమణి తననేత్ర ద్వయమునుండి కరాళజ్వాలలు నటింపుచుండ దుర్నిరీక్ష తేజోమూర్తియై మెఱపు వె అసి సంతలో మరలc దన ఖడ్గము నాతనిపైc బ్రయోగించెను. ఆయసిఘాతమునc గూడc దలయూపడలేదు ఈసారి యాతని భుజస్కంధముపై బలమైనగాయ మయ్యెను ఆ వేటుతో నాతc డొక కేకవైచి నేలపై బడి మూర్ఛిల్లెను.

ఆ సతీమణి యప్పుడు తన దక్షిణ హస్తమునందలి తీక్ష్ణ కరవాలమునుండి యుష్ణరక్తము స్రవించుచుండ మహిషాసుర సంహారణానంతరమున విజయోత్సాహోన్మాదినియై విజృంభించుచున్న యాదిశక్తింబోలి భయంకరాకారిణియై నయనగోళములనుండి యగ్నిస్ఫులింగములు వర్షించుచుండc దీక్ష్ణ దృష్టుల నా దురాత్ముని పైc బరగించుచు నట్టెనిలువcబడి యుండెను

ఆపత్సూచక మగునా భయంకరారావము నాలకించి యావల నున్న ప్రతీహారిణు లొక్కసారిగ బిలబిల నా మందిరమునc బ్రవేశించిరి భీకరాకారిణి యగు నాకాంతను, స్మృతి తప్పి పడిపోయిన యాయువరాజునుగాంచి వారందఱాకస్మికముగc గ్రోధశోకపరవశలై పోయిరి. ఆ మందిరమంతయూ వారల యాక్రోశధ్వనులతో నిండిపోయెను కొందఱు యువరాజున కుపచారములు సేయcగడంగిరి "ఈ పాపాత్మురాలిని నిలువున జీల్చివేయుcడు! పట్టిచంపి కందకమునc బాఱవేయుcడు!" అను ధ్వనులు నింగిముట్టెను. ఒక ప్రతీహారిణి యామె చేతిలో నున్న కత్తి నూడc బెఱుకుకొని యామెపై నొకవిసరు విసరెను. ఆయాఘాతముచే నామె క్రిందc బడియెను. "చచ్చినది చచ్చినది!" అనిపలుకుచు మిగిలిన వారందఱును దఢాలున నామెపైc బడియెత్తి ప్రక్కనున్న కందకములోc బాఱవైచిరి.

ఎంతలో నెంతపని జరిగిపోయినది! ఎంతటి దారుణ కృత్యము!

# 26. ప్రాణత్యాగము చేయవలసినదే

శ్యామల నత్తవారింటికిఁ బంపినది మొదలు చారుమతి మంచము పట్టెను. కుమారుఁడిల్లువిడిచి పోయెను కమలా శిశిరకుమారు లెక్కడకో వెడలిపోయిరి. ఆ కారణములచేతఁగూడ నామెవ్యాధి వృద్ధియయ్యెను ఆమెకుఁ దాపజ్వరము వచ్చుచుండెను ఆ జ్వరబాధలోఁ గూడ శ్యామలనే తలఁచు కొనుచుఁ బలవింపసాగెను. రాజవైద్యుఁడు వచ్చి జ్వరోపశమనమునకై యనేకౌషధముల నిచ్చి పోవుచుండెను జ్వరము నానాఁటికి హెచ్చుచుండెనే కాని తగ్గుటలేదు· ఔషధము లిచ్చుట సులభమే కాని వ్యాధిమూలము నెఱుంగుట చాల కష్టమైనపని రోగనిదానము తెలియకుండ నెన్నియౌషధము లిచ్చిన, నేమియును ప్రయోజనములేదు రోగి రాజమహిషి యగుటచే రాజవైద్యునకు నాడిచూచి రోగము నిర్ణయించుకొనుట కవకాశము లేకపోయెను. ఆ కారణమున వ్యాధిలక్షణములనుబట్టి మందు నీయవలసి వచ్చెను. లోకానుభవముగల వృద్ధపరిచారిక యొకర్తు చారుమతిచే నౌషధ సేవనముచేయించుచు, నామెకు వివిధోపచారము లను జేయుచుండెను.

నీలాద్రిరాజు మనసు మనసులోలేదు. ఆతఁడుదయముునను, సాయంత్రమునను మాత్రము చారుమతి యొద్దకు వచ్చి "కొంచెము నెమ్మదిగా నున్నదా?" అని కుశలప్రశ్నమును జేసి యచట విశేష కాలము నిలువకయే మేడమీదికిఁ బోవుచుండెను చారుమతి శ్యామలకై బెంగ పెట్టుకొని యిట్టిరుగ్ణతకు లోనైనదని యాతనికిఁ దెలియును, ఆ కారణమున శ్యామలను గూర్చిన ప్రసంగ మేమైనఁ దన హృదయేశ్వరి యొద్ద వచ్చునేమో యని యాతఁడు భయపడుచు నచట విశేషకాలము నిలుచుటలేదు, ఒకవేళ నా ప్రసంగము వచ్చినచో నెట్టిప్రత్యుత్తరము నీయవలయునో యాతనికిఁ దెలియదు. ఆతఁడు తన కూఁతునకు విశేషాపకారము చేసెనో లేక మహోపకారమే యొనర్చెనో, నిశ్చయించుకొనుట కాతని మనసునకే శక్తి చాలకుండెను, ఇట్టి స్థితిలోనున్న యాతఁడు తన సహచరి కేమి

ప్రత్యుత్తర మీయఁగలఁడు? శ్యామల నత్తవారింటికిఁ బంపుట చారుమతి కనిష్టదాయక మయ్యెనని యాతఁ డెఱుంగును, ఇప్పుడా లోపము నాతఁ డెట్లు సవరించుకొనఁగలఁడ ఁ మాధవుని వెదకుటకు? బోయిన గోపాలుఁడు మరలి రాఁడయ్యెను. కమలాశిశిరమణు లెక్కడకో వెడలిపోయిరి. ఈయనర్థముల కన్నింటికి నాతఁడేమని ప్రత్యుత్తర మీయఁగలఁడు? ఇందులకుఁ గారకు లెవ్వరని చెప్పఁగలఁడు? జ్వరబాధాపీడిత యగు నా చారుమతి కిట్టిప్రశ్నమును వేయుట కవకాశము లేకపోయినను, ఆమె మొగమును జూచుట కాతని కెట్లో యొకమాదిరిగా నుండెను.

దినములు జరగిపోవుచున్నవి కాని చారుమతి జ్వరనివారణో పాయ మగుటలేదు నీలాద్రిరాజు హృదయము పరిపరివిధములఁ బోవుచుండెను. ఆతఁడు రాజకార్యపర్యాలోచనమును మాని తన కుటుంబవిషయమును గూర్చియే చింతింపసాగెను. రాజకార్యముల నత్యంతాభిమానముతోఁ జూచుచున్న మంత్రి రాజశేఖరుఁ డేకారణముననో యా జోక్యమును మానుకొని యా దుర్గమును వీడిపోయెను ఇట్టి విషమావస్థలో నోరుగలవానిది రాజ్యముగా నుండెను పన్నులు మొదలగునవి బలవంతుఁడగు రాజోద్యోగియో, గ్రామోద్యోగియో 'వసూలు' చేసికొని హరించి వేయుచుండెను. ఇప్పుడు నీలాద్రిరాజు రాజ్యమును, ఆతని కుటుంబమును, ఆతని హృదయముతోపాటు చాల గందరగోళములోఁ బడిపోయినవి. అనాయకమైన ప్రజయును, నైకమత్యము లేని కుటుంబమును, వివేచనాశక్తి లేని మనసును సంక్షోభము నొందుట తప్పదు.

నేఁడు భోజనానంతరమున నీలాద్రిరాజు తన మేడపై నటు నిటు తిరుగుచుఁ దనలో నేమేమియో యాలోచించుకొనుచుండెను ఆ సమయమునకు సరిగ నొక పరిచారికుఁడు వచ్చి "ప్రభూ! కొండవీటినుండి యుత్తరము వచ్చినది.'' అని చెప్పి యొకలేఖ నాతని కిచ్చెను. ఆతఁడా యుత్తరమును గంపితహస్తములతో విప్పి రెండు పంక్తులు చదివి ''హా!'' యని యొక కేకవైచి క్రిందఁబడిపోయెను. అప్పుడు చెంతనున్న పరిచారకుఁడాత్రముతోఁ బరువెత్తుకొని వచ్చి

యాతనిని లేవదీసి కూర్చుండఁబెట్టెను. నీలాద్రిరాజు కొంతసేపటికిఁ దెలివి తెచ్చుకొని "హా! శ్యామలా! మమ్ము దుఃఖసముద్రములో ముంచిపోయితివా? నీ జననితో నేనేమని చెప్పుదును?" అని వాపోవఁ దొడఁగెను. ఆ పరిచారకుని కర్థమైపోయినది. అతఁడు కూడ దుఃఖింప సాగెను. ఈ పిడుగు వంటి వార్త వ్యాధిగ్రస్తయై యున్న చారుమతి కాకస్మికముగాఁ దెలిసినచో నామె ప్రాణములు నిలువున నెగిరిపోవు నను భయమునఁ గొంతసేపటి వఱకు నెవ్వరికిని దెలుపకుండ నుండ వలయు నని నీలాద్రి రాజు పరిచారకునకుఁ గట్టడిచేసి మేడగదిలోనికిఁ బోయి తలుపులు మూసికొని లోలోన దుఃఖింపసాగెను

"హా! సుతా! అకాల మరణమునకు గురియై పోయితివా? నేను నిశ్చయముగ సంతాన మారకుఁడను, బెబ్బులి కంటెఁ గ్రూర కర్ముఁడను, నీ యకాల మరణమునకు నేనెగదా కారకుఁడను నీవింత పని చేయుదు వని నేను కలలోనైనఁ దలంపనైతిని. నీవు చక్రవర్తి కిల్లాలి వగుదు వనియు నీ దుర్గాధ్యక్షత గోపాలునకుఁ జెందు ననియుఁ గొండంత యాశతో నుంటిని. నా యాశలన్నియు నేటితో వమ్మైపోయినవి నీవు చక్రవర్తికి భార్య వగుదు వని శ్రీశైల యోగీంద్రుఁడు చెప్పిన మాట కర్థ మేమున్నది? ఆతని కసత్యము చెప్పుటవలన నేమిలాభ మున్నదో? మహాయోగి వచనములే మిథ్య లైపోయినపుడు, ఇఁకఁ బ్రపంచములో సత్యమైన దేమున్నది? కాదు కాదు నేను తప్పుగఁ దలంచితిని. "నీ యూహాలకు దగినట్లే" అని యా మహామహుఁడు తుట్టతుదను జెప్పియుండలేదా? ఆ వాక్యము నకు నేనెట్లో నాకు సరిపడున ట్లర్థము చేసికొని సంతసించితిని. అన ర్థమును సూచించుచుండుటవలననే యాతఁడా వాక్యమును బూర్తి చేయలేదు అ యోగీంద్రుని వాక్య మన్యథా యెట్లగును? నా యూహాలకుఁ దగినట్లే యనుభవ మైనది.

అయ్యో! పుత్రికా రత్నమా! నా వంటి నిర్భాగ్యునకు నీవంటి రత్న మెట్లు దక్కును? నేను భాగ్యహీనుఁడను. దుర్మార్గుఁడను. ఆశాపాశములచేఁ గట్టుపడిపోయి యిట్టి యకార్యాకరణమున కొడి గట్టుకొంటిని. తల్లీ! చంద్రుఁడు లేని రాత్రివలె నీముఖసందర్శనము

లేని భవన మంధకారమయముగా నున్నది. ఇఁక నీజననీ నేమని యూఱడింతును? చెఱుపకురా చెడెద వనుమాట నాయెడల సార్థక మైనది. ఏ పుణ్యము నెఱుంగని మాధవున కపకారము సేయసమ కట్టితిని. నా యన్న యాజ్ఞకు వ్యతిరేకముగఁ గములకు రావలసిన రాజ్యమును హరింపవలయునని తలంచితిని ఇట్టి పాపాత్మునకు, ఇట్టి క్రూరకర్మునకు, ఇట్టి ప్రేమవిరహితునకు నది తగిన శిక్షయే యగును ఆకాశము విరిగి నా తలపైఁ బడిపోయినను నాకిట్టి శిక్ష కానేరదు. నా ప్రేమమయరత్నమును బోఁగొట్టుకొని యిఁక నే నీ లోకమున నెట్లు బ్రతుకఁగలను?

హా! సాధ్వీ! హా! ప్రియా! ఇఁక ని న్నెట్లూఱడింపఁగలను? మొట్టమొదటనే నీ సదభిప్రాయములను వినఁగలిగినచో నింత మూఁడదుగదా! వ్యాధిపీడితనై యున్న నీకీ ఘోరవార్త నెఱిం గించి నిన్ను దక్కించుకోఁగలనా?

అయ్యో! ప్రేమైకరత్నమా! "నా యుద్దేశము నాతని కెఱింగించి చూడు" మని చెప్పిన నీ వాక్యములు జ్ఞప్తికి వచ్చి నా హృదయమును దహించివేయుచున్నవి. ఇఁక నేనెట్లు జీవింపగలను? సహకారము మ్రోడుపడిపోయినది. ఇఁక గోకిలాలాపము లెట్లు వినఁ బడును? నేను పాపాత్ముఁడను. నాకీ లోకమున సుఖము లేదు. ఆ లోకమునను సుఖము లేదు."

అని యనేకవిధములఁ జింతింపసాగెను, నిమిషములును గడియ లును జాములును జరగిపోవుచున్నవి కాని, యాతని కొక నిమిష మొక యుగముగాఁ దోఁచుచుండెను. రోగగ్రస్తయగు ప్రేయసి కీదురంత వార్త నెవ్వ రెఱింగింతురు? ఎఱింగించిన నామె ప్రాణము లతో నుండునా? సహింపరాని గ్రీష్మాతపంబునకుఁదోడు గృహదా హము గూడ నారంభమైనది. నలుగెలంకుల నగ్ని ముట్టుకొనియెను. ఏదిక్కునుండి పారిపోవుటకును మార్గము లేదు. ఇఁక నా గృహము లోని వారందులోఁ బడి చావవలసినదేనా? తప్పించుకొనుటకు దీని కేమియు నుపాయము లేదా? చేతులార ముట్టించుకొనిన యగ్ని జ్వాలనుండి తప్పించుకొనుట యనఁగా నేమి? గ్రీష్మతాపము వర్షా

గమమున శాంతింపవచ్చును గృహదాహమునుండి విశివశి తప్పించుకొనినను దప్పించుకొనవచ్చును. కాని హృదయదాహము నెవ్వఁడు తప్పించుకొనఁగలడు? ఇఁక దానిని జల్లార్చుటకుఁ దగిన యుపాయము లేదు - లేదు - ప్రాణత్యాగము చేయవలసినదే

# 27. ఏఁడీ

మాధవునకై వెదకుచున్న గోపాలునకు శ్యామల మరణవార్త తెలియవచ్చెను. మాధవుఁ డెక్కడనుండెనో యాతనికిఁ దెలియలేదు. పుత్రికామరణశ్రవణమున మృదులహృదయ యగుజనని యేమైపోవునో యని యాతని హృదయము కళవళపడఁజొచ్చెను ఆకారణమువ నాతని యడుగులు ముందునకుఁ బడకుండెను అతని దృష్టియంతయును దల్లిమీఁదనే యుండెను. ప్రేమమయి యగు మాతృదేవతకుఁ గష్టకాలమునఁ బ్రియతనయుఁ డొనర్పవలసిన విధాయక కృత్యమును నిర్వహింపవలయు ననునుద్దేశముతో నాతఁడు గృహాభిముఖుఁడై బయలుదేఱెను.

అతఁడు వచ్చునప్పటికిఁ జారుమతి మరణశయ్యపై నుండెను. ఆమె సర్వావయవములును శుష్కించిపోయినవి శోషింపఁగామిగిలిన రక్తమునందలి యుష్ణము తగ్గిపోయినది. శరీర మంతయును జాలిపోయినది, ముఖవికాస మింకను నాశ గొలుపు చుండెను. ఆ వికాస మాఱిపోవుచున్న దీపమునకుఁ గల వికాసమువంటిది ఆయాశ ప్రేమ ప్రేరకమైనది పరిచారికలు దీనవదనలయ్యు నామె కుపచారములను జేయుచు నుండిరి. నీలాద్రిరాజు శయ్యాపార్శ్వమునఁ గూర్చుండి స్వయంకృతాపచారమువలనం గలిగిన దుస్సహశోకానల జ్వాలలచే హృదయము పరితపించుచుండ లోలోనఁ గ్రుంగిపోవుచుండెను, మినుకు మినుకుమను చారుమతి కడసారి చూపు లాతనిపైఁ బ్రసరించుచుండెను; ప్రేమైకనిదానంబు లగునాచూపుల భావమును గ్రహించుట కాతనికి శక్తి చాలకుండెను. ఆమె చెప్పఁజాలకుండెను

ఆ సమయమున "కుమారగోపాలుఁడు" అను శబ్దము విన వచ్చెను. నీలాద్రిరాజు దిగ్భ్రాంతుఁడై పోయెను. హృదయాంతరాళ

మున వాకస్మికముగ నత్రిక్తంబైన యొక యవ్యక్త భావముచే నాతఁడు స్తంభితుఁడై పోయెను

"ఏఁడీ?" అను హీనస్వరముతోఁ జారుమతి మ్లానవదన మండలమున నొక ప్రేమకళ యుదయించెను, నీరసాలసలంబులై ముకుళీకృతంబులగుచున్న కనుగలువ లించుక వికసితము లయ్యెను. గోపాలుఁడు వచ్చి యామె యెదుటనే నిలువఁబడి యుండెను. ఒక్క చూపు - ప్రేమరససూర్జితం బగునొక్క చూపు - ఆ మాతృదేవత కన్నుల నుండి వెలువడి యాకుమారు నాలింగనము చేసికొని యెను. తోడనే ప్రేమ రసానుప్రాణితంబగు శోకరస మామె హృదయమునం దుప్పొంగి పోవుటచే నామె కన్నుల నుండి యుష్ణాశ్రుజలము వర్షింప నారంభించెను గోపాలుఁడు పట్టజాలని దుఃఖముతోఁదల్లి శయ్యపైఁ జదికిలబడి విలక్షణములైన యామె చూపులం జూచుచు "అమ్మా!" యని బిగ్గ అగ నొక కేక వైచెను. తోడనే యామె కన్నీటి నతికష్టముతో నడంచుకొని శక్తిహీనమైయున్న తన దక్షిణ కరము కినెట్లో యెత్తి కుమారు కంఠపార్శ్వమునఁ జేర్చి యస్పష్ట స్వరముతో ' కుమారా! విచా— రించ — క ము — భాగ్యమణి — యే—బావ—పెద్ద—చెల్లెలు— సుఖము— అని యూరకుండెను. శోకము కంఠసూర్జితమగుటచే నాయాస మధికమగుటచే నామె యిఁక మాటాడలేకపోయెను మరల నామె కనులు మూఁతపడి పోయెను. ఆతనికా యస్పష్టవాక్యముల యందలి భావము బోధయైనది కాని, గర్భశోకమున హృదయము పగిలి యిట్టి స్థితిలో నున్న తల్లి నాతఁడేమని యూఅడింపఁగలఁడు? దురూహమైయున్న కమలామాధవుల నేమము వాతఁడెట్లు చెప్ప గలఁడు? ఏమియు ననఁజాలక యాతఁడు తలవంచుకొని దుఃఖించుచుండెను

ఇంతటి దురాగతమునకుఁ గారణుఁడై కుమారుని మొగమును జూడఁజాలక నిర్విణ్ణుఁడై యున్న నీలాద్రిరాజు కన్నులనుండియు దుఃఖాశ్రుధారలు ప్రవహించుచునేయుండెను. ఆతని హృదయమున ననిర్వచనీయమగు బాధ యేదియో వేధించుచునే యుండెను. కాని,

నిరాశాశనిపాతమునం దల దిమ్మెక్కిపోవ జడప్రాయుడై యున్న యాతఁడప్పుడేమి సేయఁగలఁడు? తెలియకయే యాతఁడంతయు ననుభవించుచుండెను.

అతికష్టముతోఁ జారుమతి మరలఁ గన్నులు విప్పి భర్తవంక వొకసారి చూచెను. కొంతసేపట్లే చూచుచుండెను కాని నీలాద్రిరాజున కదియేమియును దెలియలేదు. ఆ చూపులలో నెట్టి భావమున్నదో యెవ్వరు గ్రహింపఁగలరు? ఆ చూపు క్రమముగా గోపాలునివంకఁ దిరిగెను. అదియే కడసారిచూపని గ్రహించి శోకోద్వేగము, నాఁపఁజాలక యాతఁడు మరల బిగ్గరగ "అమ్మా!" యని యొక కేకవైచెను. మాతృప్రేమోద్బోధకంబుగఁ దనయుని నాభికమలమునుండి హృదయమునుండి నోరార వెలువడి పవిత్రమైన యా కడసారి పిలుపు—ప్రేమశోక సూచకంబగు నాకడసారి పిలుపు—ఆమె చెవులఁబడియెను ఏదియో మాటలాడవలయునని యామె యధరమించుక చలించెను. కాని మాట రాలేదు. తోడనే యామె కన్నులు మూఁతలు పడిపోయెను. కన్నీ రింకిపోయెను అధరస్పందన మాఁగిపోయెను. ప్రియతనయునిపైనున్న చేయి జాఱిపోయెను. ఒక నిట్టూర్పుతో నామె ప్రాణవాయువులా మహావాయుసముద్రమునఁ గలసిపోయెను. అపుడా యంతఃపురమంతయు రోదనధ్వనులతో నిండిపోయెను.

## 28. ఇఁక విచారముకంటె నేమున్నది?

సర్వప్రియకారిణియై, సర్వసుఖస్వరూపిణియై సర్వానందదాయినియై యుండిన గోపాలుని మాతృదేవత యస్తమించిపోయెను. అతనికి జగమంతయు దుఃఖమయమైపోయెను. అప్పు డాతనికిఁ గమలా మాధవుల విషయమై విచారమతితరమైపోయెను తనయుఁడగువాఁడు తల్లి యనంతరమునఁ జేయవలసిన యుత్తరక్రియ లన్నియును యథావిధిగ జరిగిపోయెను. గోపాలుఁ డెవ్వరితోఁ ను మాటలాడుటలేదు ఆతని హృదయమంతయు దుఃఖాలోచనములతో నిండిపోయెను అట నొక నిమిషమాఁగుట యాతని కతికష్టముగా

నుండెను. అతఁడొక్కచో నొంటిగాఁ గూరుచుండి యాలోచించు కొనుచుండెను. ఆ యాలోచనము లతితీవ్రములై యుండెను అతని దుఃఖ మప్పుడు క్రోధముగాఁ బరిణమించెను అతని సకలాంగకములును గంపించి పోవుచుండెను. రక్త నాళములనుండి యుష్ణరక్త మతివేగముగ నుప్పొంగి ప్రవహించుచుండెను

ఆ సమయమున నీలాద్రిరాజు తనయుని యొద్దకు వచ్చి మెల్లగఁ గూరుచుండెను. గోపాలుఁ డాతనిం జూడఁ జాలక యధో వదనుఁ డయ్యెను ఎవ్వరును మాటలాడుట లేదు. అట్లు కొంతసేపు నిశ్శబ్దముగఁ గడచిపోయెను.

అప్పుడు నీలాద్రిరాజు హీనస్వరముతో "నాయనా' కడచిన దానికై విచారించకు.'' మనియెను.

గోపా—విచారముకంటె నిఁక నేమున్నది. ప్రాణమునకుఁ బ్రాణమైయున్న సోదరీమణి దారుణానలమున కాహుతి చేయఁబడి నది. ప్రాణాధిక ప్రియయగు మాతృదేవత ప్రేమ సముద్రమున ముంచివేయఁ బడినది. ప్రాణమైయున్న కమల విపదంధకారమున నగపడకుండఁ జేయఁ బడినది. ప్రాణసమానుఁడగు మాధవుఁడు దురంతకష్టముల పాలు చేయబడియెను. తండ్రీ! ఇఁక విచారము కంటె నేమున్నది.

నీలా—నాయనా! నేనిప్పుడు జీవించియున్నను మృత ప్రాయుడనై యున్నాఁడను, నీవు కూడ దుఃఖభరముచే వికల హృదయుఁడవైనచో దుర్గపాలనాభరమును నిర్వహించు వారెవ్వరు?

గోపా—తండ్రీ! ఇంకను దుర్గమేనా? ఇది మహాశ్మశానముగఁ జేయఁబడిపోయినది కదా?

నీలా—కుమారా! వచ్చిన కష్ట మెప్పుడు నిట్లె యుండదు. కొంచెము ధైర్యము వహింపవలయును.

గోపా—ఇంతకంటె నిఁకఁ గష్టము రాదు. ఇది తీఱువఱకును సుఖము లేదు.

నీలా—నాయనా! నిరుత్సాహ పడవలదు

గోపా—తండ్రీ! మీయనుగ్రహమున నుత్సాహము దూరమై పోయినది.

నీలా—నేను చేసినపని తప్పయినను, ఒప్పయినను మీ బాగు గోరియే చేసితిని గదా?

శోకవేగముననో, కోపతీవ్రతవలననోగాని గోపాలుని తాలిమి నిలుచుటలేదు అతఁడు మహావాయుసంక్షోభముచే సముద్రమువలె నుప్పొంగిపోయెను. ఆతఁడవరిపడి "తండ్రీ! ఇది యంతయును మా బాగుకొఱకేనా? అన్నరాజ్యము నపహరించుటకై కన్నబిడ్డను బలిసేయుట బాగుకొఱకేనా? ఆ కార్యకరణముల కభ్యంతరము గూర్చునేమో యను ననుమానముచే నతిప్రియుండగు మేనల్లుని నతిని గూఢముగఁ జంప సాహసించి సర్వనాశనము చేయఁజూచుట బాగుకొఱకేనా? అన్నబిడ్డ యడవులపాలై కడగండ్లఁ బడుచుండ నామె రాజ్యమును గన్నకుమారునిచేఁ బరిపాలింప జేయ నాసించుట బాగు కొఱకేనా? కాదు కాదు. పాపము కొఱకు—పాపభూయిష్ఠమగు నైశ్వర్యము కొఱకు—తండ్రీ! ఆత్మసమానుగఁజూచి యాదరించి యున్నయెడలఁగృతజ్ఞతలేక, యధికారమదముచే నాత్మజాతపై వాత్సల్యములేక, దురాశా పరవశత్వమునఁ బాపమనిన భయములేక, రాజ్యలోభమున దూరదృష్టి లేక, యపయశమనిన జంకులేక, ఇంతటి దారుణ కృత్యముల నాచరించితిరి ఆ కర్మమునకుఁ దగినఫల మనుభవింపవలసినదే కష్టపడి సంపాదించుకొనిన యీ రాజ్యమును సుఖముననో, దుఃఖముననో మీరే యేలుకొనుఁడు! పాపఫలమునో, పుణ్యఫలమునో మీరే యనుభవింపుఁడు. నాకీదుర్గము శ్మశానమువలె నున్నది. ఈపరివారమంతయుఁబిశాచ సముదాయమువలెనున్నది ఈ యైశ్వర్యమంతయు భస్మమువలె నున్నది. వేయేల? ఈలోకమే దుష్ట భూయిష్టముగాఁ దోఁచుచున్నది ఇట నేనిలువఁజాలను ఈ లోకమువ నా వికల్ప హృదయమునకు విశ్రాంతిం గూర్పు పదార్థ మెచ్చట నున్నదియో వెదకుకొనుచుఁబోయెదను. తండ్రీ! క్రోధ శోకావేగముచేఁ బితృగౌరవమునకు వ్యతిరిక్తంబులగు పలుకు లేవైన నా నోటినుండి వెలువడియెనేని క్షమింపుఁడు! ఇఁక నేఁబోయెదను.

అని చెప్పి గోపాలుఁడు కట్టుబట్టలతో నేయశ్వమునుండి తానచ్చటికి వచ్చెనో యా యశ్వమునే యధిరోహించి వెడలిపోయెను.

# 29. మనోవికారము

ఆకాశప్రాంతమున నుయ్యాలలూఁగువాని కాశాపాశంబులు తెగినచో నధఃపతనమే గతి యగును ఉన్నతస్థలపతనమునఁ గన్నులు చీఁకటులు గ్రమ్ముటచే జగమంధకారమయమైపోవును. స్మృతిరహితుఁడై, పడియున్న యాతఁడు దుఃఖప్రభంజనవీచికలలో మరలఁ దెలివిగాంచును ఆ కారణమున నాతనికి సర్వమును దుఃఖమయముగా గనఁబడుచుండును ప్రపంచమంతయు అసహ్యముగాఁ దోఁచుచుండును. అట్టివాఁ డధఃపతనంబునం గలిగినపాటున కోర్వక ధైర్యవిహీనుండై శోకించుటదక్క నేమియుఁ జేయఁజాలఁడు ఎంతటి కఠినచిత్తుఁడైనను ఎంతటి పాపకర్ముఁడైనను, అశాపాశంబులు సాగి తెగినపుడు, అధఃపతనము ప్రాప్తించినపుడు, అవయవములు చూర్ణీభూతములై పాటవంబు చెడినపుడు, శోకప్రతప్తంబై హృదయము కరఁగి నీరైనపుడు, తన వెనుకటిచేఁతలం దలచుకొని, ప్రస్తుతమూహించి, పశ్చాత్తప్తుఁడు గాక మానఁడు, ఏనిమిషంబున నాతఁడు పశ్చాత్తప్తహృదయుం డగునో యా నిమిషమే యాతని జన్మంబున నుత్తమమైనదని నిశ్చయముగాఁ జెప్పవచ్చును పరమనాస్తికుడు కూడ నట్టియవస్థలో నట్టినిమిషమునందే "నాకు దిక్కు లేదా? నన్ను రక్షించువా రెవ్వరును లేరా?" అని లోకావనుండగు జగదీశ్వరునికై మొఱ్ఱపెట్టుకొనును ఆ నాస్తికుని జన్మమధ్యమునం దానిమిషమత్యుత్తమమైనది కాదని యెవ్వరు చెప్పఁగలరు? పరివర్తనాశీలంబగు నా నిమిషము ప్రతిమానవుని జీవితమార్గమునందును బ్రత్యక్షమై యెప్పుడో యొకప్పు డెదురుకోలు గావించుచునే యుండును

నీలాద్రిరాజున కట్టి నిమిషమే ప్రత్యక్షమైనది ఆతఁడు పశ్చాత్తప్తహృదయుండై పరిపరివిధములఁ జింతింపసాగెను ఎవ్వని మేలు కొఱకీ యకార్యకరణములనుఁ గావించెనో, యట్టిపుత్రకుఁడే తన చేఁతలకు రోసి, తన్ను నిందించుచుఁ దన మొగమును జూడనొల్లక యెచ్చటికో వెడలిపోయెను. తన మూలముననే ప్రేమైకస్థానంబగు పుత్రికారత్నము ప్రాణంబులను గోలుపోయినది ఆ కారణముననే

యిహసంసారశకటంబునకు ద్వితీయచక్రరూపంబున నొప్పు సహచరి యిహలోకంబును వీడిపోయినది. ఇఁక నాశకటంబునకు గతి యెట్లుండును? అతనికి వెనుకను ముందును, నాకాశంబును భూమియు నంతయు నంధకారమయమై పోయెను. ఆశాలేశము లేని యా యంధకారములో సూర్యాస్తమయ మయ్యెను. ఆకాశ మధ్యమున గాఢాంధకారములు క్రమ్ముకొనియెను. ఏ మూల నాలకించినను దుఃఖద్యోతకంబులగు ప్రతిధ్వనులే వినవచ్చుచుండెను. ఒకప్పుడు కీరశారికల కలస్వనములతోడను, కోకిలా లాపములతోడను దుమ్మెదల ఝంకారములతోడను, మనోహరంబుగ శ్రుతిమోహనంబుగ నలరారు ప్రమదావన మిప్పుడాతనికి మహారణ్యమై పోయెను ఆ శోభన శకుంతసంతానకలకలారావములిప్పుడు వినవచ్చుటలేదు అతఁడా యుద్యానవనమున కభిముఖముగా నొక మందిర ప్రాంగణమునఁ జిమ్మచీఁకటిలోఁ గూర్చుండియుండెను. ఆకాశమునఁ దీతువుకూఁతలు భయంకరముగ వినవచ్చుచుండెను. ఏ చెట్టు మ్రోడు మీఁదనో, ఏ యింటి వంచగోడనో చేరి గుడ్లగూబ మనుష్య ధ్వనితో మూలుగఁజొచ్చెను. అట్టి భయంకరస్థితిలో నొంటిపాటున నుండెనేని యెంతటి ధైర్యశాలియైన గుండె పగిలి చావకమానదు. కాని యాతఁడా యంధకారమును జూచుటలేదు ఆ దుష్టపతంగముల భయంకరారావములను వినుటలేదు, సంపూర్ణదుఃఖావేగమున నాతని హృదయము తడియారియుండెను దానికి సంకల్పమును లేదు వికల్పమును లేదు అది శూన్యమైయుండెను అట్టి స్థితిలో నున్న యాతని నీప్రపంచకానుబంధములుగాని, అందలి భయంకరశబ్దములుగాని, భీషణస్వరూపములుగాని యేమియును జేయఁజాలవు. అతఁడీయవస్థలో నుండఁగా, బరిచారకులొకరిద్దఱు వచ్చి యాతని నిర్వికల్పన సమాధికి భంగమును గావించిరి. వార లాతని భోజనము సేయు మని బ్రతిమాలిరి, చంద్రకిరణ ప్రసారంబున నుప్పొంగు సముద్రమువలె వారి శీతల వచనంబులచే నాతని దుఃఖము పొంగి పొరల సాగెను అతఁడీవలకుఁ దనచెంత కెవ్వరిని రానీయలేదు. ఆ జ్ఞానావస్థలోఁ బడియున్నప్పుడు వారాతనిని మేలుకొలిపిరి. దానితోఁ

గూడ సర్వంబును స్మృతి పటంబున నిలిచి మేలుకొనియెను తన్మ యము నొందియున్న శోకమును దానితోడనే మేలు కొనియెను. జాగ్రదవస్థలో నున్న జగంబునకు శోకముదక్క నేమియును లేదని యాతఁడప్పు డనుకొనియెను పూర్వపరిచిత సుఖలేశము మినుకు మినుకుమనుచు నాతని స్మృతి పటంబునఁ బొడకట్ట సాగెను శోక ధారా ధరమునంటియున్న యీ సుఖలేశము చంచలా లతవంటి దనియు, నదియస్థిరమైన దనియు, శోక మొక్కటియే జగంబున స్థిరమైన దనియ నాతఁడు భావించుకొనియెను. ఈ భావాంతరము లలో నాతని కన్నుల నుండి యేకధారగా నశ్రుజలము వర్షింప సాగెను కొంతసేపు కన్నుల వెంట నశ్రువులు కాలువలై ప్రవ హించిన పిమ్మట—దుఃఖ ప్రవాహమున కించుక మొదటి వడి తగ్గిన పిమ్మట—హృదయ భారము కొంచెము శమించిన పిమ్మట-నాతఁడు తలయెత్తి పరిచారకులవైపు చూచి "నేఁడు నా కాఁకలి యగుట లేదు. అంతయును నా పొట్టఁ బెట్టుకొంటిని. నన్ను విశ్రాంతి నొంద నిండు మీరు వెడలిపొండు" అనియెను. ఒక పరిచారకుఁడు వడఁకుచు "ప్రభూ. చాలబడలియున్నారు. ఈ ప్రాంగణమున శయ్యా నమర్చితిని. ఇందు విశ్రమింపుడు," అని విన్నవించు కొనియెను. పిమ్మట నక్కడనుండి పరిచారకులందఱును వెడలపోయిరి.

అతఁడు కూర్చున్న చోటునుండి లేవలేదు. సుఖదుఃఖ విశ్రితం బులగు మనోభావంబు లుదయించి యొకదానితో నొకటి యొరసి కొని నిష్ప్రయోజనంబుగా నస్తమించి పోవుచుండెను. శ్యామల బ్రదికి వచ్చి "నాయనా! అమ్మ యెక్కడ నున్నది?" అని యడిగినట్లును, తానేమియును ప్రత్యుత్తరము చెప్పనేర కూరకున్నట్లును. శ్యామల చక్రవర్తిని బెండ్లాడు చున్నట్లును, అశుభసమయమునఁ దన ప్రేయసి లేకుండఁ బోయినట్లును దలఁచి యాతఁడు శోకింపసాగెను ఆ శోక ముతో నన్ని సుఖములు నెగిరిపోయినవి కన్నులువిచ్చి చూచునరి కంతయు నంధకారమే—హృదయ మంధకారపూరితమై యుండెను. ఆ యంధకారమున నొకొక్కక్క సంకల్పతటిల్లత మెఱసి పోవు చుండెను, అందుమూలమునఁగూడ నంధకారము మరింత వృద్ధియగు

చుండెను. దానిపై శోకాంధకారము క్రమ్ముకొని త్రిలోకముల నంధీభూతముగఁ జేసివైచెను.

ఆ గాంఢాంధకారములోఁ దనపాపకృత్యము లన్నియు మూర్తీభవించి భయంకర రాక్షస స్వరూపములతో వచ్చి యెదుట నిలిచి కరాళ వదన గహ్వరంబులు దెఱచుకొని తన్ను మ్రింగవచ్చు చున్నట్లును, తానగతికుఁడై కన్నులు మూసికొని కొయ్యవడి పోయినట్లును తన్ను రక్షించుదిక్కు లేనట్లును, దలంచుకొని యాతఁడొక కేకవైచి క్రిందఁ బడిపోయెను.

క్రమముగా నాతని'ఁ గొంత సేపటికి మరలఁ దెలివి గలిగినది గాని, శోకావేగంబునఁ బరిశ్రాంతములై యున్న యంగకములఁ గదలించుటకు శక్తి గలుగలేదు ఆ సమయమున నాతని కన్నులు మూతపడియెను. ఆతఁడు కన్నులు మూసికొనియే తన పాపకృత్యములం గూర్చి పర్యాలోచనంబు సేయసాగెను. ఆయాలోచనా మధ్యమున నాతఁడు నిద్రాభిభూతుఁడయ్యెను. శోకప్రతప్త హృదయుండై, పాపశంకాకులుండై, యవశుఁడై పడియున్న యాతం డప్పు డొక భయంకర స్వప్నమును గనియెను.

ఆ స్వప్నమున నీల మేఘాకారులును రక్తాక్షులును, భయంకర స్వరూపులు నగుయమభటులు వచ్చి యాతనిఁ జుట్టివైచిరి. వారల కాతఁ డందకుండఁ బోవలయు నని పై కెగసెను. అప్పుడాయమభటులలో నొకఁడు ముందునకు వచ్చి ' నీతో మేమును వియత్పథంబున రాఁగలము నీకు బొందితో నరక మున్నది. నడువుము!'' అని చెప్పఁగా నాతఁడు భయాశ్చర్యములతో ''బొందితో స్వర్గము ననుభవించిన సుఖ మున్నది. నరకమునందు సుఖము లేదు. నేను రాఁజాలను.'' అనియెను.

యమ—మేము నిన్నుఁ దీసికొని పోఁగలము.

నీలా—నేను రాకున్న నెట్లు తీసికొనిపోయెదరు?

యమ—పాశముల బంధించి—

నీలా—నా యాశాపాశములు తెగిపోయినవి నన్నిఁక నెట్లు బంధింపఁగలరు?

యమ—కర్మ సూత్రముల బంధించి తీసికొనిపోయెదము.

నీలా—నా కర్మముజోలి మీ కెందులకు? నా దారిని నన్నుఁ బోనిండు

యమ—నీ కర్మమునకుఁ దగిన ఫలమును నిర్ణయింప వలదా?

నీలా—నా కర్మఫలము నాకే తెలియును నిర్ణయించు వారొరు లెవ్వరున్నారు?

యమ—మా ప్రభుడు ధర్మస్వరూపుఁడున్నాఁడు. సర్వప్రాణుల ధర్మాధర్మములను బరీక్షించుటకును పాపాత్ములను శిక్షించుటకును నాతఁడే యధికారి.

ఆ మాటలు వినినతోడనే నీలాద్రిరాజు గడగడ వడంకుచు "నన్నా యముని యొద్దకుఁ దీసికొని పోవలదు. నాతనయ శ్యామలయును, నా ప్రేయసియు నెక్కడనున్నారో యక్కడకుఁ దీసికొని పొండు" అనియాయమ కింకరుని బ్రతిమాలుకొనియెను,

అప్పుడా యమ కింకరుఁడు గంభీర స్వరముతో "శ్యామలాదేవి నీతనయ యఁటరా? దురాత్మా! నోరు మూసికొనుము," అని గద్దించి పలుకుచు నాతనిజుట్టును బట్టుకొని క్రిందికి వంగఁదీసి రెండు గ్రుద్దులు గ్రుద్దెను. ఆ గ్రుద్దులతో నాతఁడు స్మారకము తెలియకుండ బడిపోయెను. మరల నాతనికిఁ దెలివివచ్చి చూచుసరికిఁ దానుయమసభాద్వారమున నిలుఁవబడి యున్నట్లు తెలిసికొనియెను అతని చెంత నొక యమభటుఁడు మాత్ర ముండెను

నవఘన శ్యామల శరీరుఁడును, ఆరక్త పద్మనేత్రుఁడును దీర్ఘ శ్మశ్రుపరిశోభితుఁడును, గంభీర వదన మండలుఁడు నగునొక మహాపురుషుఁడు ధర్మసింహాసనంబునఁ గూర్చుండి జీవుల పాపపుణ్యంబులను విచారించుచుండుట నాఁతడు గాంచెను. ఆ మహాపురుషుని సింహాసనమునకుఁ గ్రిందుగ నొక పురుషపుంగవుండు నిలువఁబడి చేతులు జోడించుకొని జీవుల పాపపుణ్య పరిగణనంబు చేయుచుండెను. ఆ మహాపురుషునకు వెనుకను ముందును గంభీరాకారు లగు వేత్రహస్తులు నిలువఁబడి యచ్చటి కరుదెంచిన జీవులసందడులం దీర్చు

చుండిరి ఆ మహాపురుషుఁడే యమధర్మ రాజనియు, నా పురుష పుంగవుఁడే చిత్రగుప్తుడనియు నీలాద్రి శా...హించుకొనియెను.

ఆ సమయమున యమధర్మరాజు చిత్రగుప్తుని యొద్దనున్న లెక్కలను బరిశోధించి, జీవుల పాపకృత్యంబులఁ బరిగణించి వారి వారికిఁ దగిన శిక్షల విధించుచుండెనని నీలాద్రిరాజు గ్రహించెను. అప్పుడిరువురు యమభటులు లోపలినుండి వచ్చి నీలాద్రిరాజు చెఱి యొక జెక్క యును బట్టుకొని యక్కడనుండి మఱియొక ప్రక్కకు కీడ్చుకొని పోఁజొచ్చిరి నీలాద్రిరాజా యవమానమునకు సహింపక "నన్నెక్కడ కీడ్చుకొని పోయెదరు?" అని వారలఁ బ్రశ్నించెను అందుల కాభటులలో నొకఁడు "నిన్ను నరకలోకం బంతయుఁద్రిప్పి మఱి రాజసమ్ముఖమునకుఁ దీసికొనిపోయెదము," అని ప్రత్యుత్తర మిచ్చెను ఆఁతడా యమభటులతో నరకలోక సందర్శనమునకై బయలుదేఱెను.

ఒకచోట సలసల మరిగిన నూనియం జల్లుచుండుటచేఁ గొందఱు జీవు లేడ్చుచుండిరి ఒక చెంతఁ దెగియుఁ దెగని కత్తులతో నఱుకఁ బడుచున్న కొందఱుజీవులా బాధ కోర్వక కొట్టుకొనుచుండిరి మఱి యొక తావునఁ గొఱుత వేయఁబడిన జీవులు గోలుగోలున గోల పెట్టుచు నాపోవుచుండిరి, ఇం కొకదెస నినుపముళ్లపై నడపింపఁ బడుచు, నడుగడుగునకు మొఱ్ఱోయని కేకలు వేయుచుండిరి వేఱొక చోట గండ్రగొడ్డండ్రచేఁ గ్రూరముగఁ దెగఁగొట్టఁబడి, కరపదహీనులై కొందఱు దొరలాడుచు మూల్గుచుండిరి ఏమూలఁ జూచినను నేడ్పులే. ఏవంక వీక్షించినను రోదనములే. అంతయు యాతనామయమై కన్పట్టుచుండెను. ఆయాతనా మయలోకమును జూచుసరికి నీలాద్రిరాజు ప్రాణములు నిలువున నెగసిపోవు చుండెను "నేనీ శాములను జూడఁజాలను. నన్నెక్కడకైన మఱియొక తావునకుఁ దీసికొని పొండు" అని యాతఁడాయమ భటులను బ్రతిమాలు కొని యెను. 'మేము ప్రభునానతి చెల్లింతుముగాని నీ యిష్టమొచ్చినట్లు చేయఁజాలము" అని వారు ప్రత్యుత్తర మిచ్చిరి,

క్రమముగా నాతని నొకవేడి నూనెకాలువయొద్దకుఁ దీసికొని

పోయి "నీవీ కాలువలో మునుఁగుము. నీ పాపపు దేహమిందులో నూడిపోవును. అప్పుడు నిన్ను మా ప్రభువునొద్దకుఁ బాప ప్రత్య పరిత్యాగమై తీసికొని గొదుము. ఆయన విచారణచేసి నీ పాపములకుఁ దగినదండనమును విధించును పిమ్మట నీ వాదండనముల ననుభవింప వలసి యుండును." అని చెప్పిరి అతఁడా మాటలను విని గోలు గోలున నేడ్చుచు "నేనీ బాధల—ఈయమయాతనల ననుభవింపఁ గలనా? ఇఁక నా కేమియును దిక్కులేదా?, అని వాపోవఁజొచ్చెను అప్పుడా యమభటు లాతని గట్టిగఁ బట్టుకొని యాకాలువలోనికి విసరివైచిరి అప్పుడాతఁడు కెవ్వున నొక్కకేకవైచి కన్నులు విచ్చెను.

అతఁడు కన్నులు విచ్చి చూచుచున్నను నా యమలోకమే ఆ యమయాతనలే కనఁబడుచుండెను. కాని, నిజముగ నప్పటికి సూర్యోదయమయ్యెను. ఆసమయమున వీధి వెంట నొకజంగమవాఁడు గంట మ్రోఁగించుకొనుచు 'శివలింగశివలింగ శ్రీకాళహస్తీశ్వరా!" అని పాడుకొనుచుఁ బోవుచుండెను, ఆపాట లాతనిచెవులలోఁ బడియెను అప్పుడు నీలాద్రిరాజు "హా! కాళహస్తీశ్వరా! రక్షింపుము! రక్షింపుము! అని శయ్యనుండి లేచెను అతఁడు లేచుసరికి రాజవైద్యుఁడా తనిచేతినిపట్టుకొని వాడిని బరీక్షించుచుండెను రాత్రి స్మారకము తెలియకుండఁ బడిపోయినయాతనినెత్తి సేవకు లాశయ్యపైఁ బరుండఁ బెట్టిరి. రాజవైద్యుడు చేయిచూచి జ్వరము తీవ్రముగా వచ్చినది. మందు నంపించెదనని వెడలిపోయెను. నీలాద్రిరాజు భయకంపితుఁడై యేమియును దెలియనేరక మరల శయ్యపైఁ బడిపోయెను.

## 30. పిట్టయెగిరిపోయినది

అది హేమంత కాలము. కొండగాలి రివ్వురివ్వున వీచుచు లోక మును గడగడ వడఁకించుచుండెను. ధనికులు విలువగలయున్ని వసనం బులం గప్పికొని చలిబాధ నపనయించుకొనుచుండిరి సామాన్యులు గొంగళులు మొదలగుముదుగుదుప్పటంబులచే గాలక్షేపము సేయు చుండిరి. జనపదములయందలిబీదలు మంటికుంపట్లయందగ్నిని ప్రజ్వ

లింపఁజేసి దానిమూలమున శీతబాధ నివారించు కొనుచుండిరి, అకవుాయయందును. గొండసమీపములందును గాపురములుచేయుచున్న కోయలు మొదలగునడవిజాతి వారు నెగడుల నంటించి వానిచుట్టును లోకాభిరామాయణములం జెప్పుకొనుచు రాత్రులు వేగించుచుండిరి పులి మొదలగు ఘాతుక మృగములుకూడ జలిబాధకోరువక మనుజులు విడిపోయిన నెగడులదరిఁ జేరి చలిగాచుకొనుచుండెను ఏమూల వాలకించిన మహాకారంబులే వినవచ్చుచుండెను ఇతర కాలంబులయం దొక్కరికైనఁ జాలనిశయ్యాతలంబు లిప్పు డిరువురకు, ముగ్గురకు, నలువురకుఁ గూడ సరిపడుచుండెను. అ కాలమహిమ యేమియో గాని నవయువకులు సైతము తొంబదియేండ్లతొక్కులవలె సంకుచితులై కన్పట్టుచుండిరి. దంపతు లెల్లవిధములఁ బ్రణయ కోపములు మాని, యొండొరుల బ్రతిమాలుకొనకయే యనాహూతులయ్యు, మెల్లమెల్లగ దరిజేరి ప్రక్కవాయక మెలగుచుండిరి జగచ్చక్షువగు నాదిత్యుఁడు గూడ నాచలికి వెఱచి తన యాత్రా కాలంబగు పగటిపూట నంతలో ముగించుకొని చలిగాఁచుకొనుటకై సముద్రములోని బడబానలము చెంతకుఁగాఁబోలును బరువుపరువునఁ బోవుచుండెను. సాక్షాదగ్నిస్వరూపుఁడగు నాదినరాజే శీతబాధ కోరువక పారిపోవుచున్నప్పుడిఁక సామాన్యలోకముమాట చెప్పనేల?

అట్టి హేమంతఋతువున నొకనాఁటి సాయంకాలమందుఁ గృష్ణానదికుత్తర పార్శ్వమునఁగల యొక మహారణ్యమునందు కొండపల్లియలో నొకయాకుటింట డెబ్బదివత్సరముల వయసుగల వృద్ధుఁ డొకఁడు తన తలవాకిటనున్న నెగడియొద్దఁ గూర్చుండి చలిగాచు కొనుచుఁ గునుకుపాట్లను బడుచుండెను. ఆ కునుకుపాట్లలో నాతఁ డస్పష్టముగ నేమేమియో గొణుఁగుకొనుచుండెను. ఈ విధముగ నొక గడియ సేపటివఱకును నాతఁడు కన్నువిప్పకుండఁగనే వెనుకము దుల కూఁగుచుఁ గూర్చుండెను. అంతలో నాకస్మికముగ నాతఁడు పిట్ట యెగిరిపోయినది. సలిలా! పిట్ట యెగిరిపోయినది,' అని గట్టిగఁ బలవరించెను ఆ పలవరింతను విని లోపలినుండి పదు

నా కేండ్ల బాలికయొకర్తు పరువెత్తుకొనివచ్చి "దాదా! ఏమిది? పలవ రించుచుంటివా?" అని హెచ్చరించెను

వృద్ధుఁడు తటాలునఁ గన్నులువిచ్చి నలుగెలంకులఁ జూచి యా కసమునకు దృష్టి సారించెను. కాని, యాతని కంధకారముతక్క నేమియు నగపడలేదు అప్పు డాతఁడు నలిలవైపునకుఁ దిరిగి, "తల్లీ! నా తపస్సు పండినది. ఆ మహానుభావునిదర్శనమైనది కాని పిట్ట యెగిరిపోయినది " అనియెను.

నలిల యాశ్చర్యముతో "ఆ మహానుభావుఁ డెవ్వఁడు? పిట్ట యేమి?" అని యడిగెను.

వృద్ధుడు గద్గదస్వరముతో "తల్లీ! నా పుణ్యము పండినది. శ్రీ బుద్ధదేవుఁడు సాక్షాత్కరించినాడు.' అనియెను

ఆ వృద్ధుఁడు బుద్ధమతావలంబి, సుశీలుఁడు నలిల యాతనిం గాంచి మఱియు నాశ్చర్యముతో "అప్పా! స్వప్నమును గాంచితివా యేమి?" అని యడిగెను.

వృద్ధుఁ డానందంతో "ఔనౌను సుస్వప్నమునే కాంచితిని ఆ స్వప్నమును జెప్పెదను వినుము." అనియెను,

నలిని హర్షోత్కంఠయై "చెప ము, చెప్పుము" అనియెను

వృద్ధు—నే నాబుద్ధదేవునిగూర్చి వజ్రపీఠిఁ గూర్చుండి తపసు చేయుచుంటిని. లోకావనుండగు నా మహాదేవుఁ డొంటిగా నా యెదుట నున్న మహారణ్యములో సంచారము సేయుచు సమస్త జంతు జాలమును దనశాంత తేజముతో రక్షించుచుండెను అట్టిసమయమున దేవదత్తుఁడను నొక రాజన్యుఁ డా యరణ్యమునకు వేఁటకై వచ్చి నోరెఱుంగని యొక పక్షిని దన నిశితబాణమున కెరఁజేసెను అప్పు డాపక్షి కివకివ మని యఱచుచు నొక జలాశయమునఁ బడిపోయెను నే నాత్రముతో నాదిక్కునకు బరువెత్తితిని శ్రీ బుద్ధదేవుఁడుగూడ నతిత్వరితముగ నా చోటికి వచ్చి యాపక్షి నెత్తిపట్టుకొని దాని రెక్కలను నిమురుచు "కరినచిత్తుఁడా! నోరెఱుంగని యీ పక్షి నీ కేమి యపకారము చేసినది?" అని యామృగయుని మందలించుచు నా పక్షిని నాచేతఁబెట్టి "దీని ఱెక్కపై బలమైన గాయము తగిలినది.

దీనిని నీవు సంరక్షింపుము నా దివ్యత్వము నీకు గోచరించును" అని యదృశ్యుఁ డయ్యెను. నేనా పక్షికి జలాహారముల నిచ్చి సంరక్షించుచు దాని గాయమును మాన్పితిని. గాయము కుదిరినవెనుక దానిని నా చేతిపై నుంచుకొని మేను నిమురుచుండఁగా నా పిట్ట యెగిరిపోయినది. ఎగిరిపోవలసినదే. దానికి ఱెక్కలు వచ్చినవి, ఇఁక నేమియును భయములేదు. సర్వభూతసమత్వము (శ్రీ) బుద్ధదేవుని తత్త్వమని నాకిప్పుడు బోధపడినది, ఆ మహాదేవున కభివందనము నేయుచు "పిట్ట యెగిరిపోయినది" అని చెప్పితిని.

సలిల యా వృత్తాంతమును విని నిర్వేలపాటుతో నేమియో యాలోచించుకొనసాగెను ఇంతలో నావృద్ధుని యొద్ద కొక యువనుఁడు వచ్చి నిలిచెను. సలిల లోపలికిఁ బోయెను. అప్పు డా యువనుఁడు "తాతా! ఆ చిన్నది సేమముగా నున్నదా?" అని ప్రశ్నించెను.

వృద్ధు—ఫల్గునుఁడా? నాయనా! వచ్చితివాఁ ఆ బాలిక సుఖముగా నున్నది—కాని—

ఫల్గు—కాని యేమి?

వృద్ధు—ఆమె సోదరుఁ డిచ్చటికి వచ్చి యామెను దీవికొని పోయెను.

ఫల్గు—ఆమె సోదరుని నీ వెఱుంగుదువా?

వృద్ధు—నే నెఱుఁగను

ఫల్గు—అట్లయిన సోదరుఁ డని నీ వెట్లనుకొంటివి?

వృద్ధు—ఆ బాలికయే యీతఁడునాయన్న, ఈతనితో నన్నుఁ బంపవలయునని వేఁడుకొన్నది అదియును గాక లక్ష్మీపతిరాజొక కన్యకకై కొలఁదిసేనతో విడివడి వెదకు చుండె నని వినియుంటిని. అతఁడు వచ్చినచో నేమి యపాయము వచ్చునో యని యెంచి, యామెను సోదరునితో పంపివైచితిని.

ఫల్గు—లక్ష్మీపతిరా జుత్కళేశ్వరుని సేనానిగాఁడా?

వృద్ధు—అవును. ఒక కారణమునఁ గొలఁది దినముల క్రిందటనే నిడుఁబ్రోలు దుర్గనాయకుఁడు కూడనై యుండెను

ఫల్గు—మంచిపనిచేయే జరిగినది, ఎక్కడ నైననేమి యామె సేమముగ నుండినఁ జాలును

వృద్ధు—నీ వెందాకఁ బోయివచ్చితివి?

ఫల్గు—నేను కటకమువఱకును బోయివచ్చితిని

అని వారిరువురును కొంత సేపేమేమియో ముచ్చటించుకొనిన పిమ్మట నా వృద్ధుఁ డాతనిని లోనికిఁ దీసికొనిపోయెను. ఫల్గునుఁ డారాత్రి యా వృద్ధునియింట భుజియించి తెల్లవాఱుజాము నాతని యొద్ద సెలవుగైకొని తనదారిని వెడలిపోయెను.

# 31. అవస్థానము

దక్షిణకాశి యని ప్రఖ్యాతిగాంచిన కాళహస్తి నగరమునకు భారత వర్షమునందుగల యాత్రికులనేకులు వచ్చి పోవుచుందురు ఆ నగరము సువర్ణముఖి నదీతీరంబున విరాజిల్లుచుండును. గంగానదికి సోదరియైన యాసువర్ణముఖయందుఁ గ్రుంకినజనులు పాపపంకంబు నుండి విడివడి పరిశుద్ధులగుదురని పెద్దలు చెప్పుదురు ఆ నగరమున వేంచేసియున్న శ్రీ కాళహస్తీశ్వరుండు తన్ను సేవించు భక్తాగ్రేసరు లకుఁ గైవల్యంబు నొసఁగునఁట. ఆ జగదీశ్వరుని సందర్శనార్థము భక్త జనులనేకులా పురంబున వచ్చి యందు వాసంబు చేయుచుం దురు అందువలన నా పరమేశ్వరుని యాలయంబు నిత్యోత్సవంబు లతో నొప్పారుచుండును. నేఁటికి వారముదినములనుండి యాయాల యమువిరతోత్సవములచే నలరారుచుండెను. ఆ యుత్సవము లచటికి నూతనముగ విచ్చేసిన యొక ప్రభువరునిచేఁ జేయింపఁబడుచుండెనని జనులు చెప్పుకొనుచుండిరి.

ఆయాలయము సమీపమున నున్న యొక మందిరమున జనుల సందడి హెచ్చుగానుండెను రాజభటు లామందిరద్వారమున నుండి కావలిగాచుచుండిరి కాని వారు వచ్చిపోవుజనుల నాటంక పఱుచుట లేదు ఆ గృహద్వారమున నొక పిచ్చిది నిలుచుండి,

"పూవులను గోలుపోయిన తీవమిన్న

గాలిపాటున నేలపై వ్రాలిపోయె

గగనకుసుమంబు రాలుట కల్ల గాని
ఆలతాపాతమున వృక్ష మఱగునేమొ' ”

అని యేమేమియో పాడ కొనుచుండెను.

భవనానంతరమున విశాలమగు చావడియం దొక శయ్యపై నొక రోగి పరుండి మూలుగుచుండెను ఆతని చుట్టును బరిచారకు లుండి వలయునుపచారములఁ జేయుచుండిరి ఒక వైద్యుఁడు తేనెతో నౌషధమును కలిపి రోగి కిచ్చెను రోగి యా యౌషధమును సేవించెను గడియసేపైనపిమ్మట రోగి వైద్యునివంకఁ జూచి 'శ్వాసక్లేశ మించుక తెలిపిగా నున్నది. కాని, గర్భగోళమున మిగుల యాతనగా నున్నది ఈ యమయాతన యెట్లు తప్పఁగలదు?'' అని ప్రశ్నించెను.

వైద్యు—అది జ్వరతీవ్రత. మఱియొకగడియ యైనపిమ్మట దానికిఁ దగిన యౌషధము నిచ్చెదను

రోగి—గడియలు యుగములుగా నున్నవి ఈశ్వరాజ్ఞ యెట్లున్నదో?

వైద్యు—భయము లేదు మీ ప్రాణములకు నా ప్రాణము లడ్డువైచెదను

రోగి—నేను చావునకు భయపడుట లేదు—

వైద్యు—మఱెందులకు?

రోగి—యమునకు—

వైద్యు—ఈశ్వరధ్యానము సేయుఁడు. ఆ భయము నుండదు.

రోగి—ఈశ్వరధ్యానమే చేయుచున్నాను—కాని—మనసు పరధ్యానముగా నున్నది అక్కటా! శ్యామల వచ్చి యెదుట నిలుచుండి. పలుకరించు చున్నది. నా ముద్దుబిడ్డను నా చేతులారఁ జంపుకొంటిని అయ్యో! ఇఁక నెక్కడి యీశ్వరధ్యానము?

వైద్యు—గతమునకై చింతింపకుఁడు—మనసును కలఁత పెట్టుకొనకుఁడు. మనసు స్థిరముగాలేనిచో రోగము మఱింత వృద్ధి యగును.

రోగి—మనసు నిలుకడగా నెట్లుండును? నేను పాపాత్ముఁడను సర్వనాశకుఁడను. నేను గావింపని దుష్కార్య మేమున్నది?

వై—అది యంతయును మఱచిపొండు, ఈశ్వర స్మరణము చేసికొనుచు నెమ్మదిగా నుండుఁడు.

రో—అట్లే—అట్లేకాని—మనసు చలింపకుండ నేమైన మందియ్యఁగలరా?

వైద్యు—రోగము మళ్లినచో నవయవములు కుదుటఁబడును. శరీర పాటవ మించుక చేరినచో మనసునకు దృఢత్వము కలుగును. కొంచె మోపిక సేయుఁడు.

అని చెప్పి మరల నొకగడియ యైనపిమ్మట వైద్యుఁ డారోగి కింకొక క్రొత్త యౌషధము నిచ్చి రెండు గడియలవఱకు నెవ్వరితో డను మాటలాడకుండఁ బరుండుఁడని చెప్పి యక్కడనుండి వెడలి పోయెను.

ఈరోగి మనసీలాద్రి రాజే. తన పాపకృత్యములకుఁ బశ్చాత్తప్త హృదయుఁడై యేకాకియై స్వగృహమున నుండవెఱచి దక్షిణకాశి యని ప్రఖ్యాతివడసిన యీ పుణ్యక్షేత్రమునకుఁ బరివారయుతుఁడై వారము దినములక్రిందటనే వచ్చి యీ గృహమున విడిసెను. అతఁడు మొట్టమొదట మనః క్లేశమునకు లోనై, నిద్రాహారములను నియమిత కాలానుగుణంబుగఁ గావింపక రోగగ్రస్తుం డయ్యెను. నాఁటి రాత్రి స్వప్నమునఁ దన యనుభవమునకుం దోఁచిన యమలోక సందర్శ మును, యమదూతలను జూచి భయక్రాంతుఁడై కాళహస్తీశ్వరు నాశ్రయమున యమబాధలఁ దప్పించుకొనవచ్చునని యిచ్చటికి విచ్చేసి యీ మహాదేవునకు నిత్యోత్సవములఁ గావించుచుండెను. కాని హృదయ దౌర్బల్యమున నాతనికి దినదినమును రోగము హెచ్చుచుండెను.

నేఁటిరాత్రి రెండుయామము లయ్యెను. గృహమున నందఱును గాఢనిద్రాపరవశులై యుండిరి ఒకవృద్ధ పరిచారిక మాత్రము రోగిశయ్య యొద్దఁ గూర్చుండి కునికి పాట్లను బడుచుండెను, అప్పు డాకస్మికముగ నీలాద్రిరా జొక కేకవైచి యులికి పాటున శయ్యనుండి లేచి "అదిగో! శ్యామల!—శ్యామల! నా తల్లీ! యము డేమన్నాఁడు? నన్నాదండనమునుండి తప్పింప వచ్చితివా?' అని ప్రక్క

మున్న పరిచారికను గట్టిగఁ బట్టుకొనియెను ఏమరుపాటున నున్న యాపరిచారిక కెవ్వున నొకకేకవైచి యాతని వైపునకుఁ జూచి, "అయ్యో! ఏమి మూఁడినదిఁ ఏమి మూఁడినదిఁ" అని కళవళ పడ జొచ్చెను

ఆ కేకలతో నా చుట్టుపట్టుల నిద్రించుచున్న సేవకులు సరు వెత్తుకొని వచ్చి యావృద్ధపరిచారిక నాతని పట్టునుండి తప్పించి, యాతనిని మరల శయనింపఁజేసిరి రోగి "అదిగో! శ్యామల! ఇదిగో శ్యామల!" అని కేకలు వేయసాగెను. ఆ కేకలను విని భయపడి యొకసేవకుఁడు ప్రక్కగదిలోఁ బరుండియున్న వైద్యునిఁ దీసికొని వచ్చెను. ఆతఁడు వేగముగ రోగియొద్దకు వచ్చి నాడిని బరీక్షించి చూచి "జ్వరము తీవ్రముగా వచ్చినది ఈ కేకలు సన్నిపాతలక్షణములు." అని చెప్పి యందులకుఁ దగిన యౌషధము ననుపానముతో రోగి కీయఁబోయెను. ఈసారి వాడుక చొప్పున నారోగి యౌషధమును సేవింపక క్రిందికిఁ ద్రోసివైచెను అప్పుడుఁ వైద్యుడు మరల నౌషధము ననుపానముతో గలిపి యిరువురి సేవకుల సాహాయ్యమున రోగిగళమున బోసెను, కాని యా యౌషధమునుగూడ నాత డుమిసివైచెను, ఆతఁడు "రమ్ము! శ్యామలా! రమ్ము! యమభటులు నన్నుఁ గొట్టుచున్నారు." అని కేకలు వైవసాగెను, ఆతఁ డెవ్వరినిఁ జూచినను, "శ్యామలా! వచ్చితివా? రమ్ము! నా ప్రాణములను గాచుకొమ్ము. యమభటులు వచ్చియున్నారు." అని కేకలు వేయసాగెను ఔషధమును మ్రింగుటకై వైద్యుఁ డనేకోపాయములను జేసెను కాని యవియన్నియు వ్యర్థయయ్యెను రోగిసంధిగుణము లంతకంతకు ముదిరిపోవుచుండెను,

"యముని‌ఁ గొట్టుము శ్యామలా!
యమభటుని గొట్టుము శ్యామలా!!"

అని పిచ్చిపిచ్చి పాటలను పాడఁదొడగెను మంచముపై నలుగురు పట్టుకొనిన నాఁగక యెగిరిపడుచుండెను.

ఆ సమయమున వెలుపలినుండి యొక పిచ్చిది లోపలికి వచ్చి యాపరిజనుల మధ్యమున నటునిటుఁ దిరుగుచుఁ గనఁబడినవాని నెల్లఁ జూచి, "ఈతఁడు పిచ్చివాఁడా? అంతమందితో యుద్ధ మెందులకు?

ఒక్కఁ డందఱిని గొట్టఁగలఁడా? ఆఁడుది యెవ్వరిని గొట్టఁగలదు? ఆతని నెందులకుఁ గొట్టుచున్నారు? ఏడ్చుచున్నాఁ డేమి?" అని వెఱ్ఱి వెఱ్ఱిప్రశ్నలను వేయసాగెను. ఆ గందరగోళములో నెవ్వరు నామె ప్రశ్నములకుఁ బ్రత్యుత్తరములు చెప్పువారు లేరైరి ఆ పిచ్చిది యా యింటఁ దన యిచ్చవచ్చిన ట్లెల్లఁ దిరుగుచుండెను, కాని యామె నెవ్వరు నడ్డగింపరైరి అందఱు తమ యజమానున కెట్లుండునోయని వికలచిత్తులై యటునిటుఁ దిరుగుచుండిరి.

క్రమముగాఁ దెల్లవాఱుసమయము కావచ్చెను. అప్పటికి నీలాద్రిరాజునకు నోటమాట లేకుండఁబోయెను ఆ నిమిషమున కాని మిషము రోగి భయంకర సముద్రమున మునిఁగిపోవుచుండెను. రోగి పండ్లు గిట్టగఱచుకొనిపోయి కాళ్లును జేతులును దిరిగిపోవుచుండెను. ఆతఁడు యాతననొందుచు కడసారి యొకమాఱు పెదవులను గద పుచు నస్పష్టముగ శ్యా—మ—ల—"అనియెను. ఆ వాక్యముతో డనే యాతని ప్రాణవాయువు లీవలికి వచ్చెను అందఱును గొల్లు మనిరి: ఆసందడిలో నెవరి చేతికిఁజిక్కిన వస్తువాహనములు వారు సంగ్ర హించుటకై ప్రయత్నించుచుండిరి, కాని విశ్వాసముగల యొకరిద్దఱు పరిచారకులు తమప్రభుని యాస్తిని జాగ్రతపెట్టుటకై కాచుకొని యుండిరి అట్టి కల్లోలసమయమున రోగి యున్న ప్రక్క గదినుండి యిందాఁకటిపిచ్చిది యొక ప్రాఁతపేలికలమూట నెత్తిపై నుంచుకొని,

"ప్రాఁతీ పేలిక! నీ పురిత్రాడు వగుము
యుప్పొంగకుండ నేఁ కట్టివైతు."

అని పాడుకొనుచు నా యిల్లు విడిచిపోయెను.

—————

శ్రీరామచంద్ర

# ప్రమదావనము

## ద్వితీయ భాగము

### 1. అతఁ డెవ్వఁడు

"సమ్మర్దక్షుమధీనిబంధన విధా సంక్రందనాచార్య శూ
రమ్మన్యాచలవజ్ర పాతజగతీ రక్షాంబుజాక్షాకర
ధ్యమ్మార్గస్థదశాప్య రాజ్యసమప హ్యాద్రోద్భవాతీరభా
గుమ్మత్తూరిశివంసముద్రపుర వప్రోన్మాల నాడంబరా!—"

రాజభవనమునొద్ద వైతాళికు లీవిధముగాఁ గీర్తించుచుండిరి. భేరికాహాళధ్వనులు ఘనభోంతరాళముల నిండి ఘోరుకొలుపుచుండెను, తెల్లవాఱుచుండెను. క్రీడా సరోవరములనుండియుఁ గంధకముల నుండియు వికచకమల పరిమళములఁ గొల్లగొని ప్రత్యూషపవనము వీతెంచుచుండెను. మంగళ గీతము లాశీతలవాతపోతంబుల కంటెను జల్లనై శ్రుతిసుఖము నాపాదించుచుండెను, రాజమందిర ప్రాంతము నందలి బయలంతయును జనులతో నిండిపోయెను. శ్రీకృష్ణదేవ మహారాయలు దక్షిణ దిగ్విజయముం జేసి సంపూర్ణోత్సాహముతో నుండుటచే నప్పటి శరన్నవరాత్రముల యందలి వేడుకలు విశేషించి యుండెను, ఆ పర్వదినంబులలో నానగర మంతయు దేవతారాధనముల తోడను, వారాంగనా నృత్తగీతాదికంబులతోడను,

మంగళ వాద్యంబులతోడను, సాము గరిడీల తోడను, సకల సుఖా నందములతోడను, సంపూర్ణమై యుండెను. ఏవంకc జూచినను వినోదములే, ఎట నాలకించినను మంగళగీత వాద్యములే ఎటు వోయినను సముత్సాహపరవశులగు జనుల సమర్దమే. నగరమంత యును జనమయమై యుండెను మణి సౌధము లన్నియును రమ ణీయములై యుండెను శ్రీకృష్ణదేవ మహారాయని దివ్యశక్తి జగ మంతయు నొక్కచోc జేర్చివైచెనో యనునట్లుండెను.

తెల్లవారు ప్పటికి సకల సేనలును, సేనా నాయకులును, సామంత ప్రభువులను గూడ సార్వభౌమ సందర్శనమునకై రాజభవన ప్రాంతమునందలి యా విశాల ప్రదేశమువం గాచికొని యుండిరి. ఒక్కటే మాదిరి గలయుడుపులం దొడిగికొని భుజంబులపైన జికిలి చేసిన బల్లెములందాల్చి మొగంబుల నుత్సాహశక్తి తాండవించుచుండc గాల్బలమంతయు నర్ధ చంద్రాకృతిగ ముందటిభాగమున నిలువcబడి యుండెను ఆ పదాతి జనులనిశితభల్ల ముఖంబుల నుదయ కాంతులు ప్రతిఫలించుచు భావి ఘనస్సంగరమును సూచించుచుండెను ఆ వెనుక నాశ్వికవీరులు కవచోష్ణీషధారులై తమ తమ యుత్తమాశ్వముల నధిరోహించి యొకవంకన గటితటమునుండి కరవాలములు జీరాడు చుండ, నొకవంక భుజంబులపై భల్లముఖంబులు మెఱయుచుండ రూపొందిన వీరశృంగార మూర్తులవలె నున్నత వదనులై రాజస్థాన మున కభిముఖముగ నిలువcబడి యుండిరి. ఆ యుత్తమాశ్వములు కూడ మోరలు పైకెత్తి సకిలించుచుc బ్రభుసందర్శనమును నిరీక్షించు చున్నట్లుండెను ఆ వెనుక వివిధాయుధ సంకలితంబు లగు భద్ర గజంబులపై నుచిత వస్త్రాభరణాలంకృతు లగు దండ నాయకులు తమ తమ బిరుదు పట్టములు మెఱయుచుండ నధిరోహించి యుండిరి. వడగొండలవలె నున్న యామదమాతంగములు హృదయోత్సాహ ముచేc దుండముల సారించుచు ముందటి కూcగుచుండ వానిపార్శ్వ ములం జీరాడు విజయ ఘంటానినాదము లోంకారస్వరమును జీవింపc జేయుచుండెను సామంతమహీపతులు తమ తమ గౌరవములకుం

దగురీతి నుచిత వేష భూషణములచే నలంకృతులై సార్వభౌమ సందర్శనోత్కంఠితులై యుండిరి.

ఎట్టయెదుట సమున్నత ప్రదేశమున నిర్మింపఁబడిన విశాల ప్రేక్షా భవన గోపురములపై బిరుదు కేతనములు ప్రభాత వాతములతోఁ గూడ నాట్యము చేయుచుండెను ఆసందర్శన సభామండపము నందలి స్ఫటిక శిలాకుట్టిమము నుండి చంద్రకాంతమణి సోపానముల క్రిందివఱకును నమూల్య రత్నకంబళములు పఱుపఁబడి యుండెను. ఆసభా మండపమధ్యమున దివ్య మణిఖచితంబగు సువర్ణ సింహాసన మలంకరింపబడి యుండెను ఎదుట సామంతనృపాలురకును, కవి పండితాదిమాన్యులకును నసంఖ్యంబులగు నుచితపీఠము లమర్పఁబడియెను. అప్పుడా ప్రదేశ మంతయు వసంతాగమమునకై సర్వసన్నద్ధమై యున్న రమణీయోద్యానమువలె విలసిల్లుచుండెను.

సామంత మహీపతులు ప్రతి నిమిషమును నిర్దేశించుచు, ఈసరికి మహారాజు శ్రీమంతుఁడు, నతిపవిత్రుఁడు నగు బ్రాహ్మణోత్తమునిచే స్నానము చేయింపఁబడును, ఈ సరికిఁ బీతాంబరధారియై పూజా మందిరమున కరుదెంచును. ఈసారికి దేవతారాధనమును, బ్రహ్మణాశీర్వాదములును పూర్తియగును ఇఁక సార్వభౌముఁ డలంకృతుండై వేంచేయు సమయమైనది." అని యొకరితో నొకరు చెప్పుకొనుచు నెదురు చూచుచుండిరి.

ఆ సమయమున రాజభవన ద్వారమునుండి భేరీకాహళ ధ్వనులతోఁ జిత్రవర్ణాలంకృతంబులగు రెండేనుఁగులు బయలుదేఱెను. ఆ వెనుక సజ్జితాయుధపాణులై కొందఱాశ్విక యోధులు వచ్చుచుండిరి. వారల వెనుక నమూల్య హేమమణి మయాలంకారవిభూషితంబును, మృదు కౌశేయవసనాచ్ఛాదితంబునునగు భద్రగజంబును బసిడిహౌదాపై గూరుచుండి మహామంత్రి యగు తిమ్మరుసు మంద మందగమనములతో నేతెంచుచుండెను. ఆ వెనుక మఱికొంద ఱాశ్విక వీరు లత్యుత్సాహముతోఁ గదలి వచ్చుచుండిరి అనంతర మతి రమణీయముగ నలంకరింపఁబడిన పట్టపు టేనుఁగుపై రత్నాతపత్త్ర పరిశోభితంబును. మణి స్తంభ విరాజితంబును, సువర్ణమయంబును

గు చక్కని హౌదాయందు గూరుచుండి లోకపాలకుండగు సాక్షా న్మహావిష్ణుని యవతారమునం బోలి శ్రీకృష్ణదేవమహారాయలు విచ్చేయుచుండెను ఆ పట్టపు ఏనుగునకు ముందును వెనుకను పార్శ్వములందును సువర్ణమణి భూషణ విరాజితంబులగు నుత్త మాశ్వముల నధిరోహించి కృపాణపాణులగు నంగరక్షకులు కాచి కొనియుండిరి వారి పార్శ్వములను వెనుకను నలంకరింపంబడిన యుత్తమాశ్వములను భద్రగజంబులును ఐరివేష్టించి వచ్చుచుండెను.

ఆ జనుల చూపులన్నియు నా మహారాజ దేవేంద్రునిపైఁ బ్రసరించుచుండెను ప్రశాంతంబును, గంభీరంబునగు నారాజ పర మేశ్వరుని మనోజ్ఞ వదన మండలమునఁ బవిత్రంబును, మనోహర బు నగు నొక దివ్యతేజము సకలజన హృదయానందకరంబై యుండెను ఆ భూపాల శిరోమణి విశాల నయనంబులనుండి దయారసశీతలంబు లగు కటాక్షములు నలుగెలంకులఁ బ్రసరించుచుండెను నిరంతర మందహాస చంద్రికా విరాజితంబగు నారాజ చూడామణి రమణీయ ముఖమండలము సకలకువలయ పరిపాలన క్షమంబై సకల జన చకోరమనోభిరామంబై యలరారుచుండెను. ఆ రాజ శేఖరుని పవిత్రోత్తమాంగమున నమూల్య మణిగణవిరాజితంబగు కిరీటము కోటి సూర్య ప్రభాభాసమానమై యుండెను,

అంతటి మహావైభవముతో నా మహీమండలాఖండలుఁడు సభా మండప ముఖద్వారము కడకు విచ్చేసెను మంత్రియగు తిమ్మరుసు ముందుగ గజావతరణంబు చేసి యుచిత వినయ గౌరవభావములు వదనమండలమునం దోఁచుచుండ నా రాజదేవేంద్రుని భద్రగజంబు నుండి యవతరణుం జేసి కైదండ యొసఁగి సభారంగమునకుఁ దోడి తెచ్చెను. వందిమాగధులు కైవారము చేయుచుండ, గాయకులు గానము చేయుచుండ, భూసురోత్తము లాశీర్వదించుచుండ నా రాజ మార్తాండుఁడు సింహాసనాసీనుండయ్యెను ఆ ప్రభుని వెనుక నంగ రక్షకులును, వేత్రధరులును నిలిచియుండిరి. పార్శ్వమున మహా మంత్రి వినయముతో నిలువఁబడియుండెను.

పిమ్మట యథోచిత గౌరవానుసారముగ సామంత మహీపతు

లొక్కొక్కరుగ వచ్చి సార్వభౌమునకు వినయవినమితులై నమస్క రించి వారివారికి నియమించిన తావుల నాసీనులై యుండిరి, ఒక పారిగ శ్రీకృష్ణదేవమహారాయని కరుణాకటాక్షము లా సామంతు లపై నమృతమును వర్షించెను. సభయంతయు నరుణోదయంబునఁ దామరకొలనింబోలి విలసిల్లుచుండెను, ఎదుట విశాల ప్రదేశమున నానేకజనసముద్రమునం దనేక వినోదతరంగము లుత్తేజితములగు చుండెను

ఒకవంక మల్లవీరు లతి లాఘవము మెఱయ నతినిపుణముగ మల్లయుద్ధ నైపుణ్యమును బ్రదర్శించుచుండిరి. ఇంకొకవంక గారడీ వాండ్రు హస్తలాఘవముం జూపి వింత పనుల నాచరించుచుండిరి. మఱియొకవంక నైంద్రజాలికులు తమ యద్భుతసామర్థ్యమును జూపుచుండిరి. ఎల్లయెడలను వినోదములే యైయుండెను ఈ విధ ముగాఁ గొంతసేపు గడచెను.

అనంతరము మంత్రి తిమ్మరుసు సభామండపమునుండి యివ్వ లకు వచ్చి యేదియో సంజ్ఞ చేసెను. తోడనే తరుణవయస్కులగు దండనాయకు లేవ్వరు సముచితాలంకారవిలసితులై యుత్తమాశ్వ ముల బంగరు కళ్ళెములఁబట్టి నడిపించుకొనుచు వచ్చుచుఁడిరి ఆ వెనుక నొక పురుషుఁడు కూడఁ దన గుఱ్ఱము నుఱికించుకొనుచు జనుదెంచుచుండెను. ఆతఁడు చాలఁ జక్కనివాఁడుగా నగపడు చుండెను. నీలపుముంగురులును, విశాలఫాలభాగమును, ఆకర్ణాంత నేత్రములను, నూనూఁగు మీసములును, శ్మశ్రుస్నిగ్ధ గండస్థలంబు లును, మనోజ్ఞ నాసికయుఁగల యాతని రమణీయవదనమండలము సకలజన నయనానందకరమై యుండెను. విశాల వక్షస్థలంబును, నాజానుబాహువులును సమోన్నత బలిష్ఠ శరీరమునుగల యాతని యాకారము శృంగార వీరరస సమన్వితమై యుండెను. శరత్పూర్ణి మాచంద్రికఁబోలి యతని శరీరచ్ఛాయ సకల హృదయాహ్లాదముం గూర్చుచుండెను, ఆతని యాకారముఖ విలాసచేష్టితము లన్నియును మనోజ్ఞములై యుండెను ఆతని వయ సిరువది యేండ్లకు మించి యుండదని తోఁచుచుండెను.

ఆ దండనాయకులతోఁ గూడ నాతఁడును వచ్చి మహారాజున కును మంత్రికిని యథోచితముగ నమస్కరించి నిలువఁబడియెను. అప్పుడు తిమ్మరుసు వారివంకఁ జూచి "అదిగో ఆ చెరువుగట్టుపైఁ జంద్రశిలాగోపురమున శ్రీ ప్రభువువారి విజయధ్వజము నెలకొల్పఁ బడియున్నది మీరు మీ యశ్వముల నధిరోహించి యొక్కసారిగా బయలుదేఱి పోయి యెవ్వరు దానిని ముందుగ ముట్టుకొనియెదరో వారు బహుమానార్హులై యుందురు." అని చెప్పెను,

వినయసూచకముగ నందఱును దలలు వంచి మరల నొకసారి నమస్కరించి తమతమ యశ్వముల నధిరోహించి మహామంత్రియాజ్ఞ కొఱకు వేచియుండిరి. అంతలో ఘంటానాదము వినవచ్చెను. మంత్రి తిమ్మరుసు వారివంకఁ జూచి పోవచ్చునని సంజ్ఞ చేసెను తోడనే యా యాశ్వికు లార్వురును తమ యశ్వముల నుఱికించుకొని ధ్వజాభి ముఖులై పోవుచుండిరి.

మహాగౌరవ సూచకంబగు బహుమాన మెవ్వరికి లభియించునో ఎవ్వరు రాజపరమేశ్వరుని పరమానుగ్రహమునకుఁ బాత్రు లగుదురో, ఎవ్వరి యదృష్టము ఫలించునో చూడవలయునని ప్రజలంద ఱును వారివంకనే చూచుచుండిరి వారొకరికంటె నొకరు ముందుగఁ బోవలయునను నుత్సాహముతోఁ దమ యశ్వవిద్యా నైపుణ్యమును మెఱయించి గుఱ్ఱముల నుఱికించుచుండిరి. ఆ పరువులో ముందైన వారు వెనుకఁబడుచుండిరి, వెనుకవారు ముందగుచుండిరి, కార్యసిద్ధి యగువఱకు నెవ్వరు కృతార్థు లగుదురో నిర్ణయించుట కశక్యముగా నుండెను.

అందైదుగురు పరాక్రమోపార్జితంబగు దండనాయకపదవిచే నలంకరింపఁబడినవారు అశ్వవిద్యానిపుణులు. అనేక యుద్ధములయం దాఱితేఱినవారు, అంతియకాక నవయౌవనులు. అట్టివారితో నింకొక పురుషుఁడు సామ్యమునందఁగోరి ప్రయత్నించెను ఉత్తమపదము నభిలషించుట మనుజునకు సామాన్యస్వభావమే కాని యా పురుషుని యశ్వము వెనుకఁబడిన గుఱ్ఱములకంటెను వెనుకఁబడియుండెను. కాని యాతఁడు నిరుత్సాహముఁ జెందక గుఱ్ఱమును ముందునకుఁ

పోనిచ్చుచునే యుండెను "వారికి వానిని బోలిక యెక్కడ?" అని చూచువారొకరితో నొకరు చెప్పుకొనుచుండిరి

ఇంతలో నా పురుషుఁడా యశ్వోత్తమాంగమును వాగెతోఁ బైకెత్తి తన యుత్తమాంగము నించుక యా వంకకు వంచి యేమేమియో చేసెను ఆ యుత్తమాశ్వ మాతని భావమేమని గ్రహించెనో, యాతనితో నేమి మాటలాడెనో కాని యత్యుత్సాహముతో నొకసారి హేషారవము చేసి శరవేగమున, వాయువేగమున, మనోవేగమునఁ బరుగువాఱుచు ఖురపుటంబు శిలాతలంబున నిలుపుటకూడఁ గానరాకుండఁ దనజవనగమన సామర్థ్యముఁ జూపుచుఁ గనుమూసి తెఱుచునంతలో నా దండనాయకుల యశ్వముల నైదింటిని గూడ నతిక్రమించి నిర్ణీతస్థలాభిముఖంబుగఁ బోవుచుండెను అప్పుడా బయలంతయును గరతాళధ్వనులతోడను సాధువాదములతోడను నిండి పోయెను. ఆ యుత్సాహధ్వనుల నాలకించుచు నత్యుత్సాహముతో నా పురుషుఁడు గమ్యస్థానముం జేరి యశ్వావతరణంబు చేసి యా గోపురము నధిష్ఠించి యా విజయధ్వజముం బట్టుకొనియెను తత్క్షణమే యచ్చట భేరికాహాళధ్వనులతో శతఘ్ని నినాదము దశదిశల బధిరీకృతంబుగాఁ జేసెను.

ఆ యద్భుత ప్రదర్శనముం గాంచి ప్రేక్షకులందఱు నత్యుత్సాహముతో సాధువాదములు నేయుచు "ఆతఁ డెవ్వరు?" అని యొకరి నొకరు ప్రశ్నింప నారంభించిరి, ఆతని నెఱింగినవారం దెవ్వరున్నారు?

అప్పుడు శ్రీకృష్ణమహాదేవరాయ దేవేంద్రుఁడు మందహాస సుందర వదనారవిందముతో మంత్రివంక నాలోకించెను

ఆ విజయముఁ గాంచిన యాతఁ డెవ్వరు?

## 2. పేరోలగము

శ్రీకృష్ణదేవమహారాయలు నేఁడు సూర్యోదయమునకు బూర్వమే నిద్రనుండి లేచి శరీరవ్యాయామమునకై గుఱ్ఱపుసవారు మొదలగు పరిశ్రమలం గావించి దినకృత్యముల నెఱవేర్చుకొని శుచియై

దేవాగారమునకుఁ బోయి యిష్టదేవతను యథావిధిగఁ బూజించి వేదవిదులగు నుత్తమ బ్రాహ్మణుల యాశీర్వచనములం గైకొని యటనుండి నిజమందిరమునకుం బోయెను

నేఁడు విజయదశమి. నేఁడు రాయలు నిండుకొలువుండి సామంతరాజులకును సేనానులకును, రాజభక్తులకును బహుమానములనిచ్చునని యందఱును జెప్పుకొనసాగిరి కొలువుకూటము మనోహరముగ నలంకరింపఁబడియెను. ఆ కూటమునకు మహారాజు రాకుండ ముందుగ నందెవ్వరును బ్రవేశింపరాదు. రాజదర్శనార్థమై వచ్చిన సామంతాది ప్రభువరులందఱును వేచియుండుటకై కొలువుకూటమును జేరి మరియొక దివ్యభవనము కలదు వారలా భవనమునుండి మహారాజుల రాకకై నిరీక్షించుచుందురు—ఆ భవనమునకెదుటనున్న విశాలరంగస్థలమంతయు నేఁడు కొలువునకరుదెంచిన ప్రభువరుల యేనుంగులతోడను సేనానాయకుల యుత్తమాశ్వములతోడను, నుద్యోగుల శకటాది వాహనములతోడను గ్రిక్కిరిసి మనోహరముగఁ గోలాహలముగఁ గానవచ్చుచుండెను యుద్ధాదుల నియోగింపఁబడినట్టియుఁ రాజ్యములో దూరదేశమునందున్నట్టియు, రాజ్యమునకు సరిహద్దుల ప్రాంతముల నుండినట్టియు సేనానులును సేనలును దక్కఁ దక్కిన రాజులును, ప్రభువులును, సేనానులును, దమ తమ [illegible]ణువలతో నుచిత వైభవముతో మహారాజాధిరాజును సందర్శించుటకై వచ్చియుండిరి

గొప్పవారందఱును గూడిన యా ముందరి భవనము సామంతుల సల్లాపములతోడను పరివారుల విలాసములతోడను, ధనికుల వినయభాషణములతోడను, యువకుల పరిహాసములతోడను, వృద్ధుల యదలింపు మాటలతోను సందడిగా నుండెను. అంతలో రాజేంద్రుని యాగమన సూచకంబుగ లోపలినుండి యొక ఘంటారవము వినవచ్చెను అప్పుడందఱును నిమ్మకు నీరు వోసినట్లుగ నెమ్మదిగనుండిరి, మఱికొంతసేపటికి వంధిమాగధుల కైవారములు వినవచ్చెను. ఆ వెంటనే మఱియొక గంట ప్రయోగింపఁబడియెను అప్పుడు శ్రీకృష్ణదేవ మహారాయేంద్రుఁడు కొలువుకూటము నలంకరించెనని యందఱును

దెలిసికొనిరి, అప్పుడధికారబలము ననుసరించి, గౌరవప్రపత్తుల సాధారము చేసికొని మరియాదవె బడి, నా కొలువుకూటమున కొక్కరొక్కరుగఁబోయి మహారాజ చూడామణికి వందన మాచరించి యెవరికి నిర్ణీతమైన తావున వారు గూర్చుండిరి కవిపుంగవులును, పండితశ్రేష్ఠులును నా రాజేంద్రుని దక్షిణ పార్శ్వమున నున్న సమున్నత వేదికపైఁ బరువఁబడిన రత్నకంబళముపై నాసీనులైరి. మహామంత్రిశేఖరుఁడగు తిమ్మరుసు ప్రభువునొద్ద నిలువఁబడి నాటి కార్యక్రమమును బరియింపఁ జొచ్చెను పౌరులా మందిరమున నిరు పార్శ్వముల దూరముగ నమర్పఁబడియున్న ప్రత్యేకస్థలముల నిలు చుండి యా మహారాజు నానదముతోఁ దిలకించుచుండిరి. వేత్ర హస్త లటునిటుఁ దిరుగుచు సందడి నడఁచుచుండిరి

ఆ రాజపరమేశ్వరుఁడు మిగుల బొట్టియును, బొడవునుగాని సమోన్నత మనోహర దృఢశరీరుఁడై యుండెను. అతనివదనపద్మము సుందరమైన గంభీరభావమును దాల్చియుండెను రక్తరేఖాసమా యతంబులగు నాతని నేత్రములు విశాలములై, చూపులు గంభీర ములై యొప్పుచుండెను. ఆ ముఖ విలాసమును, నా కటాక్షభంగు లును ప్రేక్షకుల హృదయవీధులఁ బూజ్యభావమును బుట్టించు చుండెను

సముచితాలంకారశోభితులగు నిరువురు సేవకులా రాజేంద్రున కిరుపార్శ్వముల నిలువఁబడి వింజామరల వీచుచుండిరి మహారా జోచిత చిహ్నంబులగు బంగారు బిరుదు బెత్తంబుల ధరియించి యా వెనుక నుభయపార్శ్వముల నిరువురు దండధారులు నిలువఁబడి యుండిరి ఆ వెనుక పార్శ్వముల రాణుల సహోదరులు, తండ్రులు మొదలగు రాజబంధువు లుచితాసనంబులఁ బరివేష్టించియుండిరి, ఆ మహారాజేంద్రునకు నూతనముగ లోఁబడిన దక్షిణ హిందూస్థాన రాజవరులందఱును నాఁటిసభ నలంకరించియుండిరి. సుప్రసన్నంబు లగు నా రాజేంద్రుని కటాక్షమాలికల నందఱును గోరుకొనుచుండిరి. ఒక్కరును మాటాడుటలేదు. సభయంతయు నిశ్శబ్దముగా నుండెను అప్పుడు శ్రీకృష్ణదేవరాయల యాజ్ఞానుసారంబుగ మంత్రిశిఖామణి

యగు తిమ్మరుసు సభలోనున్న సామంత దండనాయకాదివీరుల వాలోకించి, 'మీమీ ప్రభుభక్తి విశ్వాసములు మెఱయ విజయ యాత్రా సమయమునఁ బరాక్రమ సామర్థ్యములం జూపి సార్వ భౌమునియెడఁ గృతజ్ఞులైయున్న మీ యెడల రాజపరమేశ్వరుఁడు సంపూర్ణానుగ్రహము గలిగియున్నాఁడు. మీ సేమమే సార్వభౌముని సేమముగను, మీ యున్నతియే సార్వభౌముని యున్నతిగను దలంపఁ బడుచున్నది సార్వభౌముని శ్వేతాతపత్రచ్ఛాయను సుఖంబున్న ప్రభుభక్తితత్పరులగు మీకును, మీ రాజ్యములకును, మీ ప్రజలకును నిరంతరక్షేమము గలుగుటకై సార్వభౌముని ధర్మపరిపాలనము శ్రీరామరక్షయై యుండఁగలదు రాజభక్తులగు మీవలన సార్వభౌముఁ డును ప్రజారంజకుఁడగు సార్వభౌముని వలన మీరును పరస్పరాభ్యుద యముల నందెదరుగాక!"

అని వచించి యూరకుండెను, వారలందఱును సాధువాదము లం జేయుచు నా రాజేంద్రుని ప్రసన్నభావమునకును మంద్రగంభీర వాక్యంబులకును ముగ్ధులైపోయిరి పిదప నితర ప్రజలకును సేనాను లకును హితముగ మంత్రి కొంతసేపు సంభాషించెను. అప్పుడు సభా సదులందఱును నా ప్రధానవరు ననేక విధముల గీర్తించిరి. సందడి యడఁగిన పిమ్మట రాజులు మొదలగువార లాచారము ననుసరించి ముందువెనుకలుగ నా మహారాజేంద్రునిచే బహూకరింపఁబడి మరల నాతనికి నమస్కరించి సెలవంది యటనుండి వెడలిపోవుచుండిరి, మంత్రి తిమ్మరసు నియోగంబున నొక యుద్యోగి వారివారికిఁ దగిన బహుమానముల నిచ్చి యనుపుచుండెను. ఈ విధముగనే సేనానాయ కులు గూడ మహారాజుచే సత్కరింపఁబడి సెలవంది వెడలిపోవు చుండిరి. ఆ సమయమునఁ దిమ్మరసు చానతి నొక రాజపుత్రుఁడు రాజపరమేశ్వరునకు వందన మాచరించి నిలువఁబడియెను.

అప్పుడు మంత్రి "మహారాజాధిరాజా! ఈ యౌవనుఁడు—"

అర్ధోక్తియందే, "నిన్నటి దినమున గుఱ్ఱపుబందెములో గెలు పొందిన వీరుఁ డితఁడే కాదా?" అని మహారాజనియెను.

"చిత్తము"

అప్పుడు సార్వభౌముఁడు ప్రసన్నవదనముతోఁ దన పీఠము ప్రక్కనున్న మణిఖచితంబగు బంగారుపిడిగల కరవాలమును దీసి సేవకుఁడందియీయఁ నందుకొని తిమ్మరుసున కొసంగెను ఆ మంత్రి శేఖరుఁడు దాని నందికొని యా పురుషునివంకఁ జూచుచు "నిన్నటి దినముఁ బ్రదర్శించిన నీ యశ్వవిద్యా నైపుణ్యమునకు రాజపరమేశ్వరుఁ డానందించి, యనుగ్రహ సూచకముగ నీ యనర్ఘకరవాలము ప్రసాదించుచున్నాఁడు" అని చెప్పుచు నా నిండోలగమునఁ నా మహారాజదేవేంద్రుని సమ్ముఖమున నా ఖడ్గరాజము నాతని కొసంగెను ఆ పురుషుఁ డనిర్వచనీయానంద విస్మితుఁడై కంపితహస్తములతో నా రాజశేఖర ప్రసాదమును స్వీకరించి, కనుల కద్దికొని, వినయవినమిత శిరస్కుఁడై నమస్కరించి యానందగద్గద స్వరముతో—

"భూమిభృత్కటకంబునఁ బొమ్మరాయి
గాఁదలంపంగఁబడినది నీదయార్ద్ర
హృదయమున హీరమణిగా గ్రహింపఁబడియెఁ
బ్రథితగుణసాంద్ర! శ్రీకృష్ణరాయచంద్ర!"

అని కీర్తించెను.

తోడనే రాజపార్శ్వవేదిక నుపవిష్టుఁడై యున్న యాంధ్ర కవితాపితామహుం డగు నల్లసాని పెద్దనామాత్యకవిశేఖరుఁడు లేచి తన యాశురచనాసామర్థ్యము మెఱయ,

చ. ప్రమదగజేంద్రకుంభపరి పాటనదుర్దమ విక్రమక్రియా
క్షమమహిమోగ్రకేస రినఖంబె గ్రహించునుగాక యాణిముత్యమును, ధరాపరాగహార ణాశఁ జలించుప్రమత్తహస్తిహస్తము గొనఁజాలునే? విమతసామజకేసరి! కృష్ణరాణ్మణీ!

అని యభినందించెను.

అప్పుడు సభాసదుల సాధువాదములతోడను, వందిమాగధులకైవారములతోడను సభ ముగింపఁబడియెను.

# 3. ప్రయత్నము

ఈ దేశము రెడ్డిరాజులచేఁ బరిపాలింపఁబడిన కాలమున

వచ్చుటచ్చుట శత్రుదుర్భేద్యంబు లగు దుర్గము లనేకములు, క్రొత్తగా నిర్మింపఁబడినవి. కాలక్రమమున నా రాజ్యము లంతరించిపోయినను వారిచే నిర్మింపఁబడిన దుర్గములు. గోపురములు దేవళములు మొదలగునవి యింకను వారి యమానుష సామర్థ్యమును సూచించుచునే యుండెను.

కృష్ణానది యవ్వలితీరమునం గల మహారణ్యమధ్యమునఁ బర్వత పంక్తులలో నొక యభేద్యదుర్గము కలదు. అది పూర్వము రెడ్డి రాజుల చేతనే నిర్మింపఁబడినది ఆ దుర్గమునకుఁ జుట్టును బర్వతములే ప్రాకారములై యుండుటవలన నది శత్రువులకు దుస్సాధమై యుండెను ఆ కారణమున యుద్ధసమయములం దంతఃపురస్త్రీల నాదుర్గమున నుంచి భద్రముగ సంరక్షించుచుండిరి దానికి వన దుర్గమని పేరు. ఆ దుర్గమున నేబదివేలమంది సైనికులు నిలచి యుండుటకుఁ దగిన యవకాశము కలదు. అందు నలువంకల నాలుగు చెఱువులును, తోఁటలును, గూడ నున్నవి. అందొక పుష్కరిణి యొద్దన విశాల రాజభవనము కలదు

అగపడకయో, యావశ్యకత లేకయో కాని తరువాత రాజు లెవ్వరు నా దుర్గము నుపయోగించుకొనుటలేదు అందుచే నా దుర్గము పాడుపడియుండెను. కాని నేర్పరులచే నిర్మింపబడినదగుటచే నిప్పటికిని శిథిలము కాక దృఢముగనే యుండెను చుట్టును మహారణ్యము బలసియుండుటచేతను, సమీపమున జనపద మేదియును లేకుండుటచేతను. పరిపాలకు లెవ్వరు నా దురమున నివసింపకుండుట చేతను, జను లెవ్వరు నావంకకుఁ బోవుటలేదు

రాత్రి గాఢాంధకారము మహావనమధ్యమునఁ బర్వత పరివేష్టితంబగు నాదుర్గ మతిభయంకరమై యుండెను చిరకాలము నుండి జనశూన్యమై మరుభూమిం బోలియున్న, యా ప్రదేశము నందలి యొక భవనమున దీపము ప్రకాశించుచుండెను. అందొక మృదుశయనముపై నవయౌవనవతి యగు నొకరమణీమణి శయనించి యుండెను. నిదురపట్టక యిటునటుం దొరలుటచేఁగ బోలు నాశయ్య యంతయుఁ జెదరియుండెను ఆ యువతీమణి ధరియిం

చిన యమూల్యాంబరము కూడ నలఁగియుండెను. నీలప్రభావిరాజితంబులగు ముంగురులు చెదరి యామె రమణీయఫాలభాగమున ముసురుకొని యుండెను. ఆమె విశాలనయనములు వికసితంబులును, ముకుళితంబులును గాక యరమోడ్పు వడియుండెను. అతిమృదులంబగు పట్టుపఱుపుపైఁ బఱుపఁబడిన తెల్లని పట్టు దుప్పటముపై శయనించియున్న యారమణీమణి పాలకడలియందలి తెల్లదామర పూవునందుఁ బరుండి నిదురించు లోకమాత యగు నిందిరాదేవివలె నాలోకరమణీయాకారిణియై యుండెను.

ఆమె మేలుకాంచి యుండలేదు. కేవలము నిదురించుటయును లేదు. ఆమె సుకుమారాధరము చలించుచుండెను. నాసాపుటములు విరళితంబు లగుచుండెను. కనుబొమలు ముడివడుచుండెను. పోఁగ కనుఁగ్రేవలనుండి యశ్రుబిందువులు దొరలి కర్ణకుహరముఁ బూర్ణీభవింపఁజేయుచుండెను. ముఖచిహ్నములు హృదయమునందలి శోక భయభావములను వెల్లడించుచుండెను. అప్పుడప్పుడు నిట్టూర్పులు వెలువడుచుండెను. ఒకసారి యామె "అయ్యో! సోదరీ!" అని కలవరించెను. తోడనే యామెకన్నులనుండి యశ్రువులు జాలువాఱెను. కాని యింకను మెలఁకువ కలుగలేదు. ఇంకొకసారి "నాగతి యింతియేనా?" అనియును, మఱియొకసారి "కన్యకాత్వము తోడనే మరణింపవలయునా?" అనియును గలవరించెను, ఇంక నేమేమియో యస్పష్టవచనము లామె నోటినుండి వెలువడియెను. ఆమె యేదియో స్వప్నమును గాంచుచుండవచ్చును.

ప్రజాశూన్యమైయున్న యాభవనమున—పాడువడి పట్టువగలే భయముఁ గూర్చుచుండు నా భవనమునఁ బరమసుందరియగు నొక కాంత యేకాంతముగ శయనించి యున్నది. ఈమె యెవ్వరు? వనదేవతయా? కాక దుర్గదేవతయా? నిర్జనంబగు నీదుర్గమున బలి భోజనములు లేకుండ దుర్గదేవత యింతకాలము వఱకు నిచ్చటనే యుండునా? కాదు కాదు. ఇవి యన్నియును వట్టిభ్రమలు. హృదయ దౌర్బల్యము వలనం గలిగిన మిథ్యాసంకల్పములు — దేవత

లన్వప్నలు కదా. ఈమె కలంగను చున్నట్లున్నది. ఈమె దేవత కాదు. మనుష్యాంగనయే.

ఆ సమయమున నా భవనమున కెదుట దూరముగ నున్న పర్వత మార్గమునుండి యాయుధపాణులగు భటులును, అశ్వికు లును గరదీపికానికాయములతో వచ్చి యాదుర్గమునఁ బ్రవేశించు చుండిరి. కొలఁది సేపటిలో నాదుర్గమంతయు నేనుఁగులతోడను, గుఱ్ఱములతోడను భటులతోడను నిండిపోయెను. గాఢాంధకార బంధురమై యున్న యా దుర్గమంతయు వేలకొలఁది దీపములతో వెలుఁగుచుండెను. సందడి యేమియును లేదు.

అప్పుడాకాంత "అయ్యో! రాక్షసుఁడు! రక్షింపుడు. రక్షిం పుఁడు" అని కలవరించుచు నదరిపడి శయ్యనుండి క్రిందఁబడియెను. పాప మప్పుడాయువతీమణిని భయపడవలదని చెప్పి యూఱ డించువా రందెవ్వరున్నారు? ఆమె సకలాంగకములును గంపించి పోవుచుండెను అట్లు కొంతసేపైన తరువాత నామెయే మనసు కుదురుపఱచుకొని కన్నులు విచ్చి చూచెను. ఎదుట దుర్గ మంతయును దీపకాంతులచేఁ బ్రకాశించుచుండెను. వేలకొలఁది జనులతోడను, గుఱ్ఱములతోడను, నేనుఁగులతోడను నిండియుండెను. ఆమె యప్పు డదరిపడి తన దుస్స్వప్నము వెంటనే ఫలోన్ముఖమయ్యెనని భావించు కొనియెను. ఆయాకస్మిక సందర్శనమున విభ్రాంతయై యామె యట నుండి కొంతసేపటివఱకును లేవలేకపోయెను.

అనంతరము భయావేగముచేఁ దనులత కంపించుచుండ, వేఁడి నిట్టూర్పు లధరప్రవాళమును గమలించుచుండ, నల్లన లేచి యాపా ర్శ్వమున నోరువాఁకిలిగ నున్న తలుపు తెఱచి 'బాబా!', అని పిలిచెను. ఎవ్వరును బలుకలేదు. అగదియందమర్పఁబడిన శయ్య మాత్రముండెను. ఆమె మరల నింకొకసారి బిగ్గఱగా "బాబా!" యని పిలిచెను. ప్రత్యుత్తరము లేదు.

ఆమె హృదయకుహరము వ్వెత్తుగఁ బగిలిపోయెను శోకభయ తరంగము లొక్కసారిగా నుప్పొంగి యామెను ముంచివై చెను. ఆతరంగాహతులచే నామె సర్వాంగములును గొయ్యవడిపోయెను.

నిస్తబ్ధయై యామె యచ్చొ క్రిందఁ బడిపోయెను. స్మృతి తప్పి పోయెను ప్రాణము చలించిపోయెను. ఆమె కష్టసుఖ మరణమును జీవితమును గూడ నేకరేఖా సంకలితములై యొక్క మెట్టుపై నిలిచి యుండెను అట్లు పడియున్న యామెకుఁ జైతన్యముం గూర్పువా రందెవ్వరును లేరు.

ఇంతలో నిరువురు పురుషు లాభవనమునఁ బ్రవేశించుచుండిరి. అందొకఁడు నలువది యేండ్లకు మించిన కౌమారవయస్కుఁడు. మఱియొకఁ డిరువది యేండ్లకుఁ లోఁబడిన కుమారుఁడు ఆ యిరు వురును లోపలఁ బ్రవేశించి యట్లుపడియున్న యారమణీమణిని గాంచి తత్తరముతో నామెకడ కరిగి పరీక్షించి చూచిరి. శరీర మంతయుఁ జెమ్మటలు గ్రమ్మియుండెను ముఖకమలము వసివాఁడి యుండెను అధర ప్రవాళము కమలియుండెను కనుదమ్ములు ముకుళీకృతములై యశ్రుజలమును వర్షించుచుండెను. ఇంచు కంతయుఁ జలనము లేదు అత్యల్పములగు నుచ్ఛ్వాసనిశ్వాసములు మాత్ర మామె ప్రాణములతో నున్నట్లు సూచించుచుండెను. వారి హృదయములు చెదరిపోయెను, ఏమి చేయుటకును దోఁచుటలేదు. అందుఁ బెద్దవాఁ డామె నొకటి రెండు సారులు పిలిచెను. కదలించి చూచెను ఆమెకు మెలఁకువ కలుగలేదు

తోడనే యాతఁడు లోనికరిగి శిశిరజలంబులం గొనితెచ్చి యామె మొగంబునఁ జిలుకరించెను. కొంత సేపటికి నామె కన్నులు విచ్చి చూచెను. కాలమేఘావృతమై గాఢాంధకారబంధురమై యున్న యమావాస్య రాత్రివేళ నరణ్యమున దిక్కుతోఁచక కొట్టుకొనుచున్న పాంథునకుఁ దళుక్కున మెఱవు మెఱసి నట్లయ్యెను. తోడనే యా బాలిక "హా! సోదరా!" అని యఱచెను ఆ యువకుఁ డశ్రుజల పూరితనయనుఁడై యారమణీమణిని లేవనెత్తి కూర్చుండఁజేసెను కొంత సేపటి వఱకు నెవ్వరును మాటలాడకుండిరి

పిమ్మట జలములంగొని తెచ్చిన పురుషుఁడు ' అమ్మా! కడచిన దానికి హృదయము పగుల దుఃఖించుటవలనఁ బ్రయోజనము లేదు. మరణించిన శ్యామల మరల రానేరదు కాలధర్మము నొందిన

తలిదండ్రులు మఱికనఁబడఁబోరు. ఊరక విచారించుటవలన నేమి లాభము? ధైర్యమును వహించియుండవలయును నీవు నీ సోదరుని విషయమై చాల బెంగగొనియుంటివి. అదృష్టవశమున నాతఁడు నీ కన్నులఁ బడియెను కొలఁది దినములలో నీ ప్రాణేశ్వరునిఁగూడ బడయఁగలవు ఆశుభ సమయము కొఱకు నిరీక్షించుచు నీ హృదయమున కించుక విశ్రాంతి కలిగించుకొనుము. నీవు ధైర్యముతో నుండిననే మా ప్రయత్నములు ఫలియింపఁగలవు ఇట్లు వికలహృదయవై యున్నచో విన్నదనము నొందియున్న నీకోమల వదనముంగాంచి మేమేపనియును జేయలేకుండఁ బోవుదుము—అమ్మా! ధైర్యముతో నుండుము. నాకంఠమునఁ బ్రాణములున్నంత వఱకు నీకెట్టి యపాయమును గలుగనీయను" అనియెను.

ఆరమణీమణి వెక్కి వెక్కి యేడ్చుటకంటె నేమియుఁ జెప్ప జాలకపోయెను.

అనంతరము గోపాలుడు "తల్లీ! సోదరీ! ఊఱడిల్లుము! బావ కూడ సేమముగనే యున్నాఁడు. కొలఁదిదినములలో విజయుఁడగు నాతనిఁ జూడగలుగుదుము. విచారింపకుము," అనియెను.

ఆ కాంత యించుక యూఱడిల్లి గోపాలునివంకఁ జూచి "శిశిర సేమముగా నున్నదా?" అనియెను.

గోపా—ఆమె నా కగపడలేదు. వసంతవాడ వృత్తాంత మేమియు నాకుఁ దెలియదు.

స్త్రీ— అనాథయగు నామె యెట్లున్నదోకదా! ఈ సేనలన్నియు నెక్కడివో?

గోపా—...కు నదియే వింతగా నున్నది.

పురు— గోపాలా! ఈ సేనలన్నియు నీవే

గోపా—అది యెట్లు?

పురు—వసంతవాడదుర్గ మనాయకమగుటచే నచ్చటి సైనికు లెల్లరు మమ్ము సనాథులం జేయవలయునని నన్నాశ్రయించిరి వారి వలన నచ్చటి వృత్తాంతములును, నీ సంగతియుఁ దెలియవచ్చినది. అందుచే నిన్నును వారి నీ దినముననే దుర్గప్రవేశము చేయించితిని.

గోపా—ఈ సైనికులందఱు నిచిపటు కెచ్చటనున్నారు?

పురు—కొలఁది కొలఁదిమందిగా వచ్చి యీ దుర్గప్రాంతమున నున్న మహావనమున జేరి యున్నారు. నీవు వచ్చెదవని తెలిసి వారిని గూడ నిటఁ బ్రవేశ పెట్టితిని.

గోపా—ఎందులకు?

పురు—వారిని సవాధలుగాఁ జేయుటకు.

గోపా—వసంతవాడదుర్గముతో నన్ని సంబంధములును వదిలి పోయినను నాకీ సేనాసంబంధములు వదలలేదా?

పురు—కుమారా! అట్లు విరక్తి నొందవలదు. శోకమునకు లోఁబడిపోవుట వీరధర్మంబు కాదు పరిభవక్రోధానలము వైరాగ్యముచే శాంతింపఁజేయుట క్షత్రియధర్మము కాదు కష్టసుఖములు జీవులకు సహజములు అంతమాత్రమున క్షణక్షణ పరిణామములం గాంచుట పౌరుషము కాదు ఆపదలకోర్చి సంపదలందవలయును: అదను వేచి శత్రువుల నడఁపఁ బ్రయత్నించవలయును. అధైర్య పడక కార్యాచరణ చేయవలయును. అపకారులకుఁ బ్రతీకారము సేయువఱకు నతి నిగూఢముగఁ జరియింపవలయును. కుమారా! రాజపుత్రున కుచితమైన పని చేయుము.

గోపా—మహాత్మా! నీ ప్రబోధనము సర్వోత్తమమైనది. బంధు వియోగముచేఁ గలఁగిపోయిన హృదయమిప్పుడు నిర్మలమైనది నీ యుపదేశవాక్యములు నా కుత్సాహముం గూర్చుచున వి నీవంటి ప్రజ్ఞాధికుని సాహాయ్యమ్మున నేనెంతటి ఘనకార్యమునైనను సాధింపఁ గలను. పాపాత్ముఁడగు తనయుని దుర్నయములఁ జెవులార విను చుఁడియు మందలింపఁజాలని కళింగేశ్వరుఁడు తన పాపమునకుఁ దగిన ఫల మనుభవించు గాక! పాపవర్తనుండగు వీరభద్ర గజపతి బలవంతముగఁ బరిభవింపఁబడుగాక!

పురు—కుమారా! ఆ శుభసమయము రానున్నది మనయభీష్టము ఫలోన్ముఖమైయున్నది.

వారిట్లు సంభాషించుకొనుచుండఁగా దెల్లవాఱెను. ఆ పురుషుఁడు రాజశేఖరుఁడనియు. నా రమణీమణి కమలయనియు వారకు తెలియంగి యే యుండవచ్చును ఆ నాటి రాత్రి వసంతవాడదుర్గమున్న

గృష్ణానదీతీరమున మఱ్ఱిచెట్టుక్రింద సంభాషించుకొన్న స్త్రీపురుషులు వీరే. క్రమముగ రాజశేఖరుఁడు కమల నీ దుర్గమునందుంచి కాపాడుచుండెను. చిరకాలమునుండి నిర్జనమైయున్న యీ దుర్గమిప్పు డిరువది వేల సైన్యముతో నిండి నిబిడీకృతమైనయున్నది. స్థలాభోగమును ఇలా భోగమును నెప్పటి కెట్లు పరిణమించునో యెవ్వరు చెప్పఁగలరు?

## 4. ఆమె కమలయని ఎట్లు గ్రహించితివి

నిడుబ్రోలు దుర్గ మిప్పుడు చాలఁగల్లోలమునఁ బడిపోయినది. ఆ దుర్గము నిప్పుడు క్రూరుఁడగు లక్ష్మీపతి రాజు పరిపాలించుచున్నాఁడు. దురాత్ముండగు వీరభద్రగజపతి, తన దుష్ప్రయత్నమున కంతరాయముం గూర్చునేమోయను భయమున మాధవుని జంపించుటకుఁ బ్రయత్నించెను అప్పటికి మాధవుఁడు పరాక్రమోపార్జితంబగు నా దుర్గమును బాలించుచుండెను, కావున నాతని నెదిరించి చంపుటకు వీరభద్ర గజపతి భయపడియెను అతని నొక నెపంబున వసంతవాడ దుర్గమునకుం గొని తెచ్చి రహస్యముగ నీలాద్రిరాజుచే నచటఁ జంపించుటకును మాధవుఁడు లేని సమయమున నీ దుర్గమును లక్ష్మీపతి రాజాక్రమించు కొనుటకును, నొకదుస్తంత్రమును బన్నెను కాని మాధవుఁడా యకాలమరణమునుండి తప్పించుకొనియెను. లక్ష్మీపతి రాజాకస్మికముగ నర్ధరాత్రమున ననాయకంబగు నాదుర్గముపైఁబడి సేనలఁజిందఱఁ వందఱ జేసి మాధవుని మంత్రిని జంపి యెట్లో యాదుర్గమును స్వాధీనము చేసుకొనియెను పౌరులలో ధనాఢ్యుల ద్రవ్యమంతయును గొల్లగొనియెను. ఈ ఘనకార్యమును నిర్వహించినచో నాతనికిఁ గమల నిచ్చెదనని యువరాజు వాగ్దత్తము చేసెను. కమలమాట ఎట్లున్నను నాతఁడిప్పుడు యువరాజనుగ్రహమున దుర్గేశ్వరుఁడై యుండెను కాని యాతని కాశతీఱలేదు, కమల యేది?

నిరంతర మాతఁడామె కొరకే పరితపించుచుండెను, ఆమె నాతఁడెన్నఁడును జూచియుండలేదు. ఆమె యాతని మోహించి యుండ లేదు. కేవల శ్రవణమాత్రమున నాతని కామెపై మోహము కలిగినది. ఇదియేటి మోహము! ఇది యేటి వికారము?

అట్టి హృదయ వికారముచే నాతఁడు వివేక హీనుఁ డయ్యెను. దుర్గపాలకుఁడయ్యెను రాజ కార్యములను సరిగ నిర్వ ర్తించుట లేదు. ప్రజలట్టి పరిపాలనమునఁ బరితపించుచుండిరి సైనికులును నుద్యోగిజనులును గూడా నిరుత్సాహులగుచుండిరి. కమల వసంత వాడదుర్గమునుండి తప్పించుకొని పోయెనని యాతనికిఁ దెలిసెను. ఆమె యాగడఁ దెలిసికొనుటకై యనేకుల ననేక దిక్కులకుఁ బంపిం చెను ఇంతవఱకు నాతనికెట్టి వార్తయును వినవచ్చుటలేదు. ఆ విచారముచే నాతఁడేమియుందోఁచక దుర్గప్రాంతముననున్న యొక పుష్కరిణి యొడ్డునఁగూరుచుండి యేమేమియో యాలోచించు కొనుచుండెను అతని కాలోచన మేమియును దోఁచుటలేదు ఆ సమయమున నొక పురుషుఁ డాతని యొద్దకు వచ్చి నమస్కరించి నిలువంబడియెను.

"భ్రమరకా! నీ వెప్పుడు వచ్చితివి?"

"ఈ దినముననే"

"విశేషము లేవైనఁ దెలిసినవా?

భ్రమరకుఁడు నగుమొగముతో "ప్రభూ! కృతార్థుఁడనై తిని," అనియెను.

లక్ష్మీపతిరాజు పట్టరాని సంతోషముతో "ఎట్లు?" అనియెను.

"కృష్ణానదీ తీరమున కుత్తరముననున్న యొక యడవిపల్లెలో నొక యాకుటింట నొకవృద్ధుని, నొక యువతిని జూచి వచ్చితిని."

లక్ష్మీపతి రాజానందముతో, "ఆ వృద్ధుఁడు రాజశేఖరుండై యుండవచ్చును ఆమె కమలయే" అని యనుకొని. "భ్రమరకా! నీవు కమల నెప్పుడైనఁ జూచితివా" అనియెను

ప్రభూ! అంతఃపుర కన్యకను నేనెట్లు చూడ గలుగుదును?"

"నీ వాయువతిం జూచితివి గదా! ఆమె కమలయని యెట్లు గ్రహించితివి?"

"ఆమె యందగత్తెయై యుండుటచేత,"

"మూఢుఁడా! అందకత్తె లందఱును గమలలే యగుదురా?",

మహాప్రభూ! క్షమింపుఁడు. ఆమె క్షత్రియకన్యక యనికూడ నిరుగుపొరుగువారు చెప్పుకొనఁగా వినియుంటిని."

అంత మాత్రమున నామె కమలయని చెప్పుట కాధార మేమున్నది?"

ఇంకొక సంగతినిబట్టి యామె కమలయే యైయుండునని నేను నిశ్చయించు కొంటిని "

"అది యేది?"

"ప్రభూ! నేనొకనాటి రాత్రి యాయింటియొద్ద గూఢముగ దాగియుండి వారి సంభాషణమేమైన వినవచ్చునేమో యని వేచి యుంటిని ఎవ్వరు వచ్చి చూచిపోవుదురో యని యప్పుడు నాగుండెలు కొట్టుకొనుచుండెను. ఆ గందరగోళములో నేనుండగా లోపలనున్న యా వృద్ధుడామెను బేరుపెట్టి పిలిచెను మహాప్రభూ! క్షమింపవల యును. బెదరు గుండెతోను నేనా పేరంతయు వినజాలక పోయి తిని. కడపటి యక్షరము "లా". యని వినబడినది. అందుచే నాతం డామెను కమలా!" యనియే పిలిచెనని నిశ్చయించుకొంటిని. ఇంతలో నెవ్వరో వచ్చుటచే నేనచటనుండి పారిపోతిని. ఇదియే నేనెఱింగిన వృత్తాంతము "

"భ్రమరకా! బాగు! బాగు! ప్రభుభక్తినెఱపి శుభవార్త నెఱిగించితివి అనంతర కర్తవ్యము నాలోచింతముగాక! పోయి రమ్ము."

భ్రమరకుడట నుండి వెడలిపోయెను. లక్ష్మీపతిరాజు చిటి కెలతో బందిరివేయ నారంభించెను. ఆతనిహృదయమున నెన్నియో యాలోచనములు తోచెను ఆనందముచే హృదయ ముప్పొంగి పోయెను. అంతలో నాకస్మికముగ నేదియో భయముదయించెను. వెనుకటి యాలోచనలన్నియు దానితో నంతరించిపోయెను ముందే మియును దోచుటలేదు ఊరక యాకసమువంకజూచుచు నెంత యో సేపు కూరుచుండెను. దశదిశల గాఢాంధకారము అలమికొనిన సంగతియే యాతడెఱుంగడు ఆతని కన్నులలో బొడచుచున్న చుక్కలను గూడ నాతడు చూచుటలేదు—

ఓ విభ్రాంతుడా! ఇది కృష్ణపక్షము నేడమావాస్య. క్షుధా ర్తుడవై యాకసము వంకనేల చూచెదవు? ఆ నక్షత్రములు నీ యాకలిని దీర్పగలవా? దూరమునుండి మినుకు మినుకుమనుచు

నవి నీకుఁ జల్లగ నగపడుచున్నవేమో కాని యని నిజముగా జ్యోతిర్మూర్తులు. వాని వలన నీ హృదయానలము మఱింత రవులు కొనునే గాని చల్లార నేరదు. నీ యాఁకలి మిక్కుటమై పోయినది. నీ జీర్ణకోశము దుర్బలమైపోయినది నీకే యాహార పదార్థమును జీర్ణమగుటలేదు నీ హృదయ కోశమి ఎర్చుకొని పోయినది. ఇక నీవేమి తిని బ్రదుకఁగలవు? నీకీ రోగమెట్లు నివారణ కాఁగలదు? ఊరక దిక్కులవంక నేల చూచెదవు? ఇదియా? తెలిసినది. పూర్ణ చంద్రునియం దమృతమున్న దని నీ కెవ్వరో బోధించి యున్నారు. అది సర్వరోగ నివారణౌషధ మని నీవనుకుంటివి. దానికొఱకాశించు చుంటివి ఆ యాశచేతనే నీ కన్నిటియందు నరుచి కలిగినది. అందు మూలమున నీకీరోగ ముత్పన్నమైనది, రోగ నివారణోపాయ మని చంద్రోదయమున కెదురుచూచు చుంటివా? నీ మతి చెదరిపోయినది నీకు సమయాసమయాజ్ఞానము నశించిపోయినది, నేఁడు చంద్రోదయ మగునా? చంద్రోదయ మగువఱకు నిరీక్షించు చుండినను నీకందలి యమృతము లభించునా నీయవస్థఁ బట్టి చూడఁగా నీకిఁకఁ జంద్రో దయమే కానట్టు తోఁచుచున్నది ఎదులకీ పేరాస? చూడుము! చుక్కలు నవ్వుచున్నవి దిక్కులు మూసికొనిపోవు చున్నవి. మిన్ను విఱిగి మీఁదఁ బడునేమో? పొమ్ము! తొలఁగిపొమ్ము! ఈ యమ వసనిశియందు, ఈ గాఢాంధకారమున ఈ బట్టబయట, నొంటిగానుండి యేల పరితపించెదవు? పొమ్ము తొలఁగిపొమ్ము అది పేరాస, దానిని విడిచి పొమ్ము

## 5. వాని కెట్లు వ్యాఖ్యానము జేయునో?

ఫల్గునా! ఆ యువతి యేమైనదిఁ' అని తనదర్శనగృహంబున నుచితాసనంబుపైఁ గూర్చుండియున్న మంత్రి శేఖరుఁడగు తిమ్మరుసు ప్రశ్నించెను.

ఎదుటఁ జేతులు జోడించుకొని నిలువఁబడియున్న ఫల్గునుఁడు గౌరవ సూచకస్వరముతో "ప్రభూ! ఆమె నామె సోదరుఁడుఁ వెంటఁబెట్టుకొని పోయెనఁట" అనియెను.

"నీవు, మాకర్పించిన యాకైజా రెవ్వరిది?"

"ఆ సుందరి మణిదే"

"ఆమె పేరు తెలియునా?"

"నేనడుగుటకు వలనుపడ లేదు ఆకైజారుపై నేదియో పేరున్నది, అది యామెదేయై యుండును"

తిమ్మరుసు నా కైజారును దీసి పరీక్షించి చూచెను దాని పిడిపై "శిశిరమణి" యను నక్షరములు బంగారు నీటి పూతతో మిలమిల మెఱయుచు విస్పష్టముగ నగపడుచుండెను

ఈ శిశిరమణి యెవ్వరై యుండును? మన శిశిరమణియే కాదు గదా! ఆమె కైజారతని కెట్లు దొరకినది? ఒక నిమిషమైనఁ గమలా శ్యామలల నెడఁబాయఁజాలని యామెకు దైవదుర్విపాకమున వియోగము కలుగుటచే మతి చెదరి గ్మేమైనదో? ఎక్కడకుఁ బోయి నదో? శ్యామల వృత్తాంత మేమైన నామెకుఁ దెలిసి యుండునా? ఆమెకు సోదరుఁడెవ్వఁడు? గోపాలుఁ డామె జాడ యెఱుంగనని కమలతో నీవఱకెఁ జెప్పియే యున్నాఁడు గదా! ఆయుధవిద్యా వేదినియగు శిశిర యొంటిగాఁ బోవుచున్నప్పు డాత్మసంరక్షణము నకై యాయుధములను ధరించియే యుండును. ఈ యాయుధ మామెదేయైనచో నీతనికెట్లు లభించియుండును? ఏమో యెటు తెలియును? వీరిరువురకు నా విషయమైన సంభాషణ మీ వఱకు జరిగియే యుండును. వివేకనిధియు, సూక్ష్మగ్రాహియు నగు నీయమాత్య శేఖరుని చెవులఁబడిన యీ వార్త యూరక పోనేరదు. ఆతఁడెప్పటి కైన నిందలి సత్యమును గ్రహింపకపోఁడు, అప్పుడైన మనకు దెలియకపోదు.

అప్పు డాయమాత్య శేఖరుఁడించుక యోజించి యాకైజారు నొకచోట నుంచి 'ఫల్గునా! నీవెంతవఱకును బోయితివి:' అని యెను.

"ప్రభూ! కటకమువఱకును బోయితిని."

"ఆయా దుర్గముల పటముల నన్నిటిని సంపూర్ణముగ వ్రాసికొని వచ్చితివా?"

"చిత్తము. ఉదయగిరి మొదలు కటకమువఱకునుగల ఉత్క

తేశ్వరుని పరిపాలనలోని యన్ని దుర్గములకును సరియైన పటములను వ్రాసితిని. దేవర చిత్తగింపవచ్చును.''

అని ఫల్గునుఁడా చిత్రపటములఁదీసి వేఱ్వేఱ వాని నిరూపించి చూపుచు నాయా దుర్గములకుఁగల లోపాలోపముల నా మంత్రి శేఖరునకు సహేతుకముగ, సవిమర్శ.గా విశదీకరించెను. విశేషప్రతిభా నిధియగు నాయమాత్యపుంగవుఁడా పటముల నన్నిటిని జూచుచుఁ దనకు సందేహములు గాఁ దోఁచిన విషయములను గూర్చి ఫల్గునునితోఁ జాలసేపు చర్చించి వలయు సంగతులను గ్రహించి యా విషయము నంతటితోఁ గట్టిపెట్టి యీ క్రింది విధముగ మాటలాడఁజొచ్చెను.

''ఉత్కలేశ్వరుని పరిపాలన మెట్లున్నది?''

''ఆతఁడు ధర్మానుసారంబుగనే ప్రజలఁ బరిపాలించుచున్నాఁడని లోకము చెప్పుకొనుచున్నది మంత్రిసామంతరాజవరులను సేనానులను దక్కిన సేవకకోటియు నాతనియం దెక్కుడు గౌరవము గలిగి విశ్వాసముతోఁ బ్రవర్తించుచున్నారు. రాజుకొఱకు సమరరంగమునఁ దమ ప్రాణములనైన నర్పించుటకు వెనుదీయని బలాఢ్యులగు పాత్రనాయకులు పదునాల్గు రాతనికి దాసులై యున్నారు. ఆతఁడు ధర్మప్రభువైనను నాతనియెడ నొక లోపమున్నదని ప్రజలు చెప్పుకొనుచున్నారు.''

''అది యేది?''

''తాను హిందువుఁడయ్యుఁ హిందూజననాయకుఁడయ్యు నుత్తమ క్షత్రియవీరుఁడయ్యు, విదేశీయులగు యవనులకుఁ భయపడినవానివలె నాయా సుల్తానుల సేనానాయకులఁ దన దుర్గములలో నుంచుకొని వారికి వేతనముల నిచ్చుకొనుచున్నాఁడట ఇయ్యది వారలకు భయపడియని కొందఱును. నీ విధముగ శత్రునాశనమునకై ప్రయత్నించుచున్నాఁడని కొందఱును చెప్పుకొనుచున్నారు. నెమ్మది కొఱకని కొందఱు చెప్పుకొనుచున్నారు. ఇంతియకాక కుమారుఁడగు వీరభద్రగజపతి న్యాయాన్యాయముల నెఱుంగక జరిగించు నెట్టి కార్యముల యందైన నాతఁడు కలుగఁజేసికొనక యుదాసీనుఁడై యుండునఁట''

ఆ మాటల నాలించి మంత్రి యించుక సేపాలోచించి తలయూచి

"సరియే ఈ సమీప దుర్గముల పరిపాలన మెట్లున్నది?" అని ప్రశ్నించెను

"ప్రభూ! ఈ దుర్గములన్నియును క్షాత్రనాయకులచేతను గళింగేశ్వరుని తనయులచేతను మఱికొందఱు సామంతరాజులచేతను బరిపాలింపఁబడుచున్నవి"

"అవును ఆ విషయ మెఱుంగుదుము.

"ఈ దుర్గములన్నియును కొండవీటి దురాధ్యక్షుఁడగు వీరభద్రగజపతి యాజ్ఞ ననుసరించి పాలింపఁబడుచున్నవి అతని నడవడి బాగుగలేదు అతఁడు ప్రజాకంటకుఁడై యున్నట్లు తెలియవచ్చుచున్నది. రాజ్యమదంబునఁ గన్నుఁగానక నిరంకుశవర్తనమునఁ జరియించు నాతని పాపకృత్యమువలన వసంతవాడదుర్గము నిర్మూలమైపోయినది నిడుప్రోలుదుర్గము కల్లోలమునఁ బడిపోయినది. సామంతరాజులలో నెమ్మది తగ్గిపోయినది.

"నిడుప్రోలు దుర్గమునఁ గల్లోలమేమి?"

"ఆ దుర్గాధ్యక్షుఁడు చాల బలవంతుఁడు, ఉత్కలేశ్వరున కనేకోపకారములు చేయుటచే నాతనికా దుర్గము బహుమానముగ నీయఁబడియెను. వీరభద్ర గజపతి కాతఁడనిన నిష్టము లేదు ఎదిరించి యా వీరుని జయించుటకు భయపడి కాఁబోలు నాతని రహస్యముగ వసంతవాడదుర్గమునకుఁ బిలిపించి చంపించు నీ యువరాజు ప్రయత్నించెను. దైవవశమున నాతఁడు తప్పించుకొనిపోయెనఁట. అతఁడు లేని సమయముననే నిడప్రోలుదుర్గము యువరాజునాజ్ఞానుసారముగ లక్ష్మీపతి రాజుచే నాక్రమింపఁబడినది. అతఁడు చాల క్రూరుఁడగుటచేఁ బ్రజల దఱుసు సంక్షోభిచుచున్నారు."

"వసంతవాడదుర్గ మిప్పుడెట్లున్నది?"

"అనాయకముగ నున్నది."

ఈ సంభాషణమైన పిమ్మట మంత్రి ఫల్గునునకు సెలవిచ్చి పంపివైచెను. ప్రసంగవశమునఁ దెలిసికొనిన ముఖ్యాంశము లన్నియు మహామంత్రి యగు తిమ్మరుసు గంభీర హృదయపథమున లిఖింపబడియెను. అతఁడు వానికెట్లు వ్యాఖ్యానము చేయునో మున్ముందు తెలిసికొందముగాక!

# 6. వలదు వలదు వలదు

కాలకూట విషంబును గంఠమందుఁ
దాల్చి శితికంఠుఁ డయ్యె సదాశివుండు?
కాళియోరగవిషవహ్నిఁ గ్రాఁగుకతన
నల్లవాఁడయ్యె గోపాల నందనుండు,
విషము భూషణమని యెంచి వెఱ్ఱినైతి,
విషము కన్నులలో నుంచి వెఱ్ఱినైతి,
విషము దిగ్రమింగఁజాలక వెఱ్ఱినైతి,
విషము దలఁదాల్చి నిలువున వెఱ్ఱినైతి,
ఈ విషంబును భరియింప నేది తెఱవు?
విషము హరియించుటకు వేఱు విషము లేదె?
విషము విషమున హరియించు వేళదాఁక
విషపు విఱుగుడు దొరకెడు వేళదాఁక
విషపు మంత్రంబుఁ జదివెడు వేళదాఁకఁ
త్రాఁచుపాముల బుట్ట నా తల నిదేల?
ఫణిఫణంబున నొక దివ్య మణినిఁ గాంచి
నెత్తిపై నాశతో దీని నెత్తికొంటి
త్రాఁచు బుసకొట్టి విషములఁ గ్రక్కుచుండె,
నీ విషాగ్నిని నే భరియింపఁగలనె?
బుట్టలోనుండి తల మీఁదఁ బొడిచె నేడొ?
ఉన్నయది పాము కాక యే మున్నదింక?
అవశమగుచుండె నా యొడ లక్కటకట!
బుట్ట నెట్టులు భరియింతు షట్టిమునిఁగె,
కానుకగ దీని నే మంత్రగాని కిత్తు?
పాముమంత్రంబు నేర్చిన ప్రౌఢుఁ డెవఁడొ?
తెలివిలో వానిఁ గానక తిరిగి తిరిగి
విశ్వమంతయు వెదకుచు వెఱ్ఱినైతి"

అని పాడుకొనుచు వికారాకారిణి యగు నొక యువతి తలపై నేదియో ప్రాంతపేలికల మూట నుంచుకొని రాజమార్గ

మునఁబడి పోవుచుండెను, బాల్యచాపలమునఁ గొందఱు బాలకు లామెను వెంబడించి 'పిచ్చి ప్రమద—పిచ్చి ప్రమద'' అని కేకలు వేయుచుండిరి. సామాన్యముగఁ బిచ్చివారలకుఁ బ్రజాసంఘము కంటకమయముగా నుండును. పిచ్చివారలు తమ్ముఁ బిచ్చివారని ప్రజ లనుకొనుటకు సహింపఁజాలరు. వారు తాము పిచ్చివారను సంగతియే యెఱుఁగరు. దురాశవలననో, దఃఖాతిరేకముననో, మోహావికారముననో, ఆశాభంగమువలననో, హృదయము సహింప లేని యేకష్టమువలననో, సామాన్యముగ నున్మాదము కలుగు చుండును. ఆకస్మికముగ గలిగిన యట్టి యున్మాదము నుద్రేకింపఁ జేయుట కీలోకమే కారణము. అట్టివారల కీలోకమంతయు నున్మాదోద్రిక్తమై యున్నట్టు తోఁచుచుండును.

ఆ యువతి వారివంక జూచుటలేదు. వారి మాటల నాలకించుట లేదు. ఆమె యల్లే పాడుకొనుచుఁ బోవుచుండెను. లోకము లోప ములనే యగ్గడించు స్వభావముకలది. ఆ బాలకు లింకను మూఁగి కొని యామెను బరిహసించుచునే యుండిరి. ఆమెను బోనీయక నిర్బంధించుచుండిరి. మొదలే మతి చెదరియున్న యామెకు హృద యము కలఁగిపోయెను, వారల నెట్లైనఁ దప్పించుకొని పోవల యునని యెంచి పరుగుపరుగున నవ్వలివీధింబడి యొక సమున్నత ప్రాసాదమునకు వెనుకనున్న యుద్యానవనమునఁ బ్రవేశించెను. ఏ కారణముననో గాని యా బాలకు లచ్చటఁ బ్రవేశించుటకు సాహ సింపలేకపోయిరి.

సాయం సమయము కావచ్చుచు డెను, అప్పుడా యుద్యాన వనమంతయు నతి రమణీయముగ నుండెను. సమీప పుష్కరిణీల జలంబులనుండి కమల కుసుమ సౌరభములఁ గొల్లగొని మంద మారుతము లల్లనఁ జల్లగ వీతెంచుచుండెను.

''పీడ వదలిపోయింది, పిచ్చి వదలలేదు. చల్లగాలి యాయా సము నవనయిచింది. భయము తీఱుట కుపాయ మేమున్నది? అందఱి ముందఱ నిలువఁజాలక పరువెత్తుకొని వచ్చిన నేను— ఇక్కడ నెవ్వరును లేరని భయపడుచున్నాను. ఈ రసాలభూజము పిచిది కాఁబోలును! అయిననేమి? పిచ్చిది పిచ్చిదాని నేమిచేయఁ

గలదు? అయినచో నిఁక భయ మెందులకు? ఆఁ—తెలిసినది పాముల బుట్ట నెత్తిపై నున్నది పాఱవైచినచోఁ బట్టుకొనువా రెవ్వరున్నారు? పట్టు దప్పిన పైబడునేమో! పడనిమ్ము పడనిమ్ము '

అని యనుకొనుచు నామూటను గ్రిందఁ బడవైచి కూరుచుం డెను. అప్పుడొక మహాపురుషుడు సాయంసమయోచిత వేషముతో వాయుసేవనమున కరుదెంచుచు వికారాకారిణియగు నామె నాశ్చ ర్యముతోఁ గాంచుచు దూరదూరముగ నందంనుఁ బ్రచారము సేయు చుండెను

"అప్పుడా యున్మాదిని యా ప్రాఁతపేలికల మూటను విప్పి వైచి చేతులూఁచుకొనుచు లేచి నిలువఁబడి 'నాకు మతి పోయినదని యందఱు ననుచున్నారు. మతిలేని దానికి మణు లెందులకు? మణులు దొరకు మంత్రమును నేర్చుకొంటిని మణులకొఱ కా మంత్ర మును బ్రయోగించితిని కాని యా మణులు విషఫణుల తలలపై నున్నవి ఆ మణులతో ఫణులుగూడ నా వెంటఁబడి కఱవ నారంభించినవి. నాకీ పాము లెందులకు? మరలఁ గాటు లపైఁ గఱచిన మరణింతునేమో? చచ్చిపోయినదానికిఁ గూడ మతి పోవునా? ఒకసారి చచ్చి చూచెదను. అప్పుడిఁక ఁ బాము కాటునకుఁ జావుండదు! చావకుండ మతి కుదురదా? మతి కుదుర్చుటకు మంత్ర ములు లేవా? ఉన్నవి ఆ మంత్రములు తెలిసినవారు కోటి కొక్క రున్నారు ఏ కోటిలో నెచ్చట నున్నారో యెట్లు తెలిసికొనఁగలను? విషము తలకెక్కి వెఱ్ఱి యెత్తినపుడు వివేక మెట్లుండును? నాకు మతిపోయినది నిజముగా మతిపోయినది. నాకు నేనే మతిపోయినట్లు న్నాను, లోకముఁగూడ నా కట్లే కనఁబడుచున్నది ఈ పిచ్చి లోకము నాకు పిచ్చి యెత్తినదనుచున్నది! ఈ పాములు నా కెందు లకు? ఈ మణులు నా కెందులకు? ఈ ప్రాఁతపేలికలమూటలోఁ బట్టచీర లున్నవని భ్రమపడితిని పాములున్నవని నా కెట్లు తెలి యును? పట్టి కఱచినప్పుడు నిజము తెలిసినది అయినను జుట్టఁబెట్టి పట్టుకుంటిని. విషము తలకెక్కిపోయినది ఇఁక నాకివి యెందులకు? నా మణిమంత్రము నాకు రానేరాదు. ఇవి నాకు వలదు. వలదు వల దనుచుండఁగా మరల నా తలపైఁ బెట్టెదరేల? పీడ వదలి పిశా

చము పట్టి నట్టున్నఁ. ఇఁక నే నెగిరిపోయెదను అప్పుడు పాములు నన్నేమి చేయఁగలవు వలదు వలదు వలదు—" అని పలుకుచు నామె యటనుండి పరువెత్తుకొనిపోయెను.

# 7. ఎవ్వరును కిక్కు రుమనలేదు

విడిచియు విడువని పూవుల మృదు పరిమళంబులవలె శుక్ల పక్షాష్టమీ చంద్రికల రమణీయ కాంతులు విద్యానగర మణి సౌధము కును, నందు విహరించు యువదంపతులుకును వింత మెఱుంగులనా పాదించి, పతి ప్రాణలగు సతీ మణులంబోలి యథోచితముగ నా గాలక్రమమున నపర భూమండలము నలరింపఁబోవు తమ నాథుఁ డగు రేరాజు ననుసరించి ప్రయాణము చేయుచుండెను! ఆ మోహన దంపతుల విదేశ గమనముంగూర్చి జగమంతయు విషణ్ణదనము నంది యుండెను దెసల నంధకారచ్ఛాయ లలమికొనుచుండెను. క్రమ ముగా నయ్యమృత కరుండంగనాద్వితీయుఁడై యపరసముద్రమునఁ బ్రవేశించెను తోడనే గాఢాంధకారము నిరాఘాటముగ జగమంతయు నాక్రమించుకొనియెను, అదను వేచికొనియున్న నక్షత్రము లప్పు డయ్యాకాశ రాజ్యమునఁ దమకుదొరకిన ప్రదేశమెల్ల నాక్రమించు కొని యయ్యంధతమసముల మినుకుమినుకు మని ప్రకాశింపఁజొచ్చెను అనాయకం బగు రాజ్యమును నల్పులు గూడ నిట్లే యధికారులగు చు దురు

ఆయర్ధరాత్రమున విద్యానగర రాజమార్గములయందు జన సంచార మేమియును లేదు. నిశ్శబ్దముగా నుండెను. అప్పుడు మహా మంత్రి భవనమున కించుక దూరముననున్న చతుష్పథమున నొక పురుషుండటునిటుఁ దిరుగుచుండెను. అతఁడు ధరియించిన యుడుపులంబట్టి చూడ భిక్షుకునిపోలిక నుండెను. అతఁడాగాఢాంధ కారమున రెండు జాముల వేళ నెందుల కట్లు తిరుగుచుండెనో తెలియుటలేదు. బిచ్చమునకని తలంతుమేని నిశీథ సమయమున నాద రించి యాతనికి బిచ్చము పెట్టు వారెవరున్నారుఁ ఆ చీకటిలో నావలి వీథికిఁ జేరువనున్న యొకమందిరము నొద్ద నెవ్వఁడో యొక పురు షుఁడు నిలిచియున్నట్టు పొడకట్టుచుండెను. ఆతఁడావంకనే చూచు

చుండెను. ఆ సమయమున శ్రుతి మనోహరంబగు సంగీత మాతని కిట్లు వినవచ్చెను.

"బాలగోపాలమూర్తి వ్రేపల్లెలోనఁ
జేరి యజ్ఞాతవాసంబు సేయుచుండఁ
బ్రేమమీరంగఁ గాంచి హాయిగాఁ బెరుఁగుచుండ
నిష్టబంధుల నలరింప నెంచుచుండ
ఖలజనంబుల నలయింపఁ దలఁచుచుండ
నోరి వత్సాసురాధమా! యోర్వలేక
యతని భంజింపవచ్చితే యక్కటకట!
సకలజనరంజనము సేయఁ జాలు వాని
సాధుసంరక్షణ మొనర్పఁ జాలు వాని
నపకృతులఁ జేయ నీ చేతు లాడునఁటర?
పాపకార్యంబులకు భయపడని నిన్ను
వదయుఁడగు కంసదానవుఁ డంపెనఁటర?"

ఆ గీత మవ్యక్తభావబోధకమై యుండెను. ఆ కంఠస్వరమున నమృతము వర్షించుచుండెను నిశ్శబ్దబగు నా యర్ధరాత్రమున గాఢాంధకారపూరితంబగు నా సమయమున నా మధుర మోహన సంగీత నినాదము స్వర్గమునుండి వినవచ్చుచున్న దివ్యాప్సరస్త్రీ మనోజ్ఞగానమువలె బరమానందదాయకమై యుండెను అట్లు గానము చేయుచున్న వ్యక్తి యా పురుషుని సమీపమునుండియే పోవుచుండెను. ఆ వ్యక్తి యొక స్త్రీ యని యాతఁడు గ్రహించి "ఎవరువారుఁ" అని ప్రశ్నించెను.

ఆ కాంత యట నిలువఁబడి "నేను రాధను" అనియెను

పురు—ఈ యర్ధరాత్రమున నెటకేఁగుచుంటివి?

స్త్రీ—నేను నా కృష్ణు నెఱుంగకున్నప్పుడు నా కహోరాత్ర పరిజ్ఞానముండెడిది. ఇప్పుడు నాకు దేశకాలభేదము నశించిపోయినది.

పురు—ఎందువలన?

స్త్రీ—శాపమోక్షణ మగుటవలన

పురు—నీ శాప మేమని?

స్త్రీ—కృష్ణు నెఱుంగకుండవలయునని.

పురు — ఆ శాపము తీఱిరదా?

స్త్రీ — ఆ, తీఱినవి ఇంకను వెఱ్ఱి తీఱలేదు

పురు — నీవు పిచ్చిదానవా ?

స్త్రీ — ఆ సంగతి నీ కెందులకు?

పురు — పోనిమ్ము నీ వెక్కడకుఁ బోవుచుంటివి?

స్త్రీ — నా కృష్ణుని యొద్దకు

పురు — నీ కృష్ణుఁ డెచ్చట నున్నాఁడు?

స్త్రీ — ఇచ్చటనే యున్నాఁడు

పురు — ఏఁడీ?

స్త్రీ — నీ కన్నుల కాతఁడగపడఁడు. నా కన్నుల యెదటనే యున్నాఁడు. ఈ గాఢాంధకారమునఁగూడ నా కగపడుచున్నాఁడు నా కన్ను లాతనిమీదఁనే యున్నవి ఎందుల కట్లున్నవో యాతఁ డెఱుంగఁడు. ఆతనికి నా లెక్క యేమున్నది? కాని నేనాతనికొరకే పరిభ్రమించుచుంటిని. లోకపాలకుఁడగు నాతఁడు గడియ కొక యవతార మెత్తుచుండును. ఎవ్వరిని రక్షించుటకో? ఎవ్వరిని శిక్షించుటకో? ఏమి చేయుటకో? ఆతని టక్కరివేషములన్నిటిని నేను గని పెట్టుచునే యుంటిని, ఒకప్పుడు దూరమైపోవుచుంటిని. ఒకప్పుడు దగ్గఱబడుచుంటిని ఆతని కొఱకుఁ బరిభ్రమించుచున్న నేను— ఆతనినే చూడఁగోరియున్న నేను— ఆతఁడే లోకముగనున్న నేను- ఆతని యెదుటనే యున్న నేను-ఆతనిఁ జూచి నవ్వుకొనుచున్న నేను- ఆతనితోడనే మాటలాడుచుంటి ననుకొనుచున్నాను అయ్యో! నా మతి చెదిరిపోయినది. నా బుద్ధి భ్రమసిపోయినది. ఇఁక నెందులకీ మాటలు? నేను పిచ్చిదాననై పోయితిని.

పురు — (ఆశ్చర్యములో) నీవు పిచ్చిదానవేకద!

స్త్రీ — ఏమో? నా వెఱ్ఱి నా కెట్లు తెలియును? అది, నాకును ననుమానముగనే యున్నది

పురు — నీ మాటలనుబట్టి చూడఁగా నీవు పిచ్చిదానవనియే తోఁచుచున్నది.

స్త్రీ — సరే నేను పిచ్చిదాననైనంత మాత్రమున నా మాటలు కూడఁ బిచ్చివై పోవు నెందులకు?

పురు—ఏమైనను నీ పాటలు మాత్ర మతి మనోహరము గా నున్నవి నీ కంఠస్వరము శ్రావ్యతమము గా నున్నది. నీ రూపము మాత్రము వికారము గా నున్నది.

స్త్రీ—అలాగా? నిజమేనా'— నిజమేనా?—నా రూపము వికారముగా నున్నదని యే కాఁబోలు నా కృష్ణుఁడు దూరదూరముగాఁ బోవుచున్నాఁడు! హా కృష్ణా! పోకుము పోకుము! హా కృష్ణా! నీ యనుగ్రహము రూపమునకు లభియించునా? విలాసమునకు లభియించునా? కేవలము ప్రేమమునకు లభియింపదా?

''మంజులిం బేమొ చీకటి మ్రానిచిగురు?
నిస్తులమనోహరం బేమొ నెమిలికన్ను
కుతుకదాయక మగునేమొ కొండగోఁగు?
దివ్యతమ మేమొ యమునా నదీజలంబు?
కానిచో వీనిపైఁ బ్రేమ గలుగుటేల?
అందమునకును బ్రేమింతువా! మహాత్మ'—
ఎట్టి వేషంబుతోఁ గత్తిఁ గట్టినావొ
ఎట్టి కార్యంబునకు సమకట్టినావొ
యేమి యూహించుచుంటివో యెవటఁ గలవొ
యేమి మాయలు చేసెనో యెఱుఁగరాదు;
నిన్ను మించిన మాయలు నేర్చికొన్న
దనుజుఁడల్లదె నీ ముందుఁ దాఁటుచుండె,
నింక నేఁ జెప్పవలసిన దేమి కలదు?
సమయ మెఱిఁగి చరియించెడి జాణ వీవు''

అని పాడుకొనుచుఁ బరుగుపరుగున నా యంధకారములో నదృశ్యమైపోయెను.

ఆ పురుషుం డద్భుత ప్రమోదా యత్తచిత్తుఁడై యేమేమియో యోజించుకొనుచు ముందటికిఁ బోవుచుండెను. ఆ ప్రాంత భవనమునకు సమీపమున లీలామాత్రముగఁ గానఁబడుచున్న యా వ్యక్తి యాతనిం గాంచి యించుక యోసరిల్లి యా మందిరాంగణ పార్శ్వమున నున్న యొక చెట్టుచాటున దాఁగికొనియెను. తోడనే

యా పురుషుఁ డతివేగముగ నచ్చటికిం బోయి బలవంతముగ వాత నిం బట్టి తీసికొనిపోయెను. ఎవ్వరును గిక్కురుమనలేదు,

## 8. ఆ మహాపురుషుఁ డీతఁడే

నేఁటి యుదయమున మహామంత్రియగు తిమ్మరుసు ప్రత్యేక భవనమున నుచితాసనముపై నుపవిష్టుఁడై యుండెను అతని పార్శ్వమున నొక యౌవన పురుషుఁడు నిలువఁబడియుండెను. ఎదుట నిరుపురు రాజభటుల నడుమ నొక పురుషుఁడు నిలిచియుండెను. భయముచే నాతని సకలాంగకములును వడఁకిపోవుచుండెను.

అప్పుడు మంత్రి యాతనివంకఁ జూచి "నిన్నటి యర్ధరాత్రమున గాఢాంధకారములో నీ వెందులకు దిరుగుచుంటివి?" అనియెను.

పురు—మీ పార్శ్వమున నిలిచియున్న యా మాధవరాయని కొఱకు.

మాధవుఁ డా మాట విని యదిరిపడెను

మంత్రి—మాధవుఁ డిచ్చట నుండెనని నీ కెట్లు తెలిసినది?

పురు—ఎవ్వఁడో యొక నూతన పురుషుఁడు తన యశ్వవిద్యానైపుణ్యముం జూపి రాయలవారిచే బహుమానము నందెనని వినియుంటిని ఆతఁడు మాధవుఁడే యైయుండునని గ్రహించి యిచ్చటికి వచ్చి నిన్నటి మధ్యాహ్నమున నీతనిం జూచి యానవాలు పట్టితిని.

మంత్రి—ఈతనితో నీకేమి పని యున్నది?

పురు—మా మహారాజు తన సామంతుల కందఱకును "మాధవుఁడుగాని, గోపాలుఁడుగాని, రాజశేఖరుఁడుగాని మన రాజ్యము నుండి యవ్వలికిఁ బోకుండఁ బట్టి బంధింపవలయును," అని యాజ్ఞ చేసి యున్నాఁడు అందుమూలమున నుదయగిరి దుర్గేశ్వరుని నియోగము ననుసరించి నేను వారిని వెదకుచుంటిని.

మంత్రి—మాధవుఁడు రాజద్రోహియా?

పురు—మహాప్రభూ! కాఁడు కాఁడు! దేశసంక్షోభముల నడంచి మహారాజున కనేకోపకారములం జేసిన రాజభక్తుఁడు.

మంత్రి—అట్లయినచో నీకతనిపై నిట్టి యాజ్ఞ యెందులకుఁ బుట్టినది?

పురు—మహాప్రభూ! ఈతని యెడల మా యువరాజునకుఁ గోపమో, భయమో యున్నది. అందుచే రహస్యముగ నీతని దుర్గమపహరించి, తండ్రిచే నిట్టి యాజ్ఞ చేయించినాఁడు. ఈతనిఁ జంపుటకుఁ గూడఁ బ్రయత్నించెను కాని యితఁడు తప్పించుకొనిపోయెను. ఇందుల కెన్నియోఁ గారణములున్నవి.

మంత్రి—సరియే. నీవీతనిఁ బగలు చూచితివిగదా, రాత్రివేళ నే యుద్దేశముతో నీతని యింటికిఁ బోయితివి?

పురు—మహాప్రభూ! క్షమింపుఁడు. ఇంకొక కారణమున్నది. ఈతని మేనమఱదలును, వసంతవాడ దుర్గేశ్వరియు నగు కమలను లక్ష్మీపతిరాజున కొసంగునట్లును, ఆతఁడీతని దుర్గమును రహస్యముగ వశపరచుకొనునట్లును మా యువరాజు వాగ్దానము చేసి యున్నాఁడు. అందుచే నామెను వెదకుటకుఁ గూడ నాజ్ఞ కాఁబడినది. ఆమె యీతని యింట నుండునేమోయని తెలిసికొనుటకై యచ్చటికిఁ బోయితిని.

మాధవుఁడు నిశ్చేష్టుఁడయ్యెను క్రోధావేగముచే నాతని రక్తనాళములు పొంగిపోవుచుండెను. శిలామయ విగ్రహమువలె నట్లే నిలిచియుండెను.

మంత్రి—ఆ కమలను నీ వెఱుంగుదువా?

పురు—ఎఱుఁగను.

మంత్రి—నీ వెట్లామెను గనిపెట్టదలచితివి?

పురు—ఏలినవారి కర్పించిన యా చిత్రపటమునందుఁ బ్రథమమున వ్రాయఁబడి యున్నది కమల ప్రతిరూపమే.

మంత్రి— "మాధవరాయా! ఈమె కమలయేనాఁ" అని యా రూపపటము నాతనికిఁ జూపెను.

మాధవుఁడు దానింజూచి పూర్వస్మృతి కలుగుటయు వికలహృదయుఁడై గద్గదస్వరముతో, "ఔను మహామంత్రిశేఖరా!" అనియెను

తిమ్మ—ఆ సమీపమున లిఖియింపఁబడిన యామె యెవ్వరు?

మాధ—ఆమె పినతండ్రి కూఁతురు శ్యామల,

తిమ్మ—(కొంచె మాలోచించి తలయూఁచి పురుషునింజూచి) సరియే నీవీ నగరపటము నెందులకు వ్రాసితివి?

పుర—మహాప్రభూ! క్షమియింపుఁడు మా ప్రభుండగు నుదయగిరి దుర్గేశ్వరుఁడిచ్చటి విశేషములఁ దెలిసికొని యీ నగర పటము వ్రాసి తీసుకురమ్మనికూడ నాజ్ఞాపించియున్నాఁడు. నాది సేవకజీవనము, ప్రభువు లెట్లు చెప్పిన నట్లు చేసినఁగాని జీవనము జరుగదు

మంత్రి—సరియే! నీ విషయమై యాలోచింపఁబడును

అని మహామంత్రి యానతిచ్చినతోడనే రాజభటులా పురుషుని వెంటఁబెట్టుకొనిపోయిరి,

పిమ్మట మంత్రి మాధవుని వంకఁ జూచి, "మాధవరాయా! కమలను నీకుఁ బెండ్లి చేసి వసంతవాడ దుర్గము కట్నముగా నొసంగుటకు మీ మేనమామ నారాయణరాజు మరణశాసనము వ్రాసి యుంచెనాఁ" అని యడిగెను.

మాధవుఁ డాశ్చర్యముతో "చిత్రము" అనియెను,

మంత్రి....ఆమె రాజ్యము నపహరించుటకే కాదా నీలాద్రిరాజు శ్యామలను యువరాజున కిచ్చుటకుఁ బ్రయత్నించుట?

మాధ—చిత్రము.

మంత్రి—ఆమె యంతటి ప్రభువును బెండ్లియాడుట కేల యంగీకరింపలేదు?

మాధ—అక్కయందలి ప్రేమముననుఁ యువరాజు పాప వర్తనుఁడని, యీ కార్యమును బట్టియే గ్రహించుటవలనను—

మంత్రి—తుదకామె బలవంతముగఁ గొండవీడు పంపఁబడి జంపఁబడినది కాఁబోలును?

మాధవుఁ డదరిపడి, "చంపఁబడినదా! మహామంత్రిశేఖరా! ఆ సంగతి నే నెఱుఁగను," అని పలికి యాకస్మికశోకావేగమున వడఁకి పోవుచు నిట్టూర్పులు విడుచుచుండెను.

మంత్రి యెక్కించుకసేపేమియో యోచించుకొని, "మాధవ రాయా! శిశిరమతి యెవ్వరు?" అని యడిగెను.

మాధవుఁ డులికిపడి ' ఆమె శ్యామల దాది కూఁతురు కమల, శ్యామల, శ్యామల సోదరుఁడగు గోపాలుఁడు, శిశిరమణి, నేను మేమైదుగురమును బంచప్రాణములవలెఁ జిన్నతనమునుండియు నొక్కచోఁ బెరిఁగితిమి. దైవ దుర్విపాకమునఁ దుద కీ విధముగా విడిపోయితిమి, ' అని మాటాడలేకపోయెను

అప్పుడు మంత్రి "మాధవరాయా! నీ మనసు చెదరిపోయినది. కాలగతికొఱకు విచారింపవలదు. మనసు కుదురుపఱచుకొని ధైర్యముతో నుండుము. ఆపవలు కాపురము సేయవు," అని చెప్పి పంపివైచెను.

మహామంత్రియగు తిమ్మరుసున కీ సంగతులన్నియు నెట్లు తెలియవచ్చెనని పాఠకులకు సందేహము కలుగవచ్చును, నాఁటి సాయంసమయమున నున్మాదిని యొక్కతె యుద్యానవనమునఁ బ్రవేశించి ప్రాఁతప్రేలికలమూటఁ బాఱవైచి పోయినదిగాదా? అది మంత్రి యుద్యానవనమే, నారాయణరాజు మరణశాసనమును, నీలాద్రిరాజునకు యువరాజు వ్రాసిన ప్రథమ లేఖయు, శ్యామల మరణసమాచారముం దెలుపు రెండవ యుత్తరమును, నా మూటలో నుండెను. అవి యా మంత్రిశేఖరునకు లభియించెను. ఆ సాయంకాలమున నచ్చటికి వాయు సేవనమునకై వచ్చిన యా మహాపురుషుఁ డితఁడే,

# 9. ఇదిగో

మాధవున కా దినమున నాహారము సరిగా రుచియింపలేదు. ఆతని మనసు మనసులో లేదు ఆతనికి జగమంతయు నసహ్యముగా నగపడుచుండెను. కాలము విషమయముగా నుఁడెను. ఒకసారి క్రోధముద్రేకించుచుండెను మఱియొకసారి శోకము ముంచుకొనిపోవుచుండెను దృఢహృదయుండగు నాతఁడు కూడ వానికి వశుఁడైపోవుచుండెను. తాలిమి నిలుచుటలేదు. ఆకస్మికముగఁ నాతఁడీ దినమున రెండు భయంకరవార్తల నాలకించి యుండెను. అప్పటినుండియు నాతని కేమియును దోఁచుటలేదు,

"హా, శ్యామలా! నా కంఠమునఁ బ్రాణముండఁగా నీ కెట్టి కష్టములును రానీయను." అని యానాఁటి రాత్రి నిన్నెంతయో

యూఅడించితిని కమియును జేయలేకపోయితి. నా ప్రాణములను గాపాడిన నీ ప్రాణములను నేను గాపాడలేకపోయితిని, నీవు సాహసిక పతివ్రతయ సతీశిరోమణికిఁ దగిన పనియే చేసియుండువు. అయిన నేమి? నీ యెడఁగాలము విపరీతమైపోయినది దురాత్ముల పాపము పండిపోయినది. అయ్యో? నీ చిన్నారి చేష్టితములు, నీ పరిహాస వాక్యములు, నీ పాటలు, నీ మాటలు, చిన్ననాఁటి నీ యాటలు, అన్నియును గన్నులఁ గట్టినట్టు లుండఁగా నిన్నెట్లు మఱవఁగలుగుదును? అయ్యో? ఈ విధముగా నిన్నుఁ జేతులారఁ జంపుకొనుటకుఁ గన్నతండ్రి మన సెట్లంగీకరించెనో గదా! నరహంతకుఁడగు నాతఁ డేమి చేయఁజాలఁడ, అశాభూత మాతని నేఁతకుఁ బాలు సేయదుఁ హా శ్యామలా! నీకీ లోకముతో సంబంధము వీడిపోయినదా? ప్రేమమునకు ప్రేమమై, ప్రాణమునకుఁ బ్రాణమై యున్న నీ యక్క రాజ్యమును నిలుపుటకుఁగదా నీ ప్రాణములను బలి యిచ్చితివి? నీవే ధన్యురాలవు. నీకీ కష్టము లేవియు నగపడుట లేదు. అగతికయై, అసహాయయై, అబలయై యున్న కమల యిప్పుడెట్లు బ్రతికి యుండఁగలదు? పాపవర్తనుఁడును, దుష్క్రియాపరతంత్రుఁడును, దురాత్ముఁడునగు వీరభద్రగజపతి బలవంతముగ నిన్ను బలిగొని, యతి నిగూఢముగ నా దుర్గము నపహరించి, యంతటితోఁ దృప్తినొందక, యనాథయు, నబలయు, నగు కమల నొక నీచునకు బలిసేయఁ జూచుచున్నాఁడుగా!

హా! హృదయేశ్వరీ! కమలా! మదేక జీవితవై యున్న నీకు — సోదరీ మరణదుఃఖితవై యున్న నీకు ప్రాణబంధు విరహితవై యున్న నీకు — ఆపదలపై నాపదలు వచ్చుచున్నవి ఇఁక నీకు బట యెట్లుండును? హృదయమవశమైపోయినప్పుడు — దుఃఖము సహింపరాకుండ నున్నప్పుడు — ఆపన్నివారణోపాయమేదియుఁ దోఁపకుండ నున్నప్పుడు — నన్నుఁ దలఁచుకొని దుఃఖించుచుందువా? అయ్యో! ఇట్టి యవస్థలో నున్న నేను నీకెట్లు సాయపడఁగలుగుదును. నీ వెక్కడ నుంటివో, ఎట్లుంటివో నా కేమియుఁ దెలియుటలేదు ఇట్టి యవస్థలో నున్న మనలను దైవమే రక్షింపవలెయును, దైవసమానుఁడగు రాజశేఖరుఁ డొకఁ డున్నాఁడు. అతఁడు నిన్ను రక్షింపఁగలఁడనునమ్మ

ముతో ధైర్యమును వహించియున్నాఁడను. తప్పక యాతఁడు నిన్ను రక్షించును. ఆనాటి రాత్రి యేలూరునొద్ద మేము కలిసి కొన్నప్పు డాతఁడీ విషయమున నాకు ధైర్యమును నెలకొల్పి యున్నాఁడు. కాని యంతమాత్రమున నెట్లు ధైర్యముతో నుండఁ గలనుఁ పాపాత్ముల పాపము ప్రకోపించినప్పుడు — బలవంతులు పైఁబడ నుంకించినప్పుడు — అసహాయుఁడగు మానవమాత్రు డేమిచేయఁగలఁడు? హా! ప్రాణేశ్వరీ! ఎట్లయిన నేనేమిచేయఁ గలను? దురాత్ములగు నపకారులకుఁ బ్రతీకారముం జేయు టకై సర్వవిధములఁ బ్రయత్నించుచుంటిని దైవానుకూల్యమున నా ప్రయత్నము తప్పక ఫలియింపఁగలదు. నా పరిభవము తీఱఁ గలదు విజయం లభింపగలదు. కాని యిప్పట్టున నీ వొకలాగైనచో నాకు వీనివలన నేమి యానందమున్నది! నా శరీరము నందలి ప్రాణ ములు నీ కొఱకే వేచియున్నవి"

అని యీ విధముగాఁ బనవి పనవి దుఃఖించుచు మాధవుఁ డా నాఁటిరాత్రి యాయాసముచే శయ్యపై నిట్టి మేను వాల్చెను. కాని యాతనికి నిద్దుర పట్టుట యెట్లు? పాపము! నిద్రాదేవత దుఃఖములను మఱపించు స్వభావము కలదియే కాని, యామెకు దుఃఖపడువారి దరిఁజేరుట భయపడు స్వభావము కూడ నున్నది. దుఃఖదేవత తేజస్వినియై నాట్యము సేయుచున్నంత వఱకు నిద్రా దేవత యావంకఁ దేటి చూడనైనఁ జూడఁజాలదు, దుఃఖదేవత మిన్నంటి నాట్యముజేసి యాయాసముచే నలసియునప్పుడు—వరా కుగ నున్నప్పుడు వెనుక పాటునవచ్చి నిద్రాదేవత యామెను ద్రోచి వేచును. కాని, యలసియున్న యాదుఃఖదేవత దొంగవలెఁ పైబడిన నిద్రాదేవత నెదిరించి యెట్లో యొకవిధముగ విడువక పోరాడుచునే యుండును అందువలన నిద్రాదేవతకు సంపూర్ణ విజయము కలుగుటలేదు, కావుననే నిద్రాదేవత దుఃఖతుల చెంతకు చొరుచుకొని రాదు.

మాధవుఁడు దుఃఖావేగముచే శయ్యపైఁ బడి యిటునటు దొరలుచుండెను. హృదయ పరితాపముచే నాతని యెడ లుడికిపోవు చుండెను. వేఁడి నిట్టూర్పులచే నరుణాధరము కందిపోవు చుండెను.

ఆలోచనా పరిణామములచే ముఖలక్షణములు మాఱిపోవు చుండెను ఆయాసముచేఁ గన్నులు మూఁతలుఁబడిపోవు చుండెను. ఊహాభావముచే స్మృతి తప్పిపోవు చుండెను రాత్రి మూఁడవ జాము తిరిగి పోవుచుండెను. ఆ సమయమున నిద్రాదేవత యాక్రమించుకొని యెను ఆ నిద్రలో నాతఁడొక స్వప్నమును గాంచెను.

నిర్మలమగు నీలాకాశమున సంపూర్ణ చంద్రమండలము ప్రకాశించుచుండెను ఆసుధాంశు చంద్రికలు లోకమంతటఁ జల్లగఁ బ్రసరించు చుండెను. మాధవుఁడారుబైట నావంద్రాశవంబున విహరించుచుఁ దన మనో దుఃఖము నపనయించుకొను చుండెను ఇంతలో నా చంద్రమండల మధ్యమున నొక తేజోమూర్తిని సంరక్షించుచు ననేకు లాయుధపాణులై యామండలము చుట్టును బరివేష్టించి యుండిరి. ఆ మూర్తిని దా నిదివఱ కెక్కడో చూచియున్నట్లాతనికి స్మృతికలుగు చుండెను ఆ మూర్తి శ్యామలామూర్తి యని యాతఁడనుకొనియెను. స్వర్గమునకుఁబోయిన శ్యామల తన్నుఁ జూచుటకై యా చంద్రమండలమునఁ బ్రవేశించి తన యొద్దకు వచ్చునున్న దని యాతఁడు భావించుకొనియెను, ఆసుధామయ మూర్తితో మాటాడ వలయునని యాతఁడనేక బర్యాయములు ప్రయత్నించెను. కాని. తన మాటలు దూరమునందున్న యా మూర్తికి వినంబడవేమో యని యాతనికి సంశయము తోఁచెను, ప్రేమోద్రేకమున నాతని కా సంశయమును బోయెను అతఁడు 'శ్యామలా! శ్యామలా! నాతో నొక్క మాటాడి మఱి పొమ్ము. నీ కొరకే మేము వెదకికొనుచుంటిమి, నీ కొఱకే మేము దఃఖించుచుంటిమి, మమ్మి దుఃఖ సముద్రమున ముంచివైచి నీ వా స్వర్గమున కెట్లుపోయితివి? అని పలవించుచు నాతఁడు పై కెగురుటకుఁ బ్రయత్నించెను ఱెక్కలు గల పక్షివలె నాతఁడు కొంతవఱకు బైకెగిరిపోయెను. కొంతదూరము పోవునరి కాతని కాయాసము తోఁచెను ఇఁక నెగురఁజాలక పోయెను. ఆయంతరాళమున నాఁగుటకుఁగూడ నాతని కాధార మగపడలేదు. అప్పుడాతఁడొక వృక్షమున వ్రాలెను క్రింద సముద్ర ముప్పొంగి యా వృక్షము నొరసికొను చుండెను ఆఁ డా వృక్షమునుండి పైకిఁబోవుటకుఁ గాని క్రిందికి దిగుటకుఁగాని వలను గాకుండెను.

ఇంతలో నా చంద్ర మండలము చుట్టను గారు మబ్బు లలముకొనియెను. ఆ నీల మేఘములలో నా చంద్రమండల మంతర్హితమై పోయెను. అంతయును గాఢాంధకారమై పోయెను. ఆయంధకారములో—ఆ సముద్ర జలంబుల దూరమున నొక దీపము మినుకు మినుకు మని యగపడుచుండెను ఆ దీపపుఁగాంతి యాతని యాశాలతల మరలఁ గొనసాగించెను, క్రమముగా నా కాంతి దగ్గఱఁబడుచునట్లాతండు కనిపెట్టెను ఆ దీపపు వెలుతురున నావచ్చుచున్నది యొక నావయని యతఁడు తెలిసికొనియెను. ఆ నావ దరితట్టుచున్న కెరటముల వేగమునఁ దన దిక్కునకే వచ్చుచుండెను.

ఆ నావలో నొక బాలిక కూర్చుండి విచారించుచున్నట్లు లాతఁడు గ్రహించెను ఆమె కమల యని యాతనికనుమానము గలిగెను, ఆతఁడు 'కమలా'! యని కేకవైచెను. ఆ సముద్రపు గాలిలో నాతని కేక యామె కెట్లు వినఁబడును? క్రమముగా గాలియును దుపానును బ్రారంభమయ్యెను, ఆ యొక గాలిచే నా నావలోని దీప మారిపోయెను ఆ కారణమున నాతనికా నావ యగుపడుట లేదు—కాని దూరమునుండి—ఆయంధకారములో—ఆ భయంకర ప్రభంజన మధ్యమునుండి—"నన్ను రక్షించు వారెవ్వరును లేరా? నేనీయగాధ సముద్రమున మునిఁగిపోవుచుంటిని అబలను నన్నుఁ రక్షించు వారెవ్వరును లేరా?" అను నార్తనాద మాతని చెవులకు వినఁబడియెను కమల యావిపదంబుధిలోఁ బడిపోయినదని యాతఁడు భావించుకొని, శోకోద్రిక్తమనస్కుఁడై యొడ లెఱుగకయె 'నేనున్నాఁడ" నని గట్టిగ నఱచుచు నా వృక్షాగ్రమునునుండి యాయగాధ సముద్రమున కుఱికెను కమల యెక్కడ నుండిన నాతని కదియే స్వర్గముగదా! కమలతోడి మరణమైన నాతనికి సుఖకరమైనదియే. ఆతఁడీవిధముగ భావించుకొనుచు నా యగాధ సముద్రము నీఁదుకొని ముందఱికిఁ బోవుచుండెను. కాని. యెదురెత్తున వచ్చుచున్న తీవ్రతరంగాఘాతములచే నాతఁడొక బారకు నూఱు బారలు వెనుకకే కొట్టుకొని వచ్చుచుండెను" అయ్యో నేనింకా గమలను గలిసికొనఁజాలనా? ఆమెనుద్ధరింపఁజాలనా! ఈ యగాధ ముద్రమునఁ బడిపోయిన యొకయబలను రక్షింప నేరని బ్రతుకేల? అని

వలవించుచు నింకను ముందుకిఁబోవుటకే ప్రయత్నించుచుండెను. క్రమముగా నాతని భుజబల మడంగి పోవుచుండెను. నిట్టూర్పుల వేగమధిక మగుచుండెను. తుద కాతఁడు శక్తిహీనుడై యా సముద్రము నీఁదజాలక యా మహాజలధి మధ్యమున—ఆ తరంగశయ్యాతలమునఁగాలుసేతులు సాచి శయనించెను ఆకస్మికముగ నాతని కన్నుల కొక దివ్యతేజ మగపడియెను అతఁడా తేజమును గాంచి "ఓ దివ్యశక్తి! నీ కొక నమస్కారము! నీవు నా హృదయేశ్వరి యగు కమలను గాపాడుము. నాకదియే పదివేలు" అని ప్రార్థించ సాగెను. అప్పు డా దివ్యతేజమునుండి యొక వాక్య మాతనికి వినంబడియెను.

నిన్నుఁ దీరమునఁ జేర్చుట నీ కిష్టమేనా?

"నా హృదయేశ్వరియో?"

"నీ హృదయేశ్వరి యెక్కడ నున్నది?"

"ఈ యగాధ సముద్రమున నున్నది. ఆమెను రక్షింపవా?"

"ఆమె నీకగుపడుచున్నదా?"

"లేదు. ఈ యంధకారమున నాకెట్లగపడును?"

"ఆమె యతలజలమునఁ బడిపోయినది. నీవును నామెతోఁ బోయెదవా? తీరమునకు వచ్చెదవా?"

"మహాత్మా, ఇఁక నా కెక్కడి తీరము? నేను నా హృదయేశ్వరి యొద్దకే పోయెదను. క్షమించి నన్నచటికిఁ దీసుకొని పోయెదవా?"

"మన మక్కడకుఁ బోఁజాలము"

"అయ్యో హృదయేశ్వరి! కమలా! నీవు నాకగపడవా? ఇఁక నాకీ జీవములతోఁ బ్రయోజన మేమున్నది?"

"కుమారా! ఏల దుఃఖించెదవు? నీవు తీరమునకుఁ జేరి యామె కొఱకు వెదకికొనుము!"

"ఆమె యతలజలమునఁ బడిపోయినదిగదా! నాకుఁ దీరమున నెక్కడ దొరుకును?"

"ఆమె దివ్యాంగన ఆమెకుఁ జావెక్కడిది? ఆమెయే నీ

కొఱకు వెదకికొనుచు నీ యొద్దకు వచ్చును, నీవు నీ తీరమునకు వచ్చెదవా?''

"నిజముగా నా కమల తీరమునకు వచ్చునా?

''వచ్చును, కాని ఇప్పుడు నీకగపడదు.''

' ఎప్పుడగపడును?''

' అది చెప్పుటకు వలనుగాదు "

అని చెప్పుచు నాతని నామహాత్రైజ మొకతీరమునకు విసరివైచెను, మాధవుఁ డా తీరమునఁ బడక మొదటఁ దానెక్కిన వృక్షాగ్రమునఁ బడియెను. అతఁడా వృక్షాగ్రమునఁ గూరుచుండి "ఏది?'' అని గట్టిగ నఱచెను ఆ యఱపులతో నాతనికి మెలఁకువ కలిగెను. అప్పుడే సూర్యోదయ మగుచుండెను, అప్పు డొక సేవకుఁడాతని యొద్దకు వచ్చి ' ఇదిగో! శ్రీసార్వభౌముని యాజ్ఞాపత్రము." అని యాతని చేతికిచ్చెను,

మాధవుఁడు తత్తరముతో నా యాజ్ఞాపత్రమును విప్పి యీ విధముగాఁ చదివికొనియెను.

ప్రభుభక్తి పరాయణుఁడగు మాధవ రాయులకు—

సార్వభౌముఁడు నీ స్వామి భక్తికి మెచ్చితన యాశ్వికదళమునసేనా ఆశ్విక సేనకు నిన్ను నాయకునిగాఁ జేయుచున్నాఁడు నీవు నీ విధాయక కృత్యము నస్ఖలితగతి నెరవేర్చుకొనుచు సార్వభౌమునకాదరపాత్రుఁడు వగుదువు గాక!''

మాధవుఁడు రాజముద్రికతో నున్న యీయుత్తరువును జదివికొని పరమానందమును బొందెను. పరమేశ్వరుని యనంత విలాసముల కాశఁ డచ్చెరువు నొందచు నాతని కనేక వందనములనాచరించెను

## 10. కమల ఏమైపోయినది?

నాఁటినుండియును వనదుర్గము గజాశ్వసేనా సముదాయతోఁ దనతొంటియౌన్నత్యమును వహించి యుండెను. అందిప్పు డిరువది వేల సైన్యమున్నది, అందుఁగొంత వసంతవాడ దుర్గమునుండి వచ్చినదే- రాజశేఖరుఁ డా చుట్టుపట్లనున్న యిరువురు మన్నెరాజులతో మైత్రి యలవరించుకొనుటచే వసంతవాడ సైన్యమును వారి సేవలతోఁ

జేర్చి యుంచెను. క్రమముగా నా సేనకంతకు నీకండే మార్గదర్శి యయ్యెను, ఆ సేనలును. సేనానాయకుడును మన్నెదొరలును రాజశేఖరుని యాలోచన చొప్పున నడచుకొను చుండిరి. ఆ సేనల కన్నింటికిని నీ వనదుర్గమే ముఖ్య స్థానమయ్యెను వారలందఱకును గోపాలుఁడేలికయయ్యెను వసంతవాడ దుర్గమున నీవఱకు నీలాద్రి రాజు కూడబెట్టిన ధన మంతము రాజశేఖరుని యధీనమయ్యెను. అందుచే నీసే నాపోషణమున కేమియును లోపము లేకయుండెను సమయజ్ఞుఁడగు రాజశేఖరుఁ డెల్ల విషయములను రహస్యముగ గ్రహించుచు శత్రుసంహారమున కుచిత సమయమును నిరీక్షించు చుండెను, కాని మాధవుఁ డెచ్చట నున్నదియు నాతనికిఁకను దెలి యుట లేదు తమ్ముఁ బట్టుకొనవలయునని యుత్కలేశ్వరుం డిచ్చిన యాజ్ఞావృత్తాంత మాతనికిఁ దెలియవచ్చినది. ఆ కారణమున వలను దప్పి వచ్చినచో నుత్కలేశ్వరునినైన నెదిరించి నిలుచుటకుఁ దగిన యేర్పాటులను జేసికొనుచుండెను. ఈ సందర్భమున మహమ్మదీయ ప్రభువుతో స్నేహము చేయుట కాతని కిష్టములేదు. ఎప్పటికైన విద్యానగరాధీశ్వరుఁడు శ్రీకృష్ణమహాదేవరాయలతోఁ జేరవలయు నని యాతఁడు తలంచుకొనుచుండెను. ఇంకను గొందఱు మన్నె దొరలను, మన్నె సైనికులను జేర్చుకొనుచు నా సమయమునకై నిరీక్షించుచుండెను

కాలము చల్లగా జరిగిపోవుచున్నది రాత్రి గాఢాంధకార బంధురమైయుండెను. పెనుగాలి వీచ నారంభించెను చుట్టునున్న పర్వతములపైనుండి యెండుటాకులును, నెఱ్ఱవిధూళియును నెగసి ఘూన భీంతరాళముల ముంచివైచుచుండెను. ఆ భయంకర ఝంఝా మారుతాహతులకు పర్వతములపై నున్న పెద్దవృక్షములు వేళ్ళతో గూడఁ బెలగిల్లి పెళపెళారావములతోఁ బడిపోవుచుండెను ఆ దారుణధ్వనులకు భయపడి వన్య మృగములు నలు దిక్కులకుఁ బలా యితము లగుచుండెను ఆ మహా వాయువేగమునం గలిగిన రివ్వు రివ్వు మను భయంకర నిస్వనంబులును, సమూలపతితంబులగు మహా వృక్షముల పెళపెళారావంబులును, భయకంపితములై పంచబంగా ళము లగుచున్న క్రూరమృగంబుల దారుణ ఘోషంబులును జేరి

యా వనదుర్గప్రదేశ మతంయు బీభత్సముగ నుండెను సైనికులెల్ల రనుఁ దమతమ భవనములఁ దలుపులు మూసికొని వెలుపలికి రాజాల కుండిరి దుర్గమునకు లోపలనున్న దీపము లన్నియు నారిపోయెను. అప్రళయప్రభంజన గర్జితములకు గిరిగహ్వారంబులు మాఱుమ్రోయు చుండెను ఆ మహా వాయు తరంగములలో వృక్ష శాఖలునుం దారుపత్రములును, తెగిపడిన లతాగుల్మములును గొట్టుకొనిపోవు చుండెను

రాజోచితంబగు నొక భవనంబున రాజశేఖరుఁడును, గోపా లుఁడును శయనించియుండిరి దాని యెదుటనున్న గదిలో గమల పరుండి యుండును ఆమె పరుండియున్న గది తలుపు లెప్పుడును దీసియే యుండును గాని నేఁటి రాత్రి వీచుచున్న భరింపరాని గాలికి సహింపజాలక యామె యా తలుపులను మూసి పరుండెను. ఆ యింటిలో మాత్రము దీపము వెలుఁగుచుండెను. తక్కిన దీపము లన్నియు నారిపోయినవి ద్వారపాలకు లా భయంకర వాయు సంరంభమును సహింపఁజాలక ద్వారపార్శ్వముల నున్న చిన్న గదుల లోనికిఁ బోయి తలదాచుకొని యుండిరి ఆ సమయమున నాగృహా మున నున్న యొక మఱ్ఱివృక్షము వాయువేగమునకు వ్రేళ్ళతోం బెల్లగిల్లి క్రిందఁబడిపోయెను తోడనే యా భవనమునఁ బిడుగుపడి నఁతటి చప్పుడయ్యెను ఆ చెట్టుపడిన దారుణధ్వని యా భవన మునఁ బ్రతిధ్వనించెనో, కాక యా మందిరమున నేపార్శ్వమైనఁ గూలెనో యెవ్వరికిని దెలియదు. ఆ భయంకర ధ్వనివలన నాకస్మికో ముగ మెలఁకువగలిగి రాజశేఖరుఁడును గోపాలుఁడును దత్తరముతో లేచి నలువంకలఁ బరికించిరి ఆ మందిరమున దీపములేదు జాలక మార్గమునుండి యాగాఢాంధకారమున బెల్లగిలి పడిపోయిన యా వృక్షము వారి కగపడియెను అదియే యాధ్వనికి గారణమై యుండు నని వా రనుకొనిరి. కాని, యందువలనఁ గమల యేమి భయపడునో యని సంశయము తోఁచుటచే "కమలా? కమలా!" యని పిలుచుచు, నెదుటనున్న తలుపు తట్టిరి కమల మాఱుపలకలేదు. అప్పుడు గోపాలుఁడు చెట్టుపడిపోయిన వైపు వసారా నుండి తలుపు తెఱః

బడి యున్న యా గదిలోఁ బ్రవేశించెను. అంతవఱకు వెలుగుచున్న యా గదిలోని దీపము కూడ నీవలకే యారిపోయెను

దీప మారిపోవుటయు గదితలుపులు తెఱచియుండుటయుఁ గాంచి తత్తరముతో గోపాలుఁడు తడవికొనుచుఁ గమల శయ్య యొద్దకుఁ బోయి "కమలా! కమలా! యని మరలఁ బిలిచెను ఏమి యును బ్రత్యుత్తరము రాలేదు. ఆతఁ డు మఱింత తత్తరముతో "సోదరీ!" యని పిలుచుచుఁ గమల శయ్యను దడవి చూచెను కమల యందగపడలేదు. గోపాలుఁడు "బాబా" యని కెవ్వున నొక్క కేక వైచియా ప్రక్క తలుపులను దీసివైచెను రాజశేఖరుఁడు "ఏమి? ఏమి?" అని లోపలికివచ్చి నిలిచెను. గోపాలుఁడేమని చెప్పఁగలఁడు? ఆ దుర్వార్త చెప్పకుండానే రాజశేఖరుఁడు గ్రహించి "అయ్యో! కమల యేమైనది?" అని తత్తరముతో వెలుపలికి వచ్చెను, ఆ సంద డిని విని ద్వారపాలకులు మొదలగు సేవకు లక్కడకుఁ బరువత్తుకొని వచ్చి దీపములను వెలిగించి యంతటను వెదకిచూచిరి కాని యెక్క డను గమల యగపడలేదు. ఒక నిమిషములో నా వార్త యక్కడి వాఱందరికిని దెలిసిపోయెను. ఎల్ల యెడల సంక్షోభముగా నుండెను అందఱు దలయొక దిక్కునకును బోయి కమలను వెదకఁజొచ్చిరి ఆమె పోఁబడి యేమియును దెలియలేదు. ఆ సమయమున మహావన మును వన దుర్గమును గూడ నల్లకల్లోలముగఁ జేసివైచిన దారుణ ప్రభంజనా వేగము శాంతించినది. కాని యప్పుడందఱి హృదయ ములను హృదయ విదారణంబగు శోకప్రభంజన మతిదారుణముగ వీవ నారంభించెను,

ఏకమలాసంరక్షణమునకై కష్ట సుఖంబులఁ బరిగణింపక నిరం తర ప్రయత్నములతో వనదుర్గముల నాశ్రయించి యజ్ఞాత వాసము నెట్లొద్దులు గడుపుచుండెనో. ఏకమలాసంరక్షణ విషయంబునం దన ప్రాణములనైన నర్పించి తలపూవు వాడకుండఁ గాపాడెదనని మాధవునకు వాగ్దానము చేసియుండెనో. ఏకమలా సంరక్షణమునకై యనేకోపాయములచే నసంఖ్యా సైన్యమును సంపాదించి నిర్జనమై యున్న వనదుర్గమును జనపదముగాఁ జేసియుండెనో ఆ కమల యాకస్మికముగా నగపడకుండ బోయినప్పు డెంతటి దృఢ హృద

యుడై యుండినను రాజశేఖరుడు సహించి యెట్లుండగలడు? అతని యాలోచనము లన్నియు నామె యభ్యుదయముకొఱకే అతని సామర్థ్య మంతయు నామె సంరక్షణముకొఱకే అతని ప్రయత్నము లన్నియు నామె క్షేమముకొఱకే, అయ్యో! ఇప్పు డాతని యాలోచనా సామర్థ్యప్రయత్నము లిక నెవ్వరికొఱ కుపయోగపడును? కమల యేమైనది? ఈ దుర్గమదుర్గమునుండి యామె నెవ్వ రపహరించుకొని పోగలరు?

ప్రాణాధిక సోదరీమణి మరణించిన దుఃఖమును మరచి ప్రాణ పదమగు మాతృదేవతా వియోగమును సహించి యెవ్వతెపై గన్ను లుంచుకొని, యెవ్వతెను సకలసుఖ స్వరూపిణీగా దలంచుకొనుచుండెనో, సకల బంధుస్వరూపిణీగా భావించుకొనుచుండెనో సకల సంపత్స్వరూపిణిగా దలంచుకొనుచుండెనో యట్టి సోదరీమణికూడ నిట్లగపడకుండ దూరమైపోయినప్పుడు గోపాలున కీ లోకమున నిక నే మున్నది? అయ్యో! కమల యేమైపోయినది?

# 11. రాధకు జాలపాటలు వచ్చును

అంతఃపుర మణిమందిరమున మృదుల పర్యంకముపై బట్టపు దేవియగు తిరుమలదేవి యాసీనయైయుండి సమీపమున రత్న కంబళముపై గూరుచున్న యొక చెలిమికత్తె శ్రీమదాంధ్ర మహా భాగవతమును చదువుచుండ నాలకించుచుండెను. ఆమె యప్పుడు దశమ స్కంధము నందలి నరకాసుర యుద్ధఘట్టమును బ్రీత్యతిశయ్యను జదువుచుండెను. నాఁడు శ్రీకృష్ణదేవరాయ లంతఃపురమునకు విచ్చేయు నను నానందముతో నున్న తిరుమల దేవి కప్పుడా పురాణశ్రవణ మతి మనోహరముగ నుండెను అప్పు డాకథ కూడ నుత్సాహపూరితముగ నుండెను, విదుషీమణియగు తిరుమల దేవి. శ్రీకృష్ణుని తటస్థభావముం గూర్చియు శృంగార వీరరసస్ఫూర్తి తంబులగు సత్యాదేవి విలాస విక్రమాలాపంబులను గూర్చియు క్రూర నరకాసురుని దుర్విజృంభణముం గూర్చియు సవిమర్శముగఁ జర్చించుచు రణలీలా వినోదినియగు సత్యభామను వర్ణించు పద్యముల

నడుమ నడుమ నందికొని తానుగూడఁ జదువుచు నత్యుత్సాహ ముతో నుండెను.

సాయంకాలము కావచ్చుచుండెను. ఆ సమయమున శ్రీకృష్ణ దేవమహారాయ లుచితాలంకార విభూషితుఁడై యంతపురమణి సౌధమునకుఁ జంద్రకాంతమణి సోపానముల నధిష్టించి వచ్చుచుండెను. అప్పుడు సోపానద్వారపాలిక లాతని కైవారము చేయుచుండిరి. ఆ కైవారధ్వనులు వినవచ్చినతోడనే పురాణపఠన మూఁగి పోయెను. తోడనే పట్టపుదేవి యటనుండి లేచి సఖీద్వితీయయైపోయి ప్రాణేశ్వరు నెదురుకొని నమస్కరించి కైదండ యొసఁగి లోనికిఁ దోడితెచ్చి మృదుల పర్యంకముపై నాసీనుం జేసి మందహాసవదనముతో నెదుట నిలువఁబడి యుండెను.

అప్పుడా సార్వభౌముఁడు కరుణాతరంగితాలోకనముల హృదయేశ్వరి వదనకమలమునం బ్రసరింపఁ జేయుచుఁ జిఱునగవుతో "దేవీ! కూరుచుండుము," అని పలుకుచు నా సతీమణికోమలతరకర పల్లవముం బట్టుకొని యెదుట నుపవసింపఁజేసికొనియెను పరిచారికలు రుక్మిణీ కృష్ణులను బోలియున్న యా రాజదంపతులకుఁ జామరముల విసరుచుఁడిరి

ఆ సమయమున మహారాజు దేవింగాంచి "ప్రాణేశ్వరి! ఇంతవఱకు నేదియో చదువుచున్నట్లున్నది. ఆ గ్రంథ మేమి?" అని యడిగెను

దేవి—నవ్వుచు "శ్రీమదాంధ్ర మహా భాగవతము" అనియెను,

రాజు—ఏ ఘట్టము ?

దేవి—నరకాసురసంహార ఘట్టము

రాజు చిఱునవ్వుగులుకు నమృతంపుఁ బలుకులతో "దేవీ! చూచితివా? త్రిలోకవిజయుఁడగు నరకదానవు నెదిరించి పోరాడు మహారణరంగ మధ్యమునకుఁ గూడ నంతఃపుర వధూజనసహితుఁడై నిరాటంకముగఁ నిస్సందేహముతోఁ బోయిన శ్రీకృష్ణభగవానుని లోకాతీత పరాక్రమసామర్థ్యము!" అనియెను.

ప్రాణేశ్వరుని సుధామధుర భాషణంబుల నాలకించుచున్న యా దేవి మృదుల హృదయమున నానందామృతప్రవాహము తరంగ

మాలికోద్రిక్త మగుచుండెను. ఆమె వదన మండలమునఁ జిఱునవ్వు వెన్నెల లలముకొనియెను. అప్పుడా దేవి తన ప్రాణేశ్వరుని విశాల వక్షస్థలంబున మిలమిల మెఱయుచున్న యమూల్య వజ్రనక్షత్ర మాలిక నిటునటు కదలించుచు భావగర్భితంబుగ "హృదయేశ్వరా! ఆ భగవానుని యనంత గుణగణంబుల నానుపూర్వికముగ గ్రహించి తలయూఁచి మెచ్చికొనుటకు లోకాతీతాపరాక్రములగు మీ కొక్కరికే తగును," అనియెను

రాజు—దేవీ! నీ వాక్యములు భావగర్భితములుగా దోఁచు చున్నవి. నా పలుకులలో నేమైన నతిశయోక్తి యున్నదా?

దేవి—అతిశయోక్తి యెంతమాత్రమును లేదు. ఆత్మోత్కర్షను సూచి చుచుండెనని నే ననుమానించితిననుకుంటిరా?

రాజు—దేవీ' నీ హృదయము నిత్యనిర్మలమైనది. అందు దోఁచిన యే భావమైనను నీ పలుకు వెంబడినే ప్రకటితమగుచుండును.

దేవి ప్రసన్నవదనము లజ్జాచిహ్నిత మయ్యెను. అప్పు డామె "హృదయేశ్వరా! ఎదుట నట్టివారు సాక్షాత్కరించియున్నప్పుడాకస్మికముగ నా హృదయమున నట్టిభావోదయ మగుట యస్వభావమా?

రాజు....దేవీ! ప్రేమావేశమున నట్లు తలంచితివి గాని నాకు నా మహాత్మునకును బోలిక యెక్కడ?

దేవి—అట్లుతలఁచుట యుదార హృదయముల స్వభావము

రాజు—కాదు కాదు. శ్రీకృష్ణ భగవానుని పరాక్రమచరిత్ర మనితర సాధారణమైనది.

దేవి—పరమేశ్వరావతార మగు నాతని యతిలోక ప్రతిభా విశేషమట్లుండు టొకవింత గాదు. కాని, ఆ మహారణరంగ మధ్యమున, ఆ భయంకర సమరసంరంభమున. అఖిలలోక రక్షకుండగు హృదయేశ్వరుని సాహాయ్యము కలదను ధైర్యముండిన నుండుగాక ....అబల యయ్యు నతిలోక తేజస్వినియై యతిభయంకరాకారుఁడగు నా దుష్టనరకాసురు నెదిరించి దారుణరణవిహారముం జేసి తన పరాక్రమసామర్థ్యముం జూపఁజాలిన సత్యాదేవి సాహసము వర్ణనీయము కాదా—?

రాజు—దేవీ! సాధుసాధు! గుణగ్రహణ సామర్థ్య మన నట్టి దియే, సాహసిక సతీసిరోమణి యగు సత్యాదేవి విక్రమవిహారముం గూర్చి మెచ్చుకొనుటకు నీకే తగును

ప్రేమ రసపరిప్లుతంబులును, మందహాస చంద్రికాప్రతిబింబితంబులును, కుసుమకోమలంబులును, గుసుమసాయకసునిశిత బులు నగు తన కటాక్షములను బ్రాణేశ్వరుని వంక బ్రసరింపచేయుచుఁ జిఱునగవుతో దేవి, "ప్రాణేశ్వరా! నన్ను బరిహసించు చుంటిరా?" అనియెను

రాజు—మొదట నీవు నన్నుఁ బరిహసించిన సంగతి నిజమే కాఁబోలును!

దేవి—బరిహసించుట యేమి? అది యథార్థమే.

ఇట్లు రాజదంపతులు సంభాషించుకొను చుండఁగా వారి వాక్యోవ వాక్య పరంపర కాకస్మికముగ నాతంకము గలిగెను క్రింది నుండి వ్యక్తమధుర కంఠస్వరముతో నొకగీత మీక్రింది విధముగా వినవచ్చుచుండెను. వారా మనోహరగానము నాలకించుచుండిరి

ప్రసవమా! నీవు నా పొన్పుపైనిఁ జేరి
గాలిపాటున నేడకో తూలిపోయి
కంటకమునకు నెదురుగాఁ గాలుద్రివ్వ
చేయునదిలేక నలుగుడు చెందినావె?
విరసినప్పుడు నీ జూడ లెఱుఁగనైతి
నిన్ను నొదలదాఁచికో నేరనైతి
నేఁడు నీతావులెల్లను నింగిముట్టె,
దివ్యకుసుమఁబ వంచును దెలియవచ్చె
ఆస ముందటఁ గీడ్చెడు నట్టి వేళ
వెనుక నేమియు లేదని వెఱచు వేళఁ
గన్నుగవఁ జీకటులు గ్రమ్ముకొన్న వేళ
నన్ను నేనే యఱుఁగక యున్నవేళ
నందకుండంగఁ బోయితే యక్కటకట!—
నేను పూవైన నాగుత్తిలోనె యుండి
నేను పవళింప నా ప్రక్కలోనె పండి
నేను కనుఁగొన్న నా కంటిలోనె నిలిచి
నేను మాటాడ నా మాటలోనె పలికి

నేను నవ్విన నా నవ్వులోనె నవ్వి
నన్ను నే నింత యెఱుఁగక యున్న వేళ
నిన్నుఁ గానక చరియించు చున్న వేళ
మిన్ను మన్నును నేకమై యున్న వేళ
నకట! నా స్వాంతమా! యెట కరిగినావె?''

ఆమోహానగాన శ్రితణమున నా రాజదంపతు లానంధవిస్మితులై పోయిరి. భావోద్బోధకం బగు సంగీతమే మనోమోహనకరమైనది. అది కలకంఠమునుండి వెలువడినప్పుడు ఫలరసముపై నమృతరసము చిలికినట్లుండును అప్పటి యా గాన మంతటి మనోజ్ఞముగా నుండెను.

అప్పుడు దేవి మహారాజుంగాంచి, "ప్రాణేశ్వరా! ఆ గానము నాలకించితిరా? ఆ కంఠస్వర మెంత మధురముగా నున్నది?' అని యెను

రాజు—ప్రియా! ఆలకించితిని. అట్టి మనోహార కంఠస్వరము పురాతనసుకృత పరిపాకము నంగాని లభింపదు.

దేవి—పాప మా మెపిచ్చిది, ఉన్మాదినియైనను నెవ్వరి నేమియు జేయదు. నిండుజవ్వనముననే యామె కట్టియవస్థ గలిగినది, ఆమె మాటలు మాత్రమె పిచ్చివిగా నుండును కాని పాటలెంతయో మనోహారముగా నుండును.

రాజు—ఔను. నేనామె నొకనాఁటిరాత్రి చూచితిని. ఆమె పాటలను గూడా నాలకించితిని.

ఇట్లు ప్రశంసించుచుండ గాఁ గ్రిందినుండి. ''అంతఃపురమునకు బోఁగూడదా? ఆకాశమున నెగిరిపోవుదాని కంతఃపుర మొక లెక్కయా? కంచెదాంటి లంకలోబడినను కంటకములు వదలుట లేదు. నేనల్లరి చేయుదువా? ఓసి పిచ్చిదానా! నేను నీ కట్లగుపడుచుంటినా? పిచ్చికంటి దానికిఁ బికిలిపిట్టయే బ్రహ్మరాక్షసివలెఁ దోఁచునఁటఁ నిన్న లేని యాజ్ఞ నేఁడెట్లు కలిగినది? మహారాజున్నాఁడా? ఉన్న నేమి? అతని నెవ్వరెత్తికొనిపోయెదరు?" అను వాక్యములు విననయ్యెను.

దేవి—ప్రాణేశ్వరా! పాప మాపిచ్చిదానిని ద్వారపాలిక లభ్యంతర పఱచుచున్నారు. లోనికిఁ బిలిపించి పాటలు పాడింతుమా

రాజు—పిలిపింపుము,

అప్పుడొకపరిచారిక పోయి యా యున్మాదినిని వెంటఁబెట్టుకొని లోపలఁ బ్రవేశించెను. ఆయున్మాదిని తన బెదురుచూపుల నలువంకలఁ బ్రసరింపఁజేయుచు—

నేనిక్కడ కెందులకు వచ్చితిని? నేను నాయొద్దనే యుండఁగా నలువంకల నగపడుచున్నానేమి? అదిగో నేను—ఇదిగో—నేను—అల్లదిగో నేను—ఇల్లిదిగో నేను— నేనొకతినేనైయుండఁగా నిన్ని నేను లెందులకు? నేను నాతో మాటాడుకొనుటయే నవ్వులాటయా? ఆ నవ్వెందులకు? నేను నవ్వులో నున్నానా? నవ్వునాలో నున్నదా? నేనో యెవరో నవ్వినచో నవరత్నము లొలుకునని యెవరికో యనుమానము. రత్నములు మాయఁజేయును నన్ను మాయఁజేసిన రత్నములనిన నాకు మఱియును భయము, ఆ భయములో నున్న నాకు నవ్వెందులకు రాదు? పెదవి కదలుపకుండ మాటాడుకొనుచున్న నాజోలి మీ కెందులకు?''—

తిరుమలదేవి నవ్వుచు ''రాధా! ఈ మాటలు మాని యించుకసే పిచ్చట కూర్చుండుము,'' అనియెను

ఉన్మా—మాటాడినచోఁ గోటలోనివారి కేమి భయము? నేను పెదవి గదల్చుటలేదని మొదటనే చెప్పితినిగాదా! నే నెక్కడఁ గూర్చుండఁ గలను? ఈ రత్నకంబళముపై నా కాళులు గ్రుచ్చుకొనిపోవుచున్నవి ఆ చంద్రకాంతమణులు నా పాదములపై జాఱిపోవుచున్నవి ఈ నిలువు టద్దములు నన్ను నాలుగు వైపులకును లాగుకొని పోవుచున్నవి. చూచిన నాకే భయమగుచున్నది. అయ్యో! ఇంతమంది పిచ్చివాండ్రతో మీ రెట్లు వేఁగుచున్నారు? పిచ్చివాండ్రన్న నా కెంతయో భయము. ఎవ్వరికీ నందకుండ నాకసముపై గూరుచుందునా? అయ్యో! అక్కడ నీలమేఘ మున్నది. నే నెక్కడఁ గూర్చుండఁగలను?

దేవి—రాధా! ఏదీ ఒక్క పాట పాడుము. మాటల కేమిలే!

రాజు—రాధకుఁ జాలపాటలు వచ్చును.

ఉన్మా—పుట్టి బుద్ధి యెఱిఁగినప్పటినుండియు నొక్కటే పాట. ఏమి పాట?

దేవి—నీ కృష్ణుని పాట.

ఉన్మా—కృష్ణుని పాటయా? ఏడీ కృష్ణుఁడు?

దేవి—ఇదిగో! ఇక్కడనే యున్నారు.

ఉన్మా—ఈ కృష్ణుఁడు నీ కృష్ణుఁడు. నీ కృష్ణునకు నా పాటలెందులకు?

రాజు—నీ పాటలందఱకును వినసొంపుగనే యుండును.

ఉన్మా—కాదు, కాదు నా కృష్ణుని కొఱకనికే.

దేవి—ఈయన కృష్ణుఁడే ఇంతమంది కృష్ణు లెక్కడనున్నారు? పాడుము

ఉన్మా—ఈతఁడు కృష్ణుఁడా! రుక్మిణీ సత్యభామ లున్నంత మాత్రమున నీతఁడు కృష్ణుఁడా? కాళింగమర్దనము గావించెనా? కాలయవన సంహారము చేసెనా? దుష్టలోకము చేఁ దల్లడిల్లిపోవుచున్న భూభార మడఁగించెనా? ఎందులకీ మాటలు? భద్రపాదాక్రాంతమై యున్నంతమాత్రమున నీతఁడు కృష్ణుఁడగునా? కృష్ణాపరిభవ విమోచన మెక్కడఁ జేసినాఁడు? నేను పిచ్చిదాన ననుకున్నారా? అందులకా యీ పాటలు? నా పాటలమూట వీథిలోఁ బాఱవైచి వచ్చితిని గాఁబోలును, ఎవ్వరెత్తుకొని పోవుదురో? ఎత్తుకొనిపోయిన వారి నెవ్వరి కప్పగింతును? పాటలు పోయిన తరవాత నేనెందులకు? అదిగో! పక్షులు పాడుచున్నవి? అవి నా పాట లెత్తుకొనిపోయిన వేమో? వాని నెగిరి పట్టుకొనుటకు నాకు ఱెక్కలున్నవనుకున్నారా? చెట్టు చెట్టునకును నేనెట్లు తిరుగఁగలను? అందఱి కన్నులలో దీపములు వెలుఁగుచుండఁగా నా కన్నులలోఁ జీకటిపడినదేమి చెపుమా! చీకటిలో మూట—చిన్నమెత్తు మాట. ఇఁక నెక్కడి పాట? నేఁబోవలెనమ్మా!"

అని యా యున్మాదిని మేడమెట్లను దిగిపోవుచుండెను.

దేవి—ఇది యొకరు పాడుమన్నఁ బాడదు పిచ్చిది

రాజు—అదిగో! పాడుచున్నది. వినుము. వినుము.

"ఆకసంబున నెలతోఁచి నంతమాత్రఁ
జుక్కహృదయాంతరంబునఁ జొచ్చుటేల?
మినుకుమినుకు మటంచును మెఱయు టేల?

మెఱసి లోలోననే యస్తమింపకుండఁ
బొంగి పొరలుచుఁ గన్నులఁ బొడుచు టేల?
చుక్క పొడిచిన తావెంత చక్కనిదియొ
నెలకుఁ జుక్కకు నేపాటి నెలవు గలదొ
కన్నులను విప్పి కన్నవారున్నవారె!"

ఆ సాయంసమయ చంద్రోదయామృతకిరణము లా మోహన గాన రసతరంగములలో మెఱసిపోవుచుండెను—అభినవోదితతారా సుధాకరప్రభావిరాజితంబగు నయ్యనంత నీలాకాశమును, నవనవోల్లసిత చంద్రికా విరాజితంబగు నయ్యనంతభూమండలమును, దశదిశా సముదయంబును దిగంతరాళంబులును గూడ నా యవ్యక్తమాధురీ విలసితమనోహరగానామృతానంత సాగరతరంగములలోఁ దేలిపోవుచుండెను. గాఢసుషుప్తిందవిలియున్న జగంబునకుం దక్కఁ దక్కిన లోకమున కానాఁటి రాత్రి యా పున్నమచందమామ వెన్నెలవెలుంగులతోఁ గూడఁ గలసి యప్పుడప్పుడా విద్యానగర మణిసౌధములను మందిరోద్యానములను, మెఱయించుచున్న యా గానరస తరంగ నిస్వనములు వినవచ్చుచునే యుండెను

# 12. "నావిష్ణుః పృథివీపతిః"

దక్షిణ హిందూస్థానమును జయించి కరగతము చేసికొని సంపూర్ణ విజయముతో రాజధానిం బ్రవేశించిన దాదిగ శ్రీకృష్ణదేవరాయలు సంపూర్ణోత్సాహముతో నలరారుచుండెను అతఁడు దక్షిణ హిందూదేశమున కంతకును ప్రభుఁడయ్యెను అమరేంద్రునకు బృహస్పతింబోలి రాజనీతిజ్ఞుఁడును, సమయజ్ఞుఁడును. త్రికాలవేదియునగు మహామంత్రి తిమ్మరుసు రాజకార్య నిర్వహణ విషయంబున నాతనికి మార్గదర్శియై యుండెను. అహితజనభయంకరుండును, హితజనానందకరుండును, గభీరహృదయుండును, మధురభాషణుండు నగు నా మహారాజసార్వభౌమునిఁ బ్రజలందఱును దేవునిగను,తండ్రిగను భావించి పూజించుచుండిరి అతఁడు సామంతులను సోదరులుగను, దండనాయకుల మిత్రులుగను, సైనికులను ప్రజలను బిడ్డలు

గను జూచికొనుచు నుచితగతుల నాదరించుచుండెను. ఇతరుల కష్టము లం జూచి యాతఁడు సహింపఁజాలఁడు. నిరంకుశ పాలనమున దుర్ణయపరులగు పరరాజులదుర్మార్గము నడంచుటకాతఁడు నిరంతరము ప్రయత్నించుచుండును దుష్టశిక్షణ శిష్టరక్షణములే యాతనికి ముఖ్య కర్తవ్యములై యుండెను అతనికి ప్రభుమంత్రోత్సాహశక్తులు కర తలామలకములై యుండెను. సత్త్వగుణ ప్రధానుండును, తేజస్వియు, ప్రజాపాలనదీక్షాపరతంత్రుండునగు నాతని నెల్ల ప్రజలు నేకగ్రీవముగ నభినందించుచుండిరి. ఉదార హృదయుండును, ప్రతిభానిధియు నగు నాతనిఁ గవిపండితులు కీర్తించుచుండిరి శాంతతేజోవిరాజితుండును, దివ్యగుణగణ విభూషితుండును లోకపాలకుండునగు నాతని యభ్యు దయముం గోరి దేవత లాశీర్వదించుచుండిరి భూభార నిర్వాపణంబు నకును, ధర్మసంస్థాపనంబునకును, శాంత్యుజ్జీవనంబునకును నవత రించిన యా శ్రీకృష్ణునకు మహారణరంగములు కళ్యాణమండప సదృ శములై లీలామాత్రములై యుండెను

నేఁడు పట్టపుదేవియగు తిరుమలదేవి యంతఃపురమున నిత్యా నందుఁడగు నా సార్వభౌముఁడు పరమానందోత్సాహ వివశుఁడై యుండెను, నేఁడామెతోటి సంభాషణమంతయు నుత్సాహదాయక ముగనే యుండెను వీరపత్నియగు నా దేవి పలుకు పలుకునందును శృంగారరసానుప్రాణితంబగు వీరరసము త్తేజితమగుచుండెను ప్రాణ ప్రియయగు నామె మధురవాక్యము లాతని హృదయభావ కుసుమము లను వికసింపఁజేసి పరిమళింపఁ జేయుచుండెను ఇందాఁక నా యుత్సా దిని పలి'న పలుకులును, పాడిన పాటలును గూడ నసంబద్ధములై యవ్యక్తములై యున్నను నాతని హృదయమున నాకస్మికముగ నొక నూత్న భావము నుజ్జీవింపజేసెను, అందుచే నాతని హృదయమున నతిత్వరితముగ నొక యద్భుతశక్తి యుదయించెను. నూతనాలోచన ములు పొడసూపెను. ఆ యాలోచనములతోడనే యాతఁడు నిద్రిం చెను ఆ నిద్రలో నాతఁడొక యద్భుతస్వప్నముం గాంచెను

దివ్య తేజస్స్వరూపిణియు, దివ్యమాల్యాంబరాభరణ భూషితయు దివ్యమణికిరీటాలంకృత సహస్రోత్తమాంగ విభూషితయు దుర్నిరీక్ష్య ప్రశాంత దృక్కటాక్ష మాలికావిలసిత ద్విసహస్ర కరాళ

తరళ విశాలలోచన ప్రతిభాసితయు, దివ్యమణికంకణాద్యమూల్యాభరణ విభాసమాన ద్విసహస్ర బాహుసమన్వితయు, నసంఖ్య శంఖచక్రగదాఖడ్గ డమరుత్రిశూలాద్యనేకాయుధోల్లసిత పాణిపంకేరుహయు, అనర్ఘరత్న సంశోభితానేక కేయూర ప్రభాతరంగిత మనోజ్ఞ గండభాగయు. మృదుమధుర మందహాస చంద్రికా మనోహర ప్రవాళారుణాధరయు, అమూల్య సువర్ణ మణికింకిణీల కలకలాలాప సంశోభిత మణిమేఖలాలంకృత సూక్ష్మావలగ్నయు, భవ్యకాంచన మంజీరాలంకృత దివ్య చరణ కమలయు, విశ్వవ్యాపినియు, విశ్వకారిణియు, విశ్వేశ్వరియు, విశ్వరక్షణియు, విశ్వగర్భిణియు, విశ్వరూపిణియు, నగు నొక విశ్వమూర్తి యాతని కన్నుల యెదుట సాక్షాత్కరించెన.

ఆ దివ్యరూప మాదిమధ్యాంత శూన్యమై యనంతమై యనంత తేజోవిరాజితమై, యనంత రోదసీ కుహర మంతటను, ఎల్లయెడలఁ దానై, సర్వమును దానయై. కోటి సూర్య ప్రభా భాసమానమై వెలుంగుచు నాతని కన్నులకు మిఱుఁగుపాటుఁ గల్పించెను సచరాచరంబగు నఖిలమును దాననుగూడ నందడంగియున్న ట్లాతఁడు గ్రహించుకొనియెను.

సువర్ణ మణిమయంబు లగుగనులచేఁ బ్రకాశించుచున్న శ్రీశైల మహేంద్రాద్యుత్తమ పర్వతంబులున, పూర్వ పశ్చిమ పర్వత పంక్తులునుగూడ నా విశ్వరూపాంతర్భాగమున నాతనికి దృగ్గోచరంబు లగుచుండెను. కూలంకషంబులగు వినిర్మల జలప్రవాహంబుల తోడను, నుత్తుంగ తరంగమాలికానిస్వనంబులతోడను, తరంగోత్థితంబులై యాణిముత్యంబుల వడువున జల్లుజల్లున వెలువడుచున్న శీకర పరంపరలతోడను పూర్వాభి ముఖంబుగఁ బ్రవహించుచున్న ఋషికుల్యా వంశధారా నాగావళీ శారదా నదులుత్తర భాగమునను, ఉత్తర పినాకినీ పాపఘ్ని చిత్రావతీ నదులు దక్షిణ పార్శ్వమునను, కృష్ణా గోదావరి మహానదులు, ఇంద్రావతీ ప్రాణహితా వరదా మంజీరాభీమరథీతుంగభద్రా ద్యుపనదులతో మధ్యదేశమునను పుష్పహారములవలె నా విశ్వమూర్తి నలంకరించియున్న ట్లాతఁడు కనుఁగొనియెను.

ఆయనంత తేజోమయ స్వరూపమునకుఁ బూర్వభాగమున గభీర తరంగ పరంపరా విలసితంబును, పరిపూర్ణ సలిల పరిశోభితంబును, అనంత వాయుసంచలితంబును, అనఁతో ద్ఘోషసమంచితంబు నగు మహాసముద్ర మనంత వాయు సంచలితఁబగు నా మహాదేవి చారు లచేలాంచలమువలెఁ బ్రకాశించుచున్న ట్లాతనికిఁదోచెను, మహావనంబులును ఉపవనంబులును దివ్యకేదారంబులును, దివ్యసరోవరంబులును, దివ్యక్షేత్రములును దివ్యమూర్తులతో నాయనంత దివ్యతేజమునం దడఁగియుండుట నాతఁడు కనుఁగొనియెను, మహాజనులను, ప్రజానాయకులును, నా దివ్యతేజము నందుండి యా తేజోమూర్తిని గీర్తించుచున్నటు లాతని కగపడియెను.

అతఁడు తన్మయుఁడై యా విశ్వరూపమునే చూచుచుండెను. ఆ సమయమున నా విశ్వమయ తేజమునుండి యొకదివ్యమూర్తి యావిర్భవించి, దివ్యమణిమయ విరాజితంబగు నొకసభామండపమున నలంకరింపఁబడిన దివ్య సింహాసనముపై నధిష్టించెను ఆమె యుత్తమాంగమున సీమంతరేఖ కిరువంకలను సూర్యచంద్రు లలంకారములుగా నుండిరి జ్యోతిర్మయంబు లగు నక్షత్రంబు లామె కవతంసకుసుమంబులుగాఁ బ్రకాశించుచుండెను ఆ దేవి మనోజ్ఞ వదనమండలము శాంతమై, గంభీరమై, యస్పష్ట మందహాసాంచితమై యుండెను ఆ దేవి దక్షిణ పార్శ్వమునం దలంకరింపఁబడిన సువర్ణ పీఠములపై శ్రీ రాజరాజనరేంద్రుఁడు, ప్రతాప రుద్ర భూపాలుఁడు శ్రీ గణపతిదేవ చక్రవర్తి, మనుమసిద్ధి భూపాలుడు, శ్రీ వీరభద్రారెడ్డి, శ్రీ వీరప్రతాపరుద్ర దేవచక్రవర్తి. శ్రీ బుక్కరాయలు, హరిహరరాయలు, ప్రౌఢదేవరాయలు, శ్రీ నరసింహరాయలు, వీరనరసింహరాయలు మొదలుగాఁగల పురాతనాంధ్ర దేశనాయకులును, వారియెదుట సుచితాసనములపై వాగను శాసనుండగునన్నయభట్టార కుఁడును, కవిబ్రహ్మ యగు తిక్కన సోమయాజియు, సర్వజ్ఞుండగు నాచన సోమనాథుండును, చిత్ర ప్రబంధ రచనా ధురంధరుం డగు నెఱ్ఱాప్రగ్గడయు కవి సార్వభౌముం డగు శ్రీనాథుండును, సహజ పాండితీ విలసితుం డగు పోతనామాత్యుండును, ఇంకను ప్రముఖులైన పూర్వాంధ్ర మహాకవు లందఱును

నుపవసించి యుండిరి అందఱి చూపులు నా దేవిమీఁదనే ప్రసరించు చుండెను. ఆ దేవీ సముఖమున, హంసవాహనయు; వీణా పుస్తక పాణియు, బాల శశాంక కళావతంసయు, ఉపనిషత్సఖీ పరివేష్టితయు నగు మఱియొక దేవీమూర్తి దివ్య పరిమళ విభాసితం బగు పారిజాత కుసుమ మాలికం దనకోమల కరపల్లవమునం దాల్చి "వీరు పురాణ పురుషులగు భూపాలురు. వీరు పూర్వాంధ్ర మహాకవులు" అని నిరూపించి చెప్పుచుండెను, అంతరాళమున దివ్య వాహనారూఢులగు త్రిమూర్తులును, అష్టదిక్పాలురును అష్టవసువులును, దివ్యవిమానాసీనులగు ముక్కోటి దేవతలును నిలిచి యా యానంద ప్రదర్శనము ననిమిష నయనములతో, నతి వినోదము గాంచుచుండిరి

అప్పు డాతనికా ప్రదర్శనమంతయు నత్యద్భుతముగా నగపడుచుండెను "ప్రప్రథమమునం దోఁచిన యా విశ్వమూర్తి ఎవ్వరు? ఆమె యొక నేత్రము రూక్షముగను, మఱియొక నేత్రము ప్రశాంతముగను నుండుటకుఁ గారణ మేమి? ఆ దివ్యమూర్తినుండి యావిర్భవించి యీ దివ్య సింహాసనముపై నధిరోహించి కొలువు దీర్చియున్న యీ దేవి యెవరు? ఈ దేవీ వదన మండలమున మందహాస మంత యస్పష్టముగా నుండుట కేమి కారణము? ఆహాహా! పురాణ పురుషులగు నీ మహారాజు లందఱు నిచ్చట సాక్షాత్కరించి యున్నారేమి? కీర్తికాయు లగు నీ మహాకవులందరు నిచ్చట ప్రత్యక్ష మగుటకు హేతువేమి? కుసుమ మాలికాలంకృత హస్త యగు నీ దేవీ మూర్తి యెవ్వరు? ధన్యోస్మి, ధన్యోస్మి, ఈమె భగవతి సరస్వతి" అని నిటలతటఘటితాంజలిపుటుండై, భక్తిభావోద్రిక్తహృదయముతో—

"యాకుందేందు తుషారహార ధవళా యాశుభ్ర వస్త్రాన్వితా
యావీణా వరదండ మండితకరా యా శ్వేత పద్మాసనా
యాబ్రహ్మాచ్యుత శంకర ప్రభృతిర్దేవైస్సదా పూజితా
సా మాం పాతు సరస్వతీ, భగవతీ, నిశ్శేష జాడ్యాపహా-"

అని స్తోత్రము చేయ నారంభించెను.

అప్పు డా దివ్యసింహాసనముపైఁ గొలువు చేయుచున్న దేవీ మూర్తి యానంద వికసిత విశాల నయనయై, వదన మండలమున

మందహాస చంద్రికలు మెఱయుచుండ నల్లన లేచి నిలువఁబడి వరదాభయకరంబులఁ జాఁచి ప్రసన్నమూర్తియై యుండెను. ఆమె దివ్య వదన కమలమునుండి "విజయోస్తు! విజయోస్తు! నావిష్ణుః పృథివీపతిః ' అను నమృతమయ వచనంబులు వెలువడియెను,

తోడనే రెండవ దేవీమూర్తి తన కోమల కరకమలంబునఁ బరిమళించుచున్న పారిజాత కుసుమమాలికను శ్రీ రాజరాజ నరేంద్రాది మహారాజులచేతను, నన్నయభట్టారకాది కవులచేతను క్రమముగా హస్తస్పర్శ చేయించి శ్రుతి మనోహరంబులగు సువర్ణ మణి మంజీర ఝుళంఝుళ ధ్వనులు సెలంగ హంస వాహనావతరణంబుచేసి హంసగమనంబులతో నాతని సమీపమున కరుదెంచుచుండెను. ఆ సమయమున మహారాజులును, మహాకవులును గూడఁ బ్రసన్నవదనులై లేచి నిలువఁబడి ప్రసన్న కటాక్షముల నాతనిపైఁ బరఁగించుచుండిరి. అంతరాళమున దివ్య విమానాసీనులై యున్న దేవత లెల్లరు ననిమిష నయనములతో నావంకఁ జూచుచుండిరి అప్పు డాదేవి యా కుసుమ మాలికచే నాతని కంఠము నలంకరించెను. తోడనే "విజయీ భవ! విజయీ భవ!" అను నాశీర్ని నాదములతో భూమ్యాకాశములు నిండిపోయెను

ఆ యుత్సాహ ధ్వనులతోఁగూడ "ఆంధ్రమాత! ఆంధ్ర సరస్వతి! ఆంధ్ర మహారాజులు! ఆంధ్ర మహాకవులు!" అను వాక్యము లాతని హృదయ కుహరమునఁ బ్రతిధ్వనించెను. ఆతఁ డులికిపడెను అంతలో మెలఁకువ గలిగెను తెలతెలవేఁగుచున్న యా సమయమున నాతనికిఁ గర్ణానందముగా నొక మధుర సంగీత మీ క్రింది విధముగా వినవచ్చెను

"ఎచటఁ జూచినఁ గను లున్న వేమొ నాకు
నెచటఁ జూచినఁ జెవు లున్న వేమొ నాకు
నీవె కానంగఁబడుచుంటి వెల్లయెడల
వినఁబడుచు నుండె నీపేరె విశ్వమందు,
నిన్నుఁ బొడఁగానకుండ నే నున్నవేళ
నగవడిన నాదుకష్టంబు లల్లెయుండె
మేఘమాలికపైఁ దోఁచు మెఱపువోలెఁ

గష్టతతిమీఁద నాకు సుఖంబుఁ దోఁచె;
సుఖము కష్టాల మాటిచి సుఖమె యగునో
కష్టములఁ గూడి సుఖమును గష్టమగునొ'
నీవె లోకంబుగా మది నెంచునాకు
మతి చెదరిపోవుచుండె నీ మాటలేక
హృదయ దావానలము భరియింపలేక
కష్టతరమైన కాలంబు గడపలేక
తల్లడిలు నన్ను దయఁ జూడఁ దలఁపరాదె
కృష్ణపక్షంబునను జంద్ర రేఖవోలె
దినదినంబును గృశియించి వనరుచున్న
రాధ యిదె! యున్న దిచట నీ రాధ యిదిగో!''

కమల సురభిళఁబులగు ప్రత్యూష పవనములతో నాసంగీతము చల్లగా వినవచ్చుచుండెను. ఆ సమయమున వైతాళికులు.—

'' తిరుమల దేవీ చరణో
దరలాక్షా కల్పకల్పితస్థల కమల
స్ఫురదిందీవర బంధురి
హరిహయమణివలయకూట హర్మ్య విహారీ!''

అని కీర్తించుచుండిరి, ప్రాతస్సమయ భేరీకాహళ ధ్వనులు మొరయుచుండెను అప్పుడు రాజాధిరాజ శ్రీ కృష్ణదేవరాయ సార్వభౌముఁడు పరమానందముతో శయ్యనుండి లేచెను.

# 13. అమ్మా! నీవెవ్వరు?

ఏ కమల కొఱకు నిరంతరమును నిద్రాహారములను మాని పరితపించుచుండెనో, ఏ కమలారూపధ్యానమున నితర మంతయును మఱచి యున్మత్తునివలె సంచరించుచుండెనో, ఏ కమలా సాన్నిధ్యమును విశ్వమంతటను గల్పించుకొని భ్రమపించుచుండెనో యట్టి కమలను లక్ష్మీపతి రాజు తన శక్తిసామర్థ్యమును వినియోగించి యెట్లో యెచ్చటనో కనిపెట్టి బలవంతముగఁ దీసికొనివచ్చి యానిడు బ్రోలు దుర్గమున నతి రహస్యముగ నుంచె నని యచ్చటి ప్రజ

అందఱు నిట్లనుకొనుచుండిరి. ఎచ్చట విన్న నీవార్తయే వినవచ్చుచుండెను. అయ్యో! ఎట్టి దుష్కాలము వచ్చినదని కొందఱును, శ్యామల నెత్తికొని పోయిన యువరాజేమి యనుభవింపఁ గలిగెనని కొందఱును, ఈతనికి మాత్ర మంతకంటె నెట్టి లాభము కలుగునని కొందఱును, అధికార మదంబున నింత నిరంకుశముగఁ జరియించుచున్న రాజకాముకులవలనఁ బ్రజల కింక నెట్టి యాపదలు రానున్నవో యని కొందఱును, ఏమైనను నోరెత్తుటకు వలను గాకుండఁ బోవుచున్నదని కొందఱును, మహారాజీ కల్లోల మంతయు నెఱుంగనట్లు చూచుచు నూరకుండుట యన్యాయముగా నున్నదని కొందఱును, ఎప్పటికైనఁ బాపము బద్దలుకాక మానదని కొందఱును ననేకు లనేక విధముల నెవరికిఁదోఁచినట్లు వారు రహస్యముగ జెప్పుకొనుచుండిరి.

క్రమముగా నీ వార్త రాజశేఖరునకుఁ దెలియవచ్చెను తోడనే యాతఁడును గోపాలుఁడును దమ సేనలతో నతి నిగూఢ ప్రయాణములు సేయుచువచ్చి యొకనాఁటి రాత్రి యాకస్మికముగ నా నిశ్చక్రపోలు దుర్గమును ముట్టడించి దుర్గద్వారములను భేదించి సేనలతో లోపలఁ బ్రవేశించి శత్రువులపైఁబడి నుఱుమాడ నారంభించిరి. ఆకస్మికంబగు నా దారుణ సంరంభమును సహింపఁజాలక దుర్గమునందలి సైనికులందఱును జెల్లాచెదరై పోవ నారంభించిరి. లక్ష్మీపతి రాజంతయుం జూచి చేయునదిలేక తన యదృష్టమును నిందించుకొనుచు నెప్పటికైనఁ బగదీర్చికొని తీఱవలయునని నాలో చనముతో నొకమత్తగజము నధిరోహించి యాయంధకారములో నవ్వలి ద్వారమునుండి తప్పించుకొని యెటకో పాఱిపోయెను భయవిహ్వలుఁడై యున్న యాతనికిఁ గమల మాట స్ఫురించెనో లేదో మనకుఁ దెలియదు

అందలి సేనానాయకులును, మిగిలిన సేనలనుగూడ నిదివఱకు గోపాలు నెఱింగినవారే కావున వారాతని యభయప్రదానముం గాంచి లోఁబడిపోయిరి. ఇంక వారలకు యుద్ధ సంబంధమైన కల్లోల మేమియును లేదు, కమలాన్వేషణమునకై తత్తరపడుచున్న రాజ శేఖరుఁడును గోపాలుడునుగూడఁ దమతమ సేనానాయకుల జాగ

రూకతతో నుండ నియోగించి వారిరువురు నంతఃపురమునకుఁ బోయిరి. అంతటను వెదకిచూచిరి. ఎచ్చట నెవ్వరు నగపడలేదు అందొక గది తలుపులు లోపల గొళ్ళెము వేయఁబడి యుండెను వారచ్చటికిఁబోయి తలుపు తట్టుచుఁ "గమలా! కమలా!" యని పిలిచిరి. ప్రతివచన మేమియును రాలేదు అప్పుడు రాజశేఖరుఁ డించుక యోచించి "ఇందు స్త్రీలుగాని, పురుషులుగాని యెవ్వ రున్నను మా రాజకుమారుఁడగు గోపాలరాయలు వారి ప్రాణంబు లను గాపాడుచున్నవాఁడు. నిర్భయముగాఁ దలుపులు తీయ వచ్చును" అనియెను

తోడనే యా గది తలుపులు తెఱవఁబడియెను ఆ లోపలనుండి, నిలువున మేలిముసుఁగు వైచుకొనియున్న యొక స్త్రీ విగ్రహము వారి కగపడియెను. అప్పుడు గోపాలుఁ డాత్రముతో "గమలా!" యని పిలిచెను. ఆమె యేమియును బదులు చెప్పక వెక్కి వెక్కి యేడువసాగెను.

అప్పుడు రాజశేఖరుఁడు నివ్వెఱపడి కొంతసేపూరకుండి "నీవు కమలవు గావా? అమ్మా! నీవెవ్వరు?" అని ప్రశ్నించెను.

ఆ స్త్రీ గద్గదస్వరముతో "నేను రాజకన్యను" అనియెను.

రాజ—నీకు లక్ష్మీపతిరా జేమగును?

స్త్రీ—కాలయముఁ డగును.

రాజశేఖరుఁ డాశ్చర్యముతో "నీవు లక్ష్మీపతిరాజు నంతపురః స్త్రీవి గావా?" అనియెను.

స్త్రీ—కాను.

రాజ—నీ విక్కడ నెందులకుంటివి?

స్త్రీ—దురాత్ముఁడగు నాతఁడు బలవంతముగ నెత్తుకొని వచ్చుటవలన—

రాజ—ఏమి?

స్త్రీ—నేను కమలనని భ్రమపడి—

రాజ—నిన్నిక్కడకుఁ దీసికొనివచ్చి యెన్ని నాళ్ళయినది?

స్త్రీ—వారము దినములు కావచ్చినది.

గోపాలుఁడు విస్మయముతో నాలోకించుచు వారి సంభాషణము నాలకించుచుండెను ఆతని కిది యంతయు నింద్రజాలమువలె నగపడుచుండెను

రాజ—అమ్మా! నీ కాత్మబంధువు లెవ్వరున్నారు?

స్త్రీ—ఎనుబదియేండ్ల వయసుగల వృద్ధుఁడగు పితామహుఁ డొక్కఁడు మాత్ర మున్నాఁడు. ఇఁక నెవ్వరును లేరు

రాజ—నీ వాతని పోషణమునందే యుంటివా?

స్త్రీ—అవును

రాజ—అతఁ డెచ్చట నున్నాఁడు?

స్త్రీ—ఇచ్చట కే దిక్కున నున్నదో నేఁ జెప్పఁజాలను గాని కృష్ణానదీతీరమునందున్న యొక యడవిపల్లెలో నున్నాఁడు

రాజ—ఇంతవఱకును నిన్ను లక్ష్మీపతిరాజు నిర్బంధించుచునే యుండెనా?

స్త్రీ—లేదు. కాని, కొన్ని దినములవఱకుమ గమలనను భ్రాంతితో నన్ను నిర్బంధించినాఁడు. పిమ్మట నా పేరు సలిలయని గ్రహించినాఁడు

రాజ—తరువాత..

స్త్రీ—నాకుఁ దెలిసినంతవఱకుఁ గమలా వృత్తాంతమును దెలియఁజేయుటచే నాతఁడు నిర్బంధించుట మానినాఁడు

గోపాలుఁడా వేగముతో "కమల సంగతి నీకేమి తెలియును?" అనియెను,

ఆ స్త్రీ యించుక తలవఁచుకుని. "వనదుర్గమునందున్న యామెను భూగృహమునుండి యుదయగిరి దుర్గాధిపుఁ డెత్తుకొనిపోయినట్లు మా యడవిపల్లెలోని జనులు చెప్పుకొనిరి" అనియెను.

రాజశేఖరుఁ డాశ్చర్యముతో "కమల నెత్తుకొనిపోయినవాఁ డుదయగిరి దుర్గేశ్వరుఁడా? ఆ ప్రజల మాటలు నిశ్చయమని యెట్లు చెప్పవచ్చును?" అనియెను

స్త్రీ—నిశ్చయమే నేఁ జెప్పుటయే కాకుండ లక్ష్మీపతిరాజున కుదయగిరినుండి యుత్తరము కూడ వచ్చినది. అందుచేత నా నిర్బంధము వదలిపోయినది.

గోపాలుఁడు తత్తరముతో "బాబా! మన మిప్పుడు పోయి యా దుర్గమును ముట్టడింపవలయును," అనియెను.

రాజ—కుమారా! ఆత్ర పడకుము నీ వెఱుఁగని దేమున్నది? అభేద్యమగు నుదయగిరి దుర్గమును రహస్యముగనైన భేదింపవలను పడువా? దానిని గూర్చి ముందాలోచించుకొందము మన మిప్పుడే మన వన దుర్గమునకుఁ బ్రయాణము కావలసియున్నది. ఇక్కడ నుండరాదు.

స్త్రీ భయముతో వడఁకుచు "అయ్యా—అయ్యా! నా గతి—

రాజ—అమ్మా! నీకేమియును భయములేదు నీ పితామహుఁ డెక్కడ నున్నాఁడో మాకు సరిగఁ జెప్పినచో నక్కడకుఁ దీసికొని పోయి యొప్పగింపఁగలము.

స్త్రీ—నేనెట్లు చెప్పఁగలను? మా ది దేశము కాదు నేనా యడవిపల్లెకంటె నితర మేమియు నెఱుంగను.

రాజ—నీ పితామహుని సంగతి తెలియువఱకును నిన్ను నా బిడ్డగాఁ జూచుకొనుచుండెదను నీవు మా యొద్ద నుండెదవా?

ఆ స్త్రీ యేమని యోచించుకొనియెనో కాని "సరియే" యని తల యూఁపెను ఆమె యాలోచనము సరిగనే యున్నది. ఈ విషమావస్థలో నామె కింతకంటె రక్షణోపాయ మేమున్నది? రాజశేఖర గోపాలురా రాత్రియే తమ సేనలతోడను తమతోఁ గలిసిన యా దుర్గమునందలి సేనలతోడను, నిడుఁద్రోలు దుర్గమును వదిలిపోయిరి సలిల వారితోడనే పోయినదని చెప్పవలయునా?

# 14. ఈ స్వప్నము దిగ్విజయ సూచకమైనది

"ఈ స్వప్నము దిగ్విజయ సూచకమైనది" అని మంత్రి తిమ్మరుసు ననియెను.

రాయలు "అప్పాజీ! నా హృదయము కూడ నత్యుత్సాహ పూరితముగనే యున్నది," అనియెను

"ఆ విశ్వేశ్వరి మన యెడలఁ బ్రసన్నయై యున్నది. ఆమె చూపు లొకవంక మనవంక శాంతములై యున్నవి ఇకొక వంక

హితములై యున్న యా దేవి చూపులు దుష్టరాజగర్వనిర్వాప ణంబునఁగాని శాంతింపవు ఆమె సాక్షాత్కారమందుకొనుటకే ఆమె యాశీర్వాదమందుకొనుటకే సమస్తదేవతాశీర్వాదము నిదియే. పుణ్యమూర్తులగు పూర్వరాజన్యుల యుద్దేశము గూడ నిదియే.'

"నేను నట్లే భావించుచున్నాఁడను, కాని విశ్వరూపాంతర్వర్తిని యగు నా దేవి యస్పష్ట మందహాసాంచితయై యుండు టెందులకు?"

"కుమారా, తెలిసినది. పతిప్రాణలగు సతీశిరోమణుల కాకరమై యున్న యీ యాంధ్రదేశమున సతీజనపరిభవనములు కానవచ్చుచుండుట కామె యట్లున్నదని తోఁచుచున్నది."

"అలాగా—అలాగా!"

"వసంతవాడదుర్గవృత్తాంతము మన మెఱిఁగినదేకదా! నిడుఁప్రోలె ట్లయినదియు మన మాధవుఁడే సాక్షి. వీరభద్రగజపతి పాపకృత్యము లింకను దుదముట్టలేదు. పాపము, వసంతవాడ దుర్గేశ్వరి యిప్పు డుదయగిరి దుర్గమున బందీకృతమై యున్నది."

"ఏమీ! ఆమే మరల నపాయములోఁ బడినదేమి?"

"దురాత్ముల పరిపాలనమున నున్న ప్రజలకు సుఖ మెక్కడ?"

"అప్పాజీ ఇఁక నాలస్యము చేయఁగూడదు మా గుర్వాజ్ఞానుసారముగ నిదివఱకే యుదయగిరిదుర్గ మాక్రమింపవలయునని తలంచుచుంటిని. ఇఁక నా దండయాత్ర యుత్కళము వఱకును, బోవునుగాక!'

"కుమారా! అవశ్య మట్లు జరిగి తీఱవలయును. ఆంధ్ర దేవి నిన్నెదురుకొను చున్నది. ఆంధ్ర సరస్వతి దివ్యకుసుమములచే నిన్న లంకరించినది. తల పూవు వాఁడకుండ నీకెల్ల విధముల విజయమే లభియింపఁగలదు. శ్రీకృష్ణ దేవుఁడ వగు నీకిప్పట్టున దుష్టకాళింగ మర్దనావశ్యకర్తవ్యము."

"అప్పాజీ! నాకు నవ్వు వచ్చుచున్నది. ఆయుష్మాదిని మాటలు పిచ్చిమాట లనుకొంటిని. ఆలోచించి చూచినకొలఁది నవియే యర్థ

వంతము లగుచున్నవి. "కాళింగ మర్ధనము చేసెనా? కాలయవన సంహారము గావించెనా? అను నామె పలుకులయందెంత భావము న్నది! నేను రాత్రి నిదురించువఱకు నా పిచ్చిదాని మాటలనుగూర్చియే యాలోచించుకొనుచుంటిని, ఆమె యున్మాదిని గాదు. ఏదియో దేవీమూర్తి యనుకొనియెదను."

"ఔనౌను అమె నిజముగా దేవియగుననియే తోఁచుచున్నది, కాకున్న నా మహత్తర తేజోమూర్తి యెవ్వరియందున్నది? ఆ మనోహర గానమాధుర్య మీ భూలోకమునం దెవ్వరి యందున్నది? అయలభ్య పదార్థ సంగ్రహణ సామర్థ్యతము వేఱెవ్వరియందున్నది?"

రాయ లించుక యాలోచించి "ఈ కార్యము లన్నియును దేవతా కార్యములవలె నున్నవియే" అనియెను.

"కావచ్చును. నేనుగూడా నావిషయమును గూర్చి యోచించు చుంటిని."

'యేమైన నేమి? ఆమె గానము మనోమోహనకరమైనది. ఆలోచించిన కొలఁది నామె మాటలు కూడ నట్టివియే యని చెప్ప వచ్చును'

ఉదార హృదయుండును, వివేకనిధియ నగు శ్రీకృష్ణమహా దేవరాయుని కుశాగ్రబుద్ధియే కారణముననో కాని, యా యున్మాదిని గుణగ్రహణ విషయంబునఁ బనిచేసిన ట్లామె రహస్యగ్రహణ విష యంబునఁ బనిచేయుటలేదు. పరేంగితజ్ఞాన నిపుణుండును, సూక్ష్మ దృష్టియు, మహామంత్రియునగు తిమ్మరుసామెం గూర్చి చాలవఱ కెఱింగియుండియు నేకారణముననో కాని మహారాజునకుఁ దెలియ జేయక రాయల మాటలకెల్ల "నౌ నౌ" నని ప్రత్యుత్తర మిచ్చు చుండెను.

అప్పుడు రాయలు మరల "కాళింగ మర్దనము చేసి తీరవల యును. మహాదేవి యాజ్ఞయైనది" అనియెను,

తిమ్మ—అందుల కిదియే యుక్తసమయము వీరభద్ర గజపతి దుష్పరిపాలనమునఁ బ్రజలు తల్లడిల్లుచున్నారు. ఒకటి రెండు దుర్గము లనాయకములై యున్నవి. నిరంతరాయముగ, నతి సులభముగ విజయము లభించుట కదియే యదను, ఉత్కలేశ్వరుఁడు తన సేనలతో

కృష్ణ వేణి నదిని దాఁటి యివ్వలకు రాకుండా నతిత్వరితముగఁబోయి యుదయగిరి కొండవీడు దుర్గములను సాధింపవలయును ఆ వెనుక మన విజయ యాత్ర యతిసుగమమై యుండును. ఏయేదుర్గము లెట్లున్నవో, ఎంత సైన్యములతో నున్ననో మన మీవఱకే తెలిసికొని యుంటిమిగదా! దుర్భేదమగు నుదయగిరి దుర్గమును సాధించిన వెనుకఁ గొండవీడను జయింపవచ్చును.

రాయ—ఔను అచ్చటనొక యువతీమణి బందీకృతయై యున్నదిగా! సతీ జనరక్షణమే మనకుఁ బ్రథమకర్తవ్యము. ఉదయ గిరి దుర్గముల నెంత సేన యున్నది?

తిమ్మ—పదివేల కాల్బలమును, నన్నూఱాశ్విక వీరులును గల రని తెలియవచ్చినది కాని దుర్గేశ్వరుఁడగు వీరభద్రుఁడు మాత్ర మసాధారణ ప్రతిభాశాలి యని వింటిమి. పర్వత ప్రకారములచే దుర్గ మమైయున్న యాదుర్గముకూడ దుస్సాధమైనదియే.

రాయ—అగుఁగాక! రాజ్యతంత్ర నిర్వహణ కుశలుండవును, సమయజ్ఞుండవు నగు నీయుచితాలోచనమును, బర బల భయంకరం బును, శత్రుమారణోత్సాహ విజృంభితంబును. నగు సైన్యమును గలిగియుండ నిఁక నరిదుర్గముల సాధించుట యెంతపాటిది! యుద్ధ యాత్రకు శుభముహూర్తమును నిశ్చయింపుము. సర్వసైన్యమును సన్నద్ధముఁ జేయుము. మనము ముప్పదివేల కాల్బలముతోడను, ఎనిమిది వందల యేనుంగులతోడను, ఉదయగిరి దుర్గమును ముట్ట డింప వలయును. రాజమార్గము నిష్కంటకముగఁ జేయుటకును, మార్గ మధ్యంబున సేనలకు వలయు నాహారాది పదార్థముల సేక రించుటకును దగినవారల నియమింపవలయును.

తిమ్మ—ఆ కార్యమున నన్నివిధముల సమర్థుండగు మాధవుని నియోగింపవచ్చును.

రాయ—అట్లే చేయవచ్చును. అతఁడు తన యేనూఱాశ్విక సైన్యముతోడను ముందుగఁ బోయి యావశ్యకంబులగు నెల్ల కార్య ములను నిర్వహించు నట్లాజ్ఞాపింపవలయును.

తిమ్మ—అట్లే చేసెదను సుస్వప్నఫలము వేగమ సిద్ధించుఁగాక!

క్రమముగా నన్నూఱు గజంబులచేతను, వేయిమంది యాశ్వికుల చేతను, పదివేల కాల్బలము తోడను బరివేష్టింపఁబడి దుర్భేదంబగు గిరిదుర్గమువలె నున్న మధ్యప్రదేశమున నంతఃపుర వధూజనమును, పరిచారికలును, యథోచితంబులగు వాహనముల నధిరోహించి ప్రయాణము చేయుచుండిరి. ఆ పల్లకుల చుట్టునుఁ బ్రతీహారిణు లాయుధ ధారిణులై పరివేష్టించి వచ్చుచుండిరి ఆ వ్యూహమున కవ్వల మఱికొందఱు దండనాయకులు గజారూఢులై యరుగు చుండిరి. వారల వెనుకఁ గవిపండితులును నూర్గురాశ్వికయోధులును, నూఱు గజంబులును వరుసగాఁ గదలివచ్చుచుండెను. ఆ సేనావార మెంతవఱకు వ్యాపించి కదలుచున్నదో యంతవఱకును నిలువున నిరువంకలను వరుసలుతీరి యొక్కొక్క వైపునకు రెండు వందల యేఁబది మంది యాశ్వికులును నూఱుగజంబులును జంగమ ప్రాకారాయమానంబులై క్రమము తప్పకుండ నడతెంచుచుండెను. కొందఱు దండనాయకులును సామంతరాజులును నశ్వారూఢులై సేనలు చెదరకుండఁ పార్శ్వముల యందును, మధ్యభాగంబుల యందును ముందును వెనుకను సంచరించుచు సేనల యథాక్రమ ముగ నడపించుచుండిరి

మహా వైభవముతోడను, మహోత్సాహము తోడను నా విచిత్ర వ్యూహము కదలిపోవుచుండెను ఆ వ్యూహమునకు ముందు గనే తన యేనూఱాశ్విక సైనికులతోడను మాధవుఁడామార్గమును బరిశీలించుకొనుచు సేనలను నిలుపవలసిన యాయా స్థలములలో వలయు సాధన సామగ్రులు సరిగా నున్నవో లేవో పరీక్షించు కొనుచు నందులకుఁ దగిన క్రొత్త యేర్పాటులను గావించుచు ముందటికి బోవుచుండెను.

సైనికుల యాహారావశ్యకోపకరణంబులును నితరసామగ్రు లును, అశ్వగజ వృషభంబుల యాహార పదార్థంబులును, నసంఖ్య శకట సముదాయంబులపైఁ దీసికొని రాఁబడుచుండెను వానితోఁ గొంత సైన్యముగూడ నుండెను. అవి యన్నియు నీమహాసైన్యము వెన్నంటియే వచ్చుచుండెను.

ఈ విధముగా నిడుద సైనములతో రాయల మహాసైన్యము కొన్ని దినములలో నుదయగిరిం జేరి దుర్గమును ముట్టడించెను.

# 16. ఉదయగిరి ముట్టడి

ఉదయగిరి దుర్గ మతిదుర్గమమైనది ఆ దుర్గము చుట్టును రాతిగుట్ట లతినిబిడముగ నలమికొని చాలదూరమువఱకు వ్యాపించి యుండుటచే రాయల మహాసైన్యమంతయు నా దుర్గప్రాకారమును జేరి నిలిచియుండుటకుం దగిన యవకాశము లేకయుండెను. కాని, రాయల సైన్యము దూరముననే యావరించుకొని యుండి, యాహారపదార్థములు మొదలగునవేవియు దుర్గములోనికిం బోకుండ నుండునట్లు జాగరూకతతోం గాచికొని యుండెను ఎటులయిన, నా సైన్యమంతయు నా దుర్గమును సమీపించుటకు ననువగు మార్గము నాలోచించి మహామంత్రి యగు తిమ్మరసు కొండగుట్టలను బగులంగొట్టించి బాటలు వేయుటకుం దగిన యేర్పాటులను గావించెను. రాయ లాదుర్గము నెప్పుడు కరగతము చేసికొందునా యను నుత్సాహముతో వేగిరపడుచుండెను. సామంత దండనాయకులును సైనికులు నట్లే యుండిరి.

ఉదయగిరి దుర్గనాయకుం డగు వీరభద్రపాత్రుండు రాయ లీ వఱకే దండయాత్ర వెడలి వచ్చుచుండె ననుసంగతి తెలిసికొన్నవాం డగుటచే వలయు పరికరముల నన్నిటిని సంపూర్ణముగ సేకరించుకొని దుర్గద్వారమును దృఢముగ బంధించి యాయా తావులం దగిన రక్షకుల నియమించి జాగరూకుండై కాచికొని యుండెను. ఆ దుర్గమున నిప్పుడు పదివేల కాల్బలమును, నాలుగువందల యశ్వ సైన్యమును మాత్రమే యున్నది. రాయలు వెడలుచున్నాం డని తెలియ వచ్చినతోడనే యాతనికిం దన దుర్గములోని లోపములను బూర్తి చేసికొనుట తోడనే సరిపోయిందిగాని, ఉత్కలేశ్వరునకుం దెలియపఱచుటకుంగాని, కొండవీటి సేనను రప్పించుకొనుటకుం గాని తగిన యవకాశము కలుగలేదు ఆ కారణమున నాతని కితర సాహాయ్యము లభింపలేదు. అతండు తన దుర్గమునకు వలయు కట్టు

దిట్టములను గావించుకొని, చాల నెలలవఱకును సరిపడు నాహార
పదార్థములను సేకరించి యుంచుకొనియెను. ఆతని పినతండ్రి యగు
ప్రహరేశ్వర పాత్రుఁడును మఱికొందఱు దండనాయకులును
నాతని కెల్ల విధముల సాహాయ్యముఁ జేయుచు దుర్గమును గాపాడు
కొనుచుండిరి చుట్టునున్న బురుజులమీదను, ద్వారముల లోపలను
నింకను వలయు నుచిత స్థలంబులను గూడఁ దగిన వీరవరులు తమ
తమ సేనలతోఁ గాచికొని యుండిరి పురపాలకుఁడు విజయదాసును
నాతని తమ్ముఁడు హరదాసును నుచిత పరివారముతోఁ బుర
బహిర్ద్వార సంరక్షణమునకు నియోగింపఁబడి జాగరూకతతో
మెలంగు చుండిరి.

దినములు గడచిపోవుచుండెను. రాయల సైన్యము దుర్గమును
సమీపించుట కెట్టి యవకాశమును గలుగలేదు రణోత్సాహ వివశు
లగు సైనికులును, దండనాయకులునుగూడ పగులఁ గొట్టబడిన
రాతి గుట్టల నడిమి త్రోవలనుండి దుర్గప్రాకారమును సమీపించి
యెగఁబ్రాఁక వలయునని ప్రయత్నించుచుండిరి బురుజులపై నున్న
శత్రుసైన్యము వారలపై శరవర్షములను గురియించుచు దరిఁజేర
నీయకుండెను. క్రింది వారలకు మార్గముగపడుటలేదు, పైనున్న
శత్రువుల సంహరింపవలయునను నుత్సాహముతో విడిచిన బాణ
ములు నిష్ఫలములై పోవుచుండెను. శత్రువులు బురుజుల క్రిందికి
దిగి తప్పించుకొనుచుండిరి పైనుండి వచ్చుచున్న శత్రుశరాఘాతము
లచే రాయల సైన్యములోఁ గొందఱూరక ప్రాణములను విడువ
వలసి వచ్చుచుండెను ఇదియంతయుం గాంచి మహామంత్రి బాగుగ
నాలోచించి దుర్గద్వారము పగులఁ గొట్టుట కుపాయము దొరకు
నంతవఱకు సైనికు లెల్లరును దూరముగ నుండవలయు ననియు,
నడ్డముగ నున్న రాతిగుట్టలను బగులఁగొట్టి చదును చేయవలయు
ననియు నాజ్ఞాపించెను

రాయలసేన లన్నియు నా దుర్గమునకుఁ జుట్టును నియమిత
స్థలంబుల విడిసియుండెను, యుద్ధ సంబంధమైన పనులేవియుఁ నెవ్వ
రును జేయుటలేదు. కొన్ని దినములవఱకుఁ జల్లగా నట్లే యుండిరి
రాయలసేన యిట్లుపేక్షాభావముతో నుండుటకుఁ గారణము

దుర్గములోని వారికిఁ దెలియుటలేదు. కొలఁది దినములలో రాయ లీ ముట్టడిని విడిచి పోవునని దుర్గములోని వారందఱు ననుకొనఁ జొచ్చిరి.

మంత్రి తిమ్మరుసు వేయించిన బాటలేవియు దుర్గప్రాకారమును ముట్టడించుట కుపయోగ పడినవి కావు. ఆ ప్రాకారమునకుఁ జుట్టును బెద్ద పెద్ద గుట్ట లుండెను. వానిని బగులఁగొట్టుట యసాధ్య మయ్యెను. ఇఁక దుర్గముకుఁ బ్రవేశించుటకు మార్గమేమున్నది? ఈ విధముగాఁ జాల దినములు గడచిపోవుచుండెను.

ప్రభు మంత్రోత్సాహ శక్తిత్రయ విరాజమానుఁడును, రాజనీతి నిపుణుండును, రాజ్యతంత్ర నిర్వహణ కుశలుండును, ప్రజారంజకుండును, పరేగిత జ్ఞానధురీణుండును, సమయజ్ఞుండును నగు శ్రీకృష్ణ దేవమహారాయ లచ్చటఁ బ్రతిదినమును రాత్రి పదిగంటల వఱకును దన శిబిరమున మహామాత్య సామంత దండనాయక పరివేష్టితుండై, యష్టదిగ్గజంబు లని పేరువడసియున్న మహాకవి శేఖరులచే దినమున కొక్కొక్కరివలన నాంధ్ర మహాభారతము నందలి యుద్ధ పర్వములను జదివించి యాకర్ణించుచుండెను. సైనికులుగూడఁ జుట్టును నిలిచి, యమృతమయంబగు నా పురాణము నత్యుత్సాహముతో నాలకించుచుండిరి. అనంతరము మహామంత్రి యగు తిమ్మరుసు తన యసాధారణ ప్రతిభా సామర్థ్యము మెఱయుచుండ నాఁడు చదివిన గ్రంథమందలి విశేషముల నన్నిటిని శ్రోతల హృదయంబుల నాటుకొనునట్లు మృదుమధుర గంభీర భాషణంబుల నుపన్యసించుచు భారతవీరుల మహిమంబును, రణకౌశలంబును, రణోత్సాహంబును, రణవిజయోల్లాసంబును, రణమరణనిర్భీక హృదయోద్రేకంబును రణకేళీ విహరణానంద పారవశ్యంబును, మరణ మారణ సమాలోచనా విహీన సముద్రిక్త విక్రమ విజృంభణంబును మొదలగు నుత్తమ వీరయోధ జనోత్కృష్ట దివ్యలక్షణంబుల నుగ్గడించుచు శ్రోతల నందఱను వీరరసతరంగోత్థితంబును, గభీర భావస్ఫూర్జితంబును, విజయఘోషంబుననగు భారతరత్నాకరంబున విలాప విహారంబు చేయించి సంపూర్ణోత్సాహ వివశులం జేసివైచుచుండెను. ఆ యుత్సాహము తోడనే యెల్లరును నిదురించుచుండిరి.

ఒకనాఁటి రాత్రి రెండు జాములయ్యెను, వెలుపలనున్న రాయల సైనికు లందఱు నిద్రాముద్రితులై యుండిరి. శిబిరంబుల నందందు రక్షకయోధులు మాత్రము జాగరూకులై యుండిరి. దుర్గములో సైనికులందఱు నిర్భయముగా నిదురించుచుండిరి వారల కింతవఱకు నెట్టి తొందరయును గలుగుటలేదు. రాత్రి గాఢాంధకార బంధురమై యుండెను. ఎల్ల యెడల నిశ్శబ్దముగ నుండెను. చీకటిలో గుట్టలపై మినుకు మినుకు మనుచున్న మెఱుఁగుడు బురువుల కాంతులకును, నీలాకాశమున మినుకు మినుకుమని మెఱయుచున్న నక్షత్రకాంతులకును దారతమ్యమును గ్రహించుట కప్పుడెవరి కవకాశ మున దీ? ఆ యాకాశమునందలి నైల్యమునకును, ఈ గాఢాంధకారమునకును గల సంబధమును గూర్చి చర్చించుట కప్పుడు తెలివి యెవ్వరికున్నది? ఏకాకారముగా నగపడుచున్న పర్వతపంక్తులకును, వృక్షపంక్తులకును గల భేదమును నిర్ణయించుట కప్పు డెవ్వరికిఁ దీరికయున్నది? అందరును నిద్రాలోలురై యు డిరి. ఆ సేనలోఁ గొంద ఱక్కడక్కడ మేలుకొనియున్న వారుండ వచ్చును. కాని, వారలకీ గొడవ యంతయు నె దులకు? అట్టివారల కానిశీథ సమయమున వాయుతరంగములలోఁ గలసి యప్రయత్న ముగ నొక మనోమోహనగానరవము దూరమునుండి వీనులవిందుగా వినవచ్చుచుండెను ఆ మనోహర గానామృతమునకే ప్రోళ్లు చిగురించుచున్నవో, ఏరాళ్లు కరఁగిపోవుచున్నవో, యాగాఢాంధ కారమునఁ గనిపెట్టిన వారెవ్వరున్నారు? కాని, యాగానామృత మునం దట్టిశక్తి యున్నదని విన్నవారు కన్నులారఁ జూడకున్నను గ్రహించుచునే యున్నవారు.

" దివ్యకుసుమంబ' నాకేమి తెలియకుండ
నాకసంబున కేఁగితి వనుచుఁ దలఁచి,
యెప్పుగా నీకు వృంతమై యున్న నేను,
పుట్టి నీతోడఁ బెరిగిన యట్టి నేను.
అనయమును నిన్ను నెడఁబాయ నట్టి నేను
నిన్నె ప్రాణంబుగాఁ జూచుకొన్న నేను
నీ వియోగ మహాశోక వీరనిధిని

గూలి దరిగానఁ జాలక కొట్టుకొనుచు
దేశముల వెంట వెడఁగునై తిరుగుచుంటిఁ,
బవలు రేయును నీకునై పనవుచుంటి,
భాగ్యవశమున నీవీ ప్రపంచకమున
నెత్తుగా నున్న యా కాశ వృక్షమందుఁ
బూవుగా నుండుటను జూచి పొంగుచుంటి;
దేని నీలోకమునఁ జూడ లేవటంచు
నిస్పృహను జెంది యుంటినో నెమ్మనమున
నట్టినా పుష్పరాజంబు నరయఁ గంటిఁ
బట్టరాని సంతోషంబుఁ బడయఁగంటి
నమృత కుసుమంబ! యనురూప సమయమునకు
నీపరిమళ మెల్లెడ నిండుఁగాక!—
పూవు విడిచిన చోటికిఁ బోవలేక
భ్రమరరాజమ! యారాట పడెదవేల?
చెట్లకొమ్మలలో నది చిక్కియుండె
భూతములు దానిచుట్టును బొంచియుండె
భూతమంత్రం బెఱింగిన ప్రోడవేని,
నేను నిల్చినచో నిల్వ నేర్తువేని.
స్వర్గమునకును మెట్టులు సంతరించి
యింతలో నిన్నుఁ జేర్తు, నీ కిష్టమేని
భ్రమరరాజమ! తత్తర పడక రమ్ము"

ఆ రక్షక యోధులలో నొకఁ డటునిటుఁ దిరుగుచు నా పాట నాలకించి యా వంకకుఁ బోవుచుండెను. ఆ యోధుఁడు సమీపించుటను గాంచి యా పాడుచున్న వ్యక్తి తన పాట వాఁపివైచి, కొంచె మోసరిల్లి యొక చెట్టుక్రింద నిలువంబడియెను. ఆ యోధుఁ డక్కడ వాఁగి, "ఇదిగో రాధ! ఇచ్చట కెప్పుడు వచ్చితివి?" అనియెను

అప్పుడా వ్యక్తి, "తాతా! నీవు మంత్రగాఁడవా? ఈ కొండ గుట్టలను గొండచిలువ కఱచినది విషజ్వాలలచే నది యాపాదమస్తకమును బ్రేలిపోయినది. దీనికి నీవు మంత్రము వేయఁగలవా? ఊఁదుచుంటివా యేమి? మంత్రమనిన నాకుఁ జాల భయము. ఊఁదకుము—

ఁడకుము," అని చెప్పుచు నా యంధకారములో నదృశ్యమైపో యెను.

ఆ యోధుఁడా వ్యక్తితో సంభాషించిన తావున జెట్లచేఁ గప్పఁ బడిన గుట్టల నడుమనుండి యొక మనుష్యుఁడు మాత్రము పోఁదగి నంత మార్గ మగపడియెను, ఆ యోధుఁడు తన కరవాలమును సవ రించుకొని. యా త్రోవను బట్టి ముందటికి బయలుదేఱెను, క్రమ ముగా నా త్రోవ యాతని నా దుర్గప్రాకారము నొద్దకుఁ తీసికొని పోయెను ఆ ప్రాకార పార్శ్వము నుండి యెవ్వఁడో యొక పురుషుఁ డిటునటుఁ దిరుగుచుఁ జూచుచున్నట్టులా యంధకారములో నాతనికిఁ గానవచ్చెను ఇరువురు నొకరి నొకరు చూచికొనిరి, కాని యొకరి నొకరు పలుకరించుకొనలేదు. ప్రాకారము నొద్ద నున్న పురుషుఁడు మన యోధునివైపునకుఁ దిరిగి "విజయ" అనియెను యోధుడు వెంటనే తడవుకొనకుండ "విజయ" అనియెను. విజయ యనునది విద్యానగరరాజగౌరవచిహ్నము. దానిని రాయల సైన్యములోని యోధులు కొంద ఱొకరి నొకరు దెలిసికొనుటకు సాంకేతికనామ ముగా వాడుకొనుచుండిరి

ఇట్లొండొరులం దెలిసికొన్న యా యిరువురు నక్కడనుండి యీవలకు వచ్చి యీ క్రింది విధముగ సంభాషించుకొనిరి

"మాధవరాయా! ఈ మార్గము నీ వెట్లు కనిపెట్టితివి?"

"మహామంత్రిశేఖరా! నేఁటి సాయంతనము నే నిచ్చటి గుట్టపై నుండి వచ్చుచున్న యొక పిచ్చిదానిం జూచి యిచ్చట నేదైన మార్గ ముండియుండ నని యూహించి చీకటిపడిన తరువాత మనుష్యసంచా రము లేకుండఁ జూచి యిందుఁ బ్రవేశించితిని ఈ మార్గము విస్తృత మైనచో సేనలతో నిందు ప్రవేశించి యీ ప్రాకారమును బగులఁగొట్ట వచ్చును."

"మాధవరాయా! బాగుగఁ గనిపెట్టితివి!"

## 17. ఆ దివ్యమూర్తి యెవ్వరు?

తెల్లవాఱునప్పటికా సన్నని మార్గమంతయును నిరువ దేనుఁ గులు వరుసగా నిలిచిపోవునంతటి వైశాల్యముగఁ జేయఁబడియెను.

చుట్టుపట్లనున్న గుట్టలన్నియును దుర్గప్రాకారములవఱకును చదును చేయఁబడియెను సూర్యోదయమగునప్పటికి రాయల సైన్యమంత యును దుర్గప్రాకారము మొదలుగ నా విశాల మార్గమునందంతటను నిండిపోయెను. కొంత సేన చదును చేసిన గుట్టలపై నిలిచియుండెను. శ్రీకృష్ణ దేవరాయ లత్యుత్సాహముతో నుత్తమాశ్వము నధిష్టించి సేనలను హెచ్చరించుచుండెను. మహామంత్రియగు తిమ్మరుసు నలు వంకలను దిరుగుచుఁ బ్రాకారభేదంబునకు వలయు సన్నాహమును చేయుచుండెను ఒక వంక నార్వీటి బుక్కరాజును, పెమ్మసాని రామ లింగ భూపాలుఁడును, వెలుగోటి నిర్వాణప్పనాయకుఁడును తమ తమ సేనలను బురికొల్పుచుండిరి. మాధవుఁడు తన యేనూఱాశ్వి కుల తోడను నెప్పుడు దుర్గముపైఁ బడుదునా యని యెదురు చూచుచు ముందటి భాగమున నిలువఁబడి యుండెను. ఆ సేనా మధ్యమున రాయల విజయధ్వజ ముదయారుణ ప్రభాతరశితమై ప్రాతస్సమయమంద మారుత తరంగములలో నర్తనము చేయుచుండెను. జయభేరీధ్వనులు దెసలు బ్రద్దలు చేయుచుండెను. మదగజఘీంకార ములును, నుత్తమాశ్వ హేషారవంబులును, వివిధాయుధసంఘర్షణా రావంబులును సైనికుల కత్యుత్సాహముం గూర్చుచుండెను. ప్రాకా రమున కెదుట నించుక దూరమునందున్న సమోన్నతంబులగు గుట్ట లపైఁ బిరంగు లమర్పఁబడి యుండెను, రాయలసైన్యమంతయు నత్యుత్సాహ విజృంభితమై శత్రుమారణంబున కువ్విళ్లూరుచుండెను,

ఉదయారుణకిరణ ప్రసారమున మెఱసిపోవుచున్న రాయల దివ్యమణికిరీట మా సేనావారంబున నెచ్చటఁజూచిన నచ్చటనే ప్రత్యక్ష మగుచుండెను రాయ లధిరోహించిన యుత్తమాశ్వముయొక్క సముత్సాహపూరితంబులగు హేషారవంబులును. నటన లీలావిలసి తంబులగు ఖరపుట తటతటధ్వానంబులును నెల్లయెడల విరామము లేకుండ వినవచ్చుచునే యుండెను అశనిపాతంబులంబోలె నతిదారు ణంబులగు శతఘ్ని భయంకరారావములు దశదిశలఁ బ్రకంపితము లుఁగ జేసివైచుచుండెను. ఆ భయంకర శతఘ్నినికాయంబుల విశాలాయసనాళంబులనుండి యా యుదయారుణబింబంబును బ్రతి

ఘుటించుచున్న లోహగోళంబులు వెలువడి దుర్గప్రాకారమును, గుభి ల్లునఁ దాఁకి యూఁచివైచుచుండెను.

అప్పటికప్పుడే యా దుర్గములో నున్న సేనయంతయు నీ వంక కే చేరి మహాసంరంభముతో శత్రువులపై శరవర్షమును గురి యించుచుండెను. బురుజులపై నుండి వచ్చుచున్న యా శరాపార పరంపర రాయలసైన్యమును గలచివైచుచుండెను ఆ దారుణ ఘాతంబులకుఁ గొందఱు నేలపై గూలుచుండిరి కొందఱు తప్పించు కొనుచుండిరి. క్రిందనున్న రాయల సైన్యమునకు బురుజుపై నున్న శత్రుసైన్యముల నెదుర్కొనుటకు వలనుగాకుండెను. అయినను నిందలి యోధులు తమ యుద్ధనైపుణ్యము మెఱయ శత్రువులపై శరానల కీలలఁ బ్రయోగించుచునే యుండిరి శత్రువులలో గొందఱా దారుణ కీలల కాహుతియైపోవుచుండిరి. కాని యా యసమసమరమున రాయల సైన్యమునకే విశేష నష్టము గలుగుచుండెను అట్లయ్యును వారి యుత్సాహ మతిశయించుచునే యుండెను ఒక్కసారిగ దుర్గ మువ్వె త్తుగఁ దల క్రిందుగఁ గూలిపోయెనా యని శత్రువులకు దిగ్భ్రాంతి గలుగునట్లు భూకంపముం బుట్టించుచు శ్రవణవిదారణంబులగు శతఘ్నినినాదము లెడతెగకుండ మొరయుచునే యుండెను.

అయినను దుర్గప్రాకార మింకను బగులలేదు, విద్యానగరసైని కుల హృదయ వీథులలో నతిదారుణక్రోధానలము జాజ్వల్యమాన మగుచుండెను మార్తాండుండు గూడ నభోమధ్యంబునఁ బ్రవేశించి దుస్సహప్రతాప తేజోమూర్తియై పొడగట్టుచుండెను, ఆ సమయమున శ్రీకృష్ణరాయమార్తాండుండు శత్రుదుర్నిరీక్ష్యుడై, క్రోధానలకీలా కరాళదృక్సమన్వితుడై, పవిత్రప్రభామయంబగు వదన మెత్తి యుచ్చ స్వరంబున "దుర్గప్రాకారము పగిలిపోవుచున్నది. శతఘ్ను లొక్క సారిగా విజృంభించుఁగాక!" అని కేక వైచెను.

మహాత్ముల యభీప్సితములు—సంకల్పసిద్ధుల యుదాశయ ములు—తేజోమూర్తుల యుద్దేశములు—వాని ఫలంబులు—కర తలామలకములై యుండును. వచోవిధేయములై యుండును. ఆ మహావీరశిఖామణి గంభీర వాక్యములు శత్రుశ్రవణములకు హాలాహల సదృశములై యుండెను. రాయల సైనికుల కందఱకు నమృతరస

పరిప్లుతములై యుండెను. అప్పుడా సైన్యమునం దొక్కసారిగ జయ జయ ధ్వనులు చెలరేగెను శతఘ్నినికాయ మొక్కసారిగా మొరసెను చూచుచుండఁగా నప్పుడా దుర్గప్రాకార ముత్కళ రాజ్యవినాశమును సూచించు నుల్కాపాతమువలె బ్రహ్మాండము బ్రద్దలైనంతటి దారుణధ్వనితో నువ్వెత్తుగఁ గూలి పడిపోయెను

అప్పుడు రాయల సైన్యమంతయు నుత్సాహావిజయధ్వనులతో నతిసంరంభమున నా దుర్గమునఁ బ్రవేశింపవలయునని విజృంభించుచుండెను అపిశీర్ణ దుర్గప్రాకారమున కవ్వల దుర్గములో నిశితభల్లముఖంబుల నుత్సంగ ప్రదేశముల నానికొని యేటవాలుగ వంచి పట్టుకొని క్రిక్కిరిసియున్న పదాతిజననికాయమంతయుఁ గంటకమయంబగు దుర్గమారణ్యమువలెనే యగమ్యమై యుండెను అప్పుడు రాయల సేనావాహిని యంతయు నిమ్నాభిముఖంబుగ ప్రవహించు గంభీరవర్షాతరంగిణివలె దుర్గాభిముఖంబుగఁ ద్రోసికొనివచ్చుచుండెను. అప్పుడు మహామంత్రి తిమ్మరుసు నిశితకుంతగ్రహణ ప్రశస్త హస్తంబులగు మదహస్తియూథంబులఁ బురికొల్పి శత్రుపదాతిజన వ్యూహమును జెల్లాచెదరుగఁ జేసివైచెను, ఆ యవకాశమున మాధవుఁడు తన యుత్తమాశ్వము నొక్క దాఁటున నుఱికించి శత్రుసేన మధ్యమునఁబడి ప్రళయకాలరుద్రునివలె విహరించుచుండెను మాధవుని యెదుట నున్న శత్రుసైన్యమంతయుఁ గలఁగిపోవుచుండెను. ఎదుట సవ్యసాచియై పగరపైఁబడి విజృంభించుచున్న యొక దివ్యమూర్తి సవ్యాపసవ్యహస్తంబులంగల నిశిత కరవాలంబునుండి జల్లు జల్లుగఁ గవోష్ణ రక్తబిందువులు చింది రణదేవతకుఁ బద్మరాగమణీ హారములం గల్పించుచుండెను, సంకులసమరరంగమున శత్రువుల కందకుండ విజృంభించుచున్న మాధవుఁడావంక నాశ్చర్యముతోఁ జూచెను మాధవునకు ముందై ప్రళయకాళరుద్రునివలె మహారణరంగమున నశ్రమంబుగ విహరించుచున్న యా దివ్యమూర్తి యెవ్వరు? శత్రుదుస్సహప్రతాపశాలియగు మన శ్రీకృష్ణదేవమహారాయలే! ఆ వీరప్రతాపకంఠీరవుండు తన యెదుటనున్న ప్రహరేశ్వపాత్రుని సేనలం దెమలించుకొని చక్రధరుండగు వైకుంఠనాథునింబోలి ప్రహరేశ్వరునిపైఁ దలపడి విజృంభించుచుండెను.

ఆ సమయమున మహామంత్రియగు తిమ్మరుసుచేఁ బురికొల్పఁబడిన గజయూథసంఘట్టనమున దుర్గద్వారమంతయుఁ దెఱపియై పోయెను. అప్పు డీవలనున్న రాయలదండనాయకులును సైనికులును గూడ నొక్కసారగ నా దుర్గరణక్షేత్రమునఁ బ్రవేశించి శత్రువులను ముట్టడించి కోలాహలముగ యుద్ధము సేయుచుండిరి.

ఆ దుర్గమునందలి దండనాయకులును, మంత్రులును ఆశ్విక యోధులును గాల్బలమును గూడఁ బ్రాణములపై నాస వదులుకొని రాయలసైన్యముపై బడి దారుణ వీరవిహారము నెఱపుచుండిరి. ఆ సంకుల సమరమున నొక్కొక్క వీరుని విహారమును వర్ణించి వ్రాయుట యసాధ్యము ఉభయ సేనాయోధులలో నెవ్వరును వెనుదీయుట లేదు. ఎదురించిన యోధుల నెదురుకొనుచునే యుండిరి. విసరెడు కత్తుల విసరుచునే యుండిరి, పరస్పరాఘాత ప్రత్యాఘాతంబులచే నొండొరుల శిరంబుల ఖండించుకొనుచుండిరి. అన్యోన్య విజయోత్సాహములచే నొండొరుల మార్కొనుచునేయుండిరి ఇతరేతరాయుధ సంఘర్షణంబున నొండొరులు నిరాయుధు లగుచుండిరి. ఎవ్వరును బ్రాణములపై నాసించుటలేదు. ఒక్కరును వెనుకంజ వేయుటలేదు. దుర్గమును సంరక్షించుకొనవలయునని పాత్ర సైనికులును, దుర్గమును సాధింపవలయునని రాయల సైనికులును మిగులఁ బూనికతో రణరంగమున నొడ లెఱుంగక విహరించుచుండిరి? ప్రభుభక్తికై ప్రాణముల నర్పించివైచుచుండిరి. ఈ విధముగా సంకుల సమరము జరిగిపోవుచుండెను.

సార్వభౌమునిం జూచినతోడనే మాధవుఁడొక్కదాటునఁ దన యశ్వము నా వంక కుఱికించి యేలికకు బాసటయై నిలిచి సమీప సైన్యమును గలఁగించుచుండెను. అతనితోఁ గూడఁ గొందఱాశ్విక వీరులును రణరంగమున విహరించుచుండిరి. ఇదియంతయుం జూచి తిమ్మరుసు కొందఱాశ్వికులతోఁగూడ దుర్గేశ్వరుఁడగు వీరభద్ర పాత్రుని నెదిరింపవలయునను నుద్దేశముతో వెదకుకొనుచు నడ్డపడిన శత్రువులను దునుమాడుకొనుచు ముందటికిఁ బోవుచుండెను. వెలుగోటి నిర్వాణప్ప నాయకుడు మొదలగు దండనాయకు లితర దండనాయకులతోఁ గలసి పోరాడుచుండిరి. ఆ వీర విహారముచే నా దుర్గమంతయు

నతిభిన్నముగ నగపడుచుండెను. ఎదురులేని రాయల సేనావాహిని నిరాఘాటముగఁ బైఁబడి ముంచుకొని పోవుచున్నప్పు డిఁక నా దుర్గ సైకతము విరిసిపోవక యెట్లుండఁగలదు?

ఆ దుర్గమునందలి వారెల్లరికిని నిరాశ గలిగెను ప్రాణత్యాగము కంటె యుద్ధమున విజయోపాయ మేమియు నగపడుటలేదు. చాలమంది నిరుత్సాహులై పోవుచుండిరి అప్పటికిని బ్రహరేశ్వర పాత్రు డత్యాగ్రహావేశపరవశుఁడై కృష్ణరాయలతోఁ దలపడియుద్ధము సేయుచుండెను ఆతనికిఁ గొందఱాశ్వికులు బాసటయై యుండిరి. కాని వారిని మాధవుని యాశ్వికసైన్యము చుట్టుముట్టి కలఁచివైచు చుండెను ఆ సంకుల సమరసమయమునఁ బ్రహరేశ్వరుఁ డుగ్రుఁడై తన నిశిత చంద్రహాసమును రాయలపై బలముగ విసరెను శ్రీకృష్ణదేవరాయ లతిలాఘవమున నయ్యాఘాతమును తప్పించుకొని మెఱపు మెఱసినంతసేపటిలో వెనుకపాటున నాతని గుఱ్ఱముపై కుఱికి బలవంతముగ నా ప్రహరేశ్వరుని తన సందిట నిఱికించుకొనియెను; తోడనే మాధవు డాతని కరవాలము నూడఁ బెఱికికొనియెను, ప్రహరేశ్వరుఁడు పట్టుబడినతోడనే హతశేషులగు నా దుర్గసైనికులు చెల్లాచెదరై పోయిరి రాయలసేనలలో విజయధ్వనులుబయలుదేఱెను. వీరభద్రపాత్రుఁ డేమయ్యెనో యెవ్వరికినీ దెలియలేదు. మహామంత్రి యాజ్ఞచేఁ బ్రహరేశ్వరుఁడు బందీకృతు డయ్యెను. అప్పటికి సూర్యాస్తమయ మగుచుండెను ఆ సాయంసమయ ప్రశాంతారుణకిరణకాంతులలోఁ జల్లగ వీతెంచుచున్న మందమారుతములచే నా యుదయగిరి దుర్గగోపురమున శ్రీ రాజాధిరాజ పరమేశ్వర వీరప్రతాప శ్రీకృష్ణదేవమహారాయల విజయకేతనము నాట్యము సేయుచుండెను.

## 18. ఎన్నినాళ్లయినది

శ్రీకృష్ణదేవమహారాయలకు నభేద్యమగు నుదయగిరి దుర్గము స్వాధీనమయ్యెను. హతశేషులగు సైనికులకును, పౌరులకును నభయహస్తమీయఁబడియెను. దుర్గేశ్వరుఁడగు వీరభద్రపాత్రుఁడగపడవేలేదు.

ఆ కారణమున నింక వెంటబడి తప్పించుకొని పోయిరో యని యనుమానము కలిగెను. అందుచే దిమ్మరుసు, నాటిరాత్రి సైనికులందఱును, నాయకులెల్లరును మేలుకొని జాగరూకులై యుండవలయునని యాజ్ఞాపించెను దుర్గద్వారము లన్నియును భద్రముగ మూసి సంరక్షించ బడుటకు ఏర్పాటులు గావింపబడియెను పగులఁగొట్టఁబడిన యుత్తర ప్రాకారముకడ గజయూధములతో ప్రభుభక్తి పరాయణుండగు వెలుగోటి నిర్వాణప్పనాయకుఁడు సేనాసహితుఁడై కాచియుండుటకు నియమింపఁబడియెను. అంతఃపుర జనంబున కెట్టి యపాయమును గలుగకుండఁ గాపాడుటకై మాధవరాయలు నియమింపఁబడియెను. మహారాజు తన రాణివాసముతో దుర్గాంతర్భాగమున నున్న విశాల ప్రదేశమున నమర్పబడిన పటకుటీరములలో విడిసియుండెను. ఆ రాత్రి శ్రీకృష్ణదేవరాయలు మహాభారత విరాటపర్వమునందలి యుత్తర గోగ్రహణమును దాను స్వయముగఁ జదివికొనుచుండెను. మహామంత్రియు నశ్వారూఢుఁడై యా రేయంతయును దుర్గమంతటను దిరుగుచు జాగరూకుడై యెల్లవిషయములను గనిపెట్టుచుండెను. ఏయేసైన్య మెక్కడ నుండవలయునో యా యేర్పాటులన్నియు గావింపఁబడియెను.

రాత్రి రెండుజాములయ్యెను ఎల్లరును విభాయకకృత్యములను నిర్వర్తించుకొనుచు జాగరూకులై యుండిరి. అప్పుడు మాధవుఁ డంతఃపుర ముఖద్వారమున నిశితకృపాణపాణియై గృహాంగణమున సంచారము చేయుచుండెను. ఆ యంతఃపుర భవనముల కితర ద్వారము లన్నియు భద్రముగ మూయఁబడియుండెను ఆ భవనములలోనివారికా ముఖద్వారముదక్క మఱియొకమార్గము లేదు. కావుననే మాధవుఁ డా ముఖద్వారమును సంరక్షించుకొనుచు జాగరూకుఁడై యుండెను అతఁ డప్పుడు జగదేకవీరుఁడగు శ్రీకృష్ణదేవరాయల విక్రమ విహారముంగూర్చియు, మహామంత్రియగు తిమ్మరుసు రాజనీతి పారీణతంగూర్చియు, సూక్ష్మాలోచనముం గూర్చియు, నతిపరిశ్రమంబున జాలకాలమునకు సాధించిన యా నాటి విజయముంగూర్చియు, ననేకవిధముల నాలోచించుకొనుచుండెను.

అప్పు డా యర్ధ రాత్రిసమయ నిశ్శబ్ద భావమునకు భంగము కలిగించుచు గాఢాంధకారమును ఛేధించుకొని యమృత రసతరంగ నిస్వనంబుల ననుకరించి యవ్వలివైపునుండి వినవచ్చుచున్న సంగీత కలస్వనము మనోహరంబుగ నీ క్రిందివిధంబుగ వినవచ్చుచుండెను.

"వేటకాని దారుణశర వేగరవము
చెదరగొట్టినది మిమ్ము చెట్టునుండి,
యట్టివేళనె చీకటు లఖిలదిశల
గ్రమ్మి మీ కన్నులనుగూడ గప్పివైచె,
నైన నెక్కలువచ్చిన యట్టిమీరు
చెదరిపోయిన గుండెల బెదరుతోడ
దల్లడిల్లుచు దొరకిన దారిబట్టి
దిక్కుదిక్కునకును నొక్క రొక్కరుగను
పోగిపోయితి రకట! వృక్షముల వెంటః
నాటినుండియు వెలుగన్న మాటలేక
చీకటులతోడ నిండె నీ లోకమనుచు
గన్నులను విప్పియును గాన కున్నవారు
దైవవశమున మీర లం దఱునుగూడ
నొక్కచో జేరినపుడైన నూహలేక
యొండొరుల జూచికొనలేక యున్నవారు,
ఒకరినొక్కరు గ్రహియింప కున్నవారు,
దెలిసికొన్నవా రొరులకు దెలుపకుండ
దల్లడిల్లుచు నున్నారు తమకు దామె
ఎఱిగియుండియు నొకకొంద ఱెఱుగనట్టు
లుండి తప్పించుకొనిపోవు చున్నవారు,
వేటకాని భయం బింక విడువలేదె?
నాటి చీకటి చనలేదె నేటిదాక?
ఒక్కచో బుట్టి పెద్దలై యున్న మీరు
కష్టముల జానినపుడైన గలిసికొనగ
భయపడెద రేటికో వెఱ్ఱి పక్షులార!"

ఆ మనోమోహన గానామృతము చల్లగా మాధవుని చెవులఁబడి హృదయమునఁ బ్రతిధ్వనించుచుండెను. అతని కప్పు డొకసారిగా ననేక భావములు పొడసూపెను, ఆ గీతార్ధమంతయు నాతని కప్పు డేదియో యొక నూతనభావము నుద్బోధించుచున్నట్లుండెను ఆ యవ్యక్త మధురస్వర మాతని కేదియో పూర్వస్మృతిని గలిగించుచుండెను, అప్పు డాతని సకలాంగకములును కంపించిపోవుచుండెను ఆ పాట వినవచ్చుచోటి కతివేగముగ బోయి చూడవలయునని తొందర కలిగెను, ఆ వ్యక్తిని బరీక్షించి మాటలాడవలయునను నుత్సాహము జనియించెను, కాని ప్రభుభక్తిపరాయణుండగు మాధవున కిప్పుడు రాజాజ్ఞానిర్వహణభారము తలపై నుండెను. అంతఃపుర ముఖద్వార మునువిడిచి యరనిమిషమైన నవ్వల కరుగరాదు అయినను మాధవున కిప్పు డంత తత్తర మెందులకు? ఆ పాట క్రొత్తదికాదు, చాల దినములనుండి విద్యానగర మణిసౌధములందును, నంతఃపుర భవనములందును, రాజవీథులందును ప్రమోదోద్యానము లందును నహోరాత్రములం దెల్లప్పుడును నా కోమల సంగీతస్వరంబులు ప్రతిధ్వనించుచునే యుండెను. విద్యానగర ప్రజల కందఱకు నా యున్మాదిని రూప మెల్లయెడల గన్నులగట్టినట్లే యుండెను. మాధవుఁడు దాని నింత క్రొత్తగా జూచు టెందులకు? అతఁ డిదివఱ కా పాటలను వినలేదా? ఆ యున్మాదినిని జూడలేదా? ఏమో ఆ సంగతి మనకు తెలియదు.

అతఁ డత్యుత్కంఠితుఁడై యా గానమునుగూర్చియే యాలోచించుకొనుచుండెను. మరల నా మధురసంగీతము వినవచ్చునేమో యని యెదురుచూచుచునే యుండెను. అప్పు డొక పురుషవ్యక్తి పాదచారియై యా పాట వినవచ్చుచున్న దెసకు మెల్లమెల్లగా బోవుచుండెను ఒక యాశ్విక యోధుఁ డాతనిం గాంచి తన యశ్వము నొక్కచో విడిచి మెల్ల మెల్లగా దూరదూరమునుండి యాతని వెనుకనే పోవుచుండెను. కొంఁదిసేపటి కాముందు పోవుచున్న పురుషుఁడు పాట పాడుచుండిన యున్మాదినియొద్దకుఁ బోయి నిలువఁబడియెను. తోడనే యున్మాదిని పరమానందముతో నాతనిఁ గౌఁగిలించుకొనియెను.

దూరమునుండి చూచుచున్న యోధుఁ డత్యాశ్చర్యముతో నా వంకఁ జూచుచు నిలిచియుండెను. ఆ యున్మాదిని యంతటి యుత్సాహముతో నాతనిం గౌఁగిలించుకొనుట చాల వింతగా నుండెను—ఆతని నా యున్మాదిని గౌగిలించుకొనుటకుఁ గారణ మేమైయుండును? ఆ పురుషుఁ డెవ్వఁడో? ఆమెకు ప్రియుఁడై యుండునా? పిచ్చిదానికి గూడ ప్రియుఁడా? ఏమో పిచ్చిదిమాత్రము మానవి కాదా? ప్రియుల కొఱకు పిచ్చివారై పోయిన యువతు లీ లోకమునం దెందఱులేరు? ఆతఁ డామెకు ప్రియుఁడే కాకున్న నవ్వు డాకస్మికముగ నామె యున్మాదలక్షణ మంతయు మాఱిపోవుట కేమి కారణము?—ఈ విషయముం గూర్చి తెలిసికొనవలయునను నుద్దేశముతోడనే యా యోధుడుఁ దూరముగనిలిచి వారిసంభాషణ మేమైన వినవచ్చునేమో యని యాలకించుచుండెను. అస్పష్టముగ. నతి మందస్వరమున మాట లాడుచున్న వారిమాట లన్నియును స్పష్టముగా వినబడుటలేదు. ఈ క్రింది వాక్యములు మాత్ర మించుక బిగ్గరగ వినవచ్చినవి.

ఉన్మా—.........నీ వెట్లు బ్రతుకఁగలిగితివి?

పురు—.............. దైవ మీ విధముగా నను గ్రహించిన...... పరోపకారపారీణుఁడగుఁనాతఁ డీ సేనలోనే ..

ఉన్మా—ఎంత సాహసము!....ఎట్లయిన నేమి? అదృష్టవశము .

పురు—...నీ విట్లుంటివేమి?

ఉన్మా—...ఇదియే నా సర్వారిష్టభంగకవచముగా నున్నది.

పురు—...నన్నెట్లు కనిపెట్టితివి!

ఉన్మా—నీ వెట్లు గ్రహించితివి?

పురు—...ప్రాకారముపై నుండి నిన్నుఁ జూచి యానవాలు పట్టితిని

ఉన్మా—......నేనును గుట్టపై నుండి నిన్నుఁ జూచి గ్రహియించితిని.

పురు—అంతలో మాయమైపోయితి వేమి?

ఉన్మా— ...లో నాత డగపడినాడు. అందుచే....

పురు—...నకు నీ వింతవఱకు నగపడనేలేదా?

ఉన్మా— .. అదియే ప్రథమము

పురు—...ఎక్కడ నుండిరో తెలి....

ఉన్మా—లేదు... ... ఖరు డున్నాడు... భయములేదు.

పురు—.......యిచ్చటనే యున్నది

ఉన్మా—ఔను నే నెఱుగుదును అందుకొఱకే—

పురు—ఇంకను నిట్లుండు టెందులకు?

ఉన్మా—ఇందొకపని కొండ .. నా కొక ..చందమామకుఁ జేతులు చాచుచు....

పురు—నేనో?

ఉన్మా—సమయము .. కై యుండుము

ఆ సంభాషణము నాలకించుచున్న మన యోధుఁ డతిరయంబున నచ్చటి కరిగి యా పురుషుని బట్టుకొనియెను పురుషుఁడు భయ భ్రాంత నయనములతో నాతనివంక జూచెను ఆ మహాయోధుడు మహామంత్రి యగు తిమ్మరుసు! అప్పుడు తిమ్మరు సా పురుషునిం జూచి "నీ వెవ్వరు?" అనియెను

పురు—ఇంతవఱకు నే నీ పురపాలకుఁడనుగా నుంటిని

మంత్రి—నీ విచ్చటివాడవేనా?

పురు—కాను క్రొత్తగా వచ్చి యీ పని సంపాదిఁచుకొంటిని.

మంత్రి—నీపే రెవ్వరు?

పురు—నా పేరు హరదాసు.

మంత్రి—నీ కా యున్మాదిని యేమగును?

పురుషుఁడు మాటాడలేదు, మంత్రి యాతని మొగమువంక జూచి మఱియేమియు మాటాడకుండ దనవెంట దీసికొనిపోయెను. అప్పు డా యున్మాదిని మరల దనగానము నీ విధముగా నారంభించెను.

"మృగయునా ఘాతమున దప్పి మింటి కెగసి
పాఱిపోయిన కీరమా భాగ్యగరిమ
శాంతమగు రాజభవన పంజరము నందు
సేమముగ వ్రాలియుంటి విం కేమి భయము?

వెలుగు చీకటి ద్రోసి రా గలదు ముందు
తొందర యిదేల నీదు సైదోడు లపుడు
మఱపుగూర్చిన ఏ టి మాట మఱచి
యెల్లెడల వెల్గులే యుండు నెఱిగి యెఱిగి
కన్నులను విప్పి యెందోడురుఁ గాంచఁగలరు,
నేమముగ నుండవచ్చు నిం కేమి భయము?"

ఇందాకటి సంగీతము నాలకించి దానిని గూర్చియే యాలో చించుకొనుచున్న మాధవుని తన్మయత్వమునకు మరల నిప్పటి సంగీత మీము భంగము కలిగించెను. అతని హృదయమున నొకదాని వెనుక నొక్కటిగ వెలువడుచున్న యాలోచనములు ప్రత్యాలోచనములచే భంగింపఁబడ పోవుచుండెను. అక్కడకుఁ బోయి చూడవలయునని యాతని హృదయము తత్తరపడు చుండెను. కాని యేమి చేయఁ గల డు? అతఁడచ్చటనే హృదయావేగముతోఁ బ్రచారము చేయు చుండెను ఎదుట గృహాంగణమున దీపము వెలుఁగుచుండెను.

అప్పుడా ద్వారముకడ నోరువాకిలిగ నున్న తలుపుచాటున నిలువఁబడి యొక స్త్రీమూర్తి మేలిముసుఁగు నించుక యోరచేసికొని చూచుచున్న ట్లాతని కగపడియెను "ఆమె యెవ్వరు? అట్లు చూచు టకు గారణమేమి?" అని యాశ్చర్యముతోఁ దలంచుకొనుచు మాధవుఁడట్లే తిరుగుచుండెను. అ సమయమున నా మేలిముసుఁగు వైచికొని యున్న స్త్రీ యించుక ముందటికి వచ్చి హీనస్వరముతో "అయ్యా!" అని పిలిచినట్లయ్యెను

మాధవుఁ డించుక సమీపమునకు వచ్చి "ఎవరు వారు? అనియెను

"నేను పరివారేశ్వరుని తోఁబుట్టువును. నా పేరు పాల కేశ్వరి."

"పనియేమి?"

"ఒకమనవి యున్నది. దయతో నాలింపవలయును"

"వినుట కభ్యంతర మేమున్నది? చెప్పుము"

“అయ్యా! ఒక యబలా సంరక్షణము కావింపవలసి యున్నది.”

అంత యపాయ మేమి వచ్చినది?”

దావాగ్ని మధ్యమునందున్న తీవ కపాయముగాక మఱియేమున్నది?”

“శ్రీకృష్ణరాయ దేవేంద్రుని యభయప్రదానముంగన్న యీ యంతఃపురజనమున కేమి భయమున్నది?”

“ముందుగతి గానక పరితపించుచున్న యీయబలకంతయును భయదాయకముగనే యగపడుచున్నది.

“ఆమె కిప్పుడు వచ్చినప్రమాద మేమున్నది?”

“ప్రమాదము కాకేమున్నది? ఒక నిర్బంధమును వదలి మఱియొక నిర్బంధమున? బడిపోవలసి వచ్చుచున్నది”

“ఆ యబల యీ వఱకు నిచ్చట నిర్బంధములో నున్నదా?”

“నిర్బంధము కాదు కాని బలవంతముగఁ గొనిరాఁబడుటచే నామెకిది ప్రతిబంధకముగనే యున్నది”

“ఆమెను బలవంతముగఁ గొనితెచ్చిన వారెవ్వరు?”

“ప్రహారేశ్వర పాత్రుఁడు.”

“ఎందుకొఱకు?”

“తనప్రభుని యానతిని బరిపాలించుకొఱకు”

“అట్లయినచో నామె యిచ్చట నెందుల కుంచఁబడినది?”

“ఇంతలో నీముట్టడి వచ్చుటచే నాతని యానతిని బొంది పంపుటకు వలనుగాక పోయినది.”

ఆమె కొఱకు నీ కింతయారాట మెందులకు?

“ఆరాటము గాదాఁ రాజాజ్ఞను నిషేధింపఁజాలక మాయన్న యీమెను దీసికొనివచ్చెను కాని యీమె కెట్టి నిర్బంధము గలుగకుండ నాయధీనమునందే యుంచెను. సుగుణమణి యగు నీమె విచారముం గాంచి జాలిపడి నేనీమెను నా కన్నబిడ్డవలెనే చూచుకొనుచుంటిని అయిననేమి? ఇట్టి స్థితిలో నామెకు నేనింతకంటె నేమి యుపకారము చేయఁగలను ఆమె హృదయేశ్వరుని నే నెట్లు తీసికొని

రాఁగలుగుదును? కేయుంబవలు ప్రియజన వియోగవ్యధచేఁ గుందుచు సగమై చిక్కి శల్యావశిష్టయై యున్న యీ యబలను రక్షించి పుణ్యము కట్టుకొనఁ జాలరా?'

కష్ట సుఖములను గుర్తెరిగిన మాధవుని హృదయము నా మాటలు కరఁగించివైచెను అప్పుడు దీనదయాళుఁడగు నాతఁడు 'అమ్మా నేనిప్పుడేమి చేయవలయును'' అనియెను

''ఆ బాలిక నిచ్చటనుండి తప్పింపవలయును

''ఎందులకు?''

"ఆమె ప్రియజనులను గలిసికొనుటకు."

''ఆమె ప్రియజను లెచ్చట నున్నారు?''

వనదుర్గమునం దున్నారు "

' వారి పేరెవ్వరు?''

''రాజశేఖరుఁడు, గోపాలుఁడు '

మాధవుని హృదయము వికీర్ణమయ్యెను. మన సవశమై పోయెను. రక్తనాళములు పొంగిపోయెను. ఇట్టిదని నిర్దేశింపరాని యేదోయొక భావోద్రేకముచే నాతని నోటినుండి యున్మత్త ప్రలాపంబుల వలె '.ఈమె కమలయా!" అను నక్షరములు బిగ్గరగా వినఁబడియెను, ఆ కంఠస్వరము తోడనే హాహృదయేశ్వరా!" అను నార్తనాదముతో నవకుంతనవతి యగు నొక యువతీమణి వెలుపలకు వచ్చెను.

''హా హృదయేశ్వరీ!" అని పలుకుచు శోకాద్భుతానందరస సముద్రిక్త హృదయముతో మాధవుఁడొక యంజలోఁ బోయి యామెను గౌఁగిలించికొనియెను. చిరకాల సమాగమానంద పరవశులై యున్న యా యిరువురినోటినుండి యవ్యక్తముగ నొక్కసారిగ ''హా ఎన్నాళ్ళయినది!'' అను వాక్యములు వెలువడియెను చిత్రింపబడిన చంద్రశిలా ప్రతిమలవలె వారిరువురు నట్లే నిలువఁబడి పోయిరి,

అనందముచేఁ దన్మయులై యున్న యారమణీ రమణులం

గాంచుచు నా పాలకేశ్వరియు నానందవిస్మయములలో మునింగి యుండెను.

దైవ సంఘటన మెంత యద్భుతమైనది! సుఖము గష్టము గను గష్టమును సుఖముగను నెంతలో మార్చివేయుచున్నది! నిమిషము క్రిందట జీవిత మరణసంశయావస్థలో నున్న యీ యబల యానందామృత తరంగములం దేలియాడుచున్నది! క్షణముక్రిందట నపరిచితుఁడై యాశ్రయ దుర్లభుఁడై యున్న యీ రక్షణమూర్తి నెంతలో మాధవుఁడుగా సాక్షాత్కరించినాఁడు! అఘటనఘటనా సమర్థుండగు పరమేశ్వరుని యనంతలీల లెంతచిత్రముగా నున్నవి!''
అని పాలకేశ్వరి భావించుకొనుచుండెను

# 19. పరమ రహస్యము

ఉదయమున నంతఃపురజనమునకు వారివారి యిష్టము ననుసరించి తగిన సంరక్షణములు కావింపఁబడియెను మంత్రి యాజ్ఞ చొప్పునఁ గమల రాయల యంతఃపురమునఁ జేర్పఁబడియెను. పర్వతేశ్వరుని నుచిత పరివారముతో విద్యానగరమున నుంచుట కుత్తరువు లయ్యెను.

ఇంతలో వీరభద్ర గజపతి బహుళసేనా పరివృతుఁడై కొండవీటినుండి యెత్తి వచ్చుచున్నాఁడనియు, నిక్కడకుఁ బదిమైళ్ళ దూరములో విడిసి యుండెననియు రాయలకుఁ దెలియవచ్చెను తోడనే రాయలు దుర్గసంరక్షణమునకుఁ గావలసిన యేర్పాటుల నన్నిటిని జేసివైచి యందుఁ దగిన పరిపాలకుల నియమించి కొంత సైన్యమునుగూడ నందుంచి మిగిలిన సేనతో శత్రువుల నెదిరించి తఱిమికొని పోయి కొండవీడు ముట్టడింపవలయునని యాజ్ఞ చేసెను. సేన లన్నియును సక్రమముగఁ గదులుటకును, నందులకు వలయు నేర్పాటులకును నాలుగు దినములు పట్టెను. అంతలో రాయ లిదివఱకే యాజ్ఞాపించిన చొప్పున విద్యానగరము నుండి లక్షల కొలఁది సైన్యము వచ్చి వారలఁ గలిసికొనియెను.

ఆ సేనా సముద్రముతో శ్రీ రాజపరమేశ్వరుఁ డొక శుభ ముహూర్తమున నత్యుత్సాహములో దిగ్విజయ యాత్రకు బయలు దేరెను. విజయోత్సాహోద్రిక్త హృదయులగు రాయల సైనికు లలో నెక్కడఁ జూచినను వీరరస పరిప్లుతంబు లగుమాటలే విన వచ్చుచుండెను. సామంతులును, దండనాయకులును గూడ విజయా నంద మూర్తులై బిరుదు పట్టములు మెఱయుచుండ, వీరరసము మూర్తీభవించిన రీతిగ గానవచ్చుచుండిరి

మహామంత్రి యగు తిమ్మరుసు రాజాధిరాజ పరమేశ్వరుఁ డగు రాయలును నుచితగతుల నానందముతో ముచ్చటించుకొనుచు భద్రగజారూఢులై మంద మందగమనంబుల విజయప్రస్థానముం గావించుచుండిరి. ఎదుటఁ గాచికొనియున్నదని తెలియ వచ్చిన శత్రుసైన్యముంగూర్చి వారు లక్ష్యము సేయుటలేదు. ప్రబల సేనా వాహినులతోఁ జల్లగఁ బోయి వారిపైఁ బడి వారి నతలకుతలముగ జేసివైచి యాకస్మికముగఁ గొండవీడుదుర్గముపైఁ బడి ముట్టడింప వలయునని వారాలోచించుకొనుచుండిరి. దండనాయకులు మొదలగు వీరాగ్రేసరుల కందఱకు నా విషయమైన కట్టుదిట్టములు కావింపఁ బడెను. ఈ విధముగా రాయలసైన్యము కదలి పోవుచుండెను.

రాయలనంత సేనాసముద్రుఁడై తమపైఁబడి ముంచుకొని పోవనున్నాఁడనియు కదలి వచ్చుచున్నాఁడనియు. శత్రుసేనలకుఁ దెలియవచ్చెను. అప్పు డందలి దండనాయకులందఱును భయభ్రాం తులై రక్షణహీనమైయున్న యా బహిరంగ ప్రదేశమున నంతటి రాయల సైన్యముతో నెదిరించి నిలుచుట యపాయకర మని తలంచి కాఁబోలు నటనుండి తమతమ శిబిరంబుల నెత్తివైచి యొక్కసారిగ నతిత్వరిత గమనంబులఁ గొండవీటి దుర్గాభిముఖులై పాఱిపోవుచుండిరి

ఈ యుభయ సేవా మధ్యమార్గమున ధైర్యముతో నిలువఁబడి మా పాఠకులకు మేమొక పరమ రహస్యమును జెప్పఁదలఁచుకొన్నా రము. రాయలదాడికి వెఱచిపోవుచున్న యా సైన్యము వీరభద్ర గజ పతి సైన్యమే, కాని. యాతఁడిప్పు డాసేనలో లేఁడు. దుర్జయుఁడగు

హాతఁడు వగరకు వెన్నిచ్చునంతటి భీరుస్వభావముకలవాఁడు కాఁడు. రాజశేఖరుఁడును గోపాలుఁడును నాకస్మికముగ నిడుప్రోలు దుర్గముపైఁ బడి యాక్రమించుకొనిన సంగతి మా పాఠకులకు జ్ఞప్తియం దుండవచ్చును. ఆ సమర కల్లోలమునంబడి తప్పించు కొని పాటిపోయిన లక్ష్మీపతి రాజు కొండవీడు దుర్గముఁ బ్రవేశించి యెల్ల సంగతులను యువరాజున కెఱిఁగించి యాతని కపటాలోచ నానుసారముగ, పూసపాటి రాచిరాజును, గొంత సైన్యమును సాహాయ్యముగఁ దీసికొని పోయి వనదుర్గమును ముట్టడించెను దుర్భేదమగు నా దుర్గము సేనాబలసమన్వితమై యుండుటచే వారికి స్వాధీనము కాలేదు. అయినను జాలనెలల వఱకు వారా ముట్టడిని వదలలేదు. ఇట్లుండఁగా యువరాజు, రాయ లుదయగిరి దుర్గమును జాల దినములనుండి ముట్టడించి యుండెననియు, దానిని సాధించిన తోడనే మన కొండవీటి దుర్గముపైఁ బడుట కావేగపడుచున్నట్లు తెలియుచున్నదనియు, ఈ చిక్కు సమయమున సేనలు చెల్లాచెదరై యుండు టపాయకరమనియు తత్క్షణమే వనదుర్గమును వదలి యిచ్చటికి రావలయుననియు వార్త పంపెను. ఆ యువరాజు నానతిచే వనదుర్గమును వదలి కొండవీటికిఁ బోవుచు నీమార్గ మధ్య మున విడిసి మన రాయల సైన్యముం గాంచి భయపడి పోవుచున్న ఈ సైన్యమే యా సైన్యము. రాయల వేగులవాండ్ర కీ రహస్యము తెలియలేదు.

రాయల మహాసైన్యము వారలను దఱుముకొని ముందటికిఁ బోవుచుండెను. కొలఁది దినములలోనే వారు కొండవీటిని సమీపించిరి ఇంతలో లక్ష్మీపతి రాజు సేనాసహితుఁడై దుర్గముఁ బ్రవేశించి యూపిరి ద్రిప్పుకొనియెను, రాయల రాకవిని, దుర్గద్వారము లన్నియు దృఢముగ బంధించి లోపల, నున్నవారందఱును యుద్ధ సన్నద్ధులై యుండిరి.

ఇంతలోఁ బ్రతాప రుద్రగజపతి కటకమునుండి మహా సైన్య ముతో గోదావరి నదిని దాఁటి వచ్చుచున్నాఁడని రాయలకుఁ దెలియవచ్చెను. తత్క్షణమే రాయలు, మహామంత్రి తిమ్మరుసు తన

గజయూథంబులతోడను నఱువదివేల కాల్బలముతోడను మఱి కొందఱు సేనానాయకులతోడను, అశ్వసేనాసహితుఁడగు మాధవుని తోడను గొండవీటి దుర్గమును ముట్టడించున ట్లేర్పాటు గావించి, తక్కిన సేనాసముదయముతోడను గజయూథంబుతోడను, బుక్కరాజు, నిర్వాణప్ప నాయకుఁడు మొదలగు మహాయోధులతో గూడ స్వయముగఁ బోయి. కటకేశ్వరుఁడు కృష్ణవేణీ నదిని దాఁటి యివ్వలకు రాకుండఁ దఱిమికొట్టుట కేర్పాటు చేసికొనియెను.

## 20. పలాయనము

ఓ కృష్ణవేణీ తరంగిణీ! పూర్వాబ్ధి ముఖంబుగ ద్రుతగామినివై యిట్లు పోవుచుంటివేమి? అమృతమూర్తిని గర్భమున ధరియించిన నీవు, అలసగమనవుగాక ద్రుతగమన వెట్లయితివి? ఈ నీతరంగ హస్తముల నెత్తి యెవ్వరిని బిలుచుచుంటివి? సౌభాగ్య సూచకంబులగు నీ నవనవోర్మికా నికరంబులు నెవ్వరికిఁ జూపించుచుంటివి? నీలాకాశ ప్రతిబింబచ్ఛలంబున నీలావకుంఠనముం దాల్చితివేమి? ఆయవకుంఠనమునం దచ్చటచ్చట వజ్రమణులు మెఱయుచున్నట్లున్నవే! అవి యెక్కడివి? ఆ కలకలారావ మేమి? కంకణ ఝుణఝుణత్కారము కాదుగదా! ప్రియాభిసరణంబు సేయుచు, నీ హృదయేశ్వరుం డగు వాహినీశ్వరు ననుసరింప బోవుచున్న నీవు వక్రగమనములతో నిట్లు తప్పించుకొని పోవుచుంటివేమి? ఎవ్వరు చూచెదరని భయము? సతీమణి వగునీకా భయ మెందులకు? నిన్నెవ్వ రడ్డుకొనఁగలరు? అమృతమూర్తివగు నీవు పర్వత రాజపుత్రికవు. భగవతివి. లోకరక్షణివి, ఓ లోకపావనీ! నీ యనుగ్రహము మూలముననే నీ బిడ్డలమైయున్న మేము ఫలపుష్ప సంశోభితంబులగు దివ్యారామములతోడను, దివ్యకేదారములతోడను, పాడిపంటలతోడను సుఖము ననుభవించుచున్నాము. ఓ యమృతమయ స్వరూపిణీ! నీ కరుణా ప్రసారమువలననే యూషర క్షేత్రములు దివ్యకేదారము లగుచున్నవి నీదయారసమువలననే మా హృదయ

తృష్ణ శాంతించుచున్నది నీ చల్లని సంచారమువలననే మా జీవనములు నిలుచుచున్నవి. నీవంటి ప్రత్యక్ష దేవత లేక మాకెవ్వరున్నారు? నీవు మా యిలువేల్పువు. మా కులదేవతవు నీ విశ్వరూప ప్రకోపమున లోకము బ్రుంగుడు వడిపోవును. నీ శాంతరస ప్రసాదమున జగ ముజ్జీవింపఁబడును. ఓ నిర్మలమూర్తీ! సకలార్థ ప్రదాయినీ! తుషార మందహాస చంద్రికా విలాసినీ! చంచత్తరంగ కాంచీనినాదానుకార మధురగామినీ! అమృతవాహినీ! జననీ? నీకొక నమస్కారము సకలజన హృదయానందదాయినివై. సకల సస్యోజ్జీవనామోదినివై చల్లఁగ నడయాడుచున్న నీకు వేయి నమస్కారములు. నీ దక్షిణో త్తర పార్శ్వములం గాచికొనియున్న యీ వాహినీపతు లెవ్వరు? సదాగతివగు నీకు మమ్ములను ప్రబోధించుటకుఁ దీరిక యెక్కడ నున్నది? నీ దివ్యభాషణంబుల గ్రహియించుటకు మాకుమాత్రము శక్తి యెక్కడనున్నది? కదలుము కదలుము మా దివ్య కేదారం బులఁ బంగారు తీఁగల నలరించుచు దివ్యగమనంబులఁ గదలిచనుము నీ యావశ్యక కార్యంబుల కంతరాయములు కల్పించుట మావని గాదు తెల్లవాఱినచో మేమే గ్రహియింపఁగలము పరమపావనీ! పాపనాశనీ? మా మహోహరోద్యానముల మరకత మణిశ్యామలం బులుగ జేయుచుఁ గదలి పొమ్ము! భగవతి కృష్ణవేణీ తరంగిణీ! నీకుఁ బదివేల నమస్కారములు.

కలకల తెల్లవాఱినది. కృష్ణవేణీ నది దక్షిణతీరమునం గల విశాల ప్రదేశమున శ్రీకృష్ణరాయ దేవేంద్రుని యనంత వాహినీ సముదాయము విజయభేరీధ్వనులతో ఘోషించుచుండెను. అందు నాలుగులక్షల కాల్బలములను, బదివేల యాశ్వికసైన్యమును, రెండు వేలేనుంగులును బలసియుండెను. బుక్కరాజు, నిర్వాహణప్ప నాయ కుఁడు తిమ్మప్పనాయకుఁడు. గొండారెడ్డి, గోవిందరాజు కుమార వీరశ్యామల రాయులు మొదలగు ప్రబలదండ నాయకులు తమతమ సేనలతో విజృంభించుచుండిరి.

ఉత్తరతీరమున నుత్కలేశ్వరుండగు ప్రతాపరుద్ర గజపతి పదమూఁడు వందల,యేనుంగులును, నిరువదివేల మంది యాశ్వికు

లును, నైదు లక్షల కాల్బలమును గల మహా సైన్యముతో విడిసి యుండెను. పాత్ర దండనాయకులు పదునార్వురును, సామంత రాజు లును శత్రువులపై నెప్పుడుఱుకుదుమా యని వీరావేశముతో నెదురు చూచుచుండిరి.

అప్పుడు యుద్ధ నీతి విశారదుండగు శ్రీకృష్ణదేవరాయలు కటకేశ్వరునకు "ఊరక మన మీవలావలి తీరముల వేచియుండుట వలన లాభము లేదు ఇట్లే తలపడబడినచో నదీగర్భమునం బడి నిరర్థకముగ లెక్కలేని సేనలు మడియవలసి వచ్చును. మీరుకొంతదూరము వెనుకకుంబోయి మా సేనలు నిలుచుటకుం జోటిచ్చినచో మేమీ కృష్ణవేణ నదిని దాంటి తలపడుచున్నాము. అట్లు కాదేని మేము వెనుకకు జరిగిపోయెదము మీరు మీ సేనలతో నది దాంటివచ్చి మార్కొనుండు" అని రాయబార మంపెను.

అందుల కాగజపతి యెట్టిప్రత్యుత్తరము నీయలేదు అప్పుడు శ్రీకృష్ణ దేవరాయ లుగ్రుండై, మీరు మీమీ ప్రభుభక్తి విశ్వాసములు మెఱయ మదగజ సాహాయమున నది దాంటిపోయి శత్రుసైన్యములపైం బడి నుఱుమాడుండు. విజయమో వీరస్వర్గమో చూఱంగొనుండు. ప్రాణభీతిచే వెనుదిరుగు భీరులకుం గృష్ణవేణి నదియే గతియగునని తెలిసికొనుండు," అని సామంత దండనాయకుల పరిసరంబున సకల సైనికులకు నాజ్ఞ యొసంగెను.

"ఆజ్ఞయైనది. ప్రబలశత్రు మరణంబునకు రాజపరమేశ్వరుని యాజ్ఞయైనది. లెండు! విజయము మన చేతిలో నున్నది, మన యుత్సాహమునం దున్నది," అను వీరాలాపములతో రాయలసేనా సాగరముప్పొంగి పోవుచుండెను. నదీ తరణమునకుం దగిన సాధనము అమర్పంబడియెను. సేన లన్నియును నది దాంటిపోవుటకుం బ్రయత్నించుచుండెను, బవర మనిచం బరమోత్సాహముతో ముందంజవేయు శ్రీకృష్ణదేవ మహారాయులు సేనా సముదయమును ముందఱికి నడపించుచుండెను. సేనలన్నియును వరుసగా నది దాంటుటకుం బ్రోవు త్రొని వచ్చుచుండెను.

ఆ సమయమున నదియేమి! ఉత్కలేశ్వరుని సైన్యమునందుం

తటి కోలహాలము బయలు దేఱిన దేమి? ఆ రణసంరంభమేమి' ఒకరి నొక రట్లు కొట్టుకొనుచున్నారేమి? అంతఃకలహా మేమైన బయలు దేఱినదా? అవ్వల మహారణము జరిగిపోవు చుండెను. ఆశ్చర్యముతో నా వంకఁ జూచుచు రాయలు తన సేనలను దాఁటించుచుండెను. అప్పు డొక పురుషుఁడు సముచిత సేనాపరివృతుండై నది యవ్వలి తీరమున నిలిచి రాయల సైన్యము వంకఁ జేయెత్తి "రండు! నిరపాయముగఁ గదలి రండు!' అని హెచ్చరించుచుండెను.

అప్పటి రణ సంరంభమునం గలిగిన తెలుపిలో రాయల సైన్యము చాలవఱ కవ్వలకు దాఁటిపోయెను, రాయలు కూడఁ జాల మంది యోధులతో నవ్వలి తీరమునఁ బ్రవేశించెను. ఇంతవఱకును వానిని హెచ్చరించుచున్న యా వీర పురుషుఁడు రాయల దర్శించి యాశీర్వదించి మహాప్రభూ! మీ యాజ్ఞలేనిదే మీ శత్రువులను ముందుగ మేము మార్కొనినందులకు క్షమింపవలయును. మీరువచ్చి మమ్ములను గలసికొందురను ధైర్యముతో మా నలువదివేల సైనికుల తోడను నీయనంత సేనా సాగరమున కడ్డుపడితిమి. ఆపోరాడుచున్న యోధ వీరుఁడు వసంతవాడ దుర్గేశ్వరి సోదరుఁడగు గోపాల రాయలు. నేనాతని మంత్రి రాజశేఖరుఁడను. మమ్ములను మీపక్షమున యుద్ధము చేయుట కనుగ్రహింప వలయును." అనియెను.

రాయ లత్యాశ్చర్యముతో "రాజశేఖరా! మీరు మాయెడలం జూపిన విశ్వాసమునకు మేమెంతయును సంతసించితిమి, మాధవ రాయలంబట్టి మీరు మా ప్రజలే యైతిరి. మేముత్సాహ పూర్వకముగ రణమున కనుజ్ఞ యిచ్చుచున్నారము." అనియెను

అప్పుడు రాయల యాజ్ఞచే యోధవీరు లెల్లరు సేనలఁ బురికొల్పుకొనుచు శత్రు సేనతోఁ బోరాడుచున్న గోపాలుని సేనలను మీరి ముందఱికిఁబోయి యాయనంత సేనా సాగరమును మథియింప నారంభించిరి,

క్రమముగా నా మహారణ మతిదారుణమయ్యెను, ఇరువాగుల యోధులును వెనుదీయక భయంకరముగఁ బోరాడుచుండిరి. ఆదారుణసంకుల సమరమున నెందఱు సైనికులు మరణించిరో, ఎన్ని యశ్వ

ములు నేల పాలయెనో, ఎన్ని యేనుఁగులు గుట్టలవలె బడియెనో, అప్పుడా కృష్ణవేణి నదీ ప్రాంతమున నెన్నిరక్త వేణులు ప్రవహించి యా మహానది కుపనదీ ప్రాయము లయ్యెనో. యెవ్వరు చెప్పఁ గలరు? సామాన్యమా! ఇరు వాగులుం గలసి పదిలక్షల సైన్యమున్నది! ఒక సముద్రముతో నింకొక సముద్రము తలపడుచున్నది ఒక ప్రపంచముపై నింకొక ప్రపంచము పడిపోవుచున్నది.! ఎవరు నిర్ణయించి చెప్పఁగలరు? ఎవరు లెక్కించి చూపఁగలరు? ఈ విధముగఁ గొన్ని దినముల వఱకును మహారణము జరుగుచునే యుండెను

తుద కతి భీభత్సంబగు నా మహారణంబున రాయల ప్రతాపానలమును సహింపజాలక మరి సైన్యములు వెన్నిచ్చి పాఱిపో నారంభించెను. అప్పుడు రాయ లత్యుత్సాహముతోఁ దన సేనలవంకఁ జేయూఁచి "అరి సైన్యమును వెన్నంటి తఱుముఁడు, తలపడి నఱుమాడుఁడు!" అని హెచ్చరించెను.

అప్పుడొక్కసారిగా రాయల సైన్యము శత్రుసైన్యముపైఁ బడి చాల దూరమువఱకును దఱుముకొనిపోవుచుండెను. శత్రు సైనికులు భయభ్రాంతులై తిరిగి చూడకుండఁ బాఱిపోయిరి. ఆ దారుణ పలాయన సమయమున శత్రు సంబంధములగు నేనూఱేనుంగులును, రెండువేల గుఱ్ఱములును, విశేషద్రవ్యమును, నమితములగు నాహార పదార్థములును, బట కుటీరములు మొదలగు సేనోపకరణంబులును, నాయుధంబులును రాజాధిరాజ పరమేశ్వర వీర ప్రతాప శ్రీకృష్ణదేవమహారాయలకు లభియించెను

అప్పుడు శ్రీకృష్ణదేవరాయలు మహావైభవముతో విజయ భేరీధ్వనులు దెసలు మాఱుమ్రోఁగుచుండఁ దన సేనలను మరలించెను.

ఆ పిమ్మట రాయలు రాజశేఖరగోపాలుర నభినందించి. వారలతోఁగూడఁ గొంతఱు దండనాయకులను సైనికులను నటనుండ నియోగించి వారల కధీశ్వరుఁడుగాఁ గుమార వీరశ్యామలరాయలను నియమించి శత్రుసైన్యమును మరల రాకుండఁ గొన్ని దినములు చూచి రావలయునని యాజ్ఞాపించి తక్కిన సేనాపరివారముతో నది

దాఁటి రాణివాసముతోఁగూడ నటనుండి కదలి కొండవీటి దుర్గాభి ముఖుఁడై బయలుదేఱెను.

## 21. నీ చేతిలో నున్నది

మహామంత్రియగు తిమ్మరుసును, మాధవరాయలును, నలుబది వేల సైన్యముతోడను, ఆశ్వికవీరులతోడన, గజయూధములతోడను, గొండవీటి దుర్గమును ముట్టడించిరి. పూర్వ మా దుర్గము ప్రతాప రుద్రుని సరదారులై క్రమముగ స్వతంత్రులైన రెడ్డిరాజులచేఁ బర్వతముల నడుమ శత్రువుల కభేద్యముగ నుండునట్లు నిర్మింపఁబడి నది. అదఫిరంగులచేఁ బగులునదికాదు. ఎంతటి బలముగల యేనుగు లైనను దాని ద్వారములను బగులఁగొట్టఁజాలకుండెను. శ్రీకృష్ణ దేవరాయలు తమ పై కెత్తి వచ్చుచున్న కటకేశ్వరు నెదిరించుటకు విజయనగరము నుండి వచ్చిన నూతనసేనలతోడను, సామంత రాజులతోడను, గొన్ని గజయూధములతోడను, దాడివెడలిపోయి నది మొదలా దుర్గము తిమ్మరుసు మొదలగువారిచే ముట్టడింపఁబడి యుండెను. కాని దుర్గమును బేధించుట కెట్టి యుపాయమును వారి కగపడుటలేదు. కొన్ని మాసములు గడిచిపోయెను ఏ కారణము ననో, తిమ్మరుసు తన సేన కాదుర్గము ముట్టడి వీడి యందఱు నొక్క వైపునకు రావలయునని యాజ్ఞాపించెను. ఆ విధముగనే సేనలన్ని యును నొక విశాల ప్రదేశమునఁ జేరుకొనియెను దుర్గ మునందున్న వీరభద్రగజపతి, లక్ష్మీపతిరాజు, రాచిరాజు, కనవాపాత్రుఁడు, సుప్రపాలచంద్రమహాపాత్రుఁడు ఉద్దండఖానుఁడు, యల్లాఖానుఁడు నరహరిదేవుఁడు మొదలగు నాయకులందఱును దమకు భయపడి, దుర్గమును భేదింపఁజాలక తిమ్మరుసుసైన్యము ముట్టడి వీడిపోవు చున్నదనియు, గొలఁది దినములలో నా తావును వీడిపోవుననియు భావించుకొని యుద్ధవిషయమున నశ్రద్ధ వహించి కేళీవినోదములం దవిలియుండిరి.

రాయలసైన్యమందుఁగూడ నిట్టి ప్రవాదమే కలిగియుండెను. మహామంత్రి యాజ్ఞ చొప్పున రాయలసైన్యములా ముట్టడిని వీడి

రాయలఁ గలసికొనుటకై బయలుదేఱిపోవలయునని తలంచుచుం డెను. కాని, మంత్రి తిమ్మరుసు గూఢహృదయమున నేమున్నదో యెవ్వరికిని దెలియుటలేదు అందఱును ప్రయాణసన్నాహమును జేసికొనవలయునని తలంచుచుండిరి. ఉభయసైన్యములలోని సైని కులును గేళివినోదముల రేయింబవలు జరపివైచుచుండిరి.

ఇఁక మనకు యుద్ధము వలదు. కొలఁదిదినములలోనే యీ స్థలమును వీడిపోవలయునని. మహామంత్రియగు తిమ్మరుసు తన సైనికులకు బహిరంగముగ నుత్తరువులు చేసెను ఆ యుత్తరువులు క్రమముగా దుర్గములోని నాయకులకును దెలియవచ్చెను. ఈ యుత్త రువులు పుట్టిననాఁటి రాత్రి రాయలసైన్యమంతయు నిమ్మకు నీరు వోసినట్లు కిక్కురుమనకుండ, వినోదములఁ గాలక్షేపము జరుపకుండ నెమ్మదిగా నుండెను శత్రుదుర్గమును భేదింపఁజాలమైతిమను నవ మానము వారి హృదయములఁ బీడించుచుండుటచే వారట్లు చిన్న వోయియుండిరని తోఁచుచున్నది. ఒక్కరును మాటాడుటలేదు. అంద ఱును గ్రుక్కుమిక్కుమనకుండిరి, ఏ హృదయమున నెట్టి యాలోచ నము జరుగుచున్నదో యెవ్వరికిని దెలియదు!

ఆనాఁటి రాత్రి యాకసమునఁ జంద్రుఁడు నిండు కళలతో విరాజిల్లుచుండెను. ప్రతి సైనికుఁడు నా చంద్రుఁడు తన్నుఁ జూచి, నవ్వుచుండెనని భావించుకొని తల వంచుకుని యాకసమువంకఁ జూచుటలేదు అందఱును దీర్ఘాలోచనాపరులై, యవమానశల్యము తమ్ము వేధించుచుండుటచేఁగాఁబోలు వేదన ననుభవించుచుండిరి.

ఆ సమయమున నొక పటకుటీరమునకు దూరముగనున్న యొక మఱ్ఱివృక్షముక్రింద ఫల్గునుడును వారదాసును నేమే మియో ముచ్చటించుకొనుచుండిరి. మనము వారియొద్దకుఁబోయి వారి మాటలు వాలకింతముగాక! వారేవియో యిష్టాలాపములనే చెప్పుకొనుచుండిరి ఏ వార్తలు లేని మన కిప్పట్టున నీ వినోదాలాప ములచేఁ గాలక్షేపమగునని తోఁచుచున్నది.

ఫల్గు—మిత్రమా! నీవు నాతోఁ జాల దినములనుండి మైత్రి నెఱపుచుంటివి. నీ వొక్క మాటకును బ్రత్యుత్తరము చెప్పకుంటివి.

నిన్నుఁ జూచినప్పుడెల్ల నా హృదయవికారము నాపుకొననేరక నీకుఁ జెప్పివైచుచునే యుంటిని నీ వొక్క మాట యడిగెదవు, దాఁపక చెప్పెదవా?

హార—మిత్రుఁడా! అడుగుము. హృదయమిచ్చి మాటలాడు చున్న నీ యొద్ద నేను దాఁచెదనా?

ఫల్గు—నీ మొగము చూచినప్పుడెల్ల నా కేదియో జ్ఞప్తికి వచ్చి పరమానందములో మునిఁగిపోవుచుంటిని.

హార—చెప్పుము! ఏది జ్ఞప్తికి వచ్చుచున్నది? నా మొగమున నేమున్నది?

ఫల్గు—నీ విట్లు పరిహాసము చేయుదువనియే నే నూరకుండు చుంటిని

హార—మిత్రమా! పరిహాసమాడుటలేదు. నిజము చెప్పుము

ఫల్గు—చెప్పిన నీవేమియును ననుకొనవుగదా!

హార—ఎంతమాట! మిత్రునిపట్ల నేనన్యథా భావింతునా?

ఫల్గు—పోనిమ్ము—ఆ మాట యెందులకు? అది నా హృద యము నందే యడఁగిపోనిమ్ము—

హార—చెప్పుము, నీతోడు! నేనేమియు ననుకొనను

ఫల్గు—నీ వదనకమలమును గాంచినప్పుడెల్ల నాకు నా హృదయేశ్వరి శిశిర జ్ఞప్తికి వచ్చుచున్నది. అట్లేందు కగుచున్నదో నేను చెప్పఁజాలను. ఆ మాట యడుగవలయుననియే నాలుక చివరకు వచ్చినప్పుడెల్ల బలవంతముగ నాఁపివైచుచుంటిని.

హారదాసించుక నవ్వి "మిత్రుఁడా! నీవట్లు దాఁచుకొనియుంటి వని నాకేమి తెలియును? నీ వడిగితివిగనుక, నేను నిజముగా చెప్పు చున్నాను. నేనామె సోదరుఁడను," అనియెను.

ఫల్గునుఁ డాశ్చర్యముతో "బావా! నీవు నా శిశిరమణికి సోదరుఁడవేనా? నిజమేనా? నిజమేనా? అందులకనియే నా హృదయ మట్టి యారాటమును బొందుచున్నది. అయినచో నేను తప్పుగఁ దలంపలేదు. మీ ఇరువురి ముఖకమలములును నొక్క పోలిక నుండుట చేతనే నాకీ యనుమానము కలిగినది" అనియెను.

హర—ఇంక ననుమాన మేమున్నది? ప్రత్యక్షముగనే చె'ప్పితివి గాదా!

ఫల్గు—లేదు అనుమానములేదు. ఆ యడవిపల్లెయందున్న యా వృద్ధక్షత్రియునివలనం దెలియవచ్చినది. నీవామెను వెంటబెట్టుకొని పోయితివట గాదా! ఆమె యెక్కడ నున్నదో యామెనేమము నీవు నాకు తెలుపంగలవా?

హర—తెలుపకేమి? ఆమె యిప్పుడు నా యొద్దనే సేమముగ నున్నది, నిత్యమును నీ యుపకారమును గూర్చియే నిన్ను వేనోళ్ళం బొగడుచున్నది ఆమె నీ ఋణము నెట్లు తీర్చుకొనంగలదు?

ఫల్గునుం డానందోద్రిక్తహృదయముతో "బావా! అట్లనకుము. ఆ మోహనాంగి కటాక్షలేశమును గోరియున్న నా కామె ఋణపడియున్నదనుట సాహసము," అనియెను

హరదాసు తలవంచుకొని, "ఆమె ప్రాణములు నీ విచ్చినవి. వాని నన్యథా వినియోగించుట కామెకు స్వాతంత్ర్య మెక్కడ నున్నది? అట్టి కృతజ్ఞతతోడనో, నీమీదం వలపుచేతనో యామె పిచ్చిదై పిచ్చిపాటలు పాడుకొనుచుం నిన్ను వెదకుకొనుచూ దిరుగుచున్నది" అనియెను

ఫల్గునుం డానందముతో "ఆమె కట్టి కృతజ్ఞత యున్నదా? నామీంది వలపుచే నున్మాదిని యైపోయినదా?—అయినచో నేను నిజముగ ధన్యతముండనే. ఆమె యిప్పుడు నీయొద్ద ననంగా నెక్కడ నున్నది?" అనియెను.

హర—మా యింటియొద్ద నున్నది.

ఫల్గు—మీ యిల్లెక్కడ? ఉదయగిరియందా?

హర—అవును.

ఫల్గు—అయ్యో! నేనక్కడనే తెలిసికొనంజాలనైతిని ఇప్పుడక్కడకుం బోవుదమా!

హరదాసు—(నవ్వుచు) "ఆత్రపడకుము. ప్రభుకార్యమున నియుక్తుండవై యున్న నీ విప్పు డెక్కడకుం బోంగలవు?"అనియెను

ఫల్గునుఁడు తెల్లబోయిన మొగముతో, "అవును—కాని—ఆ మనోహారిణిం జూపుట నీ చేతిలో నున్నది—ఇఁక—

అర్ధోక్తియందే "ఇఁక నేమున్నది? ఇదిగో! నీ మనోహారిణి నా చేతిలోనే యున్నది చూడుము." అని చేయి చాఁచెను.

ఫల్గు—నన్నుఁ బరిహాసము చేయుచున్నావా.

హార—పరిహాసము కాదు. నా చేతిలోనే యున్నది—నేను నీకు పాణిగ్రహణము చేయించెదనులే.

ఫల్గు—ఇంకను పరిహాసమా!

హార—ఇది పరిహాసమైనచో నిఁక నిజమేది?

ఫల్గు—ఇదియే నిజమైనచో నంతయును బరిహాసమే.

హార—కాదు కాదు. ముమ్మాటికిని సత్యము నమ్ముము

అని హారిదాసక్కడనుండి లేచెను. ఫల్గునుఁ డాతనితో లేచి "మిత్రమా! ఎక్కడకుఁ బోయెదవు? నన్నొంటిగా విడిచి యెక్కడకుఁ బోయెదవు?" అనియెను.

హార—నీ వొంటిగాఁడవా? నీ హృదయేశ్వరి నీ హృదయమునందే యుండఁగా నీ వొంటిగాఁడ వెట్లగుదువు? మరల హృదయమున దర్శనము చేయుదును—నాకుఁ బని యున్నది పోనిమ్ము

అని యాతఁ డక్కడనుండి వెడలిపోయెను. ఫల్గునుం డారాత్రి నిద్దురపోలేదని వేఱుగ వ్రాయవలయునా?

## 22. అంతకంటె నానంద మేమున్నది?

కృష్ణానది కుత్తరభాగమున సమరరంగమున కించుక పశ్చిమముగఁ గొలఁది దూరమునందున్న యొక పటకుటీరమునందు, ఒక యువతీమణియు నొక వృద్ధుండును మాటాడుకొనుచుండిరి.

"అమ్మా! మన సేనలకు రాయలసేనలు తోడుపడినవి. విజయము కలిగినది. శత్రువులు పాఱిపోయిరని తెలియవచ్చినది," అని వృద్ధుఁ డనియెను

యువతి సంతోషముతో "దాదా! భగవంతుఁడు మనయెడల

మన్నాఁడు కావుననే సమయమునకు రాయలసైన్యము కలిసి కొన్నగి,'' అనియెను

''అవును విజయము లభించినది—గోపాలరాయలకు రాజ పరమేశ్వరుని మైత్రి యలవడినది—కొలఁది దినములలో నీ విప్లవము చల్లారఁగలదు అమ్మా! మన కష్టదినములు గడచిపోయినవి ఇఁక నీ కళ్యాణశుభదినమున కెదురు చూచుచున్నాను. నాకున్న కోరిక యిది యొక్కటియే,'' అనియెను

ఆమె సిగ్గుతో నించుక తలవంచుకొని, ''కమలసంగతి యేమైనఁ దెలియవచ్చినదేమో?' అనియెను

' రాయ లుదయగిరి దుర్గమును బట్టుకొనియెనుగదా! దయామయుండగు నాతఁడు కమలను సంరక్షించియే యుండును. విజయోత్సాహులై వచ్చి రాజశేఖర గోపాలురి శుభవార్తను మనకుం దెలుపఁగలరు ''

"ఆ శుభసమాచారము,వినుటకు నా హృదయము వేగిరపడుచున్నది,''

ఈ విధముగా నింక నేమేమియో వారు సంభాషించుకొనుచుండిరి

ఆ యువతీమణి సలిల. ఆ వృద్ధుఁ డామె పితామహుఁడు. నిడుఁద్రోలు దుర్గమునందలి నిర్బంధమునుండి తప్పించినది మొదలు సలిల వనదుర్గమునందే రాజశేఖరగోపాలుర సంరక్షణములో నుండెను. ప్రతాపశాలియు, జీవదయాపరుండునుఁ సుగుణగుణాలంకార విలసితుండును, తరుణ సుందరమూర్తియు, నుత్తమ క్షత్రియవంశ సంభూతుండును, విశేషించి తనకుఁ బ్రాణసంరక్షకుండునునగు గోపాలరాయని యెడల నామెకుఁ బ్రథమ సమావేశసమయము నుండియు నన్రాగ ముదయించి క్రమముగా వృద్ధియగుచుండెను గోపాలునకుఁ గూడ నట్లే యా రమణీమణియందుఁ బ్రేమ యుదయించెను, పరేంగితజ్ఞానధురీణుండగు రాజశేఖరుఁ డా యిరువురి హృదయభావములను గ్రహించి యానందించుచుండెను.

క్రమముగా నా రమణీమణి సుగుణమణియే కాక, అభిజాత్య సంపన్న యని కూడ రాజశేఖరుఁడు తెలిసికొనియెను. కొలఁది దినములలో వాామె పితామహుఁడు వారల నావన దుర్గమునఁ గలిసికొనియెను. అతఁడుత్తర హిందూస్థానమునం దొక మండలమునకు ప్రభువుగా నుండెను, ఆఫ్గనుల కల్లోలములో నాతని తనయుఁడు వీరస్వర్గ మునందుటచే రాజ్యము శత్రువులపాలై పోయెను. దారుణ పుత్రశోకమునఁ గుందుచు మాతా పితృవిహీన యగు నీ పౌత్రిని వెంటఁబెట్టుకొని శత్రువులకుఁ జిక్కకుఁడ గూఢముగ నీదేశమునకు వచ్చి కృష్ణా నదీతీరమునందలి యడవిపల్లెలోఁ దల దాఁచుకొని కాలము గడపుచుండెను.

కష్టజీవి యగు నా వృద్ధునకు నిక్కడఁగూడఁ గొన్నికష్టములు కలిగినవి, కాని యవి యాతని సుఖమునకే కారణములయ్యెను. రాజ్యము పోయి తలిదండ్రులను బోఁగొట్టుకొని కష్టములపాలై యజ్ఞాతవాసము చేయుచు నిడుమలఁబడుచున్న యాగర్భ శ్రీమతి యగు సఖిలను గోపాలునివంటి సుక్షత్రియ వీరాగ్రేసరుఁడు ప్రేమించుచుండెనని వినుటకంటె నాతని కేమి కావలయును? అంతకంటె సుఖమేమున్నది? అంతకంటె నానంద మేమున్నది?

# 23. కొండవీటి విజయము

మహామంత్రి తిమ్మరుసు కొండవీటి దుర్గమును ముట్టడించుట వదలి సేనలతో వెడలిపోయెను దుర్గములోని వారికి వేగునడచుట లేదు. అందుచే వెలుపలి సంగతు లేవియును వారికిఁ దెలియుటలేదు. బహుళ సేనా పరివృతుఁడై యుత్కలేశ్వరుఁడు తనకు సాహాయ్యము చేయుటకై వచ్చుచున్నట్లును అతని నడ్డగించుటకు రాయలు తనయనంత సేనలతోఁ బోయినట్లును మాత్రముదుర్గములోని వారికిఁ దెలియును. అందుచే వారుత్కలేశ్వరుని సంరంభమున కోపఁజాలక యున్న రాయలకు సాహాయ్యము చేయుటకై తిమ్మరు సీముట్టడిని విడిపోయెనని నిశ్చయించుకొనిరి. కాని, శత్రుదృష్టిలో నున్నంత వఱకు జాగరూకతతో దుర్గమును సంరక్షించుకొనుట విధాయక

కృత్యము గావున దుర్గద్వారములను దెరవకుండ నట్లే యుంచిరి ఈవఱకే ఓడి గియున్న రాయల సేన మరల దమదుర్గమును ముట్టించుటకు వచ్చు నను ఉద్దేశము వారి కంత దృఢముగాలేదు. అయినను గొంతవఱకు జాగరూకత తోడనే యుండిరి

రాత్రి రెండుజాములైనది ఆకాశము మేఘావృతమై యుండుటచే వెన్నెల కాంతు లంత స్పష్టముగా నగపడుట లేదు కొండవీటి దుర్గమున కవ్వలి భాగమునుండి మధుకోశమునందలి తేనెటీ గల రొదవలె నొకధ్వని చల్లగ వినవచ్చుచుండెను అది యా మబ్బుమీదినుండి వినవచ్చుచున్న వాయునిస్వనమై యుండును. ఆ యర్ధరాత్రివేళ నా మబ్బుపైనుండి వచ్చు చల్లనిగాలి ననుభవించుచు సుఖముగా నందఱు నిద్రించుచుండిరి. ఆ సమయమున దుర్గద్వార రక్షకులును యామికులును మాత్రము రాజాజ్ఞా నిర్వహణ క్షణంబున మేలుకొని యుండిరి కాని యా చల్లని సమయమున వారికిగూడ నిద్రాదేవత చల్లఁగ నూఁచుచునే యుండెను. క్రమముగా నానిస్వనము కొంచెమధికమై నీళ్ళపై నిసుక చల్లిన చప్పుడు ననుకరించుచుండెను, కొలది సేపటిలో నా వాయురవ మాఁగి పోయినది మూడవజాము గంట యింకను వినఁబడలేదు. ఆ చంద్రాస్తమయ సమయమున సాగర ఘోషమువలె దుర్గములో భయంకర ఘోషము వెలువడియెను. "శత్రువులు, శత్రువులు దుర్గపశ్చిమ ద్వారము తెఱవఁబడి పోయినది లెండు. ఆయుధములు సవరిఁచుకొనుఁడు, ఆ సేనల నడ్డుకొనుఁడు వైరులను దునుమాడుఁడు," అను ప్రబోధ స్వరము లెల్లెడల వినవచ్చుచుండెను,

తిమ్మరుసు సైన్యము రాయలకొఱకుఁ బోలేదు సంపూర్ణ విజయుఁడై యున్న రాయలకు వీరి సాహాయ్య మెందులకు? ఇది యంతయును సాహసతంత్ర కుశలుండగు మహామంత్రి తిమ్మరుసు చేసిన యింద్రజాలము. పోయినట్లుగనే పోయి శత్రువుల నేమఱించి యాయర్ధరాత్ర సమయమునఁ బశ్చిమ భాగముననున్న కందకమును గొంతవఱకుఁ బూడ్పించి లగ్గలు పట్టించెను. ఆ విధముగఁ గొందఱు మహాయోధులు ప్రాఁకిపోయి, లోనికి దుమికి యక్రమమున రక్షకభటులను దునుమాడి యా పార్శ్వద్వారమును దెఱచి వైచిరి.

ఆ ద్వారము వెంట తిమ్మరుసు తన సైన్యముతో నా దుర్గములోఁ బ్రవేశించెను ఆ కల్లోల సమయమున దుర్గములోని యోధులును దండనాయకులును లేచి సర్వసేనలకును నీ భయంకర వార్త నెఱింగించి రణసన్నద్ధులం జేయుటకు రణభేరీ ప్రయోగించుట కాజ్ఞ యొసంగిరి, ఆ సంరంభము నాలకించి యాయుధ సన్నద్ధులై పోయి కొందఱు శత్రువుల నడ్డుకొనుచుండిరి. కొందఱు వీరావేశమున నొడ లెఱుంగక నిరాయుధులై వచ్చి శాత్రవాఘాతములచేఁ బడి పోవుచుండిరి. కొంద ఱాశ్విక యోధులు తమ వారువంబులను మఱచి డాలుకత్తులతోడనే శత్రువులపై నుఱుకుచుండిరి. కొందఱు ఏవైపునకుఁ బోవలయునో తెలియక పరిభ్రమించు చుండిరి ఆకస్మికముగ నిద్రాభంగ మగుటచే ననేకులు దిగ్భ్రాంతు లగుచుండిరి.

అప్పుడు కసవాపాత్రుఁడు, వీరభద్ర గజపతి మొదలగు వీరాగ్రేసరు లందఱును సైనికుల నాదరను హెచ్చరించి సక్రమ సన్నద్ధులం జేసికొని, విక్రమాటోపంబులు మెఱయ, ధైర్యోత్సాహంబులు మొగంబులఁ దాండవించుచుండఁ ద్రోసికొని వచ్చుచున్న యరిసేనల నడ్డగించుచుండిరి.

తెల తెల వేగుచుండెను. అప్పటికప్పుడే కొన్ని గజయూధముల తోడను కొంత కాల్బలములతోడను మంత్రి తిమ్మరుసును, తన యాశ్విక సైన్యములతో మాధవుఁడును, మఱికొందఱు దండనాయకులును దుర్గమునఁ బ్రవేశించి యడ్డుకొని వచ్చుచున్న శత్రుసేనల నుఱుమాడుచు విజృంభించుచుండిరి అత్యౌద్ధత్యముతో తీవ్రవేగము నందోసి కొనివచ్చుచున్న మహామంత్రీశ్వర సేనా వాహినుల కడ్డుపడుచున్న గజపతి సేనాభూరుహపంక్తు లూఁగిపోవు చుండెను. కొందఱు శత్రుసైనికులా వాహినిలో నంతరించిపోవుచుండిరి. కొందఱందుఁబడి కొట్టుకొని పోవుచుండిరి, కొందఱు ధైర్యముతో నెదురు నిలిచి యూఁగిపోవుచుండిరి. క్రమముగా నా వాహిని యుప్పొంగి పార్శ్వప్రదేశములనుగూడ ముంచివేయుచుండెను, ఒడ్డువిఱుచుకొని సహస్రముఖ ములఁ బ్రవహించుచుండెను.

ఆ సమయమున శత్రువిజృంభణమును సహింపఁ జాలక

దుస్సహప్రతాపశాలి యగు వీరభద్రగజపతియు, కసవాపాత్రుఁడు, నరహరి దేవుఁడు, యల్లాఖానుఁడు, ఉద్దండఖానుఁడు, సుప్రపాల చంద్ర మహాపాత్రుఁడు, రాచిరాజు, లక్ష్మీపతిరాజు మొదలగు యోధాగ్రేసరు లందఱును చెలరేఁగి యాశత్రువాహిని నింక నొక యడుగైన ముందఱికిఁ గదలకుండ నాఁపి యెదురించి పోరాడు చుండిరి.

పరిభవక్రోధాన లోద్దీప్తుండగు మాధవుఁడు తన యశ్వసైన్య ముతో వీరభద్రగజపతి నెదిరించి యాతని సేనల జెల్లాచెదరుగఁ జేసివైచుచుండెను. గజాయుధములతో విజృంభించుచున్న తిమ్మరుసును కసవాపాత్రుఁడు, ఉద్దండఖానుఁడు మొదలగు దండనాయకులు తలపడి ఘోరముగఁ బోరుచుండిరి. ఆ సమయమునఁ దిమ్మరుసు సేనలో ముందున్న సైన్యము చొఱుచుకొని పోవుటకుఁగాని, వెనుక నున్న వారు లోపలఁ బ్రవేశించుటకుఁ గాని వలను గాకుండ నా ప్రదేశ మంతయుఁ గిక్కిఱిసిపోయెను. శత్రుసైన్యము వారల నెది రించి ముందఱి కదిమికొని పోవుచుండెను.

జాము ప్రొద్దెక్కెను. ఆ సమయమున విజయభేరీధ్వనులతో భయంకరాట్టహాసములతో ననంతసేనా పరివృతుఁడైన శ్రీకృష్ణదేవ మహారాయలు వచ్చి వారిని గలిసికొనియెను. ఆ ఉత్సాహముచే దుర్గములో ముందుగ నున్న సైన్యమును ద్వారమునందున్న సైన్య మునుగూడ నొక్కమాఱుగ సముద్రతరంగముల వలె నుప్పొంగి శత్రువులను ముందఱికి జాలదూరమువఱకును గెంటుకొనిపోయెను ఆ సంరంభమున కోపక గజపతి సైన్యములు చెదరిపోవుటచే రాయల యోధులా యవకాశమున నలు మొగంబుల వ్యాపించి విక్రమ విహారము చేయనారంభించిరి. మరల రెండు దుర్గద్వారములు తెఱచి వేయఁబడియెను. ఆ వివృత ద్వారముల కడఁ గాచికొనియున్న రాయల తక్కిన సేనావాహినులొక్క మాఱుగ దుర్గములోఁ బ్రవే శించి శత్రువులఁ జుట్టుముట్టివైచెను.

అప్పుడు దుర్గముఖ ద్వారమునుండి విజయ సంరంభంతోఁ గాలాగ్ని రుద్రునింబోలి శ్వేతాశ్వము నధిరోహించి వచ్చుచున్న

శ్రీకృష్ణరాయలను గొండను దాఁకు గొఱ్ఱెవిధంబునఁ గసవాపాత్రుఁ డెదురుకొనియెను. విజయోగ్రమూర్తి యగు నారాయలు తీవ్ర క్రోధముతోఁ దనవిశిత చంద్రహాసముచే నొక్కవ్రేటున కాపాత్రుని తల నా దుర్గద్వారమునకు బలిచేసివైచెను తోడనే తల తెగిపడిన యాతని మొండెమువలె నాతని సైన్యమంతయుఁ దూలిపోయెను. రాయల చుట్టునున్న సైన్యమునందు విజయకోలాహల ధ్వనులు మిన్ను ముట్టెను. ఆ విజయారావముల నాలకించి రాయల యితరసేన లన్నియు నువ్వెత్తుగ నందుఁ బ్రవేశించి శత్రువుల మర్దించుచుఁ ద్రోసి కొని పోవుచుండెను

ఒక ప్రధాన దండనాయకుఁడు మడియుటచేతను, రాయల సేన లత్యుత్సాహముతో నలుకెలంకులఁ జుట్టుముట్టి విజృంభించు చుండుటచే తమ గజపతియోధు లందఱును బ్రాణములపై నాశ వదలి శత్రువుల మార్కొని కసిమసంగుచుండిరి ఆ సమయమున వీరభద్రగజపతి మాధవునిఁ దప్పించుకొని రాయల విజృంభణము నడఁగింపవలయునని క్రోధోద్రిక్త హృదయముతో వచ్చుచుండెను. మాధవుఁ డెదిరించిన సేనల నుఱుమాడుకొనుచు నాతని వెంబ డించియే వచ్చుచుండెను

ఒకవంకఁ దిమ్మరుసు బుక్కరాజు, నిర్వాణప్పనాయకుఁడు మొదలగు యోధులం గలసి, ఉద్దండఖానుఁడు, యల్లాఖానుఁడు, రాచిరాజు మొదలగువారిని మార్కొని, వారితో నెక్కటికయ్య బు సలుపుచుండెను.

అప్పటి కా దుర్గమంతయు తెగిపడిన శిరంబులతోడను, కూలిన గుఱ్ఱంబులతోడను, కుంగుడుపడిన కుంజరంబులతోడను, ఖండింపఁ బడిన మొండెంబులతోడను, వెలికివేయఁబడిన ప్రేగులతోడను, తెగిపడిన కరంబులతోడను, నలినలియైన సకలాంగకములతోడను, మేదోమాంసపంకిలంబులగు నెత్తురుమడుఁగులతోడను, నిండి యతి భీభత్సముగ, నతి దారుణంబుగఁ గానవచ్చుచుండెను, ఆ మహారణ సమయమున మహాప్రళయ సమయమునందుఁబోలె నిరువాగు లందును లెక్కలేని యోధుల ప్రాణవాయువులా యనంతవాయు సముద్రమున నంతర్హితములై పోవుచుండెను

యోధులను యోధులును అశ్వికులును అశ్వికులును, గజంబులును గజంబులను నెదురుకొని పరస్పర విజయాకాంక్షలతోఁ బోరుచున్న యా పోరాటము చూచితీరవలసినదే కాని, వ్రాసి యెట్లు చెప్పగలము?

ఆ సరిపోరాటంబులఁ దలమిగిలి మహామంత్రి యగు తిమ్మరుసు యల్లాఖానుఁడు, ఉద్దండఖానుఁడు ననుయవన దండనాయకుల నొట్టి బంధించివైచెను. అప్పు డా ప్రక్కనున్న గజపతిసేన యంతయు వెఱచఱచి పరువిడ నారంభించెను. వారలను నిర్వాణప్పనాయకుఁడును బుక్కరాజును దఱిమితఱిమి కొట్టుచుండిరి. ఎల్లయెడల రాయల యోధుల సింహానాదములే వినవచ్చుచుండెను.

ఆ యవమానశల్యమును సహింపఁజాలక వీరభద్రగజపతి యాగ్రహోదగ్రుఁడై యాఁకలిగొన్న బెబ్బులివలె నొక్కదాఁటున వచ్చి యావలకే నరహరిదేవునితోఁ బోరాడుచున్న మహారాజ కంఠీరవుఁడగు శ్రీకృష్ణదేవరాయని నాకస్మికముగ వెనుకపాటునం దాఁకి యాతని తల నఱకుటకై తన నిశితకరవాలమును పైకెత్తెను. రాయలు వెనుదిరిగి చూచెను ఆ నిమిషముననే వీరభద్రగజపతి చేతి యందున్న కరవాలము తుత్తునియలై క్రిందఁ బడిపోయెను. ''ఆ కృపాణమును ఖండించిన యా వీరాగ్రేసరుఁ డెవ్వఁడు?'' అని రాయ లనుకొనుచుఁ దత్క్షణమే వెనుక విసరున వీరభద్రగజపతిని ఖండించివైచుటకు సిద్ధముగ నుండెను వీరభద్రగజపతి వెనుక నున్న యా యపరిచిత పురుషుఁడు గజపతి చేతి యందున్న నిశితభల్లము నూడఁబెఱికికొనియెను, ఇంతలోఁ బ్రక్కనుండి శరవేగమున వచ్చి మాధవుఁడు గజపతిపై కుఱికి నిరాయుధుండగు నాతని బంధించి వైచెను.

ఆ సమయముననే కృష్ణరాయల యా రక్షక సైన్యముతోఁ బోరాడుచున్న నరహరిదేవునిఁ గొండారెడ్డి యక్రమమున బట్టుకొనియెను ఆ సమయమున విజయభేరీధ్వనులు రాయల సేనారంగమున దశదిశల బధిరీకృతముగఁ జేసివైచుచుండెను. సింహనాదములు చెలరేఁగుచుండెను, విజయోత్సాహముతో రాయల

సైన్యమంతయు విజృంభించిపోవుచుండెను దుర్గేశ్వరుఁడు దొరికి పోయెననుసుత్సాహముతోడను, భయముతోడను బలుచవాలిన శత్రుసైన్యము చెల్లాచెదరుగఁ బాఱిపోవుచుండెను ఆ రణసంరంభమున నితర దండనాయకు లందఱును బట్టువడిపోయిరి

గజపతి కరవాలమును దుత్తునియలుగఁ జేసి నిశితభల్లము నూడఁబెఱికికొని, నగుమొగముతో సేనామధ్యమునం బడి తప్పించుకొనిపోవుచున్న యా యపరిచిత పురుషుని రాజపరమేశ్వరుని లీలామాత్రం బగు నయన సంజ్ఞనుబట్టియే తిమ్మరుసు వచ్చి నిలిపివైచి "నీ వెవ్వరు?" అనియెను

"నేను రాజభక్తుఁడను."

"అట్లయినచో రాజాజ్ఞ యగున తవఱకు మా శిబిరమునం దుండవలయును."

"మహాప్రసాదము"

"నీ పేరెవ్వరు?"

"ప్రసాదరాయలు"

'ఇక్కడ కెందుకొఱకు వచ్చితివి?"

"ఒక యుద్యోగమునకై వచ్చితిని."

శత్రుదండనాయకులు పట్టువడిపోయిరి, మహారణము చల్లారినది. హతశేషు లనుగ్రహింపఁబడిరి. శత్రుదుర్భేదమై, దుర్గమమై యున్న యా కొండవీటిదుర్గ మసాధారణ మేధానిధి యగు మహామంత్రి బుద్ధిబలమున రాయల వశమైపోయెను. ప్రభుభక్తిపరాయణుండును నసహాయశూరుండును నగు మాధవుని విక్రమకౌశలంబునఁ బరాక్రమనిధి యగు వీరభద్రగజపతి పట్టువడిపోయెను. మాధవునకు దొరికిపోవుట వీరభద్రగజపతికిఁ దలగొట్టివైచినట్లుండెను సాయంకాలమైనది.

అప్పుడు మహీమండలాఖండలుం డగు శ్రీకృష్ణదేవరాయ లత్యుత్సాహముతో "కొండవీటి విజయమైనది," అనియెను

# 24. ఇఁక నేమున్నది?

కొండవీటి విజయము సంపూర్ణమయ్యెను. వీరభద్రగజపతితో ముఖ్య దండనాయకు లందఱును బందీకృతులైరి. ఆ సంకులసమర

మున రాయల సైన్యమును దప్పించుకొని పూసపాటి రాచిరాజొక్కడతో పాఱిపోయెను. ఆ మఱునాఁటి యుదయమున శ్రీ వీర ప్రతాప రాజకంఠీరవుం డగు శ్రీకృష్ణరాయదేవేంద్రుఁడు మహా వైభవముతోఁ జేరోలగమున సింహాసనాసీను డై సామంత రాజ వీరులను, ప్రభుభక్తిపరాయణు లగు దండనాయకులను, దగినరీతి బహుమానపురస్సర వచనములఁ బ్రహృష్టాంతరంగులం గావించి, వారివారికిఁ దగినట్లుగ నమూల్యాభరణములను, గ్రామములను, బిరుదుపతకములను, ధనరాసులను పారితోషికములుగా నొసంగు చుండెను ఉత్కలేశ్వరునికడఁ గొల్ల పెట్టిన ధనమంతయును సేనలకుఁ బంచియిచ్చున ట్లుత్తరువు గావించెను. ఆ కొండవీటి దుర్గమున మహా మంత్రి తిమ్మరుసు జయించినట్లుగ నొక శాసనము నెలకొల్పున ట్లుత్తరువు గావింపఁబడియెను

నాఁటి సభయంతయు నత్యుత్సాహవిలసితమై యుండెను. పుర ప్రముఖులుగూడ నా సభ నలంకరించియుండిరి వారు రాయల యౌదార్య గుణగణంబులను, ఆశ్రితపక్షపాతంబును. శాంతగంభీర స్వభావంబును, రాయల యెడల సామంతాదివీరులకుఁ గల భక్తి భావంబును, వారి యెడల రాయలకుంగల యాదరభావమును గాంచి. "ధర్మప్రభుత్వ మనిన నిట్లుండవలయును." అని యైక కంఠ్యముగ నా రాజదేవేంద్రునిం బొగడుచుండిరి. రాయలు పౌరులస్వాస్థ్యముల కేమియును నపాయము కలుగకుండ నీ వఱకే యుత్తరువులు గావించి, వారి నందఱినిఁ దన ప్రజలుగా గౌరవించి, యా పురప్రముఖులకుఁగూడ సభాప్రవేశమున కవకాశ మొసం గెను ఆ రాయల దయార్ద్రహృదయమున కా పౌరులందఱును నాతని వేనోళ్ళఁ బొగడుచుండిరి. సామంతరాజులకును సకల దండ నాధులకును పారితోషికముల నిచ్చినపిదప, నిన్నటి మహా యుద్ధ మున రాయల కపాయము రాకుండఁ దప్పించిన యా ప్రసాద రాయలును దుర్గాధ్యక్షుఁడగు వీరభద్రగజపతిం బట్టుకొనిన మాధవ రాయలును. మంత్రియాజ్ఞచే సార్వభౌమునిసమ్ముఖమునకుఁ గొని రాఁబడిరి. వారిరువురును శ్రీరాజపరమేశ్వరునకు వందనము లాచ రించి యెదుట నిలువఁబడియుండిరి

అప్పుడు రాయలు ప్రసన్నవదనముతో వారలం గాంచి, "మీ ప్రభుభక్తి విశ్వాసములు పరమానందదాయకములై యున్నవి. ఆ సంకుల సమరమున — నపాయకరంబగు నా సమయమున - మీ విక్రమకౌశలములం జూపి, మాకు భద్రముం గూర్చియుంటిరి. మీ రాజభక్తి పరాయణత శ్లాఘ్యతమమైనది. అందులకుఁ దగినట్లు మీ యభీప్సితముల నెఱవేర్చుటయే మాకుఁ బరమానందము మీ కోరికల నెఱింగించెదరుగాక!" అనియెను.

అప్పుడు ప్రసాదరాయలు చేతులు జోడించుకొని, "ఓ మహారాజాధిరాజా! దేవరదయారస శీతలకటాక్షావలోకనంబులకంటె నింక నాకుఁ గావలసిన దేమున్నది? అయినను నేలిక యీ భృత్యుని కోరికం దీర్ప నను గ్రహించియున్నప్పుడు వల దనుట యుచితము గాదు. నా మనవి చిత్తగించి, నా యెడల దయయుంచి, యేలినవారి యంతఃపురమున నున్న వసంతవాడ దుర్గేశ్వరి యగు కమలను నాకుఁ బ్రసాదింపవలయును" అని విన్నవించుకొనియెను.

రాజపరమేశ్వరుఁ డేమియును మాటాడలేదు. సభాసదులందఱు నాశ్చర్యముతో నా పురుషునివంకనే చూచుచుండిరి ప్రక్కను నిలువఁబడియున్న మాధవుని హృదయమునఁ బిడుగుపడినట్లయ్యెను. కొన్ని నిముషములవఱకు నిశ్చేష్టుఁడై యుండెను, క్రమముగా నాతని హృదయమున ననేక భావము లుదయించెను. అవి యన్నియు నాతని ముఖమునఁ బ్రదర్శితము లగుచుండెను. ఆ భావోద్రేకముచే, నాతని సకలాంగకములును గంపించిపోవుచుండెను, అప్పు డాతఁడు తన మనంబున "నేను కోరుట కింక నేమున్నది? ఇంక నేమున్నది? అని యనుకొనుచుండెను.

ఊహ వచ్చిన దాదిగ నే కమలయెడల నుదయించిన తన ప్రేమానుబంధము దృఢపడియుండెనో ఆ కమల యిప్పు డాతనిది కాకుండఁ బోవుచున్నది ఏ కమల తనకు లభియించు నను నాశచే నెంతటి కష్టముల కైన నోర్చుకొనియుండెనో, ఆ కమల యిప్పు డాతనిది కాకుండఁ బోవుచున్నది! అనిత్యమగు నీ లోకమున—దుఃఖమయంబగు లోకమున—ఏకమల నిత్యానందస్వరూపిణి యని

భావించుకొనుచుండెనో, ఆ కమల యిప్పు డాతనిది కాకుండఁబోవు చున్నది! పగలును రేయును, జాగరమునను స్వప్నమునను, లోపలను వెలుపలను, నెల్ల యెడలను గూడ నిరంతర మే కమల దన మనోనయనముల సాక్షాత్కరించుటచేఁ బ్రాణములు నిలిచియున్నవో ఆ కమల యిప్పు డాతనిది కాకుండఁబోవుచున్నది! హృదయమునకు హృదయమై, ప్రాణమునకుఁ బ్రాణమై, ప్రేమమునకుఁ బ్రేమమై, ఏ కమల యాతనికి సర్వమును దానై యుండెనో, ఆ కమల యిప్పు డాతనిది కాకుండఁబోవుచున్నది! ఆతనికిఁ గోరుకొనుట కిఁక నేమున్నది?—ఇఁక నేమున్నది? మాధవుఁడు విభ్రాంతుఁడై పోయెను,

ప్రసాదరాయలు సార్వభౌమునివంక ననిమిషనయనుఁడై చూచుచు నిలువఁబడియుండెను.

అప్పుడు రాయ లించుక యాలోచించి, "ఇతరుల కన్యకను నీ కీయవచ్చునా?" అనియెను.

"ఆమె యేలినవారి యధీనమునందే యున్నది"

"ఇందుల కామె యంగీకరింప వలదా?"

"ఆమె తప్పక యంగీకరింపఁగలదు"

మాధవుని గుండె గుభిల్లు మనియెను.

అప్పుడు రాయలు మరలఁ గొంతసేపాలోచించి తిమ్మరుసు వంకఁ జూచెను తిమ్మరుసు "ప్రసాదరాయా! అట్లయినచో నామెను నీ కిచ్చుట కెట్టి యభ్యంతరమును లేదు. ఆ విషయమై తెలిసికొనిన పిమ్మటఁ బర్యవసానము నీకుఁ దెలుపఁబడును రాజపరమేశ్వరుఁడు నీ ప్రభుభక్తికి మెచ్చి నీకుఁ దన యంగరక్షకసైన్యమునం దుద్యోగము ననుగ్రహించియున్నాఁడు" అనియెను.

ప్రసాదరాయలు సంతోషముతో, "మహాప్రసాదము." అని యెను,

మిన్ను విఱిగి మీఁదఁ బడినట్లున్న మాధవుఁ డప్పు డేమియును గోరుకొనలేదు

"నిస్తంద్ర ప్రతిభా! సుధీమత! దిశోసీన్మలద్యశశ్శ్రీవధూ
హస్తాగ్రామలకాయమానమహనీ యాంభోజగర్భాండ! సై
న్యస్తోమోగ్రరజో ప్రజస్థగితకృ ష్ణా గౌతమీమధ్యభూ
మ్యస్తోకోత్కలరాట్పురీహరణలీ లావార్య శౌర్యోదయా!"

అను వందిమాగధుల కైవారములతో నాఁటికి సభ ముగింపఁ బడి యెను—

"మొగ్గ వికసించి వలపిఁపఁ బూచె ననుచుఁ
బల్లవము వెల్లనై నల్ల బడఁగనేల?
తేఁటి విరిదేనియం గ్రోలి త్రోటిపుటముఁ
దుడిచికొనునప్పు డైన సంతోషపడదె?"

అను పద్యమును మెల్లగఁ జదువుకొనుచుఁ బ్రసాదరాయ లటనుండి వెడలిపోవుచుండెను. ఆతఁ డట్లు పాడుకొనుచు నుత్సాహముతోఁ బోవుట మాధవునకుఁ గష్టముగా నున్న దా యేమి?

# 25. కమల యెట్లున్నదో!

రాయలు విశ్రాంతికొఱకుఁ గొన్ని దినము లీ దుర్గముననే సేనలతో విడిసియుండెను ప్రసాదరాయ లంగరక్షకసైన్యమునఁ జేరి రాయలకు మెచ్చువచ్చునట్టుగఁ బని చేయుచుండెను రాయల మనసు వచ్చునట్లు సంచరించుచుండెను అతిమధురంబులగు నాతని వినయ సంభాషణంబులును, నిత్యసంతోష సూచకంబగు నాతని ముఖ విలాసంబును, తన హృదయము నెఱింగి కనుసన్నలను మెలంగుచున్న యాతని చుఱుకుఁదనంబును, రాయల హృదయము నాకర్షించుచుండెను రాయలు ప్రత్యహమును వినోదముకొఱ కాతనితోఁ జాలసేపు ముచ్చటించుచుండెను ప్రభుభక్తి తత్పరుండగు నా ప్రసాదరాయలకు నెదుటివారి హృదయరంజకముగ నుండునట్లు మాటాడు నేర్పు గలదు. సమయము నెఱింగి ప్రభువుల నెట్లు సేవింపవలయునో యాతనికిఁ దెలిసిన ట్లెవ్వరికిని దెలియదు. అందువలన నాతఁ డచిరకాలముననే 'రాయల యనుగ్రహమును సంపాదించికొనియెను. కాని యాతని కోరిక యింకను నెఱవేర్పఁ బడలేదు. కమలను గూర్చిన విచారణ మింకను జరుపఁబడి యుండ లేదు.

రాయలు తన సేనావారము విడిసియుండుటకుఁ దగిన తావుల నేర్పాటు చేయించెను. దండనాయకులు, సామంతులు, మొదలగు వారల కా దుర్గమునందలి కొన్ని రాజభవనములును, పటకుటీరములును నొసంగఁబడియెను ఇతర దండనాయకులతో పాటు మాధవుఁడును ప్రతి దినమును రాజసందర్శనముం గావించుకొనుచు వచ్చుచునే యుండెను. ఆతని మనసు మనసులో లేదు. ఆతని కీలోకమంతయు వికారముగ నగపడుచుండెను ఆతని హృదయమున నిరాశ యావరించుకొనుచుండెను ఆశ వీడిపోవుటలేదు. కన్నులు చీఁకటులు క్రమ్ముచుండెను. హృదయ నయనములకుఁ గమల యగుపడుట మానుటలేదు. "ఆమె తప్పక యంగీకరింపఁగలదు." అను వాక్య మాతని హృదయ కుహరమునఁ బ్రతిధ్వనించుచుఁ బగులఁ గొట్టివైచుచుండెను. "కమల యందుల కంగీకరించునా! చిన్నతనము నుండియు నన్నే ప్రేమించియున్న కమల—ఆటపాటలలోఁగూడ నేనే లోకముగ నెంచుకొనుచున్న కమల—నా కొఱకే కష్టములను సహించి జీవించియున్న కమల—నాకై వెదకుకొనుచున్న కమల—ఆనాఁటి రాత్రి యుదయగిరి దుర్గమున నా కంఠస్వర శ్రవణమాత్రమున నానందోద్రిక్తయై "హా! హృదయేశ్వరా!" యని వచ్చి నా కౌఁగిట సుఖపరవశయైపోయిన కమల—ఇందుల కంగీకరించునా? ఏమి నా వెఱ్ఱి! అట్లు కాకున్నచో సార్వభౌమసమ్ముఖమున నాతఁడంతటి ధైర్యముతో నెందులకుఁ జెప్పియుండును? ఏమో—స్త్రీల హృదయములు క్షణచంచలము లని పెద్దలు చెప్పుదురు—ఏమో—అవి యెప్పు డెట్లు మాఱునో యెవ్వ రెఱుంగుదురు?—కాని—కమలను—నా కమలను—అతిలోక సాధారణ పవిత్ర గుణగణ విరాజమాన యగు నా కమలను—లోకముతోపాటుగఁ బరిగణించుకొనవచ్చునా? ఏమో కాని నా హృదయ మందుల కంగీకరించుటలేదు. కాని, యాతని మాట మాత్రము వేధించుచున్నది—అతఁడెవ్వఁడు చెపుమా? ఆతఁడు కమల నీవఱ కెఱిఁగియుండునా?—ఎఱుఁగకున్న నెందులకుఁ గోరును?—ఏ కష్టసమయమునసైన నామె నతఁడు చూచియుండునా? అప్పు డామె హృదయ మేమైన మాఱి

యుండునా?—లేదు — ఆమె హృదయ మట్టిది కాదు—అట్టిది కాదు, కానిచో నాతఁ డక్లెందుల కడుగును?—ఇది యంతయు మాయగా నున్నది—రాయలసభలో నీ విషయమున విచారణ మింకను జరుగుటలేదు—ఈ వఱకు జరిగియేయున్నచో నా కీ యాస లేకుండఁబోవునుగదా! నా యాశ వదలిపోవునుగదా!—హా! భగవానుఁడా! న న్నేమి చేయ నున్నాఁడవు? ఈ ప్రేమాగాధ సాగరమున నన్నుఁ దేల్పఁదలఁచితివా? ముంపఁదలఁచితివా? ఈ యాతన నెందుల కనుభవింపఁజేసెదవు?—హృదయమా! ఆ యాస వదలుకొనుము! ఇఁక నీ యాతనతోఁ బని యేమున్నది?

ఆశ వదలిపోవుట యెట్లు?—ఆ దినమున నాతఁడు చదివిన పద్య మెక్కడనో వినినట్లున్నది—కాదు, కాదు. మతి చెదరిపోవుచున్నది. నేను రచియించినట్లే యున్నది—అవును—నేను రచించినదియే, అది నా హృదయమునకుఁ దక్క మఱియెవ్వరికిని దెలియదు— దాని నెవ్వరును జదువలేదు—ఏకాంతముగ నేనే చదువుకొనినట్లున్నది వరాకుగ నా పత్రము నప్పుడు పాఱవైచితిని అది యీతని కెట్లు దొరికినది?—కమల యీతని కిచ్చియుండునా?—ఇఁక నేమున్నది? ఇఁక నెందుల కీ యాశ? ఈ తథ్యమిథ్యావాద మింకెందులకు? ఈ వృథాపమాలోచనమిం కెందులకు? ఈ దుఃఖమయ ప్రాపంచక సంబంధ మిం కెందులకు? ఈ నిరర్థకజీవిత మిం కెందులకు?" అని యనేకవిధంబులఁ బరితాపతప్త హృదయముతో మాధవుఁడు తల్లడిల్లిపోవుచుండెను!

కమల యెట్లున్నదో?

# 26. శ్యామల యీ దుర్గముననే చంపఁబడినది కాదా?

ఉత్కలేశ్వరుఁడు సేనాసహితముగ గోదావరి నదిని గూడ దాఁటి మరల రాకుండఁబోవుటచే, నాతని కొఱకుఁ గృష్ణాతీరమునఁ గాచికొని యున్న సేనలన్నియును గొండవీడు వచ్చి చేరికొనియెను.

వారితోఁ గలసి రాజశేఖర గోపాలురుగూడఁ దమ పరివారముతో వచ్చియుండిరి రాజశేఖరగోపాలు రిరువురును సందర్శించి యాతనిచే గౌరవింపఁబడిరి. రాజపరమేశ్వరుని యాజ్ఞచే వారి పరివారమునకును సేనలకును నుచిత స్థలంబు లొసంగఁబడియెను నలిలను నామె పితామహులు దమ శిబిరమునం దుంచి రాజశేఖరగోపాలురు మాధవునిఁ జూడఁబోయిరి. చిరకాలమునకుం గలిసికొనిన యా యాప్త బంధువులు తమ తమ కష్టసుఖములం గూర్చియు, నవ్వుడు క్రొత్తగ వారికి సంభవించిన యా యాకస్మిక విప్లవముంగూర్చియు. సంభాషించుకొనుచుండిరి.

రాత్రి రెండు జాము లయ్యెను అవి కృష్ణపక్షదినంబు లగుటచే నింకను జంద్రోదయము గాలేదు ఆకసమున మబ్బు గ్రమ్మియుండెను గాఢాంధకార మెల్లెడల నలముకొనియుండెను. అప్పుడప్పుడు మెఱపులు మెఱయుచుండెను కాని వర్షము కురియుట లేదు ఆ సమయమున రాయలస్కంధావారమునం దెల్లయెడల సైనికులు నిద్రించుచుండిరి వీధులవెంబడి వా రక్షకయోధు లచ్చటచ్చట సేనల కెట్టి యపాయిమును రాకుండఁ గాచికొని తిరుగుచుండిరి అప్పుడొక యోధుఁ డెక్కడకో యెందులకో యా శిబిరముల నడుమనుండి పోవుచుండెను ఆతఁడు ధరించిన యుడుపులం బట్టి చూడఁగా రక్షకయోధునివలె నగపడుచుండుట లేదు. ఆ యోధుని వెనుకఁ గొలఁదిదూరమునం దుండి మఱియొకపురుషుఁ డాతని వెన్నంటిపోవుచుండెను ముందటి యోధుఁ డాగినప్పుడు వెనుకనున్న పురుషుఁడుగూడ నాఁగిపోవుచుండెను. అతఁడు నడచిన నితఁడు నడచుచుండెను. ఒక్కొక్కప్పుడు వెనుక నున్న పురుషుఁడు చప్పుడు గాకుండ వడివడిగ నడచి ముందటి యోధుని సమీపించుచుండెను, అంతలో నే కారణముననో యాఁగి మరల నెడమైపోవుచుండెను మొదటి యోధునకు వెనుక దృష్టియే లేదు. ఆ యోధుఁడు క్రమముగా మాధవుని శిబిరము నొద్దకుఁ బోయెను ప్రక్క శిబిరముల నీడలనుండి యెవ్వరో వచ్చుచున్నట్లాతఁ డనుమానించి యక్కడ నాఁగిపోయెను

ఇంతలో వెనుకనుండి యెవ్వరో కత్తి దూసిన చప్పు డాతనికి వినవచ్చెను. ఆ యుత్తరక్షణముననే కుటీరపార్శ్వమున నున్న

యొక వ్యక్తి తటాలున వచ్చి ముందటి యోధుని నఱుకఁబోవు చున్న దురాత్ముని దన కరవాలముతో రెండు ఖండములుగ ఖండించివైచెను.

అప్పుడా మొదటి యోధుఁడు వెనుదిరిగి చూచెను. ఆ సమయమునకు సరిగ నాకాశమునుండి తళుక్కున నొక మెఱపు మెఱసెను. అప్పు డొక మూర్తి దివ్యమాల్యాంబరాభరణ విభూషితయై, రక్తాభిషిక్తంబగు దారుణకృపాణము దక్షిణహస్తమున మెఱయుచుండ, దుర్ముఖసంహారిణియగు దుర్గాదేవివలె లోకమోహన కారిణియగు మోహినీదేవివలె వీరశృంగారమూర్తియై నిలువఁబడి యున్న ట్లాతనికి విస్పష్టముగ నగపడియెను ఆ సమీపముననే తెగి పడిపోయిన తలయును మొండెమునుగూడ నగపడియెను

అప్పుడా యోధుఁ డాశ్చర్యముతో "ఈ చంపఁబడినవా రెవ్వరు?" అనియెను.

"నరహంతకుఁడు."

"నీ వెవ్వరు?"

"నేను క్షత్రియకన్యను."

"ఇక్కడ కెందులకు వచ్చితివి?"

"ఈ దురాత్ముని చంపుటకు"

"ఈతఁడు దురాత్ముఁ డని నీ కెట్లు తెలిసినది?"

"ఆతని చర్యలనుబట్టి యనుమానించితిని, తరువాతఁ బ్రత్యక్షమేయైనది"

"నీ వీతని నెక్కడనుండి చూచితివి?"

"పటకుటీరమునుండి"

"ఏ పటకుటీరమునుండి?"

"నా పటకుటీరమునుండియే."

"నీ కెక్కడిది?"

"నాకు రాయ లిచ్చినాఁడు?"

"నీ కెందుల కిచ్చినాఁడు?"

"నే నాతని యంగరక్షకుఁడను గావున"

"అంగరక్షకులలో నాఁడువాం డ్రెవ్వరును లేరే?"

"నే నున్నాను."

"నీ వాఁడు దానవు కాదా?"

"నిజమున కాఁడుదాననే. కాని, యంగరక్షకులలో మగ వాఁడను—"

"నీ మాట లింక యసంబద్ధములుగా నున్న వేమి?"

"అవును నేనొకప్పుడు పిచ్చిదానను లెంక"

'నీ కిన్ని వేషము లెందులకు?"

"నా కొఱకును, లోకముకొఱకును."

"లోకములో నెవ్వరి కొఱకు?"

"శ్యామల కొఱకు"

"శ్యామల యెవ్వరు?"

"నీలాద్రిరాజు తనయ"

"శ్యామల యీ దుర్గముననే చంపఁబడినది కాదా!"

"ఆమె యెక్కడఁ జంపఁబడును? ఆమె సార్వభౌమున కిల్లాలు కానై యున్నది"

లోపలఁ బరధ్యానమున నిదురపట్టక పరుండియున్న మాధవున కా కడపటి వాక్యములు చెవులఁబడుటచేఁ దటాలునఁ దన పట కుటీరద్వారమును దెఱచుకొని యీవలకు వచ్చెను. దీపపుఁగాంతు లెదుట నున్న వారిపైఁ బ్రసరించుచుండెను. మాధవుఁడు త్వరముతో వారిని సమీపించి యా స్త్రీమూర్తి నద్భుత నయనములతోఁ జూచి పట్టరాని సంతోషమున "శ్యామలా! శ్యామలా!" అనియెను. ఆ స్త్రీమూర్తి మాటాడలేదు ప్రసాదరాయని మూలమునఁ జెదరి పోయియున్న హృదయము గల మాధవున కా ప్రదర్శన మంతయు నప్పుడు స్వప్నముగాఁ దోఁచెను. అతని హృదయము మఱింత చెదరిపోయెను అప్పు డాతని కా యెదుట నున్న పురుషుఁడు ప్రసాదరాయనివలె నగపడియెను. అతని నోటినుండి "ప్రసాద రాయా!" అను వాక్యము అప్రయత్నముగ వెలువడియెను. పురుషుఁడును మాటాడలేదు, అప్పు డా స్త్రీమూర్తి కలకల నవ్వుచు "బావా! భయపడకుము. ప్రసాదరాయలు శ్యామలయైపోయి

నాఁడు. ఈ మహాపురుషుఁడు రాజరాజేంద్రుఁడు." అని యక్కడ నుండి చరచర వెడలిపోయెను.

రాజరాజేంద్రుఁ డగు శ్రీకృష్ణదేవరాయ లత్యద్భుతానంద రస నిమగ్నహృదయుఁడై మాధవుని వీడ్కొని శిబిరాభిముఖుఁడై వెడలిపోయెను. ఆ వెంటనే మాధవుఁడు రాజశేఖర గోపాలుర కీ వృత్తాంతమంతయు నెఱింగించి వారలను వెంటఁబెట్టుకొని ప్రసాద రాయని పటకుటీరమునకు బయలుదేఱిపోయెను మన మిఁకఁ బ్రసాదరాయని పటకుటీరమున కక్కఱలేదు శ్యామల పటకుటీరమే యందము వా రచ్చటికిఁ బోవునరికి శ్యామలయును శిశిరమణియును బరమానందముతో వారల నెదురుకొని లోనికిఁ దీసికొనిపోయిరి. అప్పుడు నా రొండొరులు తమ తమ వృత్తాంతములం దెలుపుకొని పరమేశ్వరానుగ్రహమునఁ గష్టములను బాసి యందఱు నొక్కచోఁ గలిసికొన్నందులకు మహానందమున నోలలాడుచుండిరి ఆ సంతోష సమయమునకు సరిగఁ బ్రతిహారిణీ పరివేష్టితమగు బంగరుపల్లకిపై నుండి కమల యక్కడకు వచ్చెను. అప్పుడు శ్యామలా శిశిరమణు లామెను గౌఁగిలించుకొని యానందబాష్పములతో నామెయంసాం శుకమును దడిపివైచిరి, ఒక నిమిషమువఱకును నెవ్వరును మాటాడ లేకుండఁబోయిరి. ఆ గాలివాన యించుక యడంగిన పిమ్మట, హృదయావేగ మించుక తగ్గినపిమ్మట వారందఱును లోపలకుఁ బోయిరి వా రు వసంతవాడ దుర్గమును వీడిపోయినది మొదలు నేఁటివఱకును గలిగిన కష్టములం గూర్చియుఁ, దిరిగిన దేశములం గూర్చియు, జేసినపనులంగూర్చియు మరల మరల ముచ్చటించు కొనుచు, నాయా భావముల ననుభవించుచు, నాఁటి తమ యదృష్ట మును బొగడుకొనుచుండిరి

ఈ విధి నొండొరుల్ తమ యభీప్సితసిద్ధికి మూలమైన ప్ర
స్తావ కథావిధాన మవధానము సేయుచు నద్భుత ప్రమో
దావిలచిత్తులై మెలఁగునంతఁ దదీయ విపక్వరఁ వరా
భావమువోలె రేచనఁ బ్రభాతము దోఁచె నతిప్రియంబుగన్

# 27. నీ కోరిక నెరవేర్పఁబడినది

సూర్యోదయమైన తోడనే రాజశేఖర మాధవగోపాలురుచిత వేషాలంకృతులై రాజసభామండపమునకుఁ బోయిరి. రాయలు మంత్రిసామంత పరివేష్టితుఁడై మహానందముతోఁ గొలువుదీర్చి యుండెను

అప్పుడు రాజశేఖరుండు లేచి ''మహారాజాధిరాజా! ఈ భృత్యుని విన్నపమును దయతో నాలకింపవలయును,' అనియెను.

రాయలు ప్రసన్నవదనముతో నాతనివంకఁ జూచెను. మహామంత్రియగు తిమ్మరుసు ''మనవి చేసుకొనవచ్చును," అని సెలవొసంగెను

అప్పు డుచితజ్ఞుఁడగు రాజశేఖరుఁడు మృదుమధుర గంభీర భాషణంబులతో, 'రాజపరమేశ్వరా! దేవర యవ్యాజవాత్సల్యమున మా రాజకుటుంబమంతయు సముద్ధరింపఁబడినది చిరకాలము నుండి రాజసేవ చేయుచు వృద్ధుఁడనై యున్న నే నిప్పుడు ధన్యుఁడనైతిని. మహాప్రభూ! నాదొక్క కోరిక మిగిలియున్నది. రాజభక్తియును, మా రాజకుటుంబమునందు నాకుఁ గల గౌరవాభిమానములు నన్నుఁ బ్రేరేపించుచుండుటచే నేలిక సమ్ముఖమున నా కోరికను విన్నవించుకొనుటకు సాహసించుచున్నాఁడను అభిజాత్య సంపన్నయు, గుణవతియు, రూపవతియు, శీలవతియునగు మా శ్యామలను దేవర దేవేరిగఁ బరిగ్రహింపవలయునని ప్రార్థించుచున్నాఁడను. మా మాధవరాయల కోర్కె గూడ నిదియే. సోదరుఁడగు గోపాలరాయ లామె నేలికకుఁ గానుకగ నర్పించుకొనుచున్నాఁడు,' అనియెను.

అతని సంభాషణము నాలకించుచున్న సభ్యుల హృదయము లానందరస పూరితములయ్యెను. శ్రీ రాజదేవేంద్రుని వదనమండలమున సుప్రసన్నభావ మగపడుచుండెను. అంతలో మంత్రి ఆనతిచే వీరభద్రగజపతి యచ్చటకు రావింపఁబడియెను.

అప్పుడు మహామంత్రి తిమ్మరుసు గజపతిం జూచి యొక పత్రము దీసి యాతనికిం జూపి, 'ఈ మరణశాసనము వసంతవాడ దుర్గేశ్వరుఁడగు నారాయణరాజు వ్రాయించినదేకదా!' అనియెను.

"వీరభద్రగజపతి దానిని జూచి "అవును" అనియెను

"ఈ మరణశాసనమునుబట్టి కమలతోఁగూడ వసంతవాడ దుర్గము మాధవునకుఁ జెందింపవలసియుండఁగా దీనిని నీలాద్రి రాజున కెందులకుఁ బంపివైచితిరి?"

"ఆతని తనయయగు శ్యామలను నా కిచ్చుటకును, ఆ దుర్గ మాతనికిఁ జెందించుటకును, మే మేర్పరచుకొనుటవలన నాతనికి నమ్మకముగా నుండుటకై దీని నిచ్చివైచితిని"

"శ్యామల మిమ్ముఁ బ్రేమించినదా?"

"లేదు. నే నామెను బ్రేమించితిని"

"ఆ ప్రకారము నీలాద్రిరాజు మీ కామె నిచ్చి పెండ్లి చేసెనా?"

"లేదు. ఆమె యంగీకరింపకుండుటచే బలవంతముగా నా యొద్దకుఁ బంపించివైచెను"

"తరువాత నేమైనది?"

"పిమ్మట నామె నాచే నిర్బంధింపఁబడి కోపముతో నన్ను నణి కినది. నేను మూర్ఛపడిపోయితిని, ఆ సమయమున నా ప్రతిహారిణులు వచ్చి యామెను జంపి కందకములోఁ బాఱవైచిరి"

అప్పుడు తిమ్మరుసు నానతిచే సభామండప పార్శ్వమున నున్న యొక వనమునుండి యొక యువతీమణి యక్కడ కొక ప్రతి హారిణిచేఁ దీసికొని రాఁబడియెను ఆమె మహారాజునకు వందనము చేసి తల వంచుకొని నిలువఁబడియెను.

అప్పుడు మంత్రిశేఖరుఁడు గజపతివంకఁ జూచి "ఈమె యెవ్వరు?" అనియెను

గజపతి యాశ్చర్యముతో నామెవంకఁ జూచుచు "నీలాద్రి రాజు తనయ యగు శ్యామల యీమెయే!" అనియెను

"మీ యొద్దకుఁ బంపఁబడి, మీచే నిర్బంధింపఁబడి మీ ప్రతి హారిణులచేఁ జంపఁబడిన శ్యామల యీమెయేనా?"

"అవును"

అప్పుడు ఫల్గునుఁడు పిలువఁబడియెను. ఆతఁడు వినయముతో నా సభామండపము నొద్దకు వచ్చి ముకుళితకరుఁడై నిలువఁబడి యెను

"నీవే దుర్గపటమును వ్రాసికొనుచున్న రాత్రి కందకములోఁ బడిన యొక యువతిని రక్షించితివి కాదా!"

"చిత్రము"

తిమ్మరు సక్కడ తలవంచుకొని నిలిచియున్న యా యువతి నాతనికిం జూపుచు "ఆమె యీ మె యే నా?" యనియెను.

ఫల్గునుఁ డానందవికసితనయనములతో నావంకఁ జూచుచు "అవును మహాప్రభూ," అనియెను

"ఈమె పేరు నీకుఁ దెలియునా?"

"తెలియును. ఈమె పేరు శిశిరమణి"

అప్పుడు గజపతి తెల్లఁబోయి మొగము వంచికొనియెను. శ్రీకృష్ణదేవమహారాయని వదనకమలమున నాశ్చర్యోల్లాసచిహ్నములు పొడసూపుచుండెను. ఆ సభాసదులందఱును వింతగాఁ జూచుచుండిరి.

మంత్రి తిమ్మరుసు నప్పుడొక చురియను దీసి "ఇది నీ కామె యొద్దనే దొరికినది కాదా?" అనియెను.

"అవును దానిపైఁ గూడ శిశిరమణి యను నీమె పేరు లిఖింపఁబడియున్నది."

అప్పుడు తిమ్మరుసు గజపతివంకఁ జూచి, "ఈమె శిశిరమణి యఁట నీలాద్రిరాజు నిన్ను మోసము చేసెనా యేమి?" అనియెను

"లేదు, నే నీమెనే ప్రేమించితిని నీలాద్రిరాజు కూఁతురు, శ్యామలగాని శిశిరమణి కాదు."

తిమ్మరుసప్పు డా యువతివంకఁ జూచి "అమ్మా! నీ పేరె వ్వరు?" అనియెను.

ఆ యువతి తలవంచుకొనియే మెల్లగ "శిశిరమణి" అనియెను.

గజపతి మఱింత యాశ్చర్యమును బొందెను

"నీవు నీలాద్రిరాజు తనయవు కావా?"

"కాదు. ఆమె దాది కూఁతురను"

"నీలాద్రిరాజు నిన్నీయన యొద్దకుఁ బంపినాఁడా?"

"లేదు ప్రాణసమానయగు నా చెలి శ్యామల యభిమాన గౌరవసంరక్షణంబునకును, ప్రాణప్రియయగు నాచెలి కమల ప్రాణ సంరక్షణంబునకును, వారికిఁ దెలియకుండ నేనే శ్యామలకా యీయన పంపిన పరివారముతోఁ బల్లకి నెక్కి వచ్చితిని."

"అది యెట్లు?"

"ఆ రాత్రియే నీలాద్రిరాజు నిర్బంధము నుండి మా కమలా శ్యామలలను దప్పించుటకీ రాజశేఖరుఁడు దగిన యేర్పాటులను జేసెను కృష్ణాతీరమున నొక సంకేతస్థలము నేర్పఱచి ముందుగ నీతఁడు కమలను వెంటఁబెట్టుకొని పోయెను. ఆ ప్రయాణసన్నాహములోఁ దప్పించుకొనిపోవలయునని శ్యామలకూడ బయలుదేఱినది. కమలా శ్యామల లిరువురును నగపడకుండఁ బోయినచోఁ గొండవీడు పంపవలసిన శ్యామల లేకపోవుటవలన. వారు వెడలి పోయిన సంగతి వెంటనే బయలుపడిపోవుననియు, అందువలన వారు సురక్షితముగాఁ బోవుటకు భంగము కలుగుననియు నే నాలోచించుకొని యా యాలోచనము నా హృదయమునందే యుంచుకొని, వెడలిపోవుచున్న శ్యామలను వెనుకకుఁ బిలిచి 'ఆవలిఁ దప్పించుకొనిపోవుచున్నప్పు డాభరణములతో నెందులకుఁ బోయెదవు? అవి ప్రమాదదాయకములు అవి నా కిచ్చి నీ వేషము మార్చుకొని మఱి పొమ్మ'' అని మిష పెట్టి చెప్పి, యామె నా యర్ధరాత్రమునఁ బంపివైచి, నేనామె యలంకారములను బెట్టికొని ఆమె శయనమందిరమున ముసుఁగిడి పరుండియుంటిని తెల్లవారుజామున నన్నుఁ బరిచారికలు తీసికొనిపోయి పల్లకిలోఁ గూర్చుండఁబెట్టిరి. దుఃఖవివశయై యామె జనని యచ్చటికి రాలేదు. ఈ విధముగా నేనే యిక్కడకు వచ్చితిని రాజశేఖరుని సాంకేతికస్థలము తెలియకపోవుటచే, నామె వారిని గలిసికొనలేకపోయెను.''

''నీవు మరల శ్యామల నెట్లు కలిసికొంటివి?''

''ప్రతిహారిణులు నన్నుఁ గత్తితో నఱికి నేను చనిపోయితినని భావించి నన్నిచ్చటి కందకములోఁ బాఱవైచిరి. నాకుఁ గత్తిదెబ్బ బలముగాఁ దగులకపోవుటచేతను. నాకు బాగుగ నీఁదుట దెలిసియుండుటచేతను, తేలి యా నీటిలోఁ గొట్టుకొనుచుండఁగా నీయన నన్ను రక్షించి, అడవివల్లెకిఁ దీసికొనిపోయి సుశీలుఁడను నొక వృద్ధక్షత్రియుని యింటనుంచి వెడలిపోయెను ఆక్కడ నేను శత్రుభయమున మాఱుపేరితోఁ గొన్ని దినములుండి, నా శరీర స్వాస్థ్యము కుదిరిన తరువాత మా పెదతల్లి కుమారుఁడును సదయ

గిరి పురపాలకుఁడు నగు విజయదాసుతోఁ బురుషవేషమున నుదయగిరి పోయితిని, అక్కడ హరిదాసను పేరుతో నుండి, ప్రహరేశ్వరుఁడు మా కమల నెత్తుకొని వచ్చినపిమ్మట సేనక్కడ మా యన్న క్రింది యుద్యోగమును సంపాదించుకొంటిని. అట్లుండఁగా నక్కడనే భాగ్యవశమున మా శ్యామలను జూచుట తటస్థించినది.''

''ఆమె యచ్చటి కెట్లు వచ్చినది?''

''ఆమె యిట్టి కల్లోలమునంబడి పిచ్చిదానివలె దేశదేశములం దిరుగుచు విద్యానగరమున జాలకాలముండి తరువాత నక్కడకు వచ్చినది ''

ఆమె మాటల నాలకించుచున్న సభాసదు లందఱును నత్యాశ్చర్యముతో నారమణీమణీ స్వార్థత్యాగముంగూర్చియు, ప్రాణసఖుల యెడలం గల పవిత్రప్రేమముంగూర్చియు, ఆమె యసాధారణ సాహసవర్తనముంగూర్చియు, వేనోళ్ళఁ బొగడఁజొచ్చిరి. శ్రీకృష్ణదేవమహారాజేంద్రుఁ డామె యద్భుత ప్రవర్తనమునకుఁ జాల మెచ్చుకొనియెను. గజపతి విన్నఁబోయిన మొగముతోఁ దలవంచుకొని సభవంకఁ గన్నెత్తి చూడఁజాలకపోయెను. ఫల్గునుఁ డద్భుతానందరస నిమగ్నుఁడై పోయెను

అప్పుడు మహామంత్రి తిమ్మరుసు మహారాయలం గాంచి. ''రాజపరమేశ్వరా! అంతయు నాలకించితిరి. ఇఁక నేమియుం దెలిసికొనవలసినదిలేదు. ఉత్తమ క్షత్రియవంశ సంభూతయు, బవిత్రచరిత్రయు, సాధుశీలయు, సాహసికసతీశిరోమణియు, అసాధారణ శేముషీనిధానయు నగు శ్యామలాదేవి దివ్యతేజోమూర్తియని చెప్పుటకు సందియము లేదు ఆమె యెల్లవిషయంబులను నేను మొదటి నుండియును గనిపెట్టుచునే యుంటిని. విద్యానగర పరిచయమూలమున దేవరకూడ నెఱింగియే యున్నారు. ఆమె మాటలును, పాటలునుగూడ నున్మత్తప్రలాపములవలెఁ దోఁచుచున్నను సార్థకములై రాజకార్య నిర్వహణోపాయద్యోతకములై క్రమముగా దేవరకు శ్రేయోదాయకములైనవి. విద్యానగరమున నాఁటి రాత్రి రాజద్రోహిని బట్టించుటకును, దుర్గమంబగు నుదయగిరి దుర్గమునకుఁ ద్రోవను జూపుటకును; మొన్నటియిక్కడి యుద్ధమున నాకస్మికముగఁ జైఁబడన గజపతిని బట్టించుటకును, నిన్నటి రాత్రి దుర్మార్గుఁ డగు నా శత్రువును ఖండించుటకును, ఆమె పాడిన పాటలును,

నామె చేసిన కార్యములును నేలికకుఁగూడ శ్లాఘనీయములై యున్నవి. అంతటి దేవీమూర్తి, అంతటి తేజస్విని, అంతటి వివేకవతి. అంతటి దూరదర్శిని, రాజాధిరాజ రాజపరమేశ్వర వీరప్రతాప రాజకంఠీరవులగు మీకు సర్వ విధములఁ బరిగ్రహణీయురాలై యున్నది. మాధవరాయని కోరిక యిదియే యని ప్రభుభక్తిపరాయణుం డగు రాజశేఖరుండె కాక నేను నింకొకసారి మనవి చేయుచున్నాఁడను. ఆతని కోరిక యవశ్యము జెల్లింపఁదగినది," అని యా యమాత్యశేఖరుఁడు రాజదేవేంద్రుని వదనమండలముం గాంచుచుండెను.

మహారాజు చిఱునగవుతో మాధవునివంకఁ జూచుచు, "మాధవరాయా! మాకకారణోపకారియగు రాజశేఖరుని విన్నపముంబట్టియు, హితాభిలాషియగు నప్పాజీ యుపదేశముం బట్టియు, నీ కోరిక నెఱవేర్పఁబడినది" నని యెను

సభయంతయు నానందమయ మయ్యెను.

సీ. "తొలఁగెను ధూమ కేతు క్షోభ జనులకు
నతివృష్టిదోష భయంబు వాసెఁ
గంటకాగమభీతి గడచె నుద్ధతభూమి
భృత్కటకం బెల్ల నెత్తువడియె
మాసె నఘస్ఫూర్తి మరుభూములందును
నెలమూఁడువానలు నిండఁ గురిసె
నాబాలగోపాల మఖిలసద్ద్విజమును
నానందమున మన్కి నతిశయిల్లెఁ
బ్రజలకెల్లను గడు రామ రాజ్యమయ్యెఁ,
జారుసత్త్వాఢ్యుఁ డీశ్వర నారసింహ
భూవిభువికృష్ణ రాయఁ డభ్యుదయ మొంది.
పెంపుమీఱంగ ధాత్రిఁ బాలింపుచుండ."

అని వైతాళికులు కీర్తించుచుండిరి.

---

# పరిశిష్టము

## ప్రమదావనమయ్యెను

ప్రసాదరాయలు శ్యామలవైపోయినను గమల యాతని కను గ్రహింపఁబడియెను. మహారాజు మాట యీ విధముగాఁ జెల్లింపఁ బడియెను. శ్యామలచేఁ గమల మాధవున కర్పింపఁబడియెను. ఆ కారణమున స్వస్థచిత్తుఁడైన మాధవునకు మహారాజొసంగిన వరమును గోరుకొనుట కవకాశము కలిగెను. ఆతని కోరిక మూలమున రాయలచే శ్యామల యనుగ్రహింపఁబడియెను. శ్యామల దయచేఁ బ్రాణసఖియగు శిశిరమణి కృతార్థురాలయ్యెను. ఆ పరమానంద సమయమున గోపాలునిం బ్రేమించిన సలిల గుణగణంబు లందఱకును బ్రియంకరము లయ్యెను. దైవానుగ్రహావశంబునం గలిగిన యీ ప్రాణబంధు సమాగమముచేఁ బ్రమదావనము కళ్యాణమయ మయ్యెను. నిరంతర పరిచయంబున శ్యామల గుణగణంబుల నన్నిటి నెఱింగియున్న రాయల పట్టపుదేవులగు తిరుమలదేవియును, చిన్నాదేవియునుగూడ నందులకుఁ బరమానందము నందిరి.

రాజశేఖరుని కోరిక ననుసరించి యీ వివాహము లన్నియును వసంతవాడదుర్గమున జరుపుటకు రాయ లనుగ్రహించెను. మహారాజు తలఁచిన నేమి కొదువ? పాడుపడియున్న వసంతవాడదుర్గము మరల వసంతోద్యానమువలె మహావైభవ సమన్విత మయ్యెను. మహావైభవముతో నెల్ల రచ్చటికి విచ్చేసిరి. ప్రమదావన ప్రమోద భవన మతి రమణీయముగా నలంకరింపఁబడియెను. అందొక శుభ ముహూర్తమునఁ గమలా మాధవులకును. శ్యామలా కృష్ణులకును సలిలా గోపాలురకును, శిశిరమణీ ఫల్గునులకును ననంత వైభవ

ముతోఁ గల్యాణములు గావింపఁబడియెను. కళ్యాణవిజయోత్సాహుఁడగు రాయల యౌదార్యమున, నా కల్యాణమహోత్సవములింతటి మహోవైభవముతో జరిగినవని వర్ణించి వ్రాయవలసివచ్చినచో మరల నొక గ్రంథమగును గాన నా విషయమును జదువరులే యూహించుకొందురుగాక! రాయలు మా శ్యామల నతి ప్రేమతో గౌరవించుచుండెను. శ్రీకృష్ణదేవరాయలకు అన్నపూర్ణాదేవి యను నొక రాణి యున్నట్లు తెలియవచ్చుచున్నది ఆ విషయమున కొందఱామె నుత్కలేశ్వరుని తనయ యని యనుమానించుచున్నారు. కొందఱు చిన్నాదేవియే యన్నపూర్ణాదేవియై యుండు నని యనుమానించుచున్నారు. మా శ్యామలయే తరువాత నన్నపూర్ణాదేవి యయ్యెనేమో యని మాకును ననుమానముగ నున్నది.

వసంతవాడదుర్గము మాధవున కొసంగఁబడియెను గోపాలునకు రాయల యంగరక్షక సేనాధికార మొసంగఁబడియెను. శ్యామల ప్రాణసఖియగు శశిరమణి కెవ్వరే మిచ్చిన ఋణము తీఱఁగలదు? ఆమెకు వివాహ శుభసమయమున రాయల యనుజ్ఞచేఁ గొన్ని గ్రామములు కట్నముగా నీయఁబడియెను రాజశేఖరుఁడును మాధవరాయని మంత్రియై సుఖంబుండెను.

ప్రమదావన మయ్యెను, ప్రమదావనముకూడ నెప్పటి ప్రమదావన మయ్యెను.

